# భారతం - ధర్మాద్వైతం

## వ్యాసుని దర్శనం - తిక్కన సందర్శనం

...1981 లో ఆంధ్రవిశ్వవిద్యాలయంనుండి
పిహెచ్.డి. పట్టం పొందిన సిద్ధాంతవ్యాసము...

డా॥ మోపిదేవి కృష్ణస్వామి

ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ ప్రచురణ
అమలాపురం శాఖ.

ప్రథమముద్రణము :
రక్తాక్షి - మార్గశిరము
డిసెంబరు - 1984
ప్రతులు - రెండువేలు
స్వామ్యములు రచయితవి

వెల :

యాభై రూపాయలు

ప్రతులకు :
ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
అమలాపురంశాఖ
"మాస్టర్ కుటీర్"
కొంకాపల్లి
అమలాపురం

ముద్రణ :
"ముముక్షువు"
పవరుపేట
ఏలూరు.

# సమర్పణ

సరసులు

సహృదయులు

సరస్వతీస్వరూపులు

ఉదారులు

ఉత్తములు

ఉన్నతశిఖరాల నందినవారు

ఆచార్య కాశర్ల వేంకటరామనరసింహంగారికి

ప్రేమతో, భక్తితో, వినమ్రతతో

మోపిదేవి కృష్ణస్వామి.

# కృతిభర్త
# జీవిత విశేషాలు

"ఆంధ్ర విశ్వకళాపరిషత్ తెలుగుశాఖను పండి, తల్లిఋణాన్ని తీర్చుకొన్న మహామహుల్లో ఆచార్య శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి... 

దేశికవరేణ్యులైన నరసింహంగారు 1914 అక్టోబరు 25 న నేటి విజయనగరం జిల్లాలో జన్మించి, పార్వతీపురం, విజయనగరం, విశాఖపట్టణాల్లో విద్యాభ్యాసం చేశారు. వీరు విశేషించి ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి శిష్యులు.

1940 లో ఎం. ఏ., పొందిన శ్రీ ఆచార్యులవారు 1945 లో తెలుగుశాఖలో ప్రప్రథమంగా పిహెచ్. డి. పొందారు. డాక్టరేట్ పొందిన తర్వాత రెండేళ్ళు విజయనగరంలో ట్యూటర్‌గా పనిచేసి 1947 లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకు వచ్చారు. ఇక్కడ 1961 వరకు లెక్చరర్‌గాను, తర్వాత 1964 వరకు రీడరుగాను - దరిమిలా 1974 వరకు ప్రొఫెసర్‌గాను పనిచేశారు. 1963 నుంచి 11 ఏండ్లపాటు తెలుగుశాఖాధిపత్యాన్ని వహించారు.

శ్రీ ఆచార్యులవారు ఉత్తమ సాహితీ సమారాధకులు.

వీరెంతటి పండితులో అంతటి పరిశోధకులు, ఎంతటి పరిశోధకులో అంతటి సహృదయులు, ఎంతటి సహృదయులో అంతటి కవులు, ఎంతటి కవులో అంతటి ఉపాధ్యాయులు, ఎంతటి ఉపాధ్యాయులో అంతటి ఉదారులు, ఉత్తములు.

"సుజాత", "ఉషోరాగాలు" వీరి కవితాహృదయం ప్రసవించిన సురభికుసుమాలు.

"ఆంధ్రప్రబంధము - అవతరణ వికాసములు, దక్షిణాంధ్ర వాఙ్మయచరిత్ర, ఆంధ్రుల చరిత్ర సంస్కృతి" "ఆధునికాంధ్ర కవితా సమీక్షలూ విశేషించి సాహిత్యదర్శనమూ" వీరు రచించిన గ్రంథాలు. (సాహిత్యదర్శనం యు.జి.సి. నుంచి రు 10,000/-లు బహుమతిని పొందింది). వీరు శ్రీకొత్త సచ్చిదానందమూర్తిగారితో కలిసి 'ప్రమాణపద్ధతిపై ప్రసంగం' అనువదించారు. 'అరిస్టోటిల్ - ప్రాచీన భారతీయాలంకారికులు' గ్రంథం రచనావస్థలో ఉంది.

వీరి పరిశోధనపాటవం ఎగురవేసిన అక్షరపతాకలు ఈ ఉద్గ్రంథాలు. 18 మంది పిహెచ్.డిలు, ఇద్దరు యం.ఓ.యల్‌లు వీరి వైదుష్యానికి సజీవప్రతీకలు.

ఆచార్యులవారిది తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం కానీయని సమన్వయదృష్టి. కనకాభిషేకము, రఘునాథరాయులు నవలల మధుకల్లో పరిశోధనాంశాల పేకలు కలిపారు నరసింహంగారు.

పిహెచ్.డి. పట్టం పొందిన తర్వాత కూడా అనుబంధ కళాశాలలో ట్యూటరుగా పనిచేసిన గౌరవం వీరికే దక్కింది. లెక్చరర్‌గా ఉంటూనే ఒక రీడరుగారి పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసానికి పరీక్షకు లయ్యారు వీరు. తాను రీడరుగా ఉండినప్పుడే ఒక ప్రొఫెసర్

నియామకంలో ఎక్స్‌పర్టు మెంబరుగా వ్యవహరించారు. తెలుగు శాఖను పండించి పదవీవిరమణ చేసిన తర్వాత సంస్కృతశాఖలో యు. జి. సి. పరిశోధకునిగా బదిలీఅయ్యారు. ఇవి ఈ విచిత్రజాతకుని జీవితంలోని కొన్ని విశేషాలు"*

---

* ఆంధ్ర విశ్వకళాపరిషత్ తెలుగుశాఖ స్వర్ణోత్సవ శుభసందర్భంలో ఆచార్యుల వారిని సమ్మానించే నిమిత్తమై డా. చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చదివిన సమ్మానపత్రమునుండి స్వీకరింపబడిన అంశములివి. వారికి మా కృతజ్ఞతలు.

# నిండుకుండ

ఆచార్య కాకర్ల వేంకటరామనరసింహంగారు బహుముఖీనమైన ప్రజ్ఞాపాటవాలు కలిగిన వ్యక్తి. విద్యవలన వినయంబు అన్నది వీరి యెడల సార్థకం. ఏమీ తెలియని వ్యక్తి లాగానే కనబడుతూ అనేక విషయాలలో తలస్పర్శమైన పాండిత్యం కలిగి ఉండడం పండిత మండలిలో అరుదైన విషయం. సర్వసాధారణంగా మౌనంగా కనబడే మాస్టారు సరసవచనులనీ, మహావక్త అనీ వారితో ఏమాత్రం పరిచయమున్నా అర్థమయ్యే విషయం. గంభీరంగా కనబడేటటువంటి నరసింహంగారు హాస్యప్రియులని వారితో మాట్లాడితేగాని వారు మాట్లాడితే గాని తెలియదు. నవ్య నవనీత సమానమైన నిండు మనాన్ని బాహ్యాకారం పూర్తిగా కప్పివేస్తుంది వీరిదగ్గర. దైహికంగా మూర్తీభవించిన అలసత్వంగా కనబడతారు. కాని ఉరకలూ పరుగులూ వేసే మనస్సు వీరిది. వీరి నిర్నిద్రమైన మనస్సు కొన్ని విషయాలలో మాత్రమే చైతన్యవంతమైనది. అత్యంతపరిచయమైన లౌకికవిషయాలు కూడా మనస్సులోని మరపుతెరల్లోకి జారుకుంటాయి. కాని విద్యావిషయంలో మరపుఎరుగని మనీషి నరసింహంగారు. వీరు ఏకసంధాగ్రాహి అని అనేకులకు తెలియదు వీరిది **highly selective memory.**

పెద్దల యెడల గౌరవం, సమానుల యెడల ఆదరం, పిన్నల యెడల వాత్సల్యం ముప్పేట గొని మూర్తీభవించిన వ్యక్తి మాస్టారు.

ఓ చిన్న ఉదంతం. ఒకరోజు మాస్టారు వేసవిలో సెలవు రోజున కూడా డిపార్టుమెంటుకు వచ్చారు - ఏదో పనిమీద. మిట్ట మధ్యాహ్నం. నేనూ డిపార్టుమెంటుకు ఏదో పనిమీద వెళ్ళి అప్పటికే ఉన్నాను. ఇంకెవరూ లేరు. మాస్టారు గది తలుపుతీసిన చప్పుడు విని వారిని పలకరించడానికి వారి గదిలోకి ప్రవేశించాను. అక్కడి దృశ్యం నన్ను ఆనందాశ్చర్యాలతో ముంచెత్తింది. ఓ పది పన్నెం డేళ్ళ బాలుడు. చినిగిన గుడ్డలు.మాసినతల. తైలసంస్కారం ఏనాడు జరిగిందో చెప్పలేను.మంచినీళ్ళ గ్లాసు ప్రొఫెసర్ గారు ఆ పిల్లవాడికి అందిస్తున్నారు. "పాపం పిల్లవాడికి దాహం వేస్తోందిట. ఇక్క డెక్కడైనా మంచినీళ్ళు దొరుకుతాయా అని రోడ్డుమీద అడిగాడు" అన్నారు. మంచినీళ్ళ కుళాయి దగ్గర తానే గ్లాసుతో నీళ్ళు పట్టి ముక్కూ మొహం తెలియని బీదబాలుడికి అందించగలిగే ఆచార్యులు ఎంతమంది ఉంటారు! మాస్టరుగారిది అవ్యాజమైన అనురాగం.

మాస్టారిది నిర్లిప్తమైన మనస్సు. ఆవేశం వచ్చినపుడు అది తాలోత్తాలం.కాని అది క్షణికం ఎప్పుడోగాని వారిలో ఆవేశం కాన రాదు. మాస్టారి వల్ల మేలు పొందినవాళ్ళే తమ చేతుల్లో ఉన్నా తన కొడుకు విషయంలో ఉదారత చూపలేకపోయారే అని మాస్టారి భార్య సహజంగా బాధపడితే, "ఎందుకు బాధపడతావే వెర్రిదానా! మనకు చేతనైనది మనం చేశాం. వాళ్ళకు చేతనైనది వాళ్ళు చేశారు" అని సర్దిచెప్పేవారు. "స్వభావో దురతిక్రమః" అనిగదా పెద్దలన్నది !

మాస్టరుగారిది కోరకుండానే మేలు చేసే స్వభావం. వారిని కోరడం కేవలం మన తొల్యానికి తార్కాణం.

ఇటువంటి ఉపాధ్యాయునికి శిష్యుడు కావడం, సన్నిహితుడు కావడం ఒక గొప్ప అదృష్టవిశేషం. అదొక విశిష్టమైన అనుభూతి. అది గుండెగూటిలో ఆజన్మాంతమూ భద్రపరచుకొనే మహోత్తమ సంపద.

చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి

---

# ఆశీర్వదిస్తున్నాను

చిరంజీవి డా॥ మోపిదేవి కృష్ణస్వామిని డాక్టరుగా మార్చిన సిద్ధాంతగ్రంథం తెలుగువారికి అందుతోంది. అమర్చినదాంట్లో అత్తగారు వేలుపెట్టినట్టుగాక, అతడు అందజేసిన అమృతోపమాన మైన పాయసాన్ని సిద్ధపరుస్తూ ఉండగా కూడా చూసినవాణ్ణి. కనుక రెండుముక్కలు ఈ సిద్ధాంతవ్యాసాన్ని గురించి చెప్పడం సమంజసం అనిపిస్తోంది. అనాదినుండి అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వచ్చిన ఆధ్యాత్మిక భావవాహినిలో ఓలలాడి, పుడిసిళ్ళకొలది భావ పూరాలను కడుపారగ్రోలి ఉత్తేజితుడై, తన్మయుడై అనేకులను ఈభావగంగచేత పవిత్రులను చేద్దామని సదాశయం కలిగిన వ్యక్తి మన కృష్ణస్వామి. "ఏక స్వాదు న భుంజీథ" అన్నారు. రుచిగల ఆహారాన్ని తానొక్కడూ తినకూడదట. ఒక్కడే తినేవాడు పాపాన్ని మాత్రమే అనుభవిస్తాడు. గొప్పగొప్ప ఆలోచనలు రుచి కరమైన ఆహారపదార్థాలకంటే రుచికరమైనవి. తమకు కలిగిన అనుభూతులనూ, తమకు తెలియవచ్చిన విషయాలనూ పలువురకు తెలియపరచాలని పెద్దలందరూ ప్రయత్నిస్తూనే వచ్చారు. కనుకనే ఇంతటి విజ్ఞానం మన కందింది.

ప్రపంచభాషల్లో దేంట్లోనూ ధర్మం అనే పదానికి సమానార్థక మైన పదంలేదు. సంస్కృతభాషలోనే దీనికి పర్యాయపదం లేదంటే

ఇతరభాషల ఊసెందుకు ! కనుక ధర్మాన్ని నిర్వచించడంకంటే వర్ణించి చెప్పడంవల్ల విషయం ఎక్కువగా అవగాహన కావడానికి అవకాశం ఉంది. నిర్వచనం చెప్పి నిర్దేశించేవారు సూత్రకారులు-స్మృతికర్తలు. వివరించి బోధించేవారు పురాణేతిహాసకారులు. చెప్పడం మాత్రమే కాకుండా నచ్చచెప్పేవారు కవులు. వ్యాసుడిలో ఈ లక్షణాలన్నీ ఉన్నాయి.

అత్యంతగహనమైన ధర్మం సుబోధకమయ్యే రీతి మహాపురుషుల జీవితాల్లో నెలకొని ఉంటుంది. కనుకనే ధర్మజుడు "మహా జనో యేనగత స్సపంథా" అన్నాడు. అంటే భారతకథా అందలి పాత్రలుకొన్ని ధర్మానికి వ్యాఖ్యానాలవుతాయి.

మహావేత్త అయిన వ్యాసుడు ఆయాపాత్రల ఆచార విచారాలనుబట్టి ఆయావాటికి ఆయాపాత్రలు ప్రతినిధులనీ, ఆయాపాత్రలను ప్రేరేపించినవి ఆయాభావాలనీ గ్రహించాడు. ఇంతేకాదు-వ్యాసునికి ఒక గొప్ప దర్శనం లభించింది. ధర్మం ఒకటేననీ, అది అద్వైతమనీ అతనికి పొడకట్టింది. ధర్మంయొక్క ఏకత్వాన్ని దర్శించిన వ్యాసుడు ధర్మాద్వైతాన్ని అనుష్ఠించి ధర్మాద్వైతమూర్తి అయినాడు.

వ్యాసుడు ధర్మాద్వైతమూర్తి అని కవిత్రయంవారికి మనస్సులో మెదిలిందేమో చెప్పలేం. కాని వారి బాణీమాత్రం వ్యాసునియొక్క ధర్మాద్వైతపు బాణీయే. అయితే ఈ విషయం తిక్కనకు సుస్పష్టమైనట్టు మనకు తెలియవస్తోంది. చదువుల్లో మర్మ మెల్ల ప్రహ్లాదుడికి పొడగట్టినట్టు భారత రచనకు కీలకమైనది తిక్కనకు పొడగట్టినట్టు సుస్పష్టమవుతోంది.

చిరంజీవి కృష్ణస్వామి అంటాడు-వ్యాసుని దర్శనాన్నే తిక్కన సందర్శించాడు అని.

అత్యంతసరళమైన ధర్మాన్ని తన పాండిత్యప్రకర్ష చేత అత్యంతగహనంచేసే అలవాటు కొందరికి ఉంటుంది. అత్యంత

గహనంగా కనబడుతూ ఉన్న ధర్మాన్ని, సూటిగా సులువుగా వివరించి చెప్పే నేర్పు, అలవాటు చిరంజీవి కృష్ణస్వామికి ఉంది. తత్త్వప్రతిపాదన పాండిత్యప్రకర్షకు, కాక, తన పాండిత్యానికి ఇతరులు మురిసిపోవాలనే ఉద్దేశంతో కాక" తాను చెప్పదలచిన విషయానికి మాత్రమే ప్రాధాన్యమిచ్చి సుబోధకం చేయటమనేది చాలా అవసరం. మహాపురుషులందరూ అలాగే చేశారు. ఆ మహాను భావుల వరవడిలోనే తానూ మెలగాలని నిత్యజీవితంలో తటస్థపడే ఉదాహరణలను తీసుకొని విషయాన్ని చిరంజీవి కృష్ణస్వామి వివ రించాడు. ఏ మాత్రం శ్రద్ధగలిగినవారికైనా విషయం బోధగట్టా లని వాడుకభాషలో వ్రాశాడు. ఇందులోని భాష పేలవముగాని సరళతను సంతరించుకొన్నది. భారముకాని ఉదారతతో ఒప్పారినది.

విషయమూ ఉదాత్తమైనది. విధానమూ సరళమైనది. భావమూ భారమైనది. భాషయూ ఆమోదకరమైనది. వ్యాసదర్శనాన్ని వెల యించి తిక్కన సందర్శనాన్ని సమన్వయపరచి ఆధ్యాత్మికంగా ఋషిఋణాన్నీ, లౌకికంగా కవిఋణాన్నీ తీర్చుకొన్నట్టే, చిరంజీవి కృష్ణస్వామి ఈ పరిశోధనపుష్పాన్ని తనకూ, నాకూ గురువులైన ఆచార్య కాకర్ల వేంకటరామనరసింహాంగారికి సమర్పించి ఋషి కవి గురువుల ఋణాన్ని తీర్చుకొన్నాడు.

ఇంకొక్కమాట ఉంది. ఈ సిద్ధాంతవ్యాసంలో ఇతని పరమ గురువులైన శ్రీమాన్ డాక్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు అంతర్లీనంగా గోచరిస్తారు.

ఇదంతా ఒక సుయోగం.

ఇకముందుకూడా చిరంజీవి కృష్ణస్వామి మనవారికి మరింత ఉపయోగపడాలని ఆశిస్తున్నాను. ఆశీర్వదిస్తున్నాను.

చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి.

# ఆశిస్తున్నాను

ధర్మం అనే పదానికి సమానార్థకమైన పదం సంస్కృతంలోనే దొరకదనే మాట సత్యం. ఇక ఇతర భాషలలో దొరకదని చెప్పనక్కర లేదు. ఒక పదం ఒకభాషలో దొరకాలి అంటే దానివెనుక శతాబ్దాల తరబడి చరిత్రగా నడచిన ఒక సంప్రదాయం ఉండిఉండాలి. అది లేని జాతికి ఆ పదం లభించదు. ఎరుగని విషయాన్ని గురించిన పదాలు ఎవరిచేతా వాడబడవు గనుక, ఒక సంప్రదాయం ఉన్నప్పుడు మాత్రమే దానికి సంబంధించిన పదం ఆ భాషలో ఉంటుంది. ధర్మం అనే పదాన్ని అర్థంచేసుకొనటానికి ఇదే చిక్కు ఎదురౌతుంది. సృష్టి సమస్తం దైవంనుండి దిగిరావటం దగ్గరనుండి రెండు కాళ్ళ జీవిగా పుట్టిన నరజన్మ సార్థకం చేసుకోవాలి అనుకొనేవాడి దినచర్య దాకా అంతర్యామిగా వ్యాపించి ఉన్నది ఈ ధర్మం అనే పదంలోని టీక, తాత్పర్యం. సమగ్రమైన ధర్మస్వరూపాన్ని మానవుడు ఎలా దర్శించగలిగాడో అనే అంశాన్ని అర్థంచేసికొనటానికి ప్రయత్నం చేస్తూ వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, రామాయణ భారతాలు చదువుకొంటూ ఉంటే ఒక విషయం స్పష్టమవుతుంది. అదేమిటంటే ధర్మాన్ని మానవుడు దర్శనం చేయలేదు. ధర్మమే మానవుడికి దర్శన మిచ్చింది.అలాంటి అవసరం ధర్మానికి కలిగింది.అది మానవుణ్ణి

ఉద్ధరించడం. ఇలా జరగడం తన సహజధర్మం అని ధర్మానికి తెలుసు. ఆచార్యపురుషులైనా, ప్రవక్తలైనా, అవతారాలైనా ధర్మంకోసమేగాని, ధర్మం వాళ్ళకోసంకాదు. ధర్మసంస్థాపనకోసం పనిచేస్తారు కనుకనే, వాళ్ళకి ఆ అతిమానుషమైన గౌరవం. అది లేని నాడు వాళ్ళు కూడా మతస్థాపకులో, మతప్రచారకులో, మతాలు మార్చే బేహారులో అయిపోయి కాలచక్రంక్రింద నలిగిపోయి ఉండే వారు. అందుకనే అలా నలిగిపోయినవాళ్ళని కాలధర్మం చెందారు అంటారు.

సకలధర్మాలూ కలిసి మహాధర్మాల సమన్వయానికి ఒదుగు తాయి. మహాధర్మాలు శాశ్వతధర్మం అనేదాని ఏకత్వంలో పద్మ దళాలులాగా ఇమిడి ఉంటాయి. పద్మాన్ని చూడగలవాడికి పరమ ధర్మం కనిపిస్తుంది. అందులో ధర్మదళాలు అన్నిటికీ గల స్థానం తెలుస్తుంది. పద్మాన్ని చూడగలవాడు సూర్యుడొక్కడే. అతడే ఆత్మగా జీవులలోనూ అణువులలోనూ ఉండి చూస్తున్నాడు. అతనిని చూడలేనివాళ్ళకి పద్మాన్ని చూడగలగటం ఉండదు. తేనెకోసం చీమలు పద్మదళాల్లో పాకుతూనే ఉంటాయి. కాని పద్మాన్ని చూడలేవు. అలాగే సుఖం అనే మధువుకోసం వెదకులాడుతూ ఉన్న జీవులు శాశ్వతధర్మాన్ని చూడలేక తేనెబిందువులతోపాటు ధర్మదళాలకు అతుక్కుపోయి బద్ధులవుతూ ఉంటారు. ఐదువేళ్ళూ ఒకచేతవే; రెండుచేతులూ, రెండుకాళ్ళూ ఒక్కడివే అనే ధర్మం శాశ్వతధర్మం సందర్భంలో దర్శనం ఇవ్వాలి. ఈ దర్శనంలేని గుడ్డి వాడికి ధర్మాలు పరస్పరవిరుద్ధాలుగా కనిపిస్తూ ఉంటాయి. పురు షార్థాలకు సమన్వయం దొరకదు. అలాంటివాళ్ళకోసం ప్రసాదింప బడిన గ్రంథమే మహాభారతం. ఈ గ్రంథాన్ని చదువుకొనేవాళ్ళకి ఏమి కావలిస్తే అది కనిపిస్తుంది. సమస్యలు, పరిష్కారాలు, ధర్మా ధర్మాలు, శాస్త్రాలు, చర్చలు, పాండిత్యాలు, వేదం, ఉపనిషత్తులు,

వాటి సమన్వయం- మొదలైనవన్నీ ఇందులో ఉన్నాయి. ఏ మెట్టు మీద నిలబడి చదువుకొంటే దానికి సంబంధించిన దృశ్యం కనిపిస్తూ ఉంటుంది. విమానంలోంచి చూస్తే ఇన్ని దృశ్యాలూ కనిపిస్తాయి. మళ్ళా నేలపైన నడిస్తే మరికొన్ని క్రొత్త దృశ్యాలు కనిపిస్తాయి. జీవులు, సన్నివేశాలు, వాళ్ళ జీవిత పరమార్థాలు కనిపిస్తాయి. ఇన్ని విధాలైన దృక్పథాలకూ మాతృకగా మహాభారతం దర్శించి ఇవ్వబడింది. దాన్ని ఎలా చదువుకోవాలో తెలియజేయడానికి ఒకవ్యక్తి, ఒకగ్రంథం అవసరం. ఆ వ్యక్తియే మోపిదేవి కృష్ణస్వామి. ఆగ్రంథమే "భారతం - ధర్మాద్వైతం". ధర్మానికి ఇలాంటి అద్వైత స్థితి ఉన్నది అని దర్శించిన వ్యాసుడు ఈ మహాభారతం అనబడే లేఖ్యమైన ఆమ్నాయాన్ని మనకిచ్చాడు. తిక్కన దానినిగూర్చి మనందరికీ వినబడేటట్టు హెచ్చరించాడు. ఇన్నిటినీ సమన్వయించి తిక్కన వాడిన ఈ 'ధర్మాద్వైతం' అనే పదాన్నిగూర్చి చాలా పరిశ్రమ చేశారు పండిత విమర్శకులు. ఒకరికన్న ఒకరు విలక్షణమైన అర్థాన్ని చెపుతూ వచ్చారు.అంతే చెప్పేవాడి ప్రత్యేకతకే ప్రాధాన్యం గాని తిక్కనగారి ప్రయోగానికి కాదు. అందుకనే చెప్పే వ్యక్తిని బట్టి ప్రత్యేకతను పెంచుకొన్నది దాని అర్థం. అలాకాకుండా ఆ పదంలో ఇమిడి ఉన్న తిక్కన హృదయం కావాలి మనకి. అప్పుడు దానిలో ఇమిడిఉన్న వ్యాసుని హృదయం దర్శనమిస్తుంది. దానికి చక్కగా పనికివస్తుంది ఈ సిద్ధాంతగ్రంథం. అద్వైతం అనగానే ఇంతకుముందు ప్రసిద్ధి వహించిన అద్వైత సిద్ధాంతం అనే సిద్ధాంతంతో సమన్వయించి ఊరుకోనడం కాదు చేయవలసింది. అద్వైత సిద్ధాంతం, ద్వైత సిద్ధాంతం, విశిష్టాద్వైతం ఎక్కడ సమన్వయం చెంది అద్వైతస్థితిని చెందుతాయో అలాంటి సమన్వయం మహాభారతంలో ఉన్నది అని తిక్కన హెచ్చరించగా, కృష్ణస్వామి దానిని ఈగ్రంథంలో దర్శనం చేయించాడు. దీనిని చదువుకొన్న విద్యార్థులూ, వేదాంతులూ విమర్శకులూ, ధర్మతత్త్వజ్ఞులూ మొదలైన

వాళ్ళంతా సనాతనధర్మం అంటే ఏమిటో దర్శించి స్వధర్మాన్ని తెలుసుకొని ఆచరణోన్ముఖులు కావలెనని ఆశంసనం చేస్తూ ఉన్నాను. గ్రంథకర్త కృష్ణస్వామీ అతని పరివారమూ చిరకాలం ధర్మస్థితియం దుండి ఆయురారోగ్యైశ్వర్యాలతో వర్ధిల్లుదురుగాక!

భారతధర్మానికే ఆచరణస్వరూపం అయిన బ్రహ్మశ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సర్వతోభద్రమైన పర్యవేక్షణలో ఈ పవిత్రగ్రంథం రూపొందటం విశ్వశ్రేయస్సుకు ఒకమెట్టు.

ప్రేమ, ఆదరణ, సామర్థ్యం కలిసి మూర్తిగా దిగివచ్చిన ఆచార్యులు కాకర్ల వేంకటరామనరసింహంగారు ధర్మస్వరూపులు. వారికి అంకితమైన ఈ పవిత్ర ధర్మశాస్త్ర గ్రంథం చిరకాలం పుట్టి వర్ధిల్లే ధర్మమూర్తులకు శిరోధార్యమైన అధ్యయనగ్రంథంగా నిలువగలదని ఆశిస్తున్నాను.

విశాఖ
మాఘ శుద్ధ నవమి
రుధిరోద్గారి
11-2-84

ఎ. కృష్ణమాచార్య.

శ్రీ లక్ష్మణ యతీంద్రులు
ముముక్షుజనమహాపీఠాధిపతులు

# మంగళాశాసనము

రక్తాక్షి : కార్తీక శు ౧౧
ఆదివారము
4-11-1984

శ్రీరస్తు : చిరంజీవి మోపిదేవి కృష్ణస్వామికి ·
నారాయణస్మరణ పూర్వక మంగళాశాసనములతో —
ఆయుష్మన్ !

నీ రచించిన "భారతం - ధర్మాద్వైతం" అన్న గ్రంథం - సిద్ధాన్త న్యాసం - శ్రద్ధతో అధ్యయనం చేశాను. ఎంతో ఆనందించాను.

"చక్షు రున్మీలితం యేన..." ఆ జగద్గురుమూర్తి శ్రీకృష్ణమాచార్య ఆశీర్ముద్రతో అక్షరాక్షరంనుండి తొంగిచూస్తున్నాడు అనిపించింది- "కృష్ణం వన్దే జగద్గురుమ్ !".

ధర్మాద్వైతం అన్న పదానికి నీ నిర్వచనమూ, తన్నిర్వాహణా సర్వవిధాలా సముచితములుగా అనిపించాయి.

పాండవుల శ్రీకృష్ణసమాశ్రయణమూ, కుంతీదేవి తన జీవితాన్ని ధర్మస్వరూపంగా మలచుకుని నిర్వహించుకున్న తీరూ, ద్రౌపది పాతివ్రత్యమూ, ధృతరాష్ట్ర దుర్యోధన కర్ణాదుల మనస్తత్త్వాలూ - అన్నిటికీ అతీతంగా యజ్ఞార్థమే - లోకహితమే - తన ఊపిరిగా సాగగా సర్వానికీ సాక్షీభూతుడుగా నిలిచిన శ్రీకృష్ణప్రభువూ, ఈ యావద్వృత్తాంతాన్ని యథాతథంగా నిర్మమంగా నిరహంకారంగా లోకానికి అనుగ్రహించిన వ్యాసభగవానుడూ - ఇందరినీ ఇన్ని దృక్పథాలనుండీ పరిశీలించి, ఆయా సన్నివేశాల ప్రాముఖ్యాన్ని అంతరార్థాన్నీ దార్శనికంగా వివరించావు నీ ఈ గ్రంథంలో.

అయితే; భీష్మాచార్యుల విషయంలో మరింత గాఢమైన వివేచనతో పరిశీలిస్తే ఆ మహామహుని ఆంతర్యం - ఉదాత్తత - ఆవిష్కరింపబడుతుంది అనిపించింది. అస్తు -

ఆంధ్రవాఙ్మయంలో నీ ఈ గ్రంథం ధ్రువతారగా వెలుగొందగలదని ఆశిస్తున్నాను.

ఇదే సిద్ధాన్తం ప్రాతిపదికగా భారతంలోని సూక్ష్మాతిసూక్ష్మ విషయాలు నీ ముఖతః సవిస్తరంగా ఆవిష్కరింపబడాలని కూడా ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

"పుణ్య గురుకృపా కల్పకభూజ మెక్కి-
రాల కృష్ణుండు దూసి వరాల నిచ్చు"

నరరూపనారాయణ సేవలో

లక్ష్మణయతి.

# సప్రమాణమైన సమగ్రపరిశీలన

ధర్మాద్వైతస్థితి అనే సమాసం సుబోధకంకాదు. అనేక అర్థాలకు దారితీస్తుంది. విద్వాంసులనేకులు ధర్మాద్వైతాన్ని గూర్చి తమ తమ వ్యాసాల్లోనూ పుస్తకాల్లోనూ వివరించడానికి ప్రయత్నం చేయకపోలేదు. అయినా ఈ సమాసంయొక్క అర్థం ఇంకా ఇదమిత్థమని తేలక మరింత వివరణ అవసరమైంది. ఈ పరిశోధక విద్యార్థి ఈ సమాసాన్ని కూలంకషంగా పరిశీలించాడు. సమగ్రపరిశీలన విషయంలో కఠోరపరిశ్రమ కావించాడు.

... ... ... ... ... ... ...

మానవజీవనతత్త్వాన్ని గురించి ప్రతిపాదించిన భాగాలు పరిశోధకుని భావగభీరతనూ, ఆధ్యాత్మిక అభిరుచినీ వేనోళ్ళ చాటుతున్నాయి. ఇతని ఆలోచనలు సప్రమాణంగా ఉన్నాయి. వాటిల్లో సంతులనం కానవస్తోంది.

... ... ... ... ... ... ...

పరిశోధనవ్యాసం ఇతని పరిశ్రమనీ విస్తారమైన అధ్యయనాన్నీ సూచిస్తోంది.

... ... ... ... ... ... ...

వ్యావహారికభాష అంటారా! - ఇతని శైలి శక్తిమంతమైనది. ఒడుదుడుకులు లేనిది. చక్కని భావవ్యక్తీకరణ ఇతని భాషలో ఉంది. చదివించుకొంటూ వెళ్ళిపోతుంది.

(సం) దివాకర్ల వేంకటావధాని.

## సమర్థమైన సమన్వయం

వర్ణాశ్రమధర్మాలు, అర్థకామాలు, దాంపత్యధర్మం, మోక్ష ధర్మం - ఇలాంటివాటికి ధర్మాద్వైతతత్త్వాన్ని సమర్థంగా సమన్వయించాడు.

... ... ... ... ... ... ...

ధర్మాద్వైతతత్త్వసూత్రాల ఆధారంగా ముఖ్యంగా కుంతి, ద్రౌపది, భీష్ముడు, కర్ణుడు, ధర్మరాజు మొదలైన మహాభారత పాత్రలను చక్కగా వ్యాఖ్యానించాడు.

... ... ... ... ... ... ...

ఆధునికమైన శిష్టవ్యావహారికశైలిలో ఈ పరిశోధనవ్యాసం ఉంది. నా ఉద్దేశంలో ఇలాంటి విషయాలకు ఇది బాగా నప్పుతుంది.

(సం) తిమ్మావజ్ఝల కోదండరామయ్య.

# అమూల్యమైన కృషి

ఈ పరిశోధన వ్యాసమంతా మహాభారతకథను హేతువాద పురస్సరంగా వివరించింది. అనేక విషయాలు కుతూహలాన్ని రేకెత్తించేవి ఇందులో ఉన్నాయి. తమ జీవితాలని సరిదిద్దుకోదలచు కొన్న వారికి ఇది మౌలికమైన పరిజ్ఞానాన్ని కలుగ జేస్తుంది.

... ... ... ... ... ... ...

భారతాధ్యయనవిషయంలో ఇది అమూల్యమైన కృషి. ఇది గీతాసంప్రదాయంలో ముఖ్యమైన పుస్తకం. కనుక దీన్ని తప్పక ప్రచురించాలని సిఫారసు చేస్తున్నాను.*

(సం) కోరాడ మహాదేవశాస్త్రి.

---

* ఈ సిద్ధాంతవ్యాసానికి న్యాయనిర్ణేతలుగా వర్తించిన ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య తిప్పావఝ్ఝల కోదండరామయ్య, ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగార్ల 'రిపోర్టుల' నుండి భాగాలు కొన్ని స్వీకరించి వాటికి తెలుగులో భావానువాదాలు ప్రచురించడం జరిగింది.

# ప్రస్తారము

ఏడుస్వరాలు మూడు స్థాయుల్లో ప్రస్తారమవుతూ మనోహరమైన గాంధర్వవిద్యను ప్రసాదిస్తున్నాయి. అవే స్వరాలు అవే స్థాయీభేదాలు- కాని ఎన్నెన్ని లయగతులవిలాసాల్లో ఒదుగులు పోతూ ఎన్నెన్ని రాగలహరుల్ని సృష్టిస్తున్నాయి ! సమర్థుడైన గాంధర్వవిద్యాకుశలుడు ఇన్నింటినీ తనలోనుండి పుట్టించి మెరుగులు దిద్ది శ్రోతలకు శ్రోత్రపర్వంగా అందిస్తున్నాడు. అన్ని స్వరాలూ, స్థాయులూ, విలాసాలూ, విన్యాసాలూ, ఒదుగులూ- అన్నీ ఇంతకుముందు సృష్టిలో ఉన్నవే. కాని ప్రతిగాయకుడూ పాడే సమయంలో తనలోనుంచి పుట్టించి యీవలకు తేవలసినవే !

అలాగే ప్రకృతి మానవుడనే ఒక పరిపూర్ణసృష్టిని చేసి వదలి పెట్టింది. ఏడుమడతల శరీరాలతో, భౌతిక మానసిక ప్రజ్ఞామయములనే మూడుస్థాయులలో మానవజాతి ఎన్నెన్నిరకాల వ్యక్తిత్వాలతో, అస్తిత్వాలతో విరాజిల్లుతున్నది ! ఏవ్యక్తికావ్యక్తి పూర్తిగా ఒక క్రొత్త సృష్టిగానే భాసిస్తాడు. ఇన్నిరకాల వ్యక్తిత్వాలనూ తయారుచేయడానికి కావలసిన సృజనాత్మకప్రజ్ఞ ఎక్కడో ఉంది. ఎక్కడో ఏమిటి ? - ఈ సృష్టిలోనే అంతర్యామిగానే ఉంది. దానినే బ్రహ్మప్రజ్ఞ అన్నారు పెద్దలు.

ఇన్నిరకాల వ్యక్తిత్వాలనూ ఒకచోట చేర్చితే ఏంజరుగు తుందో చూద్దామనే కుతూహలం సృష్టిలోని ప్రజ్ఞకు కలిగితే, అవి ఒక్కచోటికి చేరితే ఎలాఉంటుందో చూడాలంటే మహాభారతంతప్ప మరో దర్పణం ప్రపంచవాఙ్మయం మొత్తంలో ఎక్కడా కనిపించదు. ఇంతవైవిధ్యంగల వ్యక్తిత్వాలు ఒకేచోట చేరితే భౌతికంగా యుద్ధం, మానసికంగా ఘర్షణ, జీవుని పరిణామంలో పరిపాకం ఒకేసారి సాధించబడతాయి. ఇది మహాభారతంలో జాగ్రత్తగా చూస్తే ఎవ్వరికైనా కనిపించేసత్యం. అయితే, మహాభారతం మొత్తాన్ని - ఎన్నోరాగాలు, రాగమాలికలు, దేశీ, విదేశీ, స్వదేశీ రాగభేదాలతో కూడిన మనోహరమైన గాంధర్వవిద్యాసదస్సుగా దర్శనంచేయగలిగినవారు చాలా కొద్దిమంది ఉంటారు. వారికి ఆ సమ్యక్ దృష్టి గురుచరణసేవవలన, గురుదేవుల అనుగ్రహంవలన లభించినవే. సోదరుడు కృష్ణస్వామి అటువంటివాడు. గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి అనుగ్రహం, గురు వర్యులు బ్రహ్మశ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నేతృత్వం లభించిన కృష్ణస్వామి ధన్యుడు. గురువర్యుల చరణకమలాలు పద్మాలా తన హృదయంలో విచ్చుకుంటూఉండగా, తన ధన్యతలోనుంచి కమలంలా విచ్చుకుని వచ్చినదే ఈ "భారతం-ధర్మాద్వైతం" అనే గ్రంథం. ఇది పి.హెచ్. డి. పట్టానికిగాను సమర్పించబడిన సిద్ధాంత వ్యాసం.కాని దీన్ని చదివిన సహృదయులకు- ఇది పట్టాలకూ,డిగ్రీలకూ అతీతంగా చాలాపైగా నిలబడిందని తెలిసిపోతూనే ఉంటుంది. కృష్ణస్వామి వెలువరించిన ఈ రచన "వ్యాసపీఠం" ముందు సమర్పించుకోదగిన అమూల్యమణి.

గాంధర్వసదస్సును నిర్వహిస్తున్న గాయకుడు గానంచేసే రాగాలూ, గీతాలూ సామాన్యంగా ఇంతకుముందే ప్రసిద్ధికెక్కినవై ఉంటాయి అయితే ప్రతిభావంతుడైన గాయకుడు ఒక క్రొత్త గీతాన్ని వ్రాయగలుగుతాడు. ఒక క్రొత్తరాగాన్ని కూడా సృష్టించ

గలుగుతాడు. తద్విదులైన శ్రోతలకు అప్పుడు కలిగే ఆనందానుభూతికి కొలతలుండవు. అలాగే మహాభారతం పైన ఎన్నో గ్రంథాలు వచ్చాయి. ఆ వచ్చిన విషయాలనే మళ్ళీ మళ్ళీ - తమసొంతమైన గమకాన్ని జేర్చి ఎంతోమంది గ్రంథాలుగా వ్రాశారు. వాటి నన్నింటినీ అవలోడనం చేస్తూనే, తన సొంతరచనను సొంతశైలిలో వెలార్చి, ఒక క్రొత్త మహాభారతరాగాన్ని సృష్టించాడు సోదరుడు కృష్ణస్వామి. ఈరాగం పూర్తిగా అతని సొంతసృష్టి. ఈ సృష్టికి దోహదం చేసిన పూజ్యులు కృష్ణమాచార్యులవారు, సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

ఒక్కొక్క శిష్యుణ్ణి చూచుకుని గర్వపడే అదృష్టం కొందరు గురువులకు కలుగుతుంది - కృష్ణస్వామివంటి శిష్యులు గలవారికే. అలాగే "కృష్ణస్వామి నా మిత్రుడు, సోదరుడు" అని చెప్పుకునే అదృష్టమూ నావంటి కొద్దిమందికి దక్కుతుంది.

మహాభారత గాంధర్వవిద్యాసదస్సులో తన సొంత రాగాన్ని ఒకదాన్ని సృష్టించి "వ్యాసపీఠం" ముందు ఆలపించిన చిరంజీవి కృష్ణస్వామికి శ్రీ మహాభారత అధిదైవమైన శ్రీకృష్ణుడు ఆయురారోగ్యైశ్వర్యాలను ప్రసాదించాలనీ, అతనికీ అతని కుటుంబానికీ సుఖశాంతులను ప్రసాదించాలనీ గురుదేవుల చరణకమలాలకు విన్నవించుకుంటున్నాను.

"లోకాః సమస్తాః సుఖినోభవంతు"

రుధిరోద్గారి
మార్గశీర్ష బహుళ దశమి
గురువారం
29-12-1983

ఆశీస్సులతో
చిప్పకుల రవిశర్మ.

# పారవశ్యం పలుకులైతే

ఒకవైపు వ్యాసరచిత మహాభారతాన్ని ఆలంబనంగా చేసికొని, మరొకప్రక్క కవిత్రయ అనువాదాన్ని నేర్పుతో పరిశీలించి, గీతోప దేశమందలి సారాన్ని స్వీకరించి మహాభారతమందలి ధర్మాద్వైత ప్రతిపత్తిని పరిశోధించి మానవజీవితానికి ఒక కొత్త చైతన్యాన్ని కలుగజేశారు శ్రీ కృష్ణస్వామిగారు. అంతటితో ఆపక మహాభారతం రెండు భిన్నప్రవృత్తులమధ్య జరిగిన సంఘర్షణ మాత్రమే కాదని చెబుతూ, తనయందలి తామస రాజస చిత్తవిభ్రమువల్ల మానవుడు ప్రకృతినుండి ఎటువంటి శిక్షానుభవంతో శిక్షణ పొందుతాడో సోదాహరణంగా ఈ గ్రంథంలో నిరూపించారాయన.

వ్యాసరచిత మహాభారతం, కవిత్రయ మహాభారతం అవగాహన చేసికొని ఆనందించడం ప్రతి ఒక్కరికీ సాధ్యపడే విషయం కాదు. అందుకు మరొకరిని ఆశ్రయింపక తప్పదు. అదీగాక గత 37 సంవత్సరాలనుండి మన విద్యావిధానం పరిశోధకులయొక్క ప్రయోగశాలలలోని పరీక్షానాళికలలో నలిగి విరిగి వికారరూపాన్ని దాల్చి మరణాసన్నమై ఉన్నది. ఈ కాలగతిలో మూడు తరాలు ముక్కలు కాగా నాల్గవతరంవారి నాలుకపై అక్షరజ్ఞానం అదృశ్యమైంది.

ఈ అజ్ఞానంనుండి ప్రతి ఒక్క వ్యక్తికీ శరాక్షరవిభూతిని కలుగజేయు డానికి కాబోలు శ్రీకృష్ణస్వామిగారు "చింతామణి గుణనిబ ద్ధాక్షవలయు"మను సరళ సరసాక్షర సంపుటిగా తమ అమూల్యరచనను అందరికీ అవగాహన అయ్యేటట్టుగా రచించి అందించారు.

ఈ గ్రంథ విషయమందలి అనంతగుణసంపదలో మరొక్క విశేషం-బాలబాలికలు మొదలు, విశ్వవిద్యాలయవిద్యార్థులస్థాయి వరకు- వారి వారి నైతికజీవనసరళిని తీర్చిదిద్దే చక్కటి పాఠ్యాంశా లతో నిండి ఉన్న దీ పరిశోధనాత్మక రచన. ఈ మహత్తరరచనను చదివిన ప్రతిపాఠకుడూ సనాతనధర్మంచే స్పృశింపబడి ఉద్ధరింపబడ గలడు.

'భారతం - ధర్మాద్వైతం' అనే ఈగ్రంథం ఒక మహా కావ్యమా? అవును. మాయావృత ప్రాపంచిక మహానాటక రూపమా? అదీను. సాత్త్విక రాజస తామస ప్రవృత్త్యాత్మక సామాజిక చరిత్రయా? నిస్సందేహంగా. కథలసంపుటియా? ఎందుకుకాదు! నిత్యసత్య జీవిత సన్నివేశాలతో ఆయా పాత్రల జీవితాలను ఇతివృత్తంగా పెట్టుకొన్న కల్పనారహితమైన అద్భుత నవలారూపమా? తప్పకుండా. చదువరి ఈ గ్రంథరాజాన్ని ఏకోణం లోంచి దర్శిస్తే ఆ రూపంలో దర్శింపబడటం ఈ గ్రంథం యొక్క ప్రత్యేకత. మహాభారతానికున్న ప్రత్యేకతే మహాభారత హృద యాన్ని మనకు అందిస్తున్న ఈ గ్రంథానికీ అబ్బింది. అంతేకాక ఈ దివ్యసందేశాన్ని అందిస్తున్న ఆ దివ్యపురుషునియొక్క స్వరూప సందర్శనం ఈ గ్రంథంలోని ప్రతి అక్షరంలోనుండి పాఠకునికి లభిస్తుంది.

సాధారణంగా మహాభారతగాథ విన్న శ్రోతకు దుర్యోధ నాదులపై ఒక విధమైన ద్వేషభావం కలగడం పరిపాటి. కాని

"భారతం - ధర్మాద్వైతం" చదివిన ప్రతి పాఠకుడికీ దుర్యోధ నాదుల దుర్గతియందు సానుభూతితో కూడిన మిత్రభావనే కలుగు తుంది గాని శత్రుభావన కలగదు.

ఒక దివ్యపురుషోత్తమునియొక్క హృదయకమలంనుండి ఉద్భవించిన ఈ ఉత్తమరచన ద్వారా భారతావనిలో భాగతావనిలో ఆంధ్రరాష్ట్రము అగ్రతాంబూల మందుకొనుటలో సందేహంలేదు.

నేడు తెలుగునాట వెలుగు చూపుచున్న ఈ మహత్తర పరి శోధన గ్రంథం ఏనాడు భారతీయభాషలన్నిటియందూ అనువదింప బడి యావద్భారత మానవజాతికీ అందజేయబడునో - ఏనాడు ఈ దివ్య సుందర సరళ సరస రసానందప్రద సందేశాత్మక గ్రంథం భారతీయ విద్యారంగంలో అన్ని తరగతులలో ప్రముఖ పాఠ్యాంశ ముగా స్వీకరించబడునో ఆనాడు యావద్భారత దేశమూ సనాతన ధర్మ వైభవమును తిరిగి అనుభవింపగలదనుట ముమ్మాటికీ సత్యము. సర్వ మానవ సౌభ్రాత్రమును అనుగ్రహించగల సనాతనధర్మమును సరసమధురముగ దివ్యసుందరముగ అందిస్తున్న ఈ గ్రంథ పఠనా పారవశ్యము కట్టిన పలుకులివి.

అమలాపురం<br>17-2-84

మాచిరాజు వేంకటసుబ్బారావు.

# ప్రత్యక్షసాక్షినేకాదు-
# ప్రత్యక్షర సాక్షిని

ఈ గ్రంథానికి నేను ప్రత్యక్షసాక్షినేకాదు- ప్రత్యక్షరసాక్షిని కూడా ! అదెలాగంటే -

1974 నుంచీ కృష్ణస్వామిగారిని నేనెఱుగుదును.

అంతకుపూర్వపు ఆయన చరిత్రకూడా నాకు బాగా తెలుసు. 'అన్వేషణ - అనుభూతి' లో ఆయన కథని ఆయనమాటల్లో చదివాం. అలాంటి విప్లవవాదినుంచి ఇలాంటి దర్శనాత్మకమైన గ్రంథం వెలువడింది !

ఒక చిన్నవంటకం సిద్ధంకావాలంటే ఎంతో ప్రయత్నం, ఏర్పాట్లు, సామగ్రి. సాధన కావాలిగదా ! మరి, ఇంతటి మహా రచన వెలువడాలంటే ఎంతటి సాధన సాగిఉండాలి ఆజీవితంలో !

- అదన్నమాట నాకు తెలుసున్నది. దానికి నేను ప్రత్యక్ష సాక్షిని. అయితే తినేవారికి వంటకం బాగుందో లేదో అన్న విషయమేగాని, వంటకం ఎలా తయారైనదో అక్కరలేదుగనుక ఆ సంగతి ప్రస్తుతానికి వదిలేద్దాం.

ఇంక ప్రత్యక్షరసాక్ష్యం గురించి -

విశాఖ - లాసన్స్ బే కాలనీలో, రామారావుగారింట్లో ప్రశాంతంగా ఒక గదిలో నేనూ, కృష్ణస్వామీ కూర్చుని ఉండేవారం.

నా చేతిలో కలం, కాగితాలు -

ఆయన రెండు చేతులూ కలుపుతూ, ఎటో చూస్తూ చెప్పుకు పోతూ ఉండేవారు.

'నరుడు - వేదదర్శనం'తో మొదలై, 'తిక్కన - హరిహరనాథ తత్త్వప్రతిపాదన' వరకూగల సమస్తవిషయమూ అలా ఆయన చెప్పుకుపోతూ ఉంటే ఇలా నేను వ్రాస్తూ ఉండేవాణ్ణి.

పగలో, రాత్రో; తిన్నామో, తినలేదో - ఏమీ తెలిసేది కాదు. అసలాయన చెబుతున్నట్టుగాని, నేను వ్రాస్తున్నట్టుగాని స్పృహే ఉండేదికాదు. ఒకోసారి భయంవేసేది, ఒకోసారి ఆనందం కలిగేది, మరోసారి అద్భుతమనిపించేది, నాకు నేను గుర్తువచ్చి నప్పుడల్లా ఆయా సన్నివేశాలూ, ఆయా పాత్రలూ గురించి చెబుతున్నప్పుడు నాఎదుటఉన్నది కృష్ణస్వామేనా అనిపించేది.

'వారిలా అన్నారు', 'వీరిలా అన్నారు' అనిగాని, 'ఇది నా అభిప్రాయం', 'నేనిలా భావిస్తున్నాను' అనిగాని ఎక్కడా మాటైనా వచ్చేదికాదు ఆయననుండి. ఇదెక్కడి థీసిస్సు ? ఇదేంలోకం ? ఇంత ప్రభుసమ్మితంగా, ఖండలాలు బ్రద్దలుకొట్టి మరీ చెబుతున్నారు, ఈయనకి 'డాక్టరేట్' వచ్చేనా అని భయంవేసేది.

చదువు నాకు బ్రతుకు తెరువు.

కృష్ణస్వామికో ? - బ్రతుకు తెఱవు

కనుక నాకున్న భయాల్లాంటివి ఆయనకి లేవు.

“ఈ వెలుగు ఎవరిచ్చారో వారు చూసుకొంటారనన్నీ-నువ్వు వ్రాయవోయ్” అనేవారు నాతో ఆయన.

ఆధ్యాత్మికత, అభ్యుదయభావనల సమ్మేళన ఈ పరిశోధన గ్రంథం. భగవద్గీత సందేశం అంతా భారతాన్ని వాహికగా చేసికొని అందించబడింది ఇందులో.

'పిల్లి అంటే మార్జాలం, ఆమాత్రం తెలియదా!' అనే విధంగా కాక, అనుభూతిప్రధానంగా మనజీవితాలకు కావలసిన సమన్వయాలనెన్నిటినో ఈ గ్రంధం సులభశైలిలో అందిస్తోంది.

'ధర్మాద్వైతం' అంటే ఏమిటో వ్యాసకర్త చేసిన వివరణ అనితరసాధ్యమైనది. "వ్యాసుడు ధర్మాద్వైతస్థితిలో నిలిచి ధర్మాద్వైతస్థితితోకూడిన భారతాన్ని రచించాడు. దానిని అనువదింప గోరిన తిక్కనగారికికూడా ధర్మాద్వైతస్థితి అనుగ్రహింపబడింది. భారతం మనస్సుపెట్టి చదివినవారికి వ్యాసుడు వివరించిన స్థితీ, తిక్కన పొందిన స్థితీ అయిన ధర్మాద్వైతస్థితి తప్పక సిద్ధిస్తుంది" - అంటున్నారు కృష్ణస్వామి.

వ్యాసుని దర్శనాన్ని తిక్కన సందర్శించాడు.

తిక్కన సందర్శనాన్ని కృష్ణస్వామి పునర్దర్శనం చేశారు. అంతేకాదు, తిరిగి మనందరిచేతా సందర్శింపజేస్తున్నారు.

వ్యాస తిక్కనలకు ఎలాంటి ధర్మాద్వైతస్థితి సిద్ధించిందో అలాంటి సిద్ధే శ్రీకృష్ణస్వామికీ అనుగ్రహింపబడిందని ఈరచన నిరూపిస్తుంది. 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' అనిగదా బ్రహ్మవిద్య ఘోషిస్తోంది! ధర్మాద్వైతస్థితి సిద్ధించినవారికేగాని ఇంతసుగమంగా ధర్మాద్వైతమంటే ఏమిటో, భారతం దానినెలా ప్రతిపాదిస్తున్నదో చెప్పడం సాధ్యంకాదు. అంతమాత్రంచేత కృష్ణస్వామిని వ్యాస తిక్కనల సరసన చేరుస్తున్నట్టుగా అనుకోవాల్సినపనిలేదు. కృష్ణస్వామి ఎప్పటికీ కృష్ణస్వామే !

బుద్ధితో భారతాన్ని చదివినప్పుడల్లా నాకనిపిస్తూఉండేది - అయిదుగురు భర్తలున్న ద్రౌపది, ఎంత కారణజన్మురాలనుకోనా,

పతివ్రత ఎలా అయ్యింది? కుంతి పతివ్రత ఎలాగవుతుంది? ఎంతో అవతారమూర్తి అయినా కృష్ణుడు చేయించిన యుద్ధంలో భీష్మవధ, ద్రోణవధ, కర్ణవధల సందర్భాలు అధర్మానికి ఆటపట్టులు కాకుండా ఎలాపోతాయి? - అని. ఇంకా ఎన్నెన్నో సమస్యలు ఇలాంటివే - నిరంతరం వేధిస్తూఉండేవి.

వాటితో మథనపడీపడీ - పర్యవసానంగానేనేమో, కృష్ణస్వామితో పరిచయం కలగడమూ, ఆయన జీవితంలో సాగుతున్న సాధనకూ, ధర్మాద్వైతసిద్ధికీ నేను ప్రత్యక్షసాక్షిని కావడమూ జరిగాయి.

భారతంవంటి మహాగ్రంథాలను చదవడానికి కావలసింది బుద్ధి కాదు, హృదయమని అవగతమైంది. ఈ గ్రంథాలను చదవడమంటే వాటితో కుస్తీపట్టడంకాదు, వాటిని ఆరాధించాలనీ, మన మొహాలతో సత్యాన్ని దర్శించడంకాక, సత్యాన్ని సత్యంగా దర్శించడానికి సిద్ధపడిఉండాలనీ కృష్ణస్వామి పరిచయంతోనే నాకు బోధపడింది.

అలసులమూ, మందబుద్ధులమూ అయిన మనతరంవారికి మరొకసారి 'కృష్ణద్వైపాయనమునివృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థాన్ని మన వాడుకభాషలో, మనకు తెలిసిన ఉదాహృతులతో అందిస్తున్నది ఈ గ్రంథం. వ్యాసదర్శనం ఎంత ఉన్నతమైనది! వ్యాసపరంపర ఎంత మహోదారమైనది!

ఈ గ్రంథం వస్తున్నప్పటినుంచీ నాకు ఒకేధ్యాస - ఇంత మహత్తరమైన సందేశంగల ఈమహాగ్రంథాన్ని ఎలా వెలువరించాలా? అని. నాఅజ్ఞానం కాకపోతే, నేనెంతటివాణ్ణి దీనిని వెలువరించడానికి! దివ్యవాఙ్మయంచేత మనం ఉద్ధరింపబడటమేగాని, మనం ఆ విజ్ఞానాన్ని ఉద్ధరించడమంటూ ఉండదు. తెలియనితనంతో అంటూఉండేవాడిని కృష్ణస్వామిగారితో - 'దీన్ని వెంటనే అచ్చు వేయించేద్దామండీ' అంటూ.

'అలాగైతే, దీనిసమయం దానికుంటుంది, నువ్వు కంగారు పడకు' అంటూ ఉండేవారాయన చిద్విలాసంగా.

కృష్ణస్వామిగారంటే నాకుండే వ్యామోహంచేత మాత్రమే నాకలా కంగారుగా ఉండేదా అంటే, ఈగ్రంథానికి పిహెచ్. డి. పట్టా నివ్వడానికి ఏర్పడిన డాక్టరల్ కమిటీవారుకూడా ముక్తకంఠంతో అదే అభిప్రాయం వెలిబుచ్చారు(ట)! అడిగిందే తడవుగా అయిను వేలిచ్చి ఆశీర్వదించి ముందుకుసాగమన్నాడు తిరుమలేశుడు. బహుశా, కృష్ణస్వామిగారు అన్న దీనిసమయం దీనికి ఇప్పటికి వచ్చి ఉంటుంది.

ఇన్నివిధాలుగా దివ్యంగా సాగుతున్న ఈ గ్రంథప్రకాశనానికి కర్తను నేనేనన్నట్టుగా కృతజ్ఞతలు చెప్పుకోవడంవంటి సంప్రదాయాలను పాటించాలంటే ఏమిటోగా ఉంది - రోజూ ప్రొద్దున్నే సూర్యుడికి స్వాగతం చెబుతూ, నేనలా చెబుతూండబట్టే సూర్యుడలా ప్రకాశిస్తున్నాడు - అనుకోవడంలా.

"వాసుదేవ స్సర్వమితి"

చీకటిపోయి, తెల్లవారి, వెలుగురేకలు విచ్చుకొని సూర్యోదయం జరగాలని అందరూ కోరుకుంటారు. తెల్లవారగానే ఎవరికి వారు 'హమ్మయ్య! తెల్లవారింది' అనే ఆనందంతో సవితృవందనం చేస్తారు. నేనూ అంతే. అమ్మయ్య! నాకోరిక నెరవేరుతున్నది!

ఈ థీసిస్ వెలువడుతున్నది!

11—2—84
మాస్టర్ కుటీర్
కొంకాపల్లి
అమలాపురం
533 201

వాడపల్లి చక్రపాణిరావు
జగద్గురుపీఠం- అమలాపురంశాఖ

# గతంలోకి తొంగిచూస్తే...

హైస్కూల్లో చదువుకొనేరోజుల్లో సి. వి. సుబ్బారావుగారని తెలుగుమాస్టరుగారుండేవారు. ఆయన పాఠం చెబితే మాకు నోటికి వచ్చేసేది. తెలుగంటే రుచి తెలియడం, దానిపైన అభిమానం ఏర్పడటం ఆయన సాన్నిధ్యంలోనే. ఆయన చెప్పిన తర్వాత ఇంటికి వచ్చి ఆపాఠాన్ని చూస్తే! మళ్ళీ ఆయన చెబుతున్నట్టే ఉండేది. బందరు హిందూకళాశాలలో చదువుకొనేటప్పుడు వై. వి. రమణరావుగారనే తెలుగు లెక్చరరుగారి ప్రభావం నాపైన చాలా పడింది. మధురగంభీరమైన ఆయన కంఠధ్వని తెలుగుపై నాకు గల అభిమానాన్ని మరింత పెంచింది. సుబ్బారావుగారు, రమణరావుగారు మూర్తీభవించిన ధర్మమూర్తులు, కర్తవ్యపరాయణులు, వారిని గూర్చిన మరికొన్ని అంశాలు ఇంకో సందర్భంలో ఇంకొకచోట చెబుతాను. విశాఖ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నన్ను ప్రభావితం చేసినవారు ఇద్దరు మహావ్యక్తులు. ఒకరు డాక్టర్ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మరొకరు కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య శాస్త్రిగారు ధర్మనిష్ఠులు. కృష్ణమాచార్యగారు సమన్వయమూర్తులు. శాస్త్రిగారి ప్రవర్తన, *మాస్టర్ ఇ. కె. గారి సేవా సందేశమూ

* శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యగారిని మాస్టర్ ఇ. కె. అనీ, మాస్టరుగారనీ వ్యవహరించడం పరిపాటి.

నా జీవితాన్ని తీర్చిదిద్దాయని చెప్పవచ్చు. శాస్త్రిగారు మాకు కవిత్రయ భారతభాగాలు చెప్పారు. మాస్టరు ఇ. కె. వాఙ్మయ చరిత్ర, వ్యాకరణం బోధించారు.

మాస్టరు ఇ. కె. వాఙ్మయచరిత్ర చెబుతూ తిక్కన ప్రసక్తి వచ్చినప్పుడు సంజయరాయబారఘట్టం చాలా వివరంగా లోతులకు తీసుకువెళ్ళి చెప్పిన ఘట్టమొకటి, తిక్కనగారి భగవద్గీతానువాదం గురించి చెబుతూ భగవద్గీతను తిక్కన వదలిపెట్టాడనడం సబబు కాదనీ, భగవద్గీతసారాన్నీ, సందేశాన్నీ పోకుండా ఒడిసిపట్టు కున్నాడనీ నిరూపిస్తూ వివరించిన ఘట్టమొకటి, తిక్కన హరిహర నాథ తత్త్వాన్ని గురించీ, దాని పూర్వాపరాలనుగురించీ తెలియ బరచిన ఘట్టమొకటి చాలా గాఢమైన ముద్రను నా మనస్సుమీద వేశాయి.

తిక్కన కేవలం కవిమాత్రుడుకాడు. అతడొక ప్రవక్త. సనాతనధర్మాన్నీ, భారతమిస్తున్న సమన్వయాన్నీ దర్శించి, తన నాటి ప్రజల ఆవేశకావేశాలనూ, మతోన్మత్తతనూ కరిగించి, వారిని మనుష్యులుగా నిలబెట్టిన ఒక ఆచార్యపురుషుడు, కారణజన్ముడు. హరిహరనాథతత్త్వమనేది అతను తననాటి సమాజానికి వేసిన తాత్త్వికమైన ఒక ఔషధం. ఔషధం వైద్యుడు ప్రయోగిస్తాడు. రోగిని బ్రతికిస్తాడు. వైద్యుడు వాడే ఔషధాలన్నిటినీ ఆ వైద్యుడే కనిపెట్టితీరాలనీ, తాను కనిపెట్టిన ఔషధాలను మాత్రమే ప్రతి వైద్యుడూ వాడాలనీ అనుకోవడం అవివేకం. రోగి రోగాన్ని గమనించి సిద్ధంగా ఉన్న ఔషధాలలో దేనిని ప్రయోగించాలో నిర్ణయంచేసి బ్రతికించడం వైద్యుని కర్తవ్యం. అలాగే తననాటి సామాజిక ఉన్మాదస్థితిని ఉపశమింపజేయడంకోసం, నివారణ చేయడంకోసం తిక్కన సనాతనధర్మంనుండి ఎంచి, రంగరించి అందించినదే హరిహరనాథతత్త్వం. ఇలాంటి తిక్కనను మూద

వలసిన తీరులో చూడవలసింది చాలా ఉందనిపించింది. ఆయన భారతాన్ని అనుభవించి వ్రాశాడు; అనుష్ఠించి వ్రాశాడు. జీవిత సన్నివేశాలను పరిశీలించినపుడు తిక్కన శ్రీకృష్ణుని వాహికగా, అంశగా మనకు గోచరిస్తాడు. భారతరచనలో వ్యాసుని వైభవం తిక్కన చిత్తాన్ని ఆవహించి తెలుగుభారతంగా వ్యక్తమయ్యింది.

ఎం. ఏ. అయిపోయింది. మిత్రులంతా పెట్టేబేడా సర్దుకొని ఇళ్ళకు ప్రయాణమవుతున్నారు. నాకు కృష్ణమాచార్యగారితో ఏర్పడిన పరిచయం సాహచర్యంగా రూపొందడంతో ఆయనను విడిచి వెళ్ళిపోవడం ఇష్టంగానూ లేదు, సాధ్యమనీ అనిపించలేదు. ఆయన దగ్గరకువెళ్ళి "మాస్టరుగారూ! అంతా బయల్దేరి వెడుతున్నారు. నేను మాత్రం వెళ్ళాలని అనుకోవడంలేదు. మీ పరిచయంతో క్రొత్తలోకంలోనికి ప్రవేశించిన నేను ఆ లోకం పూర్తిగా పరిచయం కాకముందే, ఆలోక జీవితం అలవాటు కాక ముందే 'మాలోకం'లోనికి వెళ్ళిపడటం కర్తవ్యంగా కనిపించడం లేదు. 'మాలోకాన్ని' ఈలోకంగా తీర్చిదిద్దగల శక్తియుక్తులను నాకిచ్చి మీరు పంపితే నాకేమీ అభ్యంతరంలేదు. అందుకుగాను కొన్ని సంవత్సరాలపాటు మీతో కలిసిఉండేటట్లు నన్ను అనుగ్రహించండి" అని వేడుకొన్నాను. ఆయన కొద్దిరోజుల తర్వాత ప్రణాళికనిస్తానని చెప్పి, ఒకరోజున పిలిచి, "సుబ్రహ్మణ్యశాస్త్రిగారి దగ్గర పిహెచ్. డి. పరిశోధనకు చేరు" అని చెప్పారు. ఆయనే శాస్త్రిగారికి నన్ను అప్పజెప్పారు. "ఆచారిమాస్టారూ! కృష్ణస్వామిని మీదగ్గరే చేర్చుకుంటే యింకా బాగుంటుందేమో!" అన్నారు శాస్త్రిగారు. "నేనెంతకాలం ఉంటానో ఈ విశ్వవిద్యాలయంలో - నాసంగతి మీకు తెలుసుగదా! నేనుగా మీకు అప్పజెబుతున్నాను" అన్నారు మాస్టరుగారు. "సంతోషం. మీ మాటను ఆదేశంగా స్వీకరిస్తున్నాను" అన్నారు శాస్త్రిగారు.

నేనిప్పుడు ఇద్దరు తల్లుల బిడ్డనయ్యాను. వారిద్దరూ ఒకే గదిలో ఉండేవారు. వారిద్దరిమధ్యా నేను !

"దేనిమీద చేస్తావు పరిశోధన ? నీవేమైనా నిర్ణయించుకొన్నావా ?" అని అడిగారు శాస్త్రిగారు. "తిక్కనగారిమీద చేద్దామని ఉత్సాహంగా ఉంది. తిక్కనగారి హరిహరనాథతత్త్వం మీద చేద్దామనుకొంటున్నాను" అని చెప్పాను నేను. "ఎలాగూ తిక్కనగారిని పట్టుకున్నావు గనుక, హరిహరనాథతత్త్వంతోపాటు, ఆయన పేర్కొన్న ధర్మాద్వైతాన్ని గురించి కూడా కలుపుకొని పరిశోధనచేస్తే బాగుంటుందేమో !" అన్నారాయన. "అలాగే చేస్తాను. తిక్కనగారి వ్యక్తిత్వం నన్ను ప్రభావితుణ్ణి చేసింది. ఆయనకు సంబంధించిన ఏ అంశంమీదనైనా తప్పక చేయాలనే ఉత్సాహం ఉన్నది" అని నేను చెప్పడంతో ప్రణాళిక సిద్ధమై పరిశోధన ప్రారంభమైంది.

'ధర్మాద్వైతం' - అనే ప్రయోగం చాలా బాగుంది. చిత్రంగాఉంది. అద్వైతం విన్నాం, విశిష్టాద్వైతం విన్నాం, ద్వైతాన్నివిన్నాం. త్రిమతాలేననుకొన్నాం. కాని తిక్కనగారు ధర్మాద్వైతమంటున్నారు. ఇది త్రిమతాలకన్నా భిన్నమైనదా ? లేక, త్రిమతాలను తనలో ఇముడ్చుకోగలిగినదా ? ఇంతకూ ధర్మాద్వైతం అంటే ఏమిటి ? - పెద్దలు ధర్మాద్వైతాన్నిగూర్చి యింతవరకూ చేసిన వివరణలను పరిశీలించడం మొదలుపెట్టాను. కాని హృదయం ఆ వివరణలకు ఎక్కువచోట్ల 'ఊఁ' కొట్టలేదు. మేధ కదిలిందిగాని, హృదయం స్పందించలేదు. కొద్దిచోట్ల మాత్రం హృదయం కొంచెం తొంగిచూసింది. కాని హృదయానికి పూర్తి తృప్తికలిగే వివరణ యింకా రావలసిఉంది అనిపించింది. ఎప్పుడు వస్తుందో ! ఎలావస్తుందో ! ఆ వ్యాసుడే దిక్కుగా కనిపించాడు. వ్యాసానుగ్రహం ఉంటేనే ఈ సిద్ధాంతవ్యాసం - అంటే

వ్యాససిద్ధాంతం బయటుకువస్తుంది అనిపించింది. భారతాన్ని దీక్షగా చదవడం, మళ్ళీ చదవడం చేస్తూవచ్చాను.

పెద్దలు కొందరు ఇంత పెద్దఅంశాన్ని ఎందుకు పట్టుకొన్నానని జాలిపడ్డారు. 'ఏ చిన్న కావ్యం మీద చేస్తే మీకు పి.హెచ్. డి. రాదు? మాటవిని టాపిక్ మార్చుకోండి' అని సలహా యిచ్చినవారూ ఉన్నారు. 'దీన్ని పూర్తిచేద్దామనేనా ?' అని దడిపించారు ఇంకొందరు. వ్యాసుడే ఇన్నిరకాలుగా కుదిపిచూశాడేమో ననిపిస్తుంది ఇప్పుడు నాకు. వాళ్ళలా అంటున్నకొద్దీ నాలో దీక్ష పెరిగింది. నాకు పి.హెచ్.డి. డిగ్రీ పొందడం ఒక్కటే ముఖ్యంకాదు. నాకు తృప్తికలిగేది వ్యాసహృదయం ఆవిష్కరించబడినప్పుడు మాత్రమే. అంతరాయాలు ఎన్నివచ్చినా ముందుకు సాగమనే అంతరాత్మ చెబుతోంది. ఇంతలో శాస్త్రిగారు జైలుకు వెళ్ళారు. అది ఎమర్జెన్సీ కాలం. మళ్ళీ జనంలోకి వచ్చారు జనతా ప్రభుత్వం వచ్చాక. ఈలోపున భారతాన్ని గూర్చిన ప్రసంగాలూ, భారత ఘట్టాలపై వ్యాసపరంపరలూ నానుండి వెలువడసాగాయి.

మాస్టర్ ఇ. కె. గారి సాన్నిధ్యం వరప్రసాదమై సనాతన ధర్మస్వరూపాన్ని సమగ్రంగా పరిచయంచేసి, దానిలోనికి ప్రవేశింప జేసింది. జీవితం సనాతనధర్మానికి అనుగుణంగా సాగసాగింది. 'స్వామిగేయాలు', 'దర్శనాలు - నిదర్శనాలు', 'సందేహాలు - సమాధానాలు', సంభాషణలు - సమన్వయాలు' అనే గ్రంథాలు నానుండి వెలువడినాయి. ఆ గ్రంథాలరచన భారతాధ్యయనానికీ, సిద్ధాంత వ్యాసరూపకల్పనకూ ఎంతగానో నాకు సహకరించింది. ఎన్నో గ్రంథాలు ఉన్న గదిలో కూర్చున్నా ఆ గ్రంథాలను చదువుకోవా లంటే వెలుగుండాలి. పవిత్రగ్రంథాలు మనచుట్టూ ఎన్నిఉన్నా వాటిని అధ్యయనం చేయాలంటే, వాటియెడల అవగాహన పెరగా లంటే ఆచార్యులకృప ఉండాలి. ఆ వెలుగు మాస్టర్ ఇ. కె గా

రూపుకట్టి నన్ను స్వీకరించింది. స్వీకరించి రూపుదిద్దసాగింది. నన్నే కాదు, ఎందరినో, ఎందరెందరినో వ్యక్తులను ప్రత్యక్షంగా, పరోక్షంగా మాస్టరుగారు తీర్చిదిద్దుతున్నారు. నవతరాన్ని నిర్మిస్తున్నారు. దేశాన్ని పునర్నిర్మించడానికై తన ఆయుర్దాయాన్ని కర్చుపెడుతున్నారు. మానవజాతికి మనుగడ నేర్పేటందుకే ఆయన మనిషిగా తిరుగుతున్నట్టు అనిపిస్తుంది. ఆయన దేహం ఒక వేదికగా ఋషులూ, అవతారమూర్తులూ కొలువుదీర్చి ప్రపంచానికి సనాతనధర్మాన్ని, శాశ్వతసందేశాన్ని నిత్యనూతనంగా, నేటిజాతి పరిణామానికి తగినట్టుగా, నేటిజాతి పురోగమనానికి చేయూత లభించేటట్టుగా వివరించడం జరుగుతోంది. ఇది పొగడ్తకాదు - అనుభూతి ! పొగడే వాడు ప్రయోజనాన్ని కోరుతాడు. అనుభూతి చెందినవాడు పరమార్థాన్ని పొందుతాడు. ఆ పరమార్థమే పవిత్రమైన ఈ సిద్ధాంతవ్యాసం.

వ్రాసినవాడే తన గ్రంథాన్నిగూర్చి ఇలా చెప్పవచ్చా ? వ్రాసినది నేను కాదు- కల్యాణి, నరసింహరాజు, చక్రపాణి. నానుండి వస్తూండగా వారు వ్రాస్తూఉండగా ఈ గ్రంథం తయారైంది. కల్యాణి నా ధర్మపత్ని. నరసింహరాజు ప్రియమిత్రుడు. చక్రపాణి నా సహచరుడు. ఇక్కడ కూడా భారతాన్ని ముగ్గురూ వ్రాయడం విశేషం. నానుండి వస్తూఉన్న వ్యాసాన్ని వ్యాసుణ్ణీ చూస్తూ, ఆనందిస్తూ ఉండటమే నేను చేసింది. బహుశా కవిత్రయంకూడా చేసిందంతేనని నా అనుభూతి. లేకపోతే, వారిభారతం ఇంత బాగుండేదికాదు.

ఈ నది ఫలానా కొండల్లో పుట్టింది అంటాం. కొండలకి నది పుడుతుందా ? కొండలమీదుగా వర్షపునీరు నదిగా రూపుకడుతుంది. నేలదారిపడుతుంది. అలాగే, రచయిత శరీరం కొండలాంటిది; రచన నదిలాంటిది. దిగిరాదలుచుకొన్న రచన రచయిత శరీరంమీదుగా

లోకంలోనికి ప్రవహిస్తుంది. ఇది ఒకసత్యం. ఈ స్థితిలో దిగివచ్చిన రచనను పెద్దలు 'అపౌరుషేయం' అన్నారు. దిగివస్తున్న వెలుగుకు రచయిత స్వభావం అడ్డుపడకుండా ఉంటే అది అపౌరుషేయ మవుతుంది. రచయిత అడ్డంపడితే కర్తృవ్యాపారమవుతుంది. అడ్డుపడని వాడు ఋషి. ఋషిఅనే పదానికి చూచేవాడు అని అర్థం. ఉన్నది ఉన్నట్టుగా చూచేవాడన్నమాట ! అందుకే మనపెద్దలు ఋషికాని వాడు కవికాలేడన్నారు. ఋషియైనవాడి రచన కలకాలం నిలబడుతుంది రచయిత ఋషికానప్పుడు ఆ రచన కాలప్రవాహంలో కొట్టుకుపోతుంది. లేదా జనసామాన్యానికి దూరంగానైనా ఉండి పోతుంది.

సామాన్యంగా విశ్వవిద్యాలయ వాతావరణం గురించి ఎవరి అభిప్రాయాలు వారివి, ఎవరి అనుభవాలు వారివి. మొత్తంమీద విద్యాప్రమాణాలు తగ్గడమేకాక, నైతికవువిలువలనుకూడా విద్యార్థులు కోల్పోవడం జరుగుతుందని సర్వసామాన్యంగా విశ్వవిద్యాలయాలను గూర్చి మనకు వినబడేమాట. కాని ఎవరిదారి వారికుంటుంది. ఎవరికి తగినవాళ్ళు వాళ్ళకు దొరుకుతూ ఉంటారు అన్న పెద్దలమాట సత్యమనిపిస్తుంది. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పర్యవేక్షణలో పరిశోధన సాగడం ఒక అదృష్టం. ఆయన దగ్గర నేను అనుభవించినది గురుకులవాతావరణం. గురుకులాలు పోయి గురువుల కులాలు మిగిలిన ఈరోజుల్లో గురుకులవాతావరణం లభించడం దైవానుగ్రహం. చేస్తున్న పరిశోధన ధర్మాన్నిగూర్చి. పర్యవేక్షకులు ధర్మనిష్ఠులు, ధర్మంకొరకు జీవిస్తున్నవారు, ధర్మాన్నే జీవితంగా వ్యక్తం చేస్తున్నవారు. ఆయన తన సొంతపనులు ఎంత ఆత్మీయంగా ఉన్న విద్యార్థిచేతనైనా చేయించరు. ఎంత ఆత్మీయుడైనా ఏమాత్రం ధర్మ తప్పినా మందలించకమానరు. పరిశోధక విద్యార్థుల విషయంలో ఆయన చూపేశ్రద్ధ విద్యార్థులకే ఆశ్చర్యం

కలిగిస్తుంది - ఆ శ్రద్ధలో ఎన్నోవంతు తమకున్నది అని. "కృష్ణ స్వామీ! నువ్వు చాలాపనుల్లో ఉంటావు. ఆ పనులన్నీ కావలసినవే. లోకానికి అవసరమైనవే. ఈపనికూడా కావాలి. ఏపనికి తగినట్లుగా కాలాన్ని ఆపనికి నీవు కేటాయించుకోగలగాలి. ఇంతకూ తర్వాతి చాప్టర్ నాకు ఎప్పుడు చూపిస్తావు?" అని మృదువుగా మందలిస్తూ ముందుకునడిపే ఆయన సారథ్యం ఆదర్శప్రాయమైనది. ఆయన పూనుకొని చేయించకపోతే ఈ పరిశోధన ఇలా పూర్తయ్యేదా అనిపిస్తుంది నాకు. వ్యాసం వ్రాయడం అయిపోతున్నది. ఆయన చూస్తున్నారు - చూడటమంటే ప్రతి అక్షరం చూస్తారు. రాజీ పడరు - శ్రమ అనుకోరు. వ్రాసినవారిభావాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తారుతప్ప, తన భావాలను రుద్దరు. వ్రాసినవారి భావాలను ఇంతకన్నా స్పష్టంగా, ఇంతకన్నా మెరుగులు దిద్ది చెప్పించవచ్చేమో చూస్తారు. తగిన సూచనలిస్తారు. కొద్దిరోజులే సమయం ఉంది. ఆరోజులు దాటితే ఆయన క్యాంపుకు వెళ్ళిపోవాలి. ఆలోపల నా వ్యాసం చూడటం అయిపోవాలి. ఆయన దీక్షగా చూస్తున్నారు, నన్ను ఎదురుగా ఉంచుకొని. వలసినప్పుడు సంప్రదిస్తున్నారు. 'భోజనానికి వెళ్ళవా?' అని అడిగారొకసారి. 'ప్రొద్దున టిఫిన్ బరువుగా చేశాను, ఆకలిగాలేదు' అన్నాను. కాస్తాగి, 'కాంటీన్‌కు వెళ్ళవద్దాం పద' అన్నారు. భుజంమీద చేయివేసి తీసుకువెళ్ళారు. 'నీవు భోజనానికి వెళ్ళలేదు, గుర్తుందనుకొంటాను. నువ్వు డబల్ టిఫిన్ తీసుకో, నేను సింగిల్ టిఫిన్ తీసుకొంటాను' అని టిఫిన్ తెప్పించారు. టీ కూడా పూర్తయినతర్వాత డబ్బులు తియ్యబోతుంటే 'పెద్దవాళ్ళుండగా చిన్నవాళ్ళు డబ్బులివ్వకూడదు' అని ఆయనే ఇచ్చారు. ఇలాంటి సన్నివేశాలు అయిదారుసార్లు జరిగాయి నాకు ఆయనతో. మళ్ళీ వెళ్ళి వ్యాసం దగ్గర కూర్చున్నాం. అదొక అనుభూతి. ఆయన వ్యాసాన్ని చూస్తుంటే నేను ఆయనలో వ్యాసుణ్ణి చూస్తూ కూర్చునేవాణ్ణి. ఆయన మూర్తీభవించిన

భారతీయత, జనానికి అందుబాటులో ఉన్న ఒక ఋషి. మన ఋషులు ఎలా ఉండేవారో అని మనం ఊహించుకోనక్కరలేదు - ఆయనను చూస్తే చాలు. భారతంకోసం దానికి సంబంధించిన ఋషి విశ్వవిద్యాలయంలో చొరబడి కుర్చీలో కూర్చుని చూస్తున్నట్టు ఉండేది. ఈ అనుభూతి నా ఒక్కడిదేకాదు - ఆయనతో పరిచయం ఉన్న అందరిదీను. తమతమ సిద్ధాంతాలకు అతీతంగా ఎదిగి ఆయన ప్రవర్తనను చూసి మురిసిపోతూ మెచ్చుకొనేవారినీ, మెచ్చుకొంటూ నేర్చుకొనేవారినీ నేను ఎందరినో చూశాను. మాస్టర్ ఇ. కె. గారి నుండి నేను అభ్యసించవలసింది సేవ అయితే, శాస్త్రిగారినుండి నేను నేర్చుకోవలసింది సంయమం. ఒకే దైవం ఈ రెండు మూర్తులుగా నాకు శిక్షణను ఇస్తున్నట్టు నా అనుభూతి. ఒక్కొక్క లక్షణం మానవాళికి అందించటానికి దైవం ఒక్కొక్క మూర్తిని ఎంచుకొంటాడు.

మాస్టర్ ఇ. కె సాహచర్యంలో, శాస్త్రిగారి సారథ్యంలో రూపుకట్టిన ఈ సిద్ధాంతవ్యాసాన్ని వారికీ నాకూ కూడా విశ్వవిద్యాలయంలో గురువులైన బ్రహ్మశ్రీ కాకర్ల వేంకట రామ నరసింహం గారికి అంకితమీయాలని కోరిక కలిగింది. నరసింహంగారు ఎంతటి పండితులో అంతటి సహృదయులు. వారిని గూర్చి చెప్పగలిగినవారు శాస్త్రిగారూ, మాస్టరుగారూ. వారివాక్కుల్లో నరసింహంగారి వ్యక్తిత్వాన్ని గూర్చి మనం అనుభూతిని చెందగలం. నా అనుభూతి ఒక్కటే- రచనకు కావలసిన సాహచర్య సారథ్యాలు లభించినట్టే, దానిని స్వీకరించి ఆశీస్సులందించే పరమగురువులుకూడా లభించారు అని. ఈ గ్రంథం తనకు కావలసినవారిని తానే ఎంచుకొన్నట్లుగా కనిపిస్తుంది. ఒక ప్రొఫెసరుగారు రిటైరయిపోయిన తర్వాత ఆయనకి ఒక యువపరిశోధకుడు తనకృతిని అంకితం చేస్తున్నాడు అంటే దేన్ని చూసి చేస్తున్నాడు ? ఆయన వ్యక్తిత్వాన్నిచూసి. ఆవ్యక్తిత్వానికి

గల మహాత్త్వాన్ని చూసి. "చెట్టుసారం పండులో వ్యక్తమైనట్టు మనిషిసారం వాక్కులో వ్యక్తమవుతుం"దని సంభాషణలు - సమన్వయాలు" లో వ్రాశాను. ఉదాహరణకు నరసింహంగారి వాక్కులు కొద్దిగా చూద్దాం. దాన్నిబట్టి ఆయన వ్యక్తిత్వాన్ని గ్రహించవచ్చు. "మీకు అపకారం ఎన్నోసార్లు చేశాడతను. అయినా ఈసారికూడా మీరాయనకి ఉపకారమే చేశారు. అవతలి వ్యక్తి తగడని తెలిసి కూడా ఎందుకు ప్రతిసారీ ఉపకారమే చేస్తూ ఉంటారు? మీ తత్త్వం బోధపడటంలేదు, అన్నాడొక శ్రేయోభిలాషి నరసింహం మాస్టారితో. ఆయన ఇలా అన్నారు : "కుక్క చెప్పుతింటుందని మనకి తెలుసు. కాని అది గుమ్మంలోకి వచ్చి నిలబడితే అన్నం పెడుతున్నామా, చెప్పు వేస్తున్నామా ? ఇదీ అంతే." "చిత్రమైన నిర్లిప్తతతో ఆయన ముఖం ప్రసన్నంగా ఉంది ఆమాట అంటున్నప్పుడు. తనకు చేతనైనది అడగకుండానే చేయడం, తనకు ఎవరు ఏమి చేశారన్నది పట్టించుకోకపోవడం ఆయన లక్షణాలు. శాస్త్రిగారు 'నిండుకుండ' వంటి వీరినీ, వీరి వ్యక్తిత్వాన్నీ ఈ గ్రంథంలోనే పరిచయం చేశారుగదా ! ఉండబట్టలేక నేనూ ఒక సన్నివేశం చెప్పాను. పెద్దల మంచితనం నూతి నీటిలాంటిది. అది తోడినకొద్దీ ఊరుతూ ఉంటుంది. ఎన్ని చెప్పినా చెప్పాల్సినవి మిగిలిపోతూనే ఉంటాయి. మాస్టర్ ఇ. కె., శాస్త్రిగారు, నరసింహం మాస్టరుగారు-మళ్ళీ ఒక త్రయం. ఎక్కడికక్కడే ఒక త్రయం. సార్థకమైనది ఋషిత్రయ కవిత్రయ సంప్రదాయం.

ఈ సిద్ధాంతవ్యాసాన్ని వాడుకభాషలో వ్రాశాను, అందరూ వాడుకొనేందుకు వీలుగా ఉండాలని. చదువరికి ఇబ్బంది కలుగకుండా సాధ్యమైనంతవరకు కొటేషన్లు ఫుట్‌నోట్సుగా యిచ్చాను. విషయాన్ని జనసామాన్యాన్ని దృష్టిలో పెట్టుకొని విపులంగా, తగిన ఉపమానాలతో వివరించే ప్రయత్నం చేశాను-

అందరికీ అర్థంకావాలనీ, అందరికీ అక్కరకు రావాలనీ. చాలాచోట్ల పాతఫక్కీనుండి ప్రక్కకు తప్పుకొని, వలసిన పథంలో సాగాను. ఫలానాఫక్కీలో విషయాన్ని చెప్పాలి అని కాకుండా, ఏవిషయాన్ని ఏఫక్కీలో చెబితే బాగుంటుంది అని చూశాను. మూసలో పోయకుండా పరమార్థాన్ని దృష్టిలో పెట్టుకొని ముందుకు సాగాను. ఈ పద్ధతికి న్యాయనిర్ణేతలైన డా. దివాకర్ల వేంకటావధానిగారు, కీ. శే. తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు, డా. కోరాడ మహాదేవశాస్త్రిగారు హృదయపూర్వకమైన ఆమోదాన్ని తెలిపారు. చాలా బాగున్నదనీ, జనసామాన్యానికి ఈ గ్రంథం అందాలనీ సూచించారు. గురువృద్ధులైన వారిని ఎంచుకొని ఈ పరిశోధన వ్యాసం నన్ను కృతకృత్యుణ్ణి చేసింది. దివాకర్ల వారు మౌఖిక పరీక్షకై వచ్చినప్పుడు ప్రత్యక్షంగా వారి ఆశీస్సులు పొందే అవకాశం దొరికింది. సహృదయులు, సత్త్వగుణ సంపన్నులు, సాహితీసాగరులు. సంప్రదాయద్రష్టలు, సిద్ధపురుషులు అయిన శ్రీ దివాకర్ల వారిరూపంలో పారాశర్యుడు తన ఆశీస్సులను అందిస్తున్నట్టు అనుభూతి చెందాను.

ఈగ్రంథానికి పెట్టిన పేరునుబట్టి 'తిక్కన సందర్శనం' అంటే తిక్కనగారి భారతానికి సంబంధించినంతవరకే ఈ పరిశోధన పరిమితం అని అనుకొనేందుకు వీలుంది. తిక్కనగారి సందర్శనం భారతాని కంతటికీ సంబంధించినది. ఆ సందర్శనం లభించిన తరువాత అనువాదంలో తనవంతు పాత్రను ఆయన నిర్వహించారు. కనుక ఈగ్రంథంలో భారతం మొత్తం పరామర్శించబడింది. విభాగించి విమర్శించడానికి యిది కేవలం సాహిత్యానికి సంబంధించిన విమర్శ కాదుగదా ! భారత పరమార్థానికి సంబంధించినది. భారత సందేశానికి సార్థకమైన నామకరణం చేశారు తిక్కనగారు.'ధర్మాద్వైత'మని ఆయనచేసిన నామకరణం జనసామాన్యంలోనికి చొచ్చుకుపోవాలన్న కోరికతో గ్రంథం పేరును కొంచెం పెద్దదనిపించినా అలాగే ఉంచాను.

పరిశోధన జరుగుతూ ఉండగా నిష్కామంగా నన్నుగూర్చి శ్రద్ధ తీసుకొన్నవారు మరొకరున్నారు. ఆయన డాక్టర్ యస్వీ జోగారావుగారు. పరిశోధన ఎలాసాగుతున్నదని పరామర్శిస్తూ, యు. జి. సి. వారినుండి ఉపకారవేతనం లభించడంలో అయాచితంగా సహకరించి నాపైన అమృతోపమానమైన వాత్సల్యాన్ని నాడూ నేడూ కూడా కురిపిస్తున్నవారాయన.

అభిప్రాయాలరూపంలో తమ ఆశీస్సులందించిన శ్రీ శాస్త్రి గారికీ, మాస్టరుగారికీ, శ్రీ లక్ష్మణయతీంద్రులవారికీ, శ్రీరమణరావు గారికీ, రవిశర్మకూ నాకృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. తమ పారవశ్యాన్ని పలుకులుగా అందించిన మాచిరాజు సుబ్బారావుగారికీ, దక్షతతో ముద్రణకార్యాన్ని నిర్వహిస్తూ, ప్రత్యక్షసాక్షిగా నిలిచిన సోదరుడు చక్రపాణికీ శుభాశీస్సులు. ప్రత్యేకమైన శ్రద్ధతో ముద్రించి అందించిన ఏలూరు- ముముక్షువుప్రెస్సువారికీ ముఖ్యంగా సోదరుడు సీతారాంకూ, ముఖచిత్రాన్ని తీర్చిదిద్దిన సోదరుడు శ్రీ ఎ. నరసింహమూర్తికీ, సంయోజకుడుగా పనిచేసిన సోదరుడు చావలి శ్యామసుందర్‌కూ శుభాకాంక్షలు. చివరిగా వ్యాస కృష్ణుల దివ్యచరణాలకు ప్రణమిల్లుతూ ఈ గ్రంథాన్ని మీ చేతుల కందిస్తున్నాను. మీ చేతుల మీదుగా మన జాతి పునర్నిర్మాణానికీ, మానవజాతి పరిపూర్ణ వికాసానికీ ఈ గ్రంథం దోహదం చేయగలదని విశ్వసిస్తున్నాను.

మీ

మోపిదేవి కృష్ణస్వామి.

14-3-84

# ఉపోద్ఘాతం

కొన్నివేల గ్రామాల ప్రజలు ఇన్నివేల సంవత్సరాలుగా భూమిని పండించుకొని సుఖజీవనం చేయడానికి కారణంగా ప్రవహిస్తూఉన్న గోదావరిలాంటి నదిఒడ్డున నిలబడి, నదినీ రాజమహేంద్రవరంలాంటి నగరాన్నీ చూస్తూఉంటే ఇటు ముందూ, అటు వెనకా ఆ నది ఇంకా ఎంతఉంటుందో ఊహించవచ్చు. ఆ ప్రజల సుఖజీవనం వర్తమానంలో ప్రత్యక్షంగా చూస్తూనే దాని భూత, భవిష్యత్తులనుకూడా గమనించవచ్చు. అలాగే ఆ నదీతీరాన పదవ శతాబ్దిలో తెలుగులోనికి అవతరించిన మహాభారతాన్ని పరిశీలిస్తే దాని ధర్మాద్వైత స్థితితోపాటు చూడగలిగేవానికి భూత భవిష్యత్కాలాల్లో భారతప్రసక్తమైన ధర్మపరిణామం కూడా దర్శనమిస్తుంది.

ఇన్నివేల సంవత్సరాలపాటు, కొన్నివేల యోజనాల పరిణామ దశల్ని పుంజుకొన్న తరువాత కనిపించేది రాజమహేంద్రవరంలోని గోదావరి. ఈ పరిణామాలను గమనిస్తూ వెనుకకు ప్రయాణం చేస్తే పాపికొండలు, భద్రాచలం మొదలైనవి దర్శనమిస్తాయి. అలాగే నన్నయతో తెలుగులోని కవతరించిన ఆంధ్రమహాభారతం వెంట వెనుకకు పయనిస్తే అనేక భాషల్లో అవతరించిన మహాభారతం, ఆ భాషల్లో అంతర్యామిగా ఉన్న వ్యాసుని స్పర్శ, ఆపైన వ్యాస మహాభారతం దర్శనమిస్తాయి. ఇంకా ఎగువకు వెళితే గోదావరీ

తీరాన మహారాష్ట్ర సీమలు తగిలినట్టు వ్యాసభారతం వెనుక శత పత్రంలా వికసించిన భారతీయ వాఙ్మయం దర్శనమిస్తుంది. గోదావరి వెంబడి ఇంకా సాగితే నాసిక, దాని నతిక్రమించగానే త్రియంబకం తగులుతాయి. త్ర్యంబకంలో జాళ్ళుజాళ్ళుగా జాలువారుతూ రూపు దిద్దుకుంటున్న గోదావరి దర్శనమిస్తుంది. అలాగే భారతీయ వాఙ్మయాన్ని దర్శిస్తూ వెనుకకు సాగినవారికి వేదఋషుల నాసికాగ్రంలో కనుబొమల మధ్య, కనుమ లోపల, లోలోపల విచ్చుకున్న తృతీయాంబకంనుండి జాలువార నారంభించిన వేదస్రోతస్సు దర్శనమిస్తుంది.

వేదసంహితలను, బ్రాహ్మణాలను, ఆరణ్యకాలను, ఉపనిషత్తులను పరిశీలిస్తే వ్యాసభారతంలో విస్తరింపబడిన ధర్మాలకీ, అర్థవాదాలకీ, ఉపాఖ్యానాలకీ మూలాలైన ప్రతీకలు స్పష్టంగా గోచరిస్తాయి. వాటి సమన్వయం తన కాలంలో జరిగిన మహాభారత కథలోనికి ఇమిడ్చి పద్మకోశంలాగా అమర్చి ముకుళింపచేయడం మహాభారత గ్రంథకర్తయొక్క సిద్ధహస్తతలో జరిగిందని ఆ గ్రంథాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. అమితాఖ్యానక శాఖలను, నదీశాఖలుగా మలచి, నానార్థాలను పురుషార్థాలుగా కాలువలు త్రవ్వి, మానవజీవితాన్ని ఐహికాముష్మిక కక్ష్యల్లో సుభిక్షం చేయడంలో ఈ గ్రంథకర్త ధర్మాద్వైతస్థితి ఉన్మీలిత మవుతుంది.

వేదమంత్రాలలో, ఉపనిషత్తులలో విశ్వసృష్టిని కన్నులకు కట్టించినవి కొన్ని. భూతసృష్టినీ, ఇంద్రియాది దేవతావ్యూహాలనీ వివరించి మానవప్రజాసర్గాన్ని వర్ణించినవి కొన్ని. మానవసృష్టి ఒక మాగాణి పొలంకాగా మొక్కలుగా మొలచిన శాస్త్రాలను, కళలను, ధర్మాలను, జీవిత మార్గాలను వివరించి చెప్పినవి కొన్ని. వ్యక్తిగత, సామూహిక గాథలను అనుభవాలుగా త్రవ్విపోసినవి కొన్ని. వీటన్నిటి సమన్వయమే మహాభారతం.

ఈ గ్రంథంలోని ధర్మదర్శనం మానవుడు భౌతిక, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక కక్ష్యలలో, వ్యక్తిగతంగా పట్టుకోగలిగింది కాదు. వ్యాసుడు కురుపాండవ గాథతోబాటు ధర్మదర్శనం చేయించినా, వైశంపాయనుడు వ్యాఖ్యానించినా, సూతుడు విపులపరచినా దీని రచన అనేకుల రచన కాలేదు. ఒక్కడే ఈ ముగ్గురు మూర్తులతో ధర్మాద్వైత స్థితిని పట్టుకొన్నాడు. కనుకనే గ్రంథవస్తువులో నైవిధ్యం ఎంతఉన్నా వైరుధ్యం ఎక్కడా కన్పించదు. ముగ్గురు వ్రాసినా ఎందరు వ్రాసినా గ్రంథకర్త ఒక్కడేనని తెలుస్తుంది. అతడే శాశ్వతధర్మగోప్త. తెలుగు భారతానికి కూడా ఆ గాలి సోకింది. నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు తెలుగులో గ్రంథప్రతిష్ఠ చేసినా గ్రంథం మాత్రం అఖండత్వాన్ని సాధించుకుంది. శయ్య, పద ప్రయోగం, వాక్యనిర్మాణం, మొదలైన భౌతిక విషయాల్లో ఉన్న రూపభేదం తప్ప గ్రంథాత్మలో భేదం ఎక్కడా కనిపించదు. గ్రంథంలోని ధర్మాద్వైత స్థితిచేత ఆవిష్టులై పనిచేసి ఈ ముగ్గురూ వ్రాశారనడానికి ఇదే నిదర్శనం. ఇంత సమగ్రమైన మహాభారత గ్రంథ ప్రతిష్ఠ ఒక్క తెలుగులోతప్ప మరి ఏ దేశభాషలోనూ జరగలేదనటం అప్రస్తుతమైనా ప్రశంసనీయం. దీని వైభవాన్ని తెలుగులో నుండి ఇతర భాషల్లోనికి ఇంతవరకూ అందించకపోవడం తెలుగు వారి ధర్మదౌర్బల్యం అనకతప్పదు. కనుకనే ఈ పరిశోధన వ్యాసాన్ని వ్రాయడంలో కవిత్రయ భారతంద్వారా వ్యాసుని దర్శించడం జరిగింది. ఆవశ్యకత ఏర్పడినపుడు మాత్రం మూలాన్ని ముట్టుకోవటం జరిగింది.

మహాభారతంలో ప్రతిపాదింపబడిన ధర్మస్వరూపం ఎలాంటిది? దానిలో సకల మానవధర్మాలూ ఏవిధంగా అంతర్భూతాలు? వాటి అద్వితీయస్థితి (అద్వైతస్థితి) యొక్క స్వరూపం ఎలాంటిది? ఈ ప్రశ్నలకు సమాధానమే ఈ పరిశోధన వ్యాసం. మానవునికి వివిధ

దశల్లో అవలంబనీయాలైన ధర్మాల పరిణామం ఎత్తిచూపడానికి ప్రయత్నం జరిగింది. ప్రయత్నం సమగ్రం అనగలమా? ఒక్క రాజమహేంద్రవరంలో గోదావరి సమగ్రస్వరూపం కనిపించడం సాధ్యమా? కాని ప్రయాణసన్నాహం జరిగింది. ఆ ప్రయాణానికి ఒక చిన్న పడవ ఈ పరిశోధన వ్యాసం.

సంస్కృతిప్రియులనూ, సాహిత్యాభిలాషులనూ, ధర్మజిజ్ఞాసువులనూ లోనికి రమ్మని ఈ పరిశోధనప్లవం సాదరంగా ఆహ్వానిస్తోంది.

... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ...

తాను దర్శించిన విశేషాలనూ, సందర్శించిన ఘట్టాలనూ వ్యాసకర్త రాబోయే ప్రకరణాల్లో ఏకరువు పెడుతున్నాడు.

# విషయానుక్రమణిక


I. బీజం

1) నరుడు - వేదదర్శనం 5

2) వేదవాఙ్మయం - వ్యాసునిపాత్ర 8

3) పురాణం - ఇతిహాసం 13

4) రామాయణం - మహాభారతం 18

II. జీవం

1) ధర్మస్వరూపం 28

2) ధర్మాద్వైతస్థితి - అభిప్రాయాల పరిశీలన 35

3) ధర్మాద్వైతస్థితి - సిద్ధాంత ప్రతిపాదన 49

III. సమ్యగ్విలసనం

(ఎ) ధర్మం 58

(బి) వర్ణధర్మాలు - ధర్మాద్వైతస్థితి 59

1) కులాల స్వరూపం 74

2) వర్ణాలు - గుణకర్మలు 78

3) అవగాహనలో పొరపాట్లు 85

4) దేహనిర్మాణం - వర్ణధర్మాలు 86

5) వర్ణధర్మాలు - మానవకర్తవ్యం 88

6) వర్ణధర్మనిర్వహణలో భీష్ముడు 91

7) ,, ద్రోణుడు 97

8) ,, అశ్వత్థామ 101

9) ,, విదురుడు 106

10) ,, ధర్మవ్యాధుడు 109

11) ,, కర్ణుడు 112

12) ,, సంజయుడు 124

13) వర్ణధర్మనిర్వహణలో ధృతరాష్ట్రుడు 129
14) ,, పాండురాజు 134
15) ,, కౌరవులు 137
16) ,, పాండవులు 140
17) ,, శ్రీకృష్ణుడు 145
(సి) ఆశ్రమధర్మాలు - ధర్మాద్వైతస్థితి 149
1) భీష్ముని వివరణ 150
2) చతురాశ్రమాల స్వరూపస్వభావాలు 151
3) చతురాశ్రమాలు - ధర్మాద్వైత దర్శనం 167
(డి) అర్థకామాలు - ధర్మాద్వైతస్థితి 170
1) అర్థకామాల స్వరూపస్వభావాలు 170
2) మానవజీవితంలో అర్థకామాలపాత్ర 173
3) భారతగాథ - అర్థకామాలు 174
4) అర్థకామాలు - ప్రభువులపాత్ర 180
(ఇ) దాంపత్యధర్మం - ధర్మాద్వైతస్థితి 184
1) దాంపత్యధర్మ పరిణామం 184
2) వివిధవివాహాలు - వ్యాససమన్వయం 190
3) పాతివ్రత్య స్వరూపం - కుంతి - గాంధారి 196
ద్రౌపది 204
సన్నివేశాలు - పాతివ్రత్య ప్రకటన
- వస్త్రాపహరణ సందర్భంలో 208
- సైంధవుడు బలాత్కరించినపుడు 210
- కీచకుడు వెంటాడినవేళ 212
ద్రౌపది - మానవీయావేశాలు 214
- కౌరవసభలో 215
- విరటుని కొలువులో 220
- కృష్ణుడి సమక్షంలో 223

కుంతీదృష్టిలో ద్రౌపది 227
కృష్ణుని ప్రకారం ద్రౌపది 229
ద్రౌపది చూపుతున్న వెలుగుదారి 232

4) దాంపత్యధర్మం - ప్రధాన ఉపాఖ్యాననాయికలు
శకుంతల 235
దమయంతి 239
సావిత్రి 243
దేవయాని 244

5) వాల్మీకి వ్యాసుల తర్వాత... 248
6) సతీసహగమనం - వ్యాసదృక్పథం 252

(ఎఫ్) మోక్షధర్మం - ధర్మాద్వైతస్థితి 262
1) మృత్యుస్వరూపం 262
2) శరీరధారణ నేరమా ? 267
3) శరీరపోషణకై హింస తగునా ? 272
4) ఆలుబిడ్డలూ, అయినవారూ ఆధ్యాత్మికతకు అడ్డమా ? 278
5) భారతం హింసను ప్రబోధిస్తున్నదా ? 286
6) కృష్ణుడిసందేశం యత్యాశ్రమానికే పరిమితమా? 287

(జి) నరుడు - నాలుగుదశలు 290
1) సంసారిగా మానవుడు 290
2) మేలుకోలుపు 298
3) యోగసాధన 302
4) యోగజీవితం 309

(హెచ్) రక్షణ – శిక్షణ 322

(ఐ) ధర్మాద్వైతమూర్తులు 335
1. వేదవ్యాసుడు 335
- తల్లిదండ్రులతో కొడుకుగా 335
- విచక్షణాశీలిగా 337

వేదవ్యాసుడు - సంసారం ఎరిగినవాడుగా 338
- రక్షకుడుగా 339
- కర్తవ్యశీలిగా 340
- శిక్షకుడుగా 341
- సమదర్శిగా 342
- పరమపురుషునికి సహచరునిగా 343
- ఇతిహాసద్రష్టగా 343

2. శ్రీకృష్ణుడు 344

IV. సమగ్ర సందర్శనం

వ్యాసుని వెలుగును అర్చించిన కవిత్రయం 347
ధర్మాద్వైతస్థితి - వ్యాసునిదర్శనం - తిక్కన సందర్శనం 352
తిక్కన - భగవద్గీతానువాదం 355
తిక్కన - హరిహరనాథ తత్త్వప్రతిపాదన 362

అనుబంధాలు

1. (ఎ) కేతవరపు రామకోటిశాస్త్రిగారి ప్రతిపాదన పూర్తిపాఠం 377
(బి) ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారి ప్రతిపాదన పూర్తిపాఠం 382
(సి) నందూరి రామకృష్ణమాచార్యగారి ప్రతిపాదన పూర్తిపాఠం 386
2. సర్ప(నహుష) యుధిష్ఠిరసంవాదం 390
3. సామవేదీయ వజ్రసూచికోపనిషత్ 392
4. యజ్ఞస్వరూపం (శతపథబ్రాహ్మణం) 395
ఉపయుక్త గ్రంథావళి 401

# నరుడు - వేదదర్శనం

శాస్త్రపరిశోధనయెడల కన్ను తెరచిన మానవుడు తన దేహ ప్రవృత్తులను పరిశీలించడం ప్రారంభించినపుడు, అది ఒక ద్రవ్యపు ముద్దకాదనీ, దానిలో ఒకచట్టంవంటి తత్త్వమున్నదనీ, దానికి విధేయంగా మాత్రమే దేహప్రవృత్తులు పనిచేస్తున్నాయనీ గమనిస్తాడు. ప్రకృతిలోని అనేక ధర్మసముచ్చయాల తత్త్వమే దేహస్థితికి కారణమవుతోందనీ, ఈ ధర్మాలన్నిటికీ 'తాన'నే ప్రజ్ఞ మూదలయనీ, తనయందీ ప్రకృతిధర్మాలు అద్వైతస్థితిని చెందిఉన్నాయనీ గమనించడంతో మానవునికి ధర్మంయెడల చక్షువు ఉన్మీలితమవుతుంది. తాను కన్ను తెరవకముందునుండీ కూడా ఈ ధర్మాలూ, వాటి అద్వైతస్థితీ పనిచేస్తూనే ఉన్నాయని తెలుస్తుంది. అంతకుముందు నుంచి తనచుట్టూ ఉన్న ప్రకృతి సకల ధర్మాలతో వర్తిస్తూ ఉన్నదని తెలుస్తుంది. తనలోవలెనే ప్రకృతిలో గూడా సకల ప్రకృతి ధర్మాల అద్వైతస్థితీ ఉన్నదనీ, అది ప్రకృతికంటుకోనకుండ అతీతంగా వర్తిస్తూ ఉన్నదనీ గమనికకు వస్తుంది. ఈ విధంగా గమనించడానికే దుర్లభమైన నరజన్మ ఉద్దేశింపబడినదని కూడా తెలుస్తుంది.

ఈ విధంగా తనలోనూ, తన చుట్టూ ఉన్న నిఖిల భూతాలలోనూ గల 'ధర్మాద్వైతస్థితి'కి తన జ్ఞానంతో సంబంధం లేదనీ,

కాబట్టి ఈ సకల ధర్మకోశం అపౌరుషేయమనీ తెలుస్తుంది. దీనిని దర్శించిన మానవుడు దీనికి పెట్టినపేరే వేదం. అది తనకు వినబడినదీ, కనపడినదీ. కనుక దానికి శ్రుతి అనీ, దర్శనమనీ కూడా అతడు పేరు పెట్టుకున్నాడు. తనకు తెలియనప్పటినుండి పనిచేస్తున్న ఈధర్మ కోశాన్ని తనకు తెలిసినప్పటినుంచీ మానవుడు ఆరాధించడం మొదలు పెట్టాడనటం ఉచితం.

తన దేహంలోని ఏ భాగం అయినా తననుంచి వేరు చేయ బడినపుడు జీవి ఆ భాగంలో జీవించడం మానేస్తాడు. అలాగే మాన వుడు తన తెలివితో ఈ ప్రకృతి కన్న తనను వేరుగా గమనించుకోవ డానికి ప్రయత్నించడంతో ఈ ప్రకృతిలోని అంతర్యామి అయిన జీవ స్రవంతి అతనిలో జీవించడం మానింది. అనగా ధర్మాద్వైతస్థితి అతనికి గోచరించక, వివిధ విజ్ఞాన శాఖలుగా తిప్పలుపెట్టసాగింది. అప్పటినుంచి నరుడు వేదాన్ని ఒక గ్రంథంగా వేరుచేసుకున్నాడు. గ్రంథంలో చెప్పబడింది సృష్టిలోని అంతర్యామియైన వేదమని మరచి పోయి, గ్రంథాన్నే వేదంగా పేర్కొనడం ప్రారంభించాడు. (బైబిలు, భగవద్గీత, వేదోపనిషత్తులు, మొదలైన పవిత్ర గ్రంథాలన్నీ ఇలాంటి సంకుచిత దృష్టితోనే చదవబడ్డాయి) అప్పటినుంచి శాస్త్రాలకు వేరుగా అస్తిత్వం దాపురించింది. శాస్త్రజాలం వివిధ శాఖలుగా పెరిగిపోయింది. 'వేదములకు, అఖిలస్మృతివాదములకు, బహుపురాణవర్గములకు వాడైన చోటు' లేర్పడటం తప్పనిసరి అయింది. (దీన్నే కలిధర్మం అంటారు. కలిలో పండితులనబడేవారు వేదాలనిలాగే దర్శిస్తున్నారు. కనుకనే పండితుల్లో మతభేదాలు పెరిగి దర్శనమనే జీవస్రవంతి ఇంకిపోయి, వాదాలనబడే శవపరీక్షలు మిగి లాయి). ఈవిధంగా మానవుడు సొంతంగా జీవితాన్ని రూపొందించు కోవడానికి యత్నించేసి చిక్కులపాలయ్యాడు. జంతువుల్లో ఆహార నిద్రా భయ మైథునాది ధర్మాలు క్రమబద్ధాలు. అల్లాకాక మానవుడు

తనకు తోచిన పద్ధతిలో నిర్వర్తించుకోవడంలో సమర్థుడయ్యాడు. అంటే ఆకలిదప్పులు, ఋతుధర్మాలు దాంపత్య ధర్మం, మొదలైన ప్రకృతిలోని ధర్మకోశంలోని నియమాలను ఉల్లంఘించి ఆధివ్యాధులకు గురై కర్మబంధాన్ని సృష్టించుకొని సంసారబద్ధుడయ్యాడు. దానితో కర్మఫలమైన దుఃఖానుభూతి తప్పనిసరి అయింది. ఈవిధంగా కాలక్రమంలో నష్టమైనధర్మాద్వైతస్థితిని మానవుడు మళ్ళీ అన్వేషించడం మొదలుపెట్టాడు. ఎవడిపద్ధతిలో వాడన్వేషించడం వల్లధర్మాద్వైతస్థితి యొక్క చిరిగిన పేలికలను పట్టుకొని వాటి నూలు పోగుల్ని విడదీసి ఎవడి ధర్మసూత్రాలు వాడల్లుకోవడంతో మ్లేచ్ఛ ధర్మం ఏర్పడింది. సుఖేచ్ఛారూపంలో, పోయిన వస్తువును వెతుక్కోవటమే జీవిత పరమావధి అయింది.

మరొకప్రక్క ఈ ధర్మాద్వైతస్థితిని దర్శించి ఉపాసిస్తున్న వారు సర్వకాలాల్లోను వర్తిస్తూనే ఉన్నారు. వారూ వీరూ కూడా సమకాలికులై తమతమ జీవనాలు నడుపుకొంటూనే ఉన్నారు. తాము దర్శించిన ధర్మాద్వైతస్థితిని దీనులైన సంసారబద్ధులచే దర్శింపజేయడానికై దయామయులై వారిచ్చిన వాక్కులే వేదసంహితలు. మరల వికసింపజేసిన వాక్కులే ఉపనిషత్తులు. మరల వివరించిన గ్రంథాలే ఇతిహాస పురాణాలు. వారు తమ సాటివారు సంసారబద్ధులై పడుతున్నపాట్లు చూసి 'మార్గమింత సుగమమై యుండగా వీరేల వాదములపాలై క్లేశపడుతున్నా రని' విస్తుపోతున్నారు. అట్టి మహనీయుల పరంపరే 'ఋషి' సంప్రదాయం. వారి నిరంతరకృషికి తరతరముల ఏర్పడిన ఫలమే పరాశరుడు, వ్యాసుడు, వారిశిష్యవర్గం.

# వేదవాఙ్మయం - వ్యాసునిపాత్ర

ప్రకృతిలో ఇమిడిఉన్న సృష్టివిజ్ఞానం, దానికతీతమైన శాశ్వత వస్తువు కలసి వేదం అనబడింది. ఆ వేదాన్ని దర్శించి గ్రంథస్థంచేసే ప్రయత్నం మానవుడు భూమిపై పుట్టినప్పటినుంచీ ఆరంభమైంది. వ్యాసునికాలంనాటికే వేదవాఙ్మయం అనంతమైన గ్రంథంగా పెరిగిపోయింది. వేదమంత్రాలు పరాశరుడికాలంవరకు గురుశిష్య పరంపరగా కాపాడబడుతున్నాయి. అందులోని విజ్ఞానాన్ననుసరించి వ్యక్తిగత జీవితాన్ని, సంఘజీవితాన్ని సమన్వయపరచుకోవడానికి యత్నించడమే జీవితపరమావధిగా స్వీకరించినవారి గురుశిష్య పరంపరలు కొన్నివందలుగా అప్పటికే ఏర్పడ్డాయి. వాటిని సుబోధం చేయడంకోసమే బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, యజ్ఞవిద్య, ఉపనిషత్తులు విస్తరించుకున్నాయి. వాటిలో అంతర్భూతాలైన అర్థవాద వివరణాదులే పురాణాలు, ఇతిహాసాలనే పేర్లతో ఆగ్రంథాలలో విపులీకరింపబడ్డాయి. తండ్రినుండి ఈ విజ్ఞానాన్ని సంక్రమింప జేసుకొన్న కృష్ణద్వైపాయనుడు శతాబ్దుల మలుపులతోకూడిన కాలప్రవాహంయొక్క పోకడలను అవగతం చేసుకొన్నాడు. ఉన్న వివిధశాఖలను నిలపాలన్నట్లయితే రాబోయే కాలానికి పనికివచ్చే

టట్లుగా ఒక్కొక్క శాఖను అధ్యయనంచేసి, అనుష్ఠించి, రక్షించు కొనే ఒక్కొక్క ఋషిగణానికి కేటాయింపుగ శిక్షణనీయడం ఆవశ్యకమని అతనికి తోచింది. ప్రధాన వేదమంత్రాలు అప్పటికే అనేక పర్యాయాలు నష్టమౌతూ పునరుద్ధరింపబడుతూ వచ్చాయి. ఈ ప్రయత్నంలో అనేకపర్యాయాలు కూర్పుచేయబడటంతో వాటికి సంహితలని పేరువచ్చింది. ఉన్న సంహితకు పలువిధాలైన వినియోగాలు కనిపెట్టబడ్డాయి. అందులో నాలుగువిధాలు ముఖ్యమైనవి. అవి -

1. అదే సంహితను ఋక్కులుగా అధ్యయనం చేయడం.
2. అదే సంహితను లోకహితం కోసం యజ్ఞవిద్యగా వినియోగించడం.
3. అదే సంహితను సంగీతంగా ప్రస్తారం చేయడం.
4. అదే సంహితనుండి ఐహిక సుఖజీవనాన్ని సాధించుకోవటం.

ఈ నాల్గు విధానాలు నాల్గు సంప్రదాయాలై ఋగ్యజుస్సామ అథర్వణవేదాలని వ్యవహరింపబడుతూ ఉండేవి. వేద మఖండం. వినియోగం నాల్గువిధాలు. ఇట్టి విద్య తరువాతికాలంవారికి దుష్కరమని భావించి వ్యాసుడు వేదమంత్రాలలోని పరమార్థాన్ననుసరించి ఆ మంత్రాలనే నాలుగు సంహితలుగా విభజించాడు. ఒక్కొక్క సంహితను ఒక్కొక్క సంప్రదాయంవారికి అప్పగించాడు. ఆ సంహితను చెక్కుచెదరకుండా తమ తర్వాతి తరాలవారికి అందించే బాధ్యతను వారు స్వీకరించారు. ఒక్కొక్కదానిలో అంతర్భాగాలేర్పడ్డాయి. వాటినిబట్టి అన్నిసంప్రదాయాలవారినీ వ్యాసుడు గణాలుగా ఏర్పరచాడు. అప్పటికే ఈ విజ్ఞానకోశం మొత్తం ఒక మహారణ్యంలా పెరిగిపోయింది. దానితో బ్రహ్మవిద్యలోని పలో

మార్గాన్ని ఎత్తిచూపేటటువంటి వేదమంత్రాలు, వాటిని గురించి సదస్సులలో జరిగిన అర్థబోధలు, వేరువేరు గ్రంథాలుగా వడపోత పెట్టబడ్డాయి. వేదసారాన్ని పట్టిఇచ్చే ఈగ్రంథాలే ఉపనిషత్తులుగా రూపొందాయి. వేదంఉపదేశిస్తున్నదేమిటి, అది దేనికి ప్రాధాన్యాన్నిస్తోంది అనే అంశాన్ని గురించి చర్చలనేకం జరుగుతూ ఉండేవి. కొందరు తమచర్చలనుండి సిద్ధాంతాలు చేసి ప్రతిపాదించారుకూడా. జైమిని పూర్వమీమాంస మొదలైనవి అట్టి ప్రతిపాదనలే. వీటన్నింటిని దృష్టిలోపెట్టుకొని, వ్యాసుడు వేదసారాన్ని,సందేశాన్ని సమ్యగ్దర్శనాన్ని సూత్రీకరించాడు. అవే బ్రహ్మసూత్రాలు. ఈ సూత్రాలలో వేదహృదయం ధృవీకరింపబడింది.

కొంతకాలం జరిగేటప్పటికి వేదాలను, వేదాంతాలను వేరుగా చూడటం మొదలుపెట్టి జనం దారితప్పసాగారు. దీన్ని గ్రహించిన వ్యాసుడు, తండ్రి పరాశర మహర్షి ఉపదేశించిన విష్ణుపురాణాన్ని ఆదర్శంగా స్వీకరించి, బ్రాహ్మణ గ్రంథాలలోని పురాణ ఇతిహాసాలనబడే అర్థవాదాలను కొన్నిటిని ఎంచుకొని విస్తృతపరిచాడు. బ్రాహ్మణాలలో పురాణేతిహాసాలు అనదగిన అర్థవాదాలు కొన్ని వందలున్నాయి. అలాంటి పురాణాల్లో ప్రధానమైనవాటిని పద్దెనిమిదింటిని స్వీకరించి వ్యాసుడు శిష్యులసహాయంతో ప్రత్యేక గ్రంథాలుగా రూపొందించాడు. అలాగే ఇతిహాసాలను ఉద్ధరించి కూర్పుచేసి తన సమకాలిక చరిత్ర అయిన కురువంశ గాథతో మేళవించి భారతగ్రంథ సంహితను ఏర్పరిచాడు. అందులో నాలుగు వేదాలలోని ధర్మమార్గాల్ని సమన్వయపరచి కథల్లో, గాథల్లో, పాత్రలపోకడల్లో, సన్నివేశాల్లో, సంభాషణాదుల్లో విచిత్రంగా ఇమిడ్చాడు. ఇలాంటి ప్రయత్నం అంతకుముందు జరగలేదు. కాబట్టే అతని శిష్యులు "వ్యాసస్యాద్భుతకర్మణః"1 అని ప్రశంసించారు. ఈ

1. సంస్కృత భారతం - ఆది - 1-1-19

ప్రయత్నాలకు ఫలితమైన మహాభారత సంహితలో మానవునకు కావలసిన అర్థాలు, పరమార్థాలు, ఆచరణీయ ధర్మాలు మొత్తం కరతలామలకమయ్యాయి. ఎప్పుడెవ్వరికి ఏ పరిష్కారం కావలసినా, దీనిలో లభిస్తుందనడానికి హేతువు ఈ సమగ్రప్రయత్నమే. ఈ గ్రంథంయొక్క పెరుగుదల పేర్పుగాకాక కూర్పుగా చేయబడింది. అంటే ఒక మహాభవన నిర్మాణం మాదిరిగాకాక, విత్తనం నుండి వృక్షంలా పెరిగింది. అమితాఖ్యానక శాఖలతో వివిధార్థ నిర్మల చ్ఛాయలు కలిగి ఈవృక్షం సర్వసద్విజశ్రేణికి, కులాయాలకు నిలయమై నిలిచింది.

జిజ్ఞాసువులలో కొందరు పుట్టుకతో అధ్యయనపరులు, కొందరు ఆలోచనాపరులు, కొందరు అనుష్ఠానపరులుగా ఉంటూఉంటారు. ఈ సత్యాన్ని గ్రహించిన వ్యాసుడు మొదటి తరగతివారికోసం వేదసంహితల విభాగాన్ని, రెండవతరగతివారికోసం బ్రహ్మ సూత్రాలనీ, మూడవతరగతి వారికోసం ఇతిహాసపురాణాలనీ ప్రసాదించాడు. సంగ్రహంగా ఈయశపోతే స్వరూపం బోధపడదనేవారి కోసం బ్రహ్మసూత్రాలు రూపుకట్టుకున్నాయి. ఆచరణమూ అనుష్ఠానానికీ తావులేనిదే సంస్కారాలు మారవని నమ్మినవారి కోసం ఇతిహాసపురాణాలు దిగివచ్చాయి. విషయం ఒక్కటే అయినా మూలగ్రంథ మెక్కువ పవిత్ర మనేవారికోసం చతుర్వేదాల సంహితా విభాగం ఏర్పడింది. ఇన్నిటిలోనూ లభ్యమయ్యే విషయం ఒక్కటే. అది అపౌరుషేయం. అది సృష్టిధర్మాలనుండి తెలియ దగినదేగాని, కేవలం గ్రంథాలనుండికాదు. వేదగ్రంథాల ప్రయోజనం సృష్టిధర్మాలరూపమైన వేదాన్ని అధ్యయనం చేయించడమే. కాబట్టి అదే ప్రయోజనాన్ని సిద్ధింపచేస్తున్న ఇతిహాస పురాణాలకు నాలుగు వేదాలతో సమానమైన గౌరవం ఏర్పడి పంచమవేదం అనే పేరువచ్చింది.

వేదాల్లోని పరమార్థం సకలసృష్టిధర్మసముచ్చయం. అది పురుషుని రూపంలో, జీవునిచేత అధ్యయనం చేయబడాలి. వేద గ్రంథాల్లో పురుషుడు, యజ్ఞపురుషుడు అనే పేర్లతో ప్రతిపాదింప బడిన్నవాడు, అధ్యయనం చేసేవాని హృదయస్థుడుగా, జీవులలో అంతర్యామిగా దర్శింపదగినవాడు. అతడే ఇతిహాస పురాణాలలో అవతారాలెత్తేమూర్తిగా ప్రతిపాదింపబడ్డాడు. ఆ మూర్తి సమగ్ర స్వరూపమే కృష్ణావతారం. అతడు భారతంలో ఇతిహాసమూర్తిగా, భాగవతంలో పరమపురుషుడుగా దర్శింపబడ్డాడు.

ఈ విధంగా వ్యాసుడు శాశ్వతుడైన పురుషుని అంతర్యామిగా దర్శించి 'లోకహితార్థమై' అట్టి దివ్య దర్శనాన్ని అందించే పవిత్ర వాఙ్మయాన్ని సృష్టిస్తూ ఉండగా ఆ పరమపురుషుడు శ్రీకృష్ణుని రూపంలో పరిపూర్ణ పురుషుడుగా భూమిపైకి దిగివచ్చాడు. వ్యాసు డతణ్ణి తన వాఙ్మయంతో అర్చించాడు. దానితో ఆ పరిపూర్ణత్వం వ్యాస వాఙ్మయానికి కూడా సిద్ధించింది. కాబట్టే నేటికి కూడా పరిపూర్ణతను అపేక్షించిన నరుడు, వ్యాసవాఙ్మయాన్ని ఆశ్రయించవలసి వస్తోంది.

# పురాణం - ఇతిహాసం

వేదవాఙ్మయాన్ని సామాన్య జనులకుకూడా బోధపడేటట్లుగా అనుభవంలోనికి వచ్చేటట్లుగా-వివరించేందుకు వ్యాసుడు ఎంచుకొన్న ప్రక్రియలు రెండు- ఒకటి పురాణం. రెండవది ఇతిహాసం. ఈ రెండింటికీ స్వరూపస్వభావాల్లో భేదం ఉంది.

ఏమీలేని స్థితినుండి అన్నీఉన్న స్థితికి ఈసృష్టి ఎలా దిగి వచ్చింది అన్న అంశాన్ని కథలుకథలుగ వివరించేటందుకు ప్రయత్నించేది పురాణం. దీనిలో సర్గ, ప్రతిసర్గ, వంశం, మన్వంతరం, వంశానుచరితం అనే ఐదు లక్షణాలు ఉంటాయని ఆ పురాణాలలోనే వివరించబడి ఉంది 1. ఈ పురాణాలలో మానవులకు సంబంధించిన అంశాలు ఒక భాగం మాత్రమే. అదికూడ పై సృష్టిధర్మాలను - అంటే సర్గ ప్రతిసర్గాది లక్షణాలను - మనకు బోధపరచడంకోసం మానవుల కథలు తగుమాత్రంగా స్వీకరింపబడతాయి. పెద్ద తోటలో నిలబడ్డ మనిషిని దూరంనుంచి ఛాయాచిత్రం తీసినపుడు తోటతో పాటు మనిషికూడ పడ్డట్లు, పురాణాలలో, సృష్టిలో ఒక భాగంగా మనిషి కనబడతాడు. సృష్టిక్రమాన్ని సజీవంగా వర్ణించి చెప్పడం

1. సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్

అమరకోశం - ప్రథమకాండ - వాగ్వర్గము - శ్లో - 182

కోసం సృష్టిలోఉన్న వివిధ ప్రజ్ఞలకుమధ్య వివిధ కక్ష్యల్లో జరిగే సన్నివేశాలన్నిటినీ మానవీకరించి వర్ణిస్తుంది పురాణం. చదువు కొనేది మానవుడు కాబట్టి, మానవీకరించి చెప్పడం ఉచితమూ, ఆవశ్యకమూకూడా. మానవలోకంలో కూడా మనం దేహధారుల మైనా, సన్నివేశాలు, సల్లాపాలు నడుస్తున్నదిమాత్రం ప్రజ్ఞల మధ్యనేనని మనం గ్రహించవలసి ఉంది. ఈ సత్యాలన్నిటినీ దృష్టిలో పెట్టుకొని సృష్టిలో మొదటినుంచి చివరివరకు నడిచే సన్నివేశాలన్నిటినీ నరులభాషలో చెప్పడానికి ప్రయత్నిస్తుంది పురాణం. సన్నివేశాలకు, పాత్రలకు నరలోకపు వాసన ఉంటుంది. పాత్రల వేషభాషలు, ప్రవర్తనలు నరుల్లోలాగానే ఉంటాయి. నరుడు తనను సృష్టికంటె వేరుగా చూడకపోతే తానే ఆ స్థితులలో నుండి నడచివచ్చినవాడు కాబట్టి, ఆ కథలన్నీ తనవేనన్న దర్శనం లభిస్తుంది. పురాణం చదువుకోవటం అంటే సర్గ, ప్రతిసర్గ మొదలైన అయిదు అధ్యాయాలుగా మానవుడు తన కథ తాను నెమరువేసు కుంటున్నాడన్నమాట.

ఇతిహాసం యొక్క రచనాప్రణాళిక వేరు. ఇది సృష్టిక్రమాన్ని నేపథ్యంలో ఉంచుకొని మానవుడికి ప్రాధాన్యమిచ్చి అతని చుట్టు కథలను అల్లుతుంది. తోటలో ఉన్న మనిషినే దగ్గరగా ఛాయాచిత్రం తీస్తుంది ఇతిహాసం. పురాణంలో నరుడు సృష్టిలో ఒక భాగమైతే, ఇతిహాసంలో నరుడు సృష్టికథకు నాయకుడు. పురాణం సృష్టిస్వభా వాన్ని వివరించడానికి ప్రయత్నిస్తే, ఇతిహాసం మానవ స్వభావాన్ని విశదీకరించడానికి ప్రయత్నిస్తుంది. మానవుడికి తానున్న సృష్టిని తనదిగా పరిచయం చెయ్యడానికి ప్రయత్నిస్తుంది పురాణం. మానవు డికి సృష్టిలో తనపాత్ర ఏమిటో తెలియచెప్పి మార్గాన్ని నిర్దేశించి గమ్యంవైపు నడిపించుకుంటూ వెళుతుంది ఇతిహాసం.

మనకు గల ప్రధానమైన ఇతిహాసాలు రెండు. అవి 1. వాల్మీకి రామాయణం, 2. వ్యాస మహాభారతం. రెండూ రెండు యుగాలల్లో

జరిగిన మానవ గాథలలోనుంచి సృష్టిలోని ధర్మస్వరూపాన్ని మనకు సాక్షాత్కరింప చేస్తాయి. పాలకోవా అన్నది వేరుగా కనబడుతున్నా అందులో ఉన్నది పాలు పంచదారే అన్నట్లు, మానవుడు తనను తాను వేరుగా గుర్తించుకుంటున్నా తాను సృష్టిధర్మాల కలయికతో కట్టుకున్న రూపే. చెట్టుతత్త్వం పండులో దిగివచ్చినట్లు, సృష్టితత్త్వం మానవుడిగా దిగివచ్చింది. మంచీ చెడూ, ధర్మం అధర్మం, సురశక్తులూ అసురశక్తులూ, సృష్టికథలో మొదటినుంచి ఉన్నవే, పనిచేస్తున్నవే. అవే వేరువేరు పాళ్ళలో దేశకాల పాత్రలనుబట్టి మానవుల్లోకూడ పనిచేస్తుంటాయి. వ్యక్తులపేర్లను వదలి వారే ప్రజ్ఞలకు ప్రతినిధులో, వారిలో ఏ సృష్టిశక్తులు దోబూచులాడుతున్నాయో దర్శించగలిగితే ఆ జరిగే సన్నివేశాలు ఎప్పుడు జరిగినా ఎక్కడ జరిగినా అదేతీరులో జరుగుతూ ఉంటాయని తెలుస్తుంది. ఇతిహాసం అన్నపదానికి అర్థం అదే. (ఇతి+హ+ఆస) 'ఈవిధంగా జరిగెను కదా' అన్నది ఇతిహాసమనే మాటకు అర్థం. ఈస్థితిలో మానవ గాథలను దర్శించి వ్రాశారు కాబట్టే వాల్మీకి వ్యాసుల రామాయణ భారతాలు సార్వకాలికాలు, సార్వజనీనాలు అయినాయి. గాలి, నీరు మొదలైన పంచభూతాలలాగా ఇవికూడా శాశ్వతంగా మానవాళికి పనికివస్తూనే ఉన్నాయి; ప్రాణం పోస్తూనే ఉన్నాయి.

ఈనాటికీ సీతారాములు, కైకా మందరలు, రావణ కుంభకర్ణులు, సుగ్రీవ ఆంజనేయులు మనం చూస్తున్న లోకంలో మనకు దర్శనమిస్తూనే ఉన్నారు. మనం ఏ యువతీయువకుల వివాహాన్ని సంకల్పించినా సీతారాములు కళ్ళలో మెదులుతూనే ఉన్నారు. ఏతండ్రికి కొడుక్కు దూరమైనా, ఆ తండ్రిలో దశరథుడు దర్శనమిస్తూనే ఉన్నాడు. ఎవడు అతిగా నిద్రపోతున్నా వాడు కుంభకర్ణుడి తమ్ముడే ననిపిస్తుంది. అలాగే భారతంలోని పాత్రలుకూడా. కడుపెడు బిడ్డలతో ఉన్న తల్లికి తాళిబొట్టు కరువైతే కుంతీదేవిలా నిలబడిందన్ని

పిస్తుంది. ఎన్నికష్టాలు వచ్చినా ధర్మానికి కట్టుబడుతున్నవాణ్ణి ధర్మరాజనాలనిపిస్తుంది. కండలు తిరిగిన బలవంతుడు కనిపిస్తే భీముడిలా ఉన్నాడనిపిస్తుంది. ఏ యింటిలో పండువృద్ధు కనిపించినా కురువృద్ధుడు భీష్ముడు గుర్తుకు వస్తాడు. అన్యోన్యతగల బావామరదులు కృష్ణార్జునులుగా దర్శనమిస్తారు. ఈ విధంగా పెద్దాచిన్నా ప్రసక్తి లేకుండా రామాయణభారతాలలోని పాత్రలు మనచేత నిత్యమూ స్మరింపబడుతూనే ఉన్నాయి. కొంచెం వివేకంతో గమనించుకొంటే మనకథలు ఆ కథలలోని అంతర్భాగాలుగానే కనిపిస్తాయి. ఈవిధంగా మానవరూపాలు ధరించి ఆడుకుంటున్న సృష్టి ధర్మాలని, తమ ప్రశాంతమైన మనస్సులనే దర్పణాలమీద పట్టి చూపించారు వాల్మీకి, వ్యాసులు.

సామాన్యంగా మానవుడు తన చుట్టూ ఉన్న ప్రపంచంలో తనకు ఉన్నట్లుగా కనబడినదాన్ని ఉన్నదని విశ్వసిస్తూఉంటాడు. కాని, తాను చూస్తున్నది ప్రపంచాన్ని కాదనీ, తన మనస్సు పై బడ్డ ప్రపంచం యొక్క ప్రతిబింబాన్ని మాత్రమేననీ మరచిపోతూ ఉంటాడు. మనస్సుపై బడ్డ ప్రపంచం యొక్క ప్రతిబింబం అంతకు పూర్వం తన మనస్సుకున్న మంచీచెడ్డా లక్షణాలతో ప్రభావితం అవుతుంది. ఈ విధంగా తన సంస్కారాలనే అలలతో నిండిఉన్న మనస్సనేకోనేరుమీాద పడ్డ ప్రతిబింబాన్ని చూచి అదే ప్రపంచం యొక్క యథార్థస్వరూపమని భాష్యం చెప్పడానికి ప్రయత్నిస్తూ ఉంటాడు మానవుడు. కోనేరు కల్లోలితమైనపుడు అందులో ప్రతిబింబించే సూర్యచంద్రులు ఖండఖండాలుగా కనబడుతూ ఉంటారు. తారలు మొదలైనవి తెగి రాలిపోతున్నట్లు కనిపిస్తాయి. కానీ ఇది ఆకాశంలో నిజంగా జరుగుతోందా? ఈవిధంగా ఎవరి మనః కాసారంలో వారు చూస్తున్న ప్రతిబింబాలనే యథార్థాలుగా భావించి ప్రచారం చేయడంతో భేదాలు, వర్ణాలు, మతద్వేషాలు మొదలైన

వన్నీ పుట్టుకొని వస్తున్నాయి. ఎవడి ప్రాణానికి వాడి దర్శనం వాడికి నిజం అనిపిస్తుంది. మరొకడితో రాజీపడ నవసరంలేదనిపిస్తుంది.

అయితే సృష్టితత్త్వం ఉన్నది ఉన్నట్లుగా దర్శన మీయడం ఎలా ? కోనేరు ప్రశాంతంగా ఉన్నప్పుడు పైన ఆకాశంలో ఏమున్నాయో క్రింద కోనేటిలోనూ అవే ఉన్నవి ఉన్నట్లుగా ప్రతిబింబిస్తాయి. అలాగే మానవుడు సర్వసమత్వాన్ని అవలంబించి భూతదయతో విశ్వప్రేమతో వసుధైక కుటుంబంగా జీవితం సాగిస్తున్నప్పుడు, అతని మనస్సు నిర్మలస్థితిని పొందుతుంది. అప్పుడు సృష్టి, దాని తత్త్వమూ ఉన్నవి ఉన్నట్లు ప్రతిబింబిస్తాయి. అప్పుడతడు ఆ తత్త్వంతో తాదాత్మ్యం చెంది గానం చేస్తాడు. ఆ గానం శాశ్వతంగా నిలిచిపోయి తరతరాలవారిని తరింపచేస్తుంది. ఆస్థితిలో ఉన్న మానవుణ్ణి 'ఋషి' అంటారు. 'ఋష్' అన్న ధాతువుకు చూచు అని అర్థం. ఋషి అంటే ఉన్నది ఉన్నట్లుగా చూడగలిగినవాడన్నమాట. అలాంటి ఋషినుండి దిగివచ్చేదే, సరైన కావ్యం, సత్కావ్యం అవుతుంది. ఈ సత్యాన్ని చెప్పడానికే మనపెద్దలు 'నానృషిః కురుతే కావ్యం' అన్నారు. ఈ విధంగా లోకహితాన్నికోరి ఋషివంటి స్థితిలో నిలిచి కృషిసల్పినవారే వాల్మీకీ, వ్యాసుడూ.

---

# రామాయణం - మహాభారతం

రామాయణ మహాభారతాలు రెండూ రెండు మహేతిహాసాలు. పురుషార్థాలైన ధర్మార్థకామమోక్షాల స్వరూప స్వభావాలను మానవుడికి బోధపరచేటందుకే ఈ యితిహాసాలు వెలిశాయి. మానవుణ్ణి ధర్మం యెడల మేల్కొల్పి ధర్మనిష్ఠలో నిలిపి దైవంగా మలిచేటందుకే ఈ యితిహాసాలను అనుగ్రహించారు వాల్మీకి వ్యాసులు. మానవుడికి తాను ఉన్న స్థితినుంచి తాను ఉండవలసిన స్థితికి మార్గనిర్దేశం చేసి, చేయూతను ఇచ్చి నడిపించగల మహత్తర గ్రంథాలివి.

పురుషార్థాల నిర్వహణలో మానవుడికి శిక్షణను ఇవ్వడానికి వెలసిన ఈ పవిత్రగ్రంథాలు రెండూ రెండు తరహాలకు చెందినవి. ఇవి రెండూ రెండుస్థాయుల్లో మానవుడికి ఆవశ్యకమైన శిక్షణను ఇస్తాయి. మనిషి వ్యక్తిగతంగా ఎలా ఉండాలో, ఎన్ని ఒడుదుడుకులు ఎదురైనా దీక్షతో తన్నుతాను ధర్మమార్గంలో ఎలా నిలబెట్టుకోవాలో ఉపదేశిస్తూ మనిషి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే ప్రయత్నం చేస్తుంది రామాయణం. రాముడు అసాధారణమైన

కష్టాలు ఎదురైనప్పుడుకూడా, తట్టుకోలేక కన్నీరుకార్చాడేమోగానీ, తాను పట్టుకొన్న ధర్మమార్గాన్ని మాత్రం ఎన్నడూ విడనాడలేదు. ధర్మమార్గాన నడిచే మానవుడు తాత్కాలికమైన కష్టనష్టాలకు తట్టుకొని, ధర్మమార్గంలో స్థిరంగా నిలబడగలగాలనీ, అలా నిలబడగలిగినప్పుడే తన కర్తవ్యాన్ని పరిపూర్ణంగా నిర్వహించగలడనీ, రామాయణం ఉపదేశిస్తుంది. రామాయణం కుటుంబపరంగా మానవుడు ఎలాంటి సమన్వయంతో జీవించాలో ఎక్కువగా వివరిస్తుంది. మనిషి తాను తన కుటుంబంలో ఎలా ఉండాలో తెలుసుకోవాలంటే రామాయణం చదువుకోవాలి. తండ్రీకొడుకులు, తల్లీబిడ్డలు, అన్నదమ్ములు, భార్యాభర్తలు ఒకరి యెడల ఒకరు ఏవిధంగా ప్రవర్తిస్తే దివ్యత్వానికి దగ్గరవుతారో రామాయణం చక్కగా వివరిస్తుంది. ఈ కావ్యం హృదయపూర్వకంగా చదివిన వాడికి పవిత్రమైన వ్యక్తిత్వం, ధార్మికమైన కుటుంబసమాజీవనం అబ్బుతాయి. ఈకావ్యంలో కథ ప్రధానంగా మూడుకుటుంబాలచుట్టూ తిరుగుతుంది. ఒకటి దశరథుడి కుటుంబం, రెండవది వాలి కుటుంబం, మూడవది రావణుడి కుటుంబం. రామాయణంలోని సన్నివేశాలు ఎక్కువభాగం ఈ కుటుంబాల పరిధుల్లో జరిగినవే. ఒక్క సీతాపరిత్యాగ ఘట్టం మాత్రం కుటుంబపరిధిని దాటి, రాష్ట్రధర్మాల కక్ష్యలో అడుగుపెట్టిన ఘట్టం. రాముడు తనవారిని సుఖపెట్టడంకోసం తాను అడవులపాలయ్యాడు. తన ప్రజల్ని ధర్మమార్గాన నిలపడంకోసం తన ప్రాణమైన సీతనే త్యాగం చేశాడు. ఈ విధంగా వ్యక్తి-కుటుంబం, కుటుంబం - సమాజం అన్న అంశాలపై కథను నడిపి, మార్గాన్ని నిర్దేశిస్తాడు రామాయణకర్త. ఇందులో కథ సూటిగా సాగిపోతుంది. మలుపులు తక్కువ. అలాగే వ్యక్తిత్వాలు కూడా స్పష్టంగా తెలుస్తూఉంటాయి. కథనుగూర్చి మనకు కలిగే సందిగ్ధత తక్కువ.

భారతం అలా కాదు. ఇది ఒక ప్రపంచాన్ని తనలో ఇముడ్చుకొందా అనిపిస్తుంది. సృష్టితత్వంపై తేలియాడుతున్న మానవమన స్తత్వాలన్నిటినీ తన పద్దెనిమిది పర్వాల్లో సర్దుకొనేటట్లు చేశాడా వ్యాసభగవానుడు అనిపిస్తుంది. సృష్టిలో ఉన్న మన స్తత్వాలన్నీ ఇందులో ఉన్నాయి గనుక కథలోని మలుపులకు లెక్కలేదు. ఆ మన స్తత్వాలన్నీ దేనికోసం వెతుక్కొంటున్నాయో, దేనికోసం మథనపడుతున్నాయో, ఎలాంటి స్థితిలో సుఖపడుతున్నాయో, ఎలా ఉన్నప్పుడు దుఃఖాలపాలవుతున్నాయో, జరిగిన కథను జరిగినట్లుగా చెబుతూ దర్శింపజేస్తాడు వ్యాసుడు.

భారతం వ్యక్తి జీవితాన్ని రెండుభాగాలుగా దర్శింపజేస్తుంది. మొదటిది వ్యక్తిగత జీవితం. రెండవది సామాజిక జీవితం. మానవుడు తనజీవితంలోని ఈ రెండు పాత్రల్ని ధర్మబద్ధంగా నిర్వహించుకోవాలి. వ్యక్తిగత జీవితం సామాజిక జీవితానికి దీప్తిని కలిగించేదిగా ఉండాలి. సామాజికశ్రేయస్సుకు ఆవశ్యకమైనపుడు మానవుడు తన వ్యక్తిగత జీవితాన్ని త్యాగం చేయగలిగి ఉండాలి. అలా త్యాగం చేయడమే ధర్మం అవుతుంది. సామాజికశ్రేయస్సుకన్న తన వ్యక్తిత్వానికే ఎక్కువగా ప్రాముఖ్యమిచ్చే వ్యక్తి అధర్మమార్గాన్ని అవలంబించినవాడు అవుతున్నాడు అన్నది మహాభారతం యొక్క ఉపదేశం. ఉదాహరణకు తన వ్యక్తిగత జీవితంలోని పవిత్రతను కురువంశాన్ని నిల్పేటందుకు త్యాగంచేశాడు వ్యాసభగవానుడు. అదే సందర్భంలో లోకశ్రేయస్సుకన్నా తన ప్రతిజ్ఞకు ఎక్కువ విలువను ఇచ్చాడు భీష్ముడు. సమర్థుడు అయిఉండికూడా తనకు తానుగా లోకహిత కార్యంలో పాలుపంచుకోలేకపోయాడు. వ్యక్తిగతజీవితంలో చూపిన పవిత్రత సామాజిక జీవితంలో చూపలేకపోయాడు కర్ణుడు. మిత్రునిగా, దాతగా, వ్యక్తిగత జీవితంలో ప్రసిద్ధిపొందిన కర్ణుడు తన సామాజిక పాత్రలో దుర్యోధనుడికి ప్రేరణను ఇచ్చి, అధర్మమార్గాన

నడుస్తున్న అతనికి వంతపాడి, జరుగకూడని సంఘటనలు జరగడానికి కారణభూతుడయ్యాడు.

ఈ విధంగా మానవుడు నిర్వహించవలసిన వ్యక్తిగత, సామాజిక పాత్రలను దర్శింపజేసి, ఈ రెండు పాత్రలను ధర్మబద్ధంగా నడుపకొన్నవాడు ధర్మాత్ముడు అవుతాడనీ, ఆవశ్యకత ఏర్పడినప్పుడు వ్యక్తిత్వాన్ని లోకశ్రేయస్సుకోసం త్యాగం చేయగలిగినవాడు ధన్యుడు అవుతాడనీ బోధపరుస్తుంది భారతం. రామాయణం కుటుంబజీవనానికి మార్గదర్శకమైనట్లు భారతం సాంఘిక సహజీవనానికి మార్గదర్శకమౌతోంది. మానవుణ్ణి కుటుంబానికి తగిన వ్యక్తిగా రామాయణం తీర్చిదిద్దగా సమాజానికి తగినవ్యక్తిగా భారతం తీర్చిదిద్దుతోంది.

మహాభారతంలో ధర్మసంఘర్షణలూ, పరిష్కారాలూ మాత్రమే కాకుండా ఆపద్ధర్మాలుకూడా ప్రాముఖ్యం వహించాయి. ఇందులో 'వాదైన చోటు' లన్నీ రాజకుటుంబాల కక్ష్యల్లోనే ఉత్పన్నమైనప్పటికీ, ఆ సన్నివేశాలన్నీ రాష్ట్రధర్మం, సకల ప్రజాపాలన - రక్షణ ధర్మాలు అనే కక్ష్యలతో ముడిపెట్టుకొని ఉన్నాయి. శంతనుడి రెండోపెళ్ళి, భీష్ముడి ప్రతిజ్ఞ, గాంధారి వివాహం, ద్రౌపది వివాహం, కుంతీగాంధారుల సంతానప్రాప్తి, రాజసూయం, జూదం, కీచకునిఘట్టం మొదలైనవన్నీ ప్రజలకూ రాష్ట్రానికీ సంబంధించిన సన్నివేశాలుగా ప్రాముఖ్యం వహించాయి. అన్నిటికన్న మిన్నగా యుద్ధరంగంలో అర్జునుడి విషాదం, తత్ఫలితమైన గీతోపదేశం యావత్ప్రపంచానికీ సార్వకాలికమైన మూదలగా ప్రతిష్ఠ చెందింది. అలాగే ధర్మజుడికి భీష్ముడుచేసిన ఉపదేశంకూడా. ఈవిధంగా ధర్మాలకూ, వేదాలకూ, వాదాలకూ రంగస్థలం అవడంలో రామాయణంకన్నా మహాభారతం కనీసం పద్దెనిమిది రెట్లు పెద్దది. కనుకనే భారతంలోని అరణ్యపర్వంలో అంతర్భాగంగా రామాయణగాథ ఇమిడిపోగలిగింది.

మానవుడు సృష్టిలో ఒకభాగం. అతడు సుఖపడాలంటే సృష్టి యొక్క తత్త్వాన్ని తెలిసి ప్రవర్తించాలి. ఆ ప్రవర్తన త్రివర్గసాధనతో నిండిఉంటుంది. అనగా, ధర్మార్థకామాలను అతడు నిర్వహించుకోవడంమీద అతడి ఆనందానుభవంగానీ, దుఃఖానుభవంగానీ ఆధారపడిఉంటాయి. ధర్మార్థకామాల నిర్వహణ సృష్టిధర్మాలకు అనుగుణంగా ఉన్నప్పుడు అతడు సుఖాన్ని అనుభవిస్తాడు. దాన్నే మోక్షం అంటారు. ధర్మార్థకామాల నిర్వహణ సృష్టిధర్మాలకు అనుగుణంగా లేనప్పుడు దుఃఖాన్ని అనుభవిస్తాడు. దాన్నే సంసారం అంటారు. కాబట్టి పురుషార్థాలైన ధర్మార్థకామమోక్షాలను గురించి మానవుడు బోధపరుచుకోవలసింది ఎంతైనా ఉంది. రామాయణం పురుషార్థాలయొక్క స్వరూపస్వభావాలను బోధపడేట్లు చేస్తూ, ఆదర్శప్రాయమైన జీవన మార్గాన్ని ఉపదేశిస్తోంది. మహాభారతం పురుషార్థాల స్వరూపస్వభావాన్ని వివరించడమే కాకుండా, వాటిలోని లోతుపాతుల్ని పరిపూర్ణంగా బోధపరుస్తుంది. అందుకే దీన్ని మొదటగా జనమేజయుడికి వివరించిన వైశంపాయనుడు ఈగ్రంథ ప్రాశస్త్యాన్ని, ప్రత్యేకతనూ చెబుతూ "ధర్మార్థకామమోక్షాల విషయంలో ఇందులో ఉన్నది ఎక్కడైనా ఉన్నది; ఇందులో లేనిది ఎక్కడా లేదు" 1 అన్నాడు. అదే వెలుగులో చూసిన నన్నయగారు ఈ పవిత్రగ్రంథంలో ఎవరికి కావలసింది వారికి దొరుకుతోందన్నారు. అదే వెలుగును తెలుగువారికి అందించాలని దీక్షవహించిన తిక్కన, మానవుడికి ధర్మాద్వైతస్థితి సిద్ధించే మార్గాన్ని మహాభారతంలో వ్యాసుడు నిర్దేశిస్తున్నట్టు దర్శించాడు. ధర్మార్థకామమోక్షాల విషయంలో వేదాలకూ, అఖిలస్మృతి వాదాలకూ, బహుపురాణ వర్గాలకూ వాదైనచోటులు ఏర్పడినప్పుడు, భారతం తాను మాదల అవుతోందని తిక్కన దర్శనం. ఈవిధంగా రామాయణ మహాభారతాలు, మానవుడికి ఆవశ్యకమైన శిక్షణను రెండు స్థాయుల్లో అందిస్తూ, అతణ్ణి పరిపూర్ణుణ్ణి చేస్తున్నాయి.

---

1. ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్ — సంస్కృతభారతం.
ఆది - 1-66-33.

# II. ఖండం

ధర్మస్వరూపం

ధర్మాద్వైతస్థితి - అభిప్రాయాల పరిశీలన

ధర్మాద్వైతస్థితి - సిద్ధాంత ప్రతిపాదన

# ధర్మస్వరూపం

ధర్మం అనే పదం చాలా చిత్రమైనది. దీనికి సమానార్థకమైన పదం మరి యేయితర భాషల్లోనూ కనబడదు. సంస్కృతభాషలోనే దీనికి సరైన పర్యాయపదం కానరాదు.

'ధృ' అనే ధాతువునుంచి ధర్మం అనే పదం పుట్టింది. 'ధరించునది' అని దీనికి అర్థం. సృజింపబడినదానిని ధరించేదీ, సకలచరాచర జగత్తును అంతర్యామియై నడిపించేదీ, విశ్వచక్రాన్ని వర్తింపజేస్తూ, రక్షణ కలుగజేసేదీ ధర్మమని మన పెద్దలు చెప్పారు. మహాభారతం కర్ణపర్వంలో పురాణపురుషుడైన శ్రీకృష్ణుడు ధర్మాన్ని గూర్చి ఇలా వివరించాడు : 'ధరించేదికాబట్టి ధర్మం అనబడింది. ధర్మమే ప్రజలను ధరిస్తోంది ఏది సంఘాన్ని కట్టుబాటులో నిలుపుతోందో అదే ధర్మమని పెద్దలు నిశ్చయించారు.' 1 ధర్మాన్ని గూర్చి మనువు ఇలా వివరించాడు : 'వేదప్రమాణితమూ, స్మృతిచోదితమూ, సత్పురుషుల నడవడికి అనుగుణమైనదీ, తన ఆత్మకు ఇంపైనదీ - ఈ నాలుగున్నూ ధర్మం యొక్క లక్షణాలు'. 2

---

1. ధారణా ద్ధర్మమిత్యాహుః ధర్మో ధారయతే ప్రజాః
యత్స్యా ద్ధారణ సంయుక్తః సధర్మ ఇతి నిశ్చయః ॥ - భారతం- కర్ణ -70-58.
2. వేదః స్మృతిః సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః ।
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్యలక్షణమ్ ॥ మను - 2 1

వేదాల్లో సృష్టియందలి ధర్మాలు గానం చేయబడ్డాయి. ధర్మ శాస్త్రాల్లో సృష్టి యందలి ధర్మాలతో శ్రుతి కుదుర్చుకొనేటందుకు మానవజీవితం ఎలా నియమబద్ధమై ఉండాలో నిర్దేశింపబడింది. సృష్టి ధర్మాన్ని అనుసరించి మానవుడి ప్రవర్తనను శాసించేవి గనుక అవి ధర్మశాస్త్రాలయినాయి. సత్పురుషుల నడవడిలో శ్రుతి స్మృతులకు లయకుదిరి, సదాచారం రూపుకట్టుకుంటుంది. ఆ సదాచారం ధర్మాను రక్తిగల జీవికి తృప్తిని కలిగిస్తుంది. ఇది ఒక నిచ్చెన. వేదం, స్మృతి, సదాచారం దాని మెట్లు. వేదంనుంచి స్మృతి, స్మృతినుంచి సదాచారం రూపుకట్టుకుంటున్నాయి. జీవి తన హృదయానికి తృప్తికలిగించే సదాచారాన్ని అనుసరిస్తూ స్మృతి శ్రుతులతో తాదాత్మ్యాన్ని అనుభవిస్తున్నాడు. కనుకనే శ్రుతి, స్మృతి, సదాచారం, ఆత్మతృప్తి అనే నాలుగింటినీ ధర్మలక్షణాలుగా మనువు వక్కాణించాడు. రాముడు మొదలైన అవతారపురుషులు తాము భూమికి దిగివచ్చి నప్పుడు ధర్మబద్ధమైన సదాచారాలను రాచబాటలుగా నిలిపి వెళ్ళారు. ఇప్పటికీ ఆ రాచబాటలు జిజ్ఞాసువులతో కిటకిటలాడుతూనే ఉన్నాయి. పితృవాక్య పరిపాలన, ఏకపత్నీవ్రతం, సత్యనిష్ఠ, ఆశ్రిత రక్షణ, మొదలైనవి ఆ రాచబాటలు. ఈ సత్యాన్ని దర్శించినవాడు గనుకనే భీష్ముడు విష్ణుసహస్రనామ స్తుతిలో ఆచార ప్రభవశీలమైనది ధర్మం. ధర్మానికి ప్రభువు అచ్యుతుడు * అని వివరించాడు. సదాచార వంతుడు ధర్మం యెడల మేల్కొల్పు పొందుతాడు. ఆ ధర్మంతో చేతులుకలిపి ధర్మానికి ప్రభువైన శాశ్వతపురుషుణ్ణి దర్శిస్తాడు అన్నది పెద్దల భావం, అనుభవం. ఆ అనుభవంలో జీవిస్తున్న మనిషి యొక్క లక్షణాలనుగూర్చి మనువు ఇలా చెప్పాడు: 'ధైర్యం, ఓర్పు, మనోనిగ్రహం, తనదికాని వస్తువుపై ఆశపడకపోవడం, శుచిత్వం, ఇంద్రియ నిగ్రహం, బుద్ధిమత్త్వం, విద్య, సత్యభాషణం,

---

* 'ఆచారప్రభవో ధర్మః ధర్మస్యప్రభు రచ్యుతః' విష్ణుసహస్రనామం.

కోపరాహిత్యం-ఈ పదీ ధర్మానికి లక్షణాలు. 4 అంటే ఈ పదిలక్షణాలూ ధర్మనిష్ఠుడినుంచి వ్యక్తమవుతూ ఉంటాయి. ఈ పదిలక్షణాలనుబట్టి ఆవ్యక్తి ధర్మాత్ముడన్న విషయం స్పష్టమవుతుంది. సువాసననుబట్టి పువ్వును నిర్ణయించగలిగినట్లు ఈ పదిలక్షణాలు వ్యక్తమవడాన్నిబట్టి ధర్మం అక్కడ ఉన్నదని విదితమవుతుంది. ఈనిర్ణయాన్ని ఆధారంగా తీసుకొనే మన సంప్రదాయంలో సద్గుణాలను అన్నింటినీ ధర్మాలుగా, పరమధర్మాలుగా వర్ణించడం జరిగింది.

సృష్టిలో ఒకభాగమైన మానవుడు తనయందూ, నిఖిల భూతాలయందూ వర్తిస్తున్న ధర్మాలకు అనుగుణంగా ప్రవర్తించినపుడు రక్షణపొందుతాడు. లేనపుడు శిక్షింపబడతాడు. ఈ సత్యాన్ని వివరిస్తూ మనువు 'ధర్మాన్ని బాధిస్తే అది తిరిగి మననే బాధిస్తుంది. ధర్మరక్షణంచేస్తే మనకు రక్షణకలుగుతుంది. కాబట్టి ధర్మాన్ని నాశనంచేయకూడదు. మిమ్మల్ని మీరు నాశనం చేసుకోవాలని కోరరుగదా!' 5 అన్నాడు. ఎలా ప్రవర్తిస్తే రక్షణకలుగుతుందో తన ధర్మసూత్రాల్లో వివరించాడు.

వేదాల్లో మిత్రావరుణులవంటి దేవతలందరినీ ధర్మమూర్తులుగా సంబోధించడం జరిగింది. 6 ఒకే పరమధర్మం స్థితిభేదాలను పొంది భిన్నంగా గోచరిస్తూ సృష్టిగా దిగివస్తోంది. కనుక ఆస్థితుల్లో ఏస్థితినైనా ధర్మమూర్తిగా సంబోధించడం ధర్మమేకదా! పూర్వ

4. ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః
ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥ మను - 6-92.

5. ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః।
తస్మా ద్ధర్మో నహంతవ్యో మానోధర్మోహతోఽవధీత్॥- మను - 8-50.

6. ధర్మణా మిత్రావరుణా విపశ్చితా వ్రతా అసురస్యమాయయా॥
ఋగ్వేదం - 5-63-72

లోని ఏ రేకు పూవుకాదు! ఆకాశంనుంచి వాయువు దిగివస్తోంది. దాని ధర్మం వేరు. వాయువునుంచి అగ్ని వ్యక్తమవుతోంది. దానిధర్మం వేరు. అగ్నినుంచి నీరు వ్యక్తమవుతోంది. దానిధర్మం వేరు. నీటినుంచి భూమి రూపుకట్టుకుంటోంది. దానిధర్మం వేరు. ఒకే ఆకాశం విభిన్నధర్మాలుగల పంచభూతాలుగా వ్యక్తమయినట్లు, ఈసృష్టిలోని సకల ధర్మాలూ ఒకే పరమధర్మంయొక్క వివిధకక్ష్యల్లోని అంచులు. వేదం మనకు అందిస్తూన్న దర్శనం ఇదే. కనుక వేదంలో ధర్మపదం స్వేచ్ఛగా వాడబడింది. స్థితి (State) భేదమేగాని తత్త్వం (Essence) ఒక్కటే అన్నది వేదఋషుల దర్శనం. లోకంలో మనం వింటున్న విష్ణువు, శివుడు, నారాయణుడు మొదలైన దేవుళ్ళ పేర్లన్నీ నిజానికి పేర్లు కావు. ఒకే చైతన్యానికి స్థితిభేదాన్నిబట్టి పాడబడిన విశేషణాలు. పత్తిని కడ్డీలా చేసి ఏకు అంటున్నాం. కదురుతో ఏకును సన్నగా సాగదీస్తే దారం అంటున్నాం. దారాన్ని మడతలు వేసి మెలిపెట్టి చిలప అంటున్నాం. ఆ చిలపను కొంత కథ నడిపి మగ్గానికి ఎక్కించి నేస్తే బట్ట అంటున్నాం. కాని ఈపేర్లన్నీ వివిధస్థితుల్లో ఉన్న పత్తికి మనంవాడిన విశేషణాలే కదా! ఈ సత్యాన్ని ఒంటపట్టించుకొన్నకొద్దీ మనకు వేదంయొక్క స్వరూపం దర్శనమీయడం ప్రారంభమవుతుంది. ప్రారంభించినప్పటినుంచి వేదద్రష్టలు దర్శించిన ధర్మంయొక్క విశ్వరూపం సాక్షాత్కరిస్తుంది. ఉన్నదా, లేదా అనిపించే ఆకాశం అంచెలంచెలమీద భూమిగా అవతరించినట్లు ఆపరమధర్మమే మనం చూస్తున్న చరాచరజగత్తుగా రూపుకట్టి వర్తిస్తున్నదన్న సత్యం కన్నులకు కడుతుంది. 'ధరించేది కాబట్టి ధర్మమనబడింది' అన్న నిర్వచనం అప్పటికి పూర్తిగా అనుభవానికి వస్తుంది.

ఒక వృక్షం తాను మొలకెత్తి విస్తరించకపూర్వం విత్తనంలో ధర్మస్వరూపంగా ఉంటోంది. అదనునుబట్టి ఆ ధర్మ

స్వరూపమే వృక్షంగా విచ్చుకుంటుంది. ఇది ధర్మం. విచ్చుకోవడం గుణం.విచ్చుకుంటున్నప్పుడు జరిగేది కర్మ.అలాగే సృష్టికూడా పరమ ధర్మంనుంచి గుణాలుగా, గుణాలనుంచి కర్మలుగా విస్తరించు కుంటుంది. ప్రళయకాలంలో కర్మలూ,గుణాలూ ఉండవు. కాని వీటికి మూలమైన ధర్మాలు మాత్రం నిలిచే ఉంటాయి. ఆధర్మాలను అను సరించే దేవతలు మళ్ళీమళ్ళీసృష్టిచేస్తూఉంటారని వేదం కీర్తిస్తోంది7. సృష్టిలో జరుగుతున్న కర్మలకూ, వ్యక్తమవుతున్న గుణాలకూ ఉండటం, లేకపోవడం ఉంటుంది కాని, ధర్మాలకు మాత్రం లేకపోవడం ఉండదు. కనుకనే కృష్ణుణ్ణి పరమపురుషుడుగా దర్శించిన అర్జునుడు "త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా" 8 అని కీర్తించాడు. ఆధర్మాలు ప్రవర్తించినపుడు సృష్టి రూపుకట్టుకుంటోంది. నివృత్తిని పొందినపుడు ప్రళయం సంభవిస్తోంది. ప్రవృత్తినివృత్తులు అనే రెండు రెక్కలతో పరమధర్మం అగ్నిస్వరూపమైన సుపర్ణుడిగా శాశ్వతంగా వెలుగొందుతూ విహరిస్తూఉంటుంది.

సృష్టిధర్మాన్ని దృష్టిలో పెట్టుకొని తదనుగుణమైన ప్రవర్తనతో జీవితాన్ని నిర్వహించుకున్నవారికి సృష్టిధర్మంతో శ్రుతికుదిరి జీవితంలో ఆనందం పండుతుందని ఋషులు దర్శించారు. మానవ జీవితాన్ని వేదధర్మానికి అనుగుణంగా తీర్చిదిద్దాలనే సంకల్పంతో స్మృతులను రచించారు.మానవుని జీవితంలో ధర్మార్థకామాలు చోటు చేసుకుంటున్నాయనీ, ఆ త్రివర్గాన్ని సృష్టిధర్మానికి అనుగుణంగా నిర్వహించుకుంటే మోక్షం అనుభవానికి వస్తుందనీ వారు వివరిం చారు. సృష్టిధర్మాన్ని అనుసరించడానికై మానవుడికి వారు నిర్దేశిం చిన నియమాలకు కూడా ధర్మాలనే పేరు వచ్చింది. ఆగ్రంథాలే ధర్మశాస్త్రాలయ్యాయి. వేదాన్ని అనుసరించి మానవజీవితాన్ని

---

7. తాని ధర్మాణి ప్రథమాన్యాసన్.... పురుషసూక్తం.
8. భగవద్గీత 11.18.

ఈ సిద్ధాంతవ్యాసంలో సంస్కృతశ్లోకాలకు భావానువాదం ఈయబడింది. భగవద్గీతశ్లోకాల అనువాదానికి "మంద్రగీత" ఆధారం.

శాసించేదే ధర్మశాస్త్రం. ఈ రెండింటిని- అనగా శ్రుతిస్మృతులను - సామాన్యమానవులకుసైతం అందుబాటులోకి తీసుకురావడానికి వ్యాసాదులు చేసిన ప్రయత్నమే పురాణేతిహాసాల ఆవిష్కరణ. పురాణేతిహాసాలు ధర్మస్వరూపాన్ని ఉదాహరణపూర్వకంగా ఉపదేశిస్తున్నాయి. తేలినదేమంటే, సృష్టిలో ఉన్నది ధర్మం. దానికి అనుగుణంగా మానవుడు నడిచే మార్గానికి కూడా ధర్మమే అని వ్యవహారం. కాబట్టే మానవజీవితంలో కూడా ధర్మశబ్దం వేదాల్లోవలె స్వేచ్ఛగా అనేక అర్థాల్లో వాడబడుతోంది. మహాభారతంలో ధర్మశబ్దం ప్రధానంగా ఈ క్రింది అర్థాల్లో వాడబడినట్లు స్పష్టం అవుతోంది.

1. ధర్మం = ప్రకృతిస్వభావం.

ఉదా :- "ఎల్లలోకంబులు ధర్మువునందు నిలుచు" 9

"దేవతలు ధర్మవర్తులు." 10

2. ధర్మం = పురుషార్థం.

ఉదా :-"కమనీయ ధర్మార్థకామమోక్షములకు
అత్యంతసాధనంబైనదానిని... 11

"...సర్వజన స్వ
ర్గారోహణ సోపానం
బారగ ధర్మంబచూవె" 12

3. ధర్మం = వేదవిహిత కర్మ.

ఉదా :- "సంధ్యలందొనరించు సద్విధుల్ గడచిన ధర్మలోపంబగు." 13

---

9. ఆం.మ.భా - ఆది - 5-92.
10. ఆం.మ.భా - సభా - 2-313.
11. ఆం. మ. భా. ఆది - 3-9
12 ఆం.మ.భా - అరణ్య - 1-228.
13. ఆం.మ.భా - ఆది - 2-168.

4. ధర్మం = వర్ణధర్మం, ఆశ్రమధర్మం.

ఉదా :-"వర్ణధర్మ పరిపాలనంబునకుం దపంబునకు మెచ్చితి"14

"క్షత్రియులు ధర్మమార్గంబునన్ ప్రజాభిరక్షణంబు సేయుటం జేసి వర్ణాశ్రమధర్మస్థితులు తప్పక ప్రవర్తిల్లుటలు" 15

5. ధర్మం = జాతిధర్మం.

ఉదా :-"మనుష్యులందు జాతిధర్మోపధారకు లెక్కుడు"16

6. ధర్మం = కులధర్మం (వంశాచారం)

ఉదా :-"భవత్కులధర్మరక్షివై"17

"వంశవిహితధర్మంబులవదలి"18

7. ధర్మం = లోకాచారం.

ఉదా :-"గురులకు శిష్యులు పుత్రులు
పరమార్థము లోకధర్మపథమిది"19
"ఎట్టిసాధ్వులకుంబుట్టినయిండ్లను
బెద్దకాల మునికి తద్దతగదు
పతుల కడన యునికి సతులకు ధర్మువు" 20

8. ధర్మం = లోకనీతి.

ఉదా :-"పాండుతనూజులున్న వారని విని
వారికిందగుం బ్రియంబాచరింపకయునికి ధర్మువె"21

---

14. ఆం.మ.భా - ఆది - 3-24.
15. ఆం.మ.భా - ఆది - 3-52.
16. ఆం.మ.భా - శాంతి - 5-89.
17. ఆం.మ.భా - శాంతి - 1-150.
18. ఆం.మ.భా - శాంతి - 1-135.
19. ఆం. మ. భా - ఆది - 3-131.
20. ఆం. మ. భా - ఆది - 4- 66.
21. ఆం. మ. భా - ఆది - 8-36.

"ఒరులధనము నికృతిమై గొనుటిది ధర్మువగునే"22
"కులదూషకు దూషించి కులంబు రక్షించుట ధర్మువు"23

9. ధర్మం = సముచితప్రవర్తన.

ఉదా :-"ఇల నీకైకొన్న తెఱగు ధర్మంబో కాదో దైవం
బెఱుగున్"24
"తండ్రులను బుత్త్రపౌత్త్రుల గురులనైనను
పాపపరులు పోరఁజంపుట ధర్మంబు"25

10. ధర్మం=న్యాయం.

ఉదా :-"ధర్మమార్గంబుఁదప్పక తలఁపుడొక్క-
తెఱఁగు ధర్మువుదప్పి యుధిష్ఠిరుండు
పడయ నొడఁబడఁ డయ్యింద్రపదవినైన"26
"రణన్యాయంబుఁ దప్పకుండగ"27
"రణధర్మకోవిదుండవు"28 (ఇచ్చట ధర్మ న్యాయాలు పర్యాయపదాలుగా వాడబడ్డాయి).

11. ధర్మం=విధి (duty)

ఉదా :-"సంగ్రామంబు రాజులకు ధర్మంబవుం గాదని నీవ
చెప్పుము"29

22. ఆం. మ. భా. - సభా - 2-204.
23. ఆం. మ. భా. - అరణ్య - 1-50.
24. ఆం. మ. భా. - శాంతి - 1-113.
25. ఆం. మ. భా. - శాంతి - 2-155.
26. ఆం. మ. భా. - ఉద్యోగ - 1-11.
27. ఆం. మ. భా. - కర్ణ - 1-41.
28 ఆం. మ. భా. - కర్ణ - 3-351.
29. ఆం. మ. భా. - ఉద్యోగ - 1-335.

"కులధర్మము విడువక
మనుట పరమధర్మమండ్రు మాన్యులు"30
"నీరక్షణంబు కతమున
ధారుణి మముబోటి సాధు తపసులు నిత్య
ప్రారంభ ధర్మకర్మ
ధ్ధారులగుట యదియు విహిత ధర్మువుగాదే"31

12. ధర్మం = శీలము.
ఉదా :-"వైదర్భి యొరున్ వరింపనంత ధర్మేతర చరితయే"32

13. ధర్మం = అహింసాదిగుణాలు.
ఉదా :-"ధర్మజునకు భోగంబులు
ధర్మువున ట్లింపుగావు ధర్మంబులలో
నిర్మలబుద్ధి నహింసకుఁ
గూర్మిఁగడుం గలఁడతండు కురువంశనిధీ"33

14. ధర్మం = పుణ్యకర్మ.
ఉదా :-"అన్నదానముచేత అధికధర్మమనుట వినమె."34

15. ధర్మం = పరమధర్మం.
ఉదా:-"సారపు ధర్మమున్ విమలసత్యము బాపముచేతబొంకుచేఁ
బారముఁబొందలేక చెడుబారినదైనయవస్థ దక్షు లె
వ్వారల లుపేక్ష సేసి రది వారల చేటగుగాని ధర్మ ని
స్తారకమయ్యు, సత్యశుభదాయకమయ్యును
దైవముండెడిన్."35

---

30. ఆం. మ. భా. - అరణ్య - 5-37.
31. ఆం. మ. భా. - అరణ్య - 4-383.
32. ఆం. మ.భా. - అరణ్య - 2-185.
33. ఆం. మ. భా. - ఉద్యోగ - 2-7.
34. ఆం. మ. భా - శాంతి - 1 - 333.
35. ఆం. మ. భా. - ఉద్యోగ - 3 - 275.

ఈ విధంగా ధర్మశబ్దం అనేక అర్థాల్లో భారతంలోనూ మిగిలిన వేదవాఙ్మయంలోనూ ప్రయోగించబడింది.* స్థూలదృష్టి విభిన్న అర్థాల్లో గోచరిస్తున్నా, సూక్ష్మదృష్టిని ప్రసరింపజేసినపుడ ఒకేఒక పరమధర్మం యొక్క ప్రతిబింబాలనే-లేదా వివిధముఖాలనే ధర్మాలుగా పేర్కొనడం జరిగిందని తెలుస్తుంది. సృష్టిలోని ధర్మా

---

*ధర్మశాస్త్ర చరిత్రను (History of Dharma Sastra) రచించిన పి. వి. కాణే మహాశయుడు ధర్మశబ్ద స్వరూపాన్ని గూర్చి ఇలా వివరిస్తున్నారు -

"Dharma is one of those Sanskrit words that defy all attempts at an exact rendering in English or any other tongue. That word has passed through several vicissitudes. The dictionaries set out various meanings of Dharma such as ordinance, usage, duty, right, justice, morality, virtue, religion, good Works, function or characteristic. Dharma is also personified as a deity."

[History of Dharma Sastra
Volume I, page I]

మోనియర్ విలియమ్స్ పండితుని నిఘంటువు ధర్మశబ్దానికి ఉన్న అర్థాన్ని ఇలా వివరిస్తోంది :

**Dharma**: that which is established or firm, Steadfast, statue or ordinance, law, usage, practice, customary observance or prescribed conduct, duty, right, justice, virtue, morality, religion, religious merit, good works, law or justice personified,

లను అనుసరించి సృష్టివ్యూహ దర్శనాన్ని చేయించడానికై యజ్ఞ యాగాది క్రతువులు పుట్టాయి. వైదికకర్మలన్నీ రూపుకట్టుకున్నాయి. కాబట్టి వేదవిహితకర్మకూడా ధర్మం అనే వ్యవహృతం అయ్యింది. ఆ పరమధర్మాన్ని అనుసరించే పెద్దల నడవడినుంచి లోకాచారాలూ, లోకనీతులూ రూపుకట్టుకున్నాయి కనుక వాటిని కూడా ధర్మం అని వ్యవహరించారు. వర్ణాశ్రమాల్లో ఆ పరమధర్మాన్ని దర్శించడంతో వర్ణాశ్రమ విధులు ధర్మాలు అయ్యాయి. పరమ ధర్మాన్ని గమ్యంగా పెట్టుకొని మానవుడు వివిధస్థితుల్లో ఏర్పరచుకున్న ఆచారాలూ,నీతులూ మొదలైనవన్నీ ధర్మాలుగానే పేర్కొనబడ్డాయి. 'ఇది ధర్మం' అని ఏ వర్ణధర్మాన్నో, ఆశ్రమధర్మాన్నో, వంశాచారాన్నో చూపిస్తున్నారూ అంటే ఈ ధర్మాచరణం పరమ ధర్మం దగ్గరకు మానవుడు చేసే ప్రయాణం అవుతోందన్నమాట. మనం కొందరం కలిసి కాశీకి బయల్దేరాం అనుకొందాం. ప్రయాణం మధ్యలో ఎన్నో మజిలీల్లో ఎందరో మిత్రులు మనల్ని కలిసి 'ఎక్కడికి మీ ప్రయాణం?' అని అడిగినప్పుడు 'కాశీకి' అని చెబుతాంగాని, ఆమధ్యలో ఉన్న వందలాది ఊళ్ళ పేర్లు చెప్పం. నిజానికి ఆఊళ్ళ పేర్లు మనకు స్ఫురహాలో ఉండవుకూడా. మనదృష్టి కాశీమీద ఉంటుంది గనుక ఎన్నిఊళ్ళ మీదుగా ప్రయాణం సాగుతున్నా అది కాశీ ప్రయాణమే అవుతోంది. అలాగే లోకనీతి, లోకాచారం, యజ్ఞ యాగాది క్రతునిర్వహణాలు మొదలైనవాటి అన్నిటిమీదుగా జీవి పరమధర్మంవైపుకు ప్రయాణం చేస్తున్నాడు కనుక, ఆమజిలీలన్నీ ధర్మశబ్దంతోనే వ్యవహరింపబడ్డాయని మనం గ్రహించవలసిఉంది. ఆ ప్రయాణాన్ని పూర్తిచేసినవాడికి మానవుడు నిర్వర్తిస్తున్న ధర్మాలన్నీ మానవుడిలో వ్యక్తం అవుతున్న పరమధర్మంయొక్క అనేకాలైన అభివ్యక్తులేనని దర్శనం లభిస్తుంది. శరీరభాగాలు ఒకదానికి ఒకటి వేరుగా కనబడుతున్నా అవి ఒకే జీవశక్తినుంచి వ్యక్తం అవుతున్నట్లు,

వర్ణధర్మం, ఆశ్రమధర్మం - ఇలా భిన్నభిన్నధర్మాలుగా గోచరిస్తున్నవన్నీ ఆపరమధర్మంయొక్క వివిధ అభివ్యక్తులే అని అతడు దర్శిస్తాడు.

ధర్మంయొక్క స్వరూపాన్ని దర్శించాం. ఇక ధర్మాద్వైత స్థితి అంటే ఏమిటో దర్శించడానికి ప్రయత్నిద్దాం.



# ధర్మాద్వైతస్థితి - అభిప్రాయాల పరిశీలన

"విద్వత్సం స్తవనీయ భవ్య కవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సంభావ్యానుభావుండుఁ గృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైత స్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్" 1

'విద్వాంసులచే స్తుతింపబడే భవ్య కవితావేశం కలవాడూ, తన విజ్ఞానసంపదచే ప్రసిద్ధుడైనవాడూ, మహర్షులబృందంచే గౌరవింపబడే సహజ సద్గుణాలు కలవాడూ అయిన వేదవ్యాసమహర్షి లోకహితనిష్ఠతో ధర్మాద్వైత స్థితితో కూడిన భారతమనే లేఖ్యమైన ఆమ్నాయాన్ని రచించాడు' అని తిక్కనగారు వ్యాసభగవానుణ్ణి తమ విరాటపర్వ అవతారికలో కీర్తించారు. ఈ కీర్తించడంలో వ్యాసుని విశిష్టతను గూర్చి ఆయన చెప్పిన మిగిలిన అంశాలకన్నా భారతంలో వేదవ్యాసుడు ధర్మాద్వైతస్థితిని సమకూర్చాడు అన్న అంశం పెద్దల్లో చాలామందిని బాగా ఆకర్షించింది. ధర్మాద్వైత స్థితి అంటే ఏమిటి అని పెద్దలు అనేకులు తమలో తాము నాటినుంచి

1. ఆం॥ మ, భా॥ విరాట -1-8

నేటివరకూ తర్కించుకొంటూనే ఉన్నారు. వారిలో కొందరు మాత్రం ధర్మాద్వైత స్థితి అంటే 'ఇదీ' అని వివరించినవారు ఉన్నారు. వారి వివరణలు వ్యాసుని సందేశాన్ని, వ్యాసుని గూర్చిన తిక్కనగారి సందర్శనాన్ని ఎంతవరకూ పట్టిఇచ్చాయో పరిశీలించి ముందుకు సాగడం ఉచితం.

భారతంయొక్క అంతరాత్మ ధర్మాద్వైతమని తిక్కన దర్శించాడని కీ. శే. పింగళి లక్ష్మీకాంతంగారు చెప్పారు.2 యథార్థ విషయాన్ని సూచించిన లక్ష్మీకాంతంగారు తాము వివరించ గల సామర్థ్యాన్ని కలిగిఉండికూడా ఎందుచేతనో ధర్మాద్వైతస్థితిని గురించి ప్రత్యేకించి వివరించలేదు. ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు భారతం సర్వధర్మాలకూ సమాన ప్రతిపత్తిని చెప్పుతున్నదనీ, ధర్మబోధ ప్రధానంగా గల ఇతిహాసం అవడంచేత, దీన్ని తిక్కన ధర్మాద్వైతస్థితిగల గ్రంథంగా కీర్తించి ఉండవచ్చుననీ, తిక్కన జీవితంలో కూడా ధర్మాద్వైతస్థితి ప్రతిఫలిస్తున్నదనీ తమ వ్యాసంలో భావించారు.3 పై ఇద్దరుపెద్దలూ తమ అభిప్రాయాలు ప్రకటించిన తర్వాత ధర్మాద్వైతస్థితిని గురించి పండితలోకంలో మరింత వివేచనా, విమర్శా, సమన్వయం కొనసాగాయి. ఇటువంటి విమర్శలు కావించినవారిలో ప్రధానులు ముగ్గురు కానవస్తున్నారు. వారు డాక్టర్ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రిగారు, డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యగారు, బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠ శాస్త్రిగారు. వారివారి విమర్శలు వెలువడిన కాలాన్నిబట్టి ఈ వరుస ఏర్పడింది. విమర్శతీరునుబట్టి డాక్టర్ రామకోటి శాస్త్రిగారిదీ, బ్రహ్మశ్రీ నీలకంఠశాస్త్రిగారిదీ ఒక కోవకు చెందినవి. వారి వాదాల సారాంశం కూడా దాదాపుగా ఒక్కటే.

2. ఆంధ్రసాహిత్యచరిత్ర - పుటలు 40,41.
3. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - సంపుటి 49; సంచికలు 5, 6.

డాక్టర్ రామకృష్ణమాచార్యులవారిది వేరొకతీరు. వారివాదం వీరిద్దరి వాదంకన్నా భిన్నంగా ఉంది.

డాక్టర్ రామకోటిశాస్త్రిగారు భారతాన్నే కాక, శంకర భాష్యాన్ని, తత్త్వగ్రంథాల్ని సమ్యగధ్యయనం చేసి ధర్మాద్వైత స్థితి విషయంలో విపులమైన విమర్శ కావించి సిద్ధాంతప్రతిపాదన చేశారు. వీరి బుద్ధినైశిత్యం, శాస్త్రపాండిత్యం, విమర్శనపాటవం అసాధారణమైనవి. బ్రహ్మశ్రీ నీలకంఠశాస్త్రిగారిది వేదవేదాంగాల్లోనూ, ధర్మశాస్త్రాది బహుశాస్త్రాల్లోనూ పరంగతమైన పాండిత్యం. వీరు ధర్మాద్వైతస్థితిని వివరించిన తీరులో కూడా పాండిత్యం, శాస్త్ర మర్యాదలూ మొదలైనవన్నీ రామకోటిశాస్త్రిగారి రచనలో మాదిరిగానే ప్రస్ఫుటం అవుతున్నాయి. డాక్టర్ నండూరి రామ కృష్ణమాచార్యులవారు అపారమైన మేధాసంపత్తి, అలౌకికం అయిన ప్రతిభావిశేషమూ కలిగిన గొప్ప విద్వాంసులు. ఈ ముగ్గురుపెద్దల సిద్ధాంతాల తీరుతెన్నుల్ని సంగ్రహంగా క్రింద పొందుపరుస్తున్నాను.*

## 1. రామకోటిశాస్త్రిగారి ప్రతిపాదన :

ధర్మాద్వైతాలంటే కర్మజ్ఞానాలు. ధర్మం అంటే కర్మ. అద్వైతం అంటే జ్ఞానం. ధర్మాద్వైత స్థితి అంటే కర్మజ్ఞానాల యొక్క కలిమి. గీతలో కృష్ణుడు "లోకేఽస్మిన్ ద్వివిధానిష్ఠా..." అనే శ్లోకంలో కర్మజ్ఞానాలందలి నిష్ఠనే తాను ఏర్పరచానని చెప్పాడు. వేదంకూడా పూర్వోత్తర కర్మజ్ఞానాలతో కూడుకొని ఉంది. కర్మ జ్ఞానాలను ప్రతిపాదించింది కాబట్టే భారతం పంచమవేదం అయ్యింది.

* ఈ ముగ్గురు పెద్దల ప్రతిపాదనల పూర్తిపాఠాలు అనుబంధం I గా ఇవ్వబడ్డాయి.

**2. నీలకంఠశాస్త్రిగారి ప్రతిపాదన :**

ధర్మాద్వైతస్థితి అనే సమస్తపదంలో ధర్మ+అద్వైత+స్థితి అనే మూడుపదాలున్నాయి. ధర్మం అంటే వేదవిహితకర్మం. అద్వైతం అంటే భేదరహితజ్ఞానం. ధర్మాద్వైతస్థితి అంటే వేదంలోని కర్మకాండచే తెల్పబడిన ధర్మస్థితితోనూ, జ్ఞానకాండ (ఉపనిషత్తుల) చే ప్రతిపాదింపబడిన జ్ఞానస్థితితోనూ వ్యాసభగవానుడు భారతాన్ని రచించాడు.

**3. నండూరివారి ప్రతిపాదన :**

రెండు ధర్మాలు విప్రతిపన్నాలు అయినప్పుడు అందులో ఏది పరమధర్మమో దాన్నే అనుసరించాలి. అప్పుడు రెండవధర్మానికి ఉపహతి కలిగినా ఆచరించింది ధర్మమే అవుతుంది. ఈవిధంగా స్వార్థాన్ని కుటుంబంకోసం, కుటుంబాన్ని దేశంకోసం, దేశాన్ని విశ్వమానవశ్రేయస్సు కోసం త్యజించాలి. ధర్మానికీ, అధర్మానికీ వైరుధ్యం ఏర్పడినప్పుడు ధర్మాన్నే స్వీకరించాలి. అది సులభ పరిష్కారమే. రెండూ అధర్మాలే అయినప్పుడు రెండూ విడిచిపెట్ట దగినవే. ఇక రెండూ ధర్మాలే అయినప్పుడూ, ఆ రెంటికీ సంఘర్షణ ఏర్పడినప్పుడూ కర్తవ్యం ఏమిటి అనేదే ప్రశ్న. విప్రతిపన్న ధర్మాలకూ, ధర్మవికల్పాలకూ సమన్వయాన్ని కల్పించి పరమధర్మాన్ని నిర్వచించే ధర్మాద్వైత తత్త్వాన్ని నిరూపించే పంచమవేదమే మహాభారతం.

ఆలోచనలను రేకెత్తించే ఈమహామహుల ప్రతిపాదనలను చదివిన తరువాత ఈవ్యాసకర్తకు కొన్ని సందేహాలూ, కొన్ని సమాధానాలూ, కొన్ని సమన్వయాలూ ఏర్పడ్డాయి. గురుకటాక్షం వల్ల ఈవ్యాసకర్త పొందిన పరిజ్ఞానం మేరకు ఈవ్యాసంలో విషయ వివేచనం జరిగింది.

శ్రీ శాస్త్రిగార్ల యొక్క వాదాలవల్ల ఏర్పడ్డ సందేహాలు ఇవి:

1. వేదం కర్మకాండమనీ, జ్ఞానకాండమనీ వ్యవహరింపబడు తున్నమాట సత్యమే. కానీ సూక్ష్మంగా పరిశీలించినప్పుడు ఈ రెండు రకాల విభాగాలూ, వాటిపేర్లూ సౌకర్యంకోసం ఏర్పడినవేగానీ వేదతత్త్వాన్నిబట్టి ఏర్పడినవి కావనిపిస్తుంది. వేదకర్మలను నిష్ఠతో ఆచరించినప్పుడు అనుభవానికి వచ్చే అద్వైతస్థితేగదా జ్ఞానకాండమని చెప్పబడేదానిలో వివరించబడింది! ఒకటి ఆచరణా, రెండవది అనుభవం. ఆచరణా, అనుభవమూ ఒకదానికన్నా ఒకటి వేరు ఎలా అవుతాయి? కాబట్టి కర్మకాండ, జ్ఞానకాండ అన్నవిభాగం కేవలం వేదాన్ని అధ్యయనం చేసేవారు తమసౌకర్యంకోసం పెట్టుకొన్న పేర్లే అని తెలుస్తుంది. మనవాళ్ళు తత్త్వంతో సంబంధం లేకుండా ఇలాంటిపేర్లు చాలా పెడుతూ ఉంటారు. ఉదాహరణకి రుద్రాధ్యాయంలో ప్రతిమంత్రానికీ చివర 'నమో నమో' అని వస్తూ ఉండటం వల్ల దానికి 'నమకం' అని పేరుపెట్టారు. అలాగే మంత్రాలకు చివర 'చమే చమే' అని వచ్చే అధ్యాయానికి 'చమకం' అని పేరుపెట్టారు. సౌకర్యంకోసం పెట్టుకున్న ఈ నమక చమకాలనే పేర్లకీ, ఆయా అధ్యాయాల్లోని తత్త్వాలకీ సంబంధం ఏమీ లేదు. అలాగే వేదంలో కర్మలను వివరించే భాగానికి కర్మకాండమనీ, అద్వితీయానుభూతిని గూర్చి వివరించేభాగానికి జ్ఞానకాండమనీ పూర్వులెవ్వరో పేర్లుపెట్టి ఉంటారు అని మనం గ్రహించవలసి ఉంటుంది.

ఇక వేదంలోని కర్మకాండ, జ్ఞానకాండలకూ భారతంలో వివరించబడ్డ కర్మజ్ఞానాలకూ ముడిపెట్టడం కుదరదు. వేదానికీ భారతానికీ సారంలో సామ్యం ఉందిగానీ స్వరూపంలో సామ్యంలేదు. వేదవిహితకర్మలకూ, భారతంలోని కర్మలకూ పేరులో మాత్రమే సామ్యంఉంది. వేదంలోని కర్మ యజ్ఞయాగాది రూపంలో ఉండగా, భారతంలోని కర్మ మానవులనుండి ప్రవర్తించేదిగా ఉంది. కాబట్టి వేదసారాన్ని మానవజీవితగాథలతో మెదిపి అందించడానికి సంకల్పించ

బడ్డ భారతంలో వేదంలో ఉన్న స్వరూపంలాంటి స్వరూపం ఉండటం సాధ్యంకాదు. వేదంయొక్క ప్రణాళిక వేరు; ఆ వేద సారాన్ని అనుభవాత్మకంగా ఉపబృంహణంచేసి బోధించడానికి రూపుకట్టుకున్న భారతంయొక్క ప్రణాళిక వేరు. వేదంలోనూ, భారతంలోనూ ఉన్న ఆంతరమైన తత్త్వం ఒక్కటే. బాహిరమైన రూపురేకల్లో రెంటికీ పోలిక తక్కువ. కాబట్టి వేదం కర్మకాండా, జ్ఞానకాండా అని రెండుభాగాలనీ, అవే కర్మజ్ఞానాలుగా భారతంలోకి దిగివచ్చాయనీ చెప్పడానికి అవకాశం కనబడటంలేదు. అయితే శ్రీకృష్ణుడు

"లోకేఽస్మిన్ ద్వివిధానిష్ఠా పురాప్రోక్తా మయాఽనఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్"4

అని లోకంలో కర్మనిష్ఠనీ, జ్ఞాననిష్ఠనీ వేరువేరుగా తానే ఏర్పాటుచేసినట్లుగా చెప్పాడుగదా అనవచ్చు. నిజమే - చెప్పాడు. కానీ అదే కృష్ణుడు అర్జునుణ్ణి మరికొంతదూరం తీసుకువెళ్ళి

"యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి"5

అని సాంఖ్యయోగాలను ఒక్కటిగా చూసినవాడే నిజమైన చూపు కలవాడనీ సాంఖ్యయోగాలను వేరుగాచూసినవాళ్ళు పిల్లకాయలనీ, పండితులు అలాచూడరనీ నొక్కిచెప్పాడు.6 నిజానికి అనుభవంలో కర్మ వేరుగా జ్ఞానం వేరుగా ఉండదు. కర్మవల్ల జ్ఞానం వస్తుంది. వచ్చిన జ్ఞానంవల్ల అనుష్ఠించే కర్మ మరికొంత దారిన బడుతుంది. కర్మజ్ఞానాల్ని వేరుగా విడదీసి చూడటం అధ్యయనంలో సాధ్యపడుతుందేమో కానీ ఆచరణలో సాధ్యపడదు. భారతం జ్ఞానయుక్తమైన కర్మనిర్వహణలో మానవుడికి శిక్షణను ఇస్తోందిగాని,

4. భగవద్గీత - 3-3
5. భగవద్గీత - 5-5
6. 'సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి నపండితాః' - భగవద్గీత - 5-4.

కర్మస్థితినీ జ్ఞానస్థితినీ వేరుగా ఎక్కడా బోధించడంలేదు. కర్మాచరణలో మోహితుడైన అర్జునుణ్ణి ఆస్థితినుంచి మేలుకొలిపి జ్ఞానం ఇచ్చి జ్ఞానయుక్తమైన కర్మాచరణకు సిద్ధపరిచాడు కృష్ణుడు. కర్తవ్య కర్మకు భయపడినవాడు అర్జునుడు. అతడికి కృష్ణుడు ఉపదేశించింది జ్ఞానం. దానికి ఫలితంగా చేయించింది కర్మ అయిన యుద్ధం. కాబట్టి వేదంగానీ మహాభారతంగానీ కర్మస్థితినీ, జ్ఞానస్థితినీ రెండుగా విడదీసి వివరిస్తున్నాయి అనడం సమంజసంకాదు.

2. ధర్మం అంటే వేదవిహితకర్మ అన్న అర్థమున్నమాట నిజమే. కాని ఆ వేదవిహితకర్మలు పరమధర్మాన్ని ఉద్దేశించి కాక స్వార్థదృష్టితో ఆచరించినపుడు అధర్మాలు అవుతున్నాయని కృష్ణుడు నొక్కిచెప్పాడు. "లోకంలో వేదవాదులమని గర్వపడే వారు కొందరు కర్మ దాని ఫలితమూ తప్ప, ఆపైన ఏదీలేదు అంటున్నారు. ఆఫలితానికి స్వర్గం అని పేరుపెట్టి దానిపై కోరికతో వేదకర్మలను నిర్వర్తిస్తున్నారు. ఈవిధంగా స్వర్గాలపైన కోరికతో కర్మల్ని ఆచరిస్తున్నప్పుడు వ్యక్తిప్రజ్ఞ (ఇంద్రియాల్లోకి చెదిరిపోయి) బహుత్వాన్ని పొందుతోంది. ఇక అతనికి బుద్ధి, సమాధి అందేవి కావు" అన్నది కృష్ణుని ఉద్ఘాటన. 7 సృష్టిధర్మాన్ని దృష్టిలో పెట్టుకుని వేదాల్లోని కర్మలకు రూపుదిద్దారు ఋషులు. ఆ కర్మల్ని ఆచరించడంద్వారా మానవుడు సృష్టిధర్మంతో శ్రుతికలిపి ముక్తుడై

---

7. యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥
కామాత్మానః స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్ ।
క్రియావిశేష బహులాం భోగైశ్వర్య గతిం ప్రతి॥
భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృత చేతసామ్।
వ్యవసాయాత్మికాబుద్ధి స్సమాధౌ న విధీయతే ॥

భగవద్గీత - 2-42, 43,44

జీవించగలడన్నది వారి దర్శనం. ఆ కర్మలను స్వార్థదృష్టితో ఆచరించినప్పుడు అది ఋషులమార్గం కాదుకాబట్టి అధర్మం అవుతుంది. ఒకకర్మ ధర్మమా, అధర్మమా అన్నది కేవలం ఆ కర్మపైన ఆధారపడి ఉండదు. కర్మచేస్తున్నవ్యక్తియొక్క సంకల్పంమీద ఆధారపడి ఉంటుంది. తోడివ్యక్తితో ప్రేమగా మాట్లాడుతున్నవాణ్ణి చూసి వాడు ధర్మాన్ని ఆచరిస్తున్నాడు అని చెప్పలేం. వాడు ప్రేమతో మాట్లాడితే ఆ మాట్లాడటం ధర్మం. తనప్రయోజనంకోసం అవతలి వ్యక్తిని వశపరచుకోవడానికి అలా మాట్లాడితే అది అధర్మం. అలాగే మద్యాన్ని రోగనివారణకు వాడితే ధర్మం. అలాకాక కోరికతో పుచ్చుకొని వ్యసనపరుడై పశువులా ప్రవర్తిస్తే అధర్మం. అలాగే వేదకర్మ ధర్మమా, కాదా అన్నది నిర్వర్తిస్తున్నవారి సంకల్పంమీద ఆధారపడి ఉంటుంది. వారు ఆకర్మను పరమధర్మాన్ని ఉద్దేశించి ఆచరిస్తే అది ధర్మం. ఫలితాలపై కోరికతో ఆచరిస్తే అది అధర్మం. ఈసత్యం మరికొంత సూక్ష్మంగా ఆలోచించిన వారికి తప్పక బోధపడుతుంది. కాబట్టి ధర్మం అంటే వేద విహితకర్మ మాత్రమే అని చెప్పడానికి కుదరదు. ఒకవేళ ధర్మం అంటే వేదంలోని యజ్ఞయాగాది రూపం అయిన కర్మే అనుకొన్నప్పటికీ అది భారతానికి ఎలా నప్పుతుంది? భారతంలో యజ్ఞయాగాది కర్మల గురించి తక్కువా, మానవులనుంచి వర్తించే కర్మల గురించి ఎక్కువా ఉంది.

8. పోనీ కేతవరపువారు చెప్పినట్లు మానవులనుంచి వర్తిస్తున్న కర్మ ధర్మం అందామా? అదీ పొసగదు. నిజానికి కర్మ అంటే సృష్టికర్మ. మనం చేస్తున్న కర్మలన్నీ ఆ సృష్టికర్మలోని భాగాలే. ఈ సృష్టికర్మ బ్రహ్మనుంచి ఉద్భవిస్తోంది.8 ఇక ధర్మాలు అనేవి సకల

8. 'కర్మబ్రహ్మోద్భవం విద్ధి' - భగవద్గీత - 3-15

సృష్టికర్మలూ పుట్టకముందుకూడా ఉన్నాయి.9 అవన్నీ ఒకధర్మం నుంచి పుడుతున్నాయి. దాన్నే అవ్యయం లేక అక్షరం లేక ప్రణవం అని శాస్త్రం చెబుతోంది. సృజనకర్మకు కారకుడైన బ్రహ్మ ఈ అక్షరంనుంచే వ్యక్తం అవుతాడు10. దేవతలు ప్రకృతిలో మొట్ట మొదటగా సృష్టికర్మను ఆరంభించేనాటికే ధర్మాలు ఉంటాయి. అవి వారికొరకు ఏర్పరచబడ్డ మార్గదర్శక సూత్రాలు. ఆ సూత్రాలకు అనుగుణంగానే దేవతల సృష్టినిర్మాణం జరుగుతుంది.

సముద్రపునీరు ఉప్పగా ఉంటుంది. ఆ సముద్రపు నీటిచుక్క మన నాలుకపై పడ్డప్పుడు ఈ విషయం మనకు అనుభవంలోకి వస్తుంది. మన అనుభవంలోకి రాకపూర్వం కూడా సముద్రపునీరు ఉప్పగానే ఉంది. అసలు సముద్రం పుట్టనప్పుడు కూడా ఉప్పదనం అనే ఒక రుచివిశేషం విశ్వంలో ఉండనే ఉంది. ఉప్పదనమనే ధర్మం సముద్రజలంలో నిక్షిప్తమై మన నాలుకపై పడ్డప్పుడు అనుభవానికి వస్తున్నది. అలాగే సకల సృష్టిధర్మాలూ సృష్టికన్నా, సృష్టికర్త అయిన బ్రహ్మకన్నా ముందే శాశ్వతధర్మంలో ఉంటాయి.

ఇక కర్మ అనేది శాశ్వతధర్మాన్ని ఆధారంచేసుకొని సృష్టియొక్క ప్రారంభంతోనే కలిసి పుడుతోంది. అంటే ధర్మం సూత్రం, కర్మ నిర్మాణం.ధర్మం ప్రచోదకం, కర్మ ప్రచోదితం.ధర్మం ఆంతరం,కర్మ బాహిరం. ధర్మం శాశ్వతమైనది. అది అభివ్యక్తం అయినప్పుడు మాత్రమే కర్మకు అస్తిత్వం ఏర్పడుతోంది. కాబట్టి శాశ్వతమైన ధర్మానికి తాత్కాలికమైన కర్మనే అర్థంగా పొసగించడం సమంజసం కాదు. కర్మకు ఉండటం, లేకపోవడం ఉంటుంది. కాని ధర్మానికి లేకపోవడం అనేది ఉండదు. వాస్తవానికి ధర్మం అంటే కర్మకాదన్న

---

9. 'తాని ధర్మాణి ప్రథమాన్యాసన్' - పురుషసూక్తం.

10. 'బ్రహ్మాక్షర సముద్భవమ్' - భగవద్గీత - 3-15

సత్యం కేతవరపువారి మనస్సులో మెదలుతూనేఉంది. భీష్మపర్వానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో వారు ధర్మాన్ని సంప్రదాయబద్ధంగా విశ్లేషించి వివరించే ప్రయత్నం చేశారు.*

4. ఇక అద్వైతం అనగా జ్ఞానం అనడం కూడా కుదరదు. కర్మజ్ఞానాలను జీవితంలో సమన్వయించుకొన్నప్పుడు మానవుడు పొందే ఆనందమయస్థితేగదా అద్వైతస్థితి ! కర్మజ్ఞానాల కలయికకు ఫలితం

---

* "సమాజమునకు ధర్మము కవచము. ఆకవచమును రక్షించినచో అది మనను రక్షించును. ధర్మరక్షణభారము నెందరు ఋషులు వహించిరో చెప్పలేము.

........................................................................

ధర్మమనగానేమి ? ఏమి చెప్పిన ధర్మము చెప్పినట్లగును ? ప్రజకు ముందు ధైర్యము కావలయును. ఓర్పుకావలయును. వారు ఏరూపముగానూ దొంగతనమునందు ప్రవర్తింపరాదు. సమాజము రోగములతో తీసికొనరాదు. ఇంద్రియ నిగ్రహము నలవాటుచేయవలయును. విషయవిచారణ చేయు బుద్ధి పాటవము ముఖ్యము. సత్యమునకు దూరమై సమాజము పోకూడదు. సమాజమిట్లు సంపూర్ణముగా వికసించి యుండుటను ప్రబోధించినచో ధర్మమును ప్రబోధించినట్లు. మరియు హింసాప్రవృత్తి ప్రజల కలవాటు కారాదు. క్రోధము మంచిదికాదు. దయాదాక్షిణ్యములు మానవత్వ లక్షణములు. అవి శ్రద్ధముగా కాపాడుకోవలసినవి. శమదమాదు లెంత ముఖ్యమో కుటిల ప్రవృత్తి లేకపోవుట అంతకంటె ముఖ్యము. ఆయా విషయములను ప్రబోధించినచో ధర్మప్రబోధము జరిగినట్లు. ఇంతమాత్రముతో సరిపోదు. ఇందుకు విరుద్ధమైన అధర్మప్రవృత్తిని నిర్ద్వంద్వముగా ఖండించివేయవలయును. అదియును ధర్మప్రబోధములోని భాగమే. ఇంతకును ఈధర్మ ప్రబోధమెందుకు ? ఎందుకనగా లోకప్రవృత్తి సక్రమముగా నుండుటకు.

...... ......"

— భీష్మ పర్వము - ఉపోద్ఘాతము
పుటలు 3, 4
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ

అయిన అద్వైతస్థితికి జ్ఞానం అనే అర్థం చెప్పడం పొసగదు. మానవుడు గుడ్డు బద్దలుకొట్టుకొని కర్మజ్ఞానాలనే రెండు రెక్కలతో పైకి లేచిన ఒకపక్షివంటివాడు. అందులో ఏ రెక్కా పక్షి కాదు. తాను రెక్కల కన్నా వేరుగా ఉన్నాననీ, ఆ రెక్కలు తనవేననీ గ్రహించిన అనుభూతే అద్వైతానుభూతి. ఈ స్థితినే వ్యాసుడూ, కృష్ణుడూ ప్రతిపాదించింది. కర్మజ్ఞానాలు తన రెక్కలనీ11 తాను వేదాత్మకుడైన సుపర్ణుడనీ దర్శించినవానికి ఈ స్థితి అనుభూతం అవుతుంది. కాబట్టి అద్వైతం అంటే కర్మజ్ఞానాలలోని జ్ఞానం అనడం కుదరదు.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అన్న తైత్తిరీయ ఉపనిషత్తులోని మంత్రంలో జ్ఞానం పరబ్రహ్మకు పర్యాయపదంగా వాడబడినమాట నిజమే. కాని ఈ సందర్భంలోని జ్ఞానానికీ, కర్మజ్ఞానాలలోని జ్ఞానానికీ చాలా అంతరం ఉంది. కర్మజ్ఞానాలలోని జ్ఞానం కర్మలను నిర్వహించడానికి ఆవశ్యకమైన జ్ఞానం. ఆ జ్ఞానంతో కర్మల్ని ఆచరిస్తే అనుభవానికి వచ్చేదే తైత్తిరీయ ఉపనిషత్తులోని పరబ్రహ్మం. ఆ మంత్రంలోని బ్రహ్మము ఎలా (చతుర్ముఖ) బ్రహ్మ కాదో, అలాగే ఆ మంత్రంలోని జ్ఞానం కర్మజ్ఞానాలలోని జ్ఞానం కాదు. ఈ సత్యం కేతవరపువారు ఎరుగనిది కాదు.*

11. పులస్త్యస్మృతికూడా మనిషిని పక్షితోనూ, కర్మజ్ఞానాలను రెక్కలతోనూ పోల్చింది.

"జ్ఞానం ప్రధానం నతు కర్మహీనం కర్మప్రధానం నతుబుద్ధిహీనమ్ ।
తస్మాదుభాభ్యాం తు భవేత్ప్రసిద్ధిః నహ్యేకపక్షో విహగః ప్రయాతి॥"-

సూక్తిముక్తావళినుంచి ఉద్ధృతం-
సంకలనకర్త: శ్రీమహీధర జగన్మోహనరావు.

* అకాడమీవారి భీష్మపర్వ అవతారికలో కర్మ, జ్ఞాన, మోక్షాలను సంప్రదాయబద్ధంగా ఇలా వివరిస్తున్నారు :

"........దుఃఖనివృత్తి జ్ఞానమువల్ల కలుగును. జ్ఞానము చిత్తశుద్ధిద్వారా కలుగును. చిత్తశుద్ధి కర్మయోగమువల్ల కలుగును. దుఃఖనివృత్తియే మోక్షము." పుట xii

5. ధర్మాద్వైతాలు అంటే కర్మజ్ఞానాలు అన్న అభిప్రాయం తిక్కనగారికి ఉండిఉంటే ఆయన సూటిగా కర్మజ్ఞానపదాలనే ఉపయోగించి ఉండేవాడు. కర్మకు మారుగా ధర్మాన్నీ, జ్ఞానానికి ప్రత్యామ్నాయంగా అద్వైతాన్నీ వాడి అనావశ్యకం అయిన మెలికలు పెట్టి, విషయాన్ని క్లిష్టంచేసి చదువరులను కష్టపెట్టవలసిన ఆవశ్యకత కాన రావడంలేదు. నిజంగా కర్మజ్ఞానాలకు పర్యాయపదాలుగానే ధర్మాద్వైతాలను ఆయనవాడిఉంటే శాంతిత్రయంలో కర్మజ్ఞానాల ప్రసక్తి వచ్చినప్పుడు ఈ పదాలను తప్పక వాడి ఉండేవాడు. భారతగ్రంథం మొత్తంమీద కర్మకు పర్యాయపదంగా ధర్మం, జ్ఞానానికి పర్యాయపదంగా అద్వైతం వాడబడకపోవడం మనం గమనించవలసిఉంది.

6. భారతంలో కర్మజ్ఞానాల ప్రసక్తి ఉందిగానీ, కర్మజ్ఞానాలకు వేరువేరుగా అస్తిత్వంమాత్రం లేదు. కర్మజ్ఞానాలకు సమన్వయాన్నీ ఏకత్వఅనుభవాన్నీ అందిస్తుంది భారతం. అలాగే ప్రవృత్తి నివృత్తి మార్గాలకూ, ఇహపరాలకూ భోగమోక్షాలకూ సమన్వయస్థితినీ, అద్వితీయ దర్శనాన్నీ అనుగ్రహిస్తుంది భారతం. కాబట్టి ప్రత్యేకంగా కర్మజ్ఞానాలనే దృష్టిలోపెట్టుకుని భారతాన్ని వ్రాశాడనడం పొసగదు. భారతం మానవుడి కొరకు వ్రాశాడు వ్యాసుడు. మానవుడికి సంబంధించిన అన్ని అంశాలకూ—పెద్దా చిన్నా భేదంలేకుండా—ఇందులో చోటుఉంది. ఆ అంశాల్లో కర్మజ్ఞానాల స్వరూపాన్ని వివరించి వాటి ఏకత్వాన్ని దర్శింపచేయడం కూడా ఒకటి.

భారతాన్ని తొలిసారిగా జనమేజయుడికి వినిపించిన వైశంపాయనుడూ, దాన్ని తెలుగులోనికి అవతరింపచేయడంలో ప్రధాన పాత్రవహించిన తిక్కనగారూ భారతంలో పురుషార్థాలైన ధర్మార్థ కామమోక్షాలకు సంబంధించిన సమగ్రదర్శనం ఉందీ అని అంటున్నారు. కాబట్టి తిక్కనగారు చెప్పిన ధర్మాద్వైతస్థితికూడా ఆ పురుషార్థాలకు సంబంధించినదే అయిఉండాలి.

**నండూరివారి ప్రతిపాదనను గూర్చి :**

**నండూరివారి** వివరణ 'వేదములకూ అఖిలస్మృతివాదము లకూ' అన్న తిక్కనగారి పద్యాన్ని ఆధారంగా చేసుకొని సాగింది. దానికి పై పద్యంలో "భారతంలో ధర్మాద్వైతస్థితిని సమకూర్చాడు వ్యాసుడు" అని తిక్కనగారు చెప్పారు. మహాభారతం ధర్మాద్వైత స్థితితో ప్రకాశిస్తూ ఉండటంవల్ల ధర్మార్థకామమోక్షాల విషయంలో వాదైన-చోటులకు నిష్కర్ష లభిస్తూందని తిక్కనగారి అభిప్రాయం. ఇది ధర్మాద్వైతస్థితితో భారతం వెలుగొందుతూ ఉండటంవల్ల మానవుడికి సిద్ధించే ప్రయోజనం. ఈ ప్రయోజనాన్నే ధర్మాద్వైత స్థితిగా చెప్పడం సముచితమైన సమాధానం కానేరదు.

విప్రతిపన్న ధర్మాలను సమన్వయించి పరమధర్మం బోధిస్తు న్నది మహాభారతం. రెండు ధర్మాలకు ఘర్షణ ఏర్పడినప్పుడు దానిలో ఏది పరమధర్మమో నిర్ణయిస్తోంది మహాభారతం అన్నారు వీరు. కొంచెం సూక్ష్మంగా చూస్తూ ముందుకుసాగిత్తే, మరికొంత వెలుగూ, క్రొత్తవెలుగూ ఏర్పడతాయి. రెండు ధర్మాలకుమధ్య సంఘర్షణ ఏర్పడినప్పుడు లోకశ్రేయస్సును దృష్టిలోపెట్టుకుని ఒక ధర్మాన్ని స్వీకరించి రెండవధర్మాన్ని కాదనడం పొసగనిపని. ఇలా తిరస్కరిస్తూపోతే చివరకు ఒకేధర్మం పరమధర్మంగా నిలిచి మిగిలినవి అన్నీ కొట్టివేయబడతాయి. భారతంలో అలాకాక అన్నిధర్మాలూ దేశకాలపాత్రాలనూ సంఘటనలలోని ఔచిత్యాన్నీ అనుసరించి ఆచరణీయాలై పరమధర్మంతో అద్వైతస్థితిని పొందుతున్నాయి.

సాధకుడు ప్రాథమికావస్థలో ఉన్నప్పుడు మాత్రమే అతడికి క్రొత్తగా గోచరమైన ధర్మం పాతధర్మాన్ని కొట్టివేస్తుంది (విజ్ఞానశాస్త్రంలో నేడు కనిపెట్టిన సిద్ధాంతం నిన్నటిదాన్ని కాదంటే నేటిదాన్నే స్వీకరిస్తున్నట్లు). కాని సాధకుడు ఆస్థితిని

దాటినతర్వాత క్రొత్తగా దర్శనం ఇచ్చిన ధర్మాలూ, సిద్ధాంతాలూ పాతధర్మాలను కొట్టివేయవు. వాటిపై క్రొత్తవెలుగును ప్రసరింప చేస్తాయి. అప్పుడు సమన్వయం ఏర్పడి ధర్మాద్వైతస్థితి అబ్బుతుంది. జీవితంలో అన్ని ధర్మాలకూ స్థానం ఉంటుంది. వాటియొక్క పరస్పర సంఘర్షణకు మాత్రం తావుఉండదు. ఈస్థితినే భారతం ప్రతిపాదిస్తోంది. బ్రహ్మచర్యమే జీవితధ్యేయంగా భావించి అనుష్ఠిస్తున్న జరత్కారుడికి చెట్టుకు వ్రేలాడుతున్న పితృదేవతలు కనబడి మొరపెట్టుకోవడంతో అతడి మనస్సుపై క్రొత్తవెలుగు ప్రసరించింది. అతడు గృహస్థాశ్రమస్వీకారానికి అంగీకరించాడు. అంటే బ్రహ్మచర్యం తప్పనిగాని, గృహస్థాశ్రమం మంచిదనిగాని అతడికి అనిపించలేదు. జీవితంలో బ్రహ్మచర్య గృహస్థాశ్రమాలకు గల స్థానం అతడికి బోధపడింది. ఇక్కడ ఒకధర్మం మరొకధర్మాన్ని కొట్టివేయడంలేదు. క్రొత్తవెలుగును ప్రసరింపచేస్తోంది. ఆ వెలుగులో రెండుధర్మాలూ పరమధర్మంతో అద్వైతస్థితిని అనుభవిస్తున్నాయి. భారతం ప్రతిపాదిస్తున్న ధర్మాద్వైతస్థితి ఇలాంటిది. ఈ అంశం ముందు ముందు ఇంకా వివరించబడుతుంది.

మొత్తంమీద నండూరివారు తిక్కనగారి భారతావతారికను తమ మనఃపీఠంపైకి అవతరింపచేసుకుని ధర్మాద్వైతస్థితినిగూర్చి దార్శనికంగా వివరించడానికి ప్రయత్నించారు. అవతారికనువదలి పండితమార్గంలో తిక్కనగారిని వివరించడానికి ప్రయత్నించడంకన్నా అవతారికనే సూక్ష్మదృష్టితో అధ్యయనం చేస్తే తిక్కనగారు బోధపడగలరు అన్న రాచబాటను వేశారు. ఆ రాచబాటలో ఇంకా ప్రయాణం కొనసాగిస్తే తిక్కనగారి హృదయానికి చేరువ కాగల మనిపిస్తుంది.

# ధర్మాద్వైతస్థితి-
# సిద్ధాంతప్రతిపాదన

మానవుడు సృష్టిలోని భాగం. సృష్టిలోని భాగమైన మానవుడు సృష్టిక్రమంతో శ్రుతి కుదుర్చుకున్నప్పుడు అనుభవానికి వచ్చేదే అద్వితీయస్థితి. అట్టి శ్రుతిని కుదుర్చుకునేటందుకు అతడికి అందిన సాధనమే అతడి శరీరం. శరీరాన్ని ధరించిన మానవుడినుంచి వ్యక్తం అయ్యేవి ధర్మార్థకామాలు.

మానవుడినుంచి వ్యక్తం అవుతున్న ధర్మం వర్ణాశ్రమాల నిర్వహణ రూపంలో ఉంటుంది. వర్ణం అంటే అతడి స్వభావం. ఆ స్వభావంనుంచి దిగివచ్చేవి అతడి గుణకర్మలు.1 ఆశ్రమం అంటే స్థితి. మానవుడి శరీర పరిణామాన్నిబట్టి దర్శించబడ్డ స్థితులే ఆశ్రమాలు. అవే బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలు. మానవుడు తన స్వభావంనుంచి దిగివస్తున్న గుణకర్మలను తన శరీర పరిణామదశలతో తగిన రీతిలో జతపరుచుకొని ఆ స్వధర్మంతో లోకాన్ని అర్చించాలి.

1. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" — భగవద్గీత - 4-13

స్వధర్మాచరణవల్ల మానవుడికి సమకూరే ధనధాన్యాది వస్తుసంపదలే అర్థం. శరీరంతో ఉన్న మనిషికి ఆవశ్యకమైన సుఖభోగాలే కామం. అర్థకామాలను స్వధర్మనిర్వహణకు పరిపోషకాలుగా స్వీకరిస్తూ విశ్వరూపంలో ఉన్న అంతర్యామిని అర్చించసాగినప్పుడు మానవుడు అనుభవించేదే ధర్మాద్వైతస్థితి. ఈ అర్చనలో మానవుడి జీవితంలోని వివిధదశల్లో వ్యక్తం అవుతున్నట్లు కనిపిస్తున్న వర్ణాశ్రమ ధర్మరూపాలకు సృష్టికర్మంతో శ్రుతికుదిరి అద్వితీయస్థితి అనుభవానికి వస్తుంది. ఈసత్యాన్నే శ్రీకృష్ణుడు ఇలా వివరించాడు :

"యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః"॥2

జీవరాసుల స్వభావం ఎక్కడనుంచి పుడుతోందో దేనిచేత సృష్టి అంతా నిండి ఉందో, అది తనకు ప్రసాదించిన స్వభావంనుంచి దిగివస్తున్న గుణకర్మలతో దానినే అర్చించి మానవుడు సిద్ధిని పొందుతున్నాడు.

విశ్వరూపంగా వ్యక్తం అవుతున్న అంతర్యామేగదా మానవుడికి తాను మానవుణ్ణి అనే ప్రత్యేకమైన గమనికనీ, ఆ గమనికకు తగ్గ శరీరాన్నీ, దానిద్వారా వ్యక్తంఅయ్యే స్వధర్మాన్నీ, ఆ స్వధర్మాన్ని నిర్వహించగల సామర్థ్యాన్నీ ప్రసాదించింది! ఆ అంతర్యామి ప్రసాదించిన స్వధర్మంతో తోడి జీవుల రూపంలో వ్యక్తం అవుతున్న ఆ అంతర్యామినే సేవించగలిగినప్పుడు మానవుడిచే వివిధ స్థితుల్లో అనుష్ఠింపబడుతున్న సకల ధర్మాలకూ అద్వితీయస్థితి సిద్ధిస్తుంది.

ఈసత్యాన్నే వ్యాసభగవానుడు భాగవతంలో మరొకసారి గుర్తుచేస్తూ "ధర్మంబునకు భక్తి ఫలంబు, పురుషులు వర్ణాశ్రమ

2. భగవద్గీత - 18-46.

ధర్మభేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయే సిద్ధి"[3] అని నిర్ధారించి చెప్పాడు. లోకరూపంలో వ్యక్తం అవుతున్న ఏకైకమూర్తిని స్వధర్మంతో అర్చించినపుడు 'అతడు' సంతోషించి అనుగ్రహించేదే అద్వితీయస్థితి. అదే సిద్ధి అన్నది వ్యాసుడిసందేశం.

ఈధర్మాద్వైతస్థితిని అనుభవించడమే మానవ జీవితానికి పరిపూర్ణత అని తెలిసి దానిని అనుభవించగోరిన మానవుణ్ణి ఉద్దేశించి వ్యాసుడు అనుగ్రహించినదే మహాభారతం. దీనిలో ధర్మార్థకామాల స్వరూపస్వభావాలు ఉదాహరణ పూర్వకంగా ఉపదేశించబడ్డాయి. ధర్మార్థకామాల సక్రమ నిర్వహణనుంచి వ్యక్తం అయ్యే తురీయపురుషార్థమే మోక్షం లేక ధర్మాద్వైతస్థితి. కాబట్టి ధర్మార్థకామాల నిర్వహణలో లోతుపాతులు తెలుసుకొని కౌశలాన్ని సాధించకపోతే ధర్మాద్వైతస్థితి కోరికగా మాత్రమే మిగిలిపోతుంది. శ్రుతిస్మృతులు ధర్మార్థకామాలను గూర్చి సూచిస్తున్నాయి. నిర్వచిస్తున్నాయి. నదిలో ఈత నేర్చుకోవాలి అనుకొనే వాడికి ఈత అంటే ఇదీ అని చెబితే బోధపడుతుందేమోగానీ, ఈత మాత్రం రాదు. ఈత రావాలీ అంటే ఈత నేర్పేవాడు కావాలి. ధర్మార్థకామాల నిర్వహణలో అలాంటి ఆచరణాత్మకం అయిన చేయూతను ఇవ్వడం కోసమే వ్యాసుడు భారతాన్ని రచించింది. ఈ ఇతిహాసాన్ని శ్రద్ధతో చదవడం ప్రారంభించిన వ్యక్తికి ధర్మార్థకామాల నిర్వహణలో ఆ వ్యక్తి కొన్నివేల జన్మల్లోగాని పొందలేని అనుభవాన్ని వ్యాసుడు అవలీలగా అందిస్తాడు. మనస్సుపెట్టి భారతం చదువుకొన్న వ్యక్తికి జీవితంలోని సత్యం కరతలామలకం అవుతుంది.

వర్ణం అంటే ఏమిటి? అది నరుల్లో ఎలా పనిచేస్తూఉంటుంది? గుణకర్మలసాయంతో దానిని ఎలా గమనించుకోవాలి ? గమనించు

3. ఆంధ్రమహాభాగవతం - 1-66.

కొని ఎలా ఆచరించుకోవాలి ? ఆచరణలో గతితప్పితే ఎలాంటి దుస్థితులు ఎదురవుతాయి? గతితప్పకుండా కొనసాగాలంటే మార్గం ఏమిటి ? - మొదలైన అంశాలన్నీ అవగతం అవుతాయి.

అలాగే ఆశ్రమం అంటే ఏమిటి ? చతురాశ్రమాల స్వరూప స్వభావాలు ఏమిటి ? గృహస్థాశ్రమం యొక్క పవిత్రతా సార్థకతా ఏమిటి ? ముక్తులైన పెద్దలు కూడా చతురాశ్రమాల్ని ఎందుకు నిర్వహిస్తున్నారు ? ఒకవేళ ఆవశ్యకత లేనివారు నిర్వహించకపోతే దోషం అవుతుందా ? - మొదలైన అంశాలన్నీ బోధపడతాయి.

వర్ణాశ్రమ ధర్మనిర్వహణ కోసం అయిన స్వధర్మాచరణతో అర్థకామాలను ఎలా అనకలుపుకోవాలి ? అర్థకామాలను స్వధర్మానికి పరిపోషకంగా నడుపుకున్నప్పుడు ఎలాంటి దివ్యస్థితి అనుభవానికి వస్తుంది? స్వధర్మంచేత అర్థకామాలకు ఊడిగం చేయించినపుడు ఎలాంటి దుర్భరస్థితి అనుభవించవలసి వస్తుంది?- మొదలైన అంశాలు అర్థంఅవుతాయి.

దాంపత్యధర్మ స్వరూప స్వభావాలు ఏమిటి? అది ఎలాంటి పరిణామాన్ని చెంది వివాహవ్యవస్థ రూపుకట్టుకొంది ? ఆచరింపబడుతున్న వివిధవివాహాల విషయంలో గ్రహించవలసిన మెలకువలు ఏమిటి ? దాంపత్యధర్మనిర్వహణలో సూక్ష్మదృష్టిని ప్రసరింపచేసినప్పుడు దర్శనం ఇచ్చే పాతివ్రత్యంయొక్క పరిపూర్ణ స్వరూపం ఏమిటి ? సతీసహగమనం మొదలైన సంప్రదాయాలు ఎలా రూపుకట్టుకున్నాయి ? ఆ సంప్రదాయాల నిర్వహణలో మానవుడు చూపించవలసిన వివేకం ఎలాంటిది ? - మొదలైన అంశాలు అవగాహనకు వస్తాయి.

ధర్మార్థకామాల నిర్వహణలో మానవుడు చూపవలసిన కౌశలం ఎలాంటిది ? దేహంతో ఉన్న మానవుడు ఆ దేహాన్ని ఎలా

ఉపయోగించుకోవాలి? ఇంద్రియాల్లోకి చెదిరిపోయినప్పుడు మానవుడు ఎలాంటి బద్ధస్థితిని అనుభవిస్తాడు? ఇంద్రియాలనుంచి మనస్సుకూ, మనస్సునుంచి బుద్ధికీ, బుద్ధినుంచి తనలోకి తానూ చేరుకొన్నప్పుడు ఎలాంటి ముక్తస్థితి అనుభవానికి వస్తుంది? అలా తనలోకి తాను చేరేందుకు తాను తానుగా నిలబడగలిగేటందుకు మానవుడు ఎటువంటి సాధన చేయాలి? - మొదలైన అంశాలన్నీ ఉపదేశింపబడతాయి.

ముక్తస్థితిలో నిలిచిన మానవుడి కర్తవ్యం ఏమిటి అన్న ప్రశ్నకు లోకసామాన్యమైన సమాధానం ఆ స్థితి లభించడమే గమ్యం గనుక, ఆ తర్వాత ధర్మాచరణకు ప్రసక్తి లేదూ అని. కాని మహాభారతం ముక్తస్థితిలో నిలచిన వ్యక్తిమాత్రమే స్వధర్మాచరణలో మెలకువను చూపగలడనీ, తనపాత్రకు పరిపూర్ణమైన న్యాయం చేకూర్చగలడనీ చెబుతుంది. బద్ధస్థితిలో ఉన్నప్పుడు ధర్మార్థకామాల ఎడల తన సంస్కారాన్నిబట్టి మానవుడు ప్రవర్తిస్తాడు. అతడు అనుకొన్నట్లుగా ధర్మార్థకామాలనిర్వహణ జరగాలని తాపత్రయపడతాడు. ముక్తస్థితిలో నిలచిన వ్యక్తి అలాకాక, ధర్మార్థకామాల స్వరూప స్వభావాలను దర్శిస్తాడు. విశ్వరూపంలో జరుగుతున్న యజ్ఞాన్ని దర్శించి ఆ యజ్ఞం తననుంచి ప్రసారం చేస్తున్న స్వధర్మాన్ని ఆయజ్ఞానికి అనుగుణం అయిన రీతిలో మలచుకొని యజ్ఞార్థంగా నిర్వహిస్తాడు.*

---

* పరమపురుషుణ్ణి పశువుగా బంధించి, దేవతలు యజ్ఞంచేయడంవల్ల ఈసృష్టి రూపుకట్టుకుంటోందనీ, ఈసృష్టి ఆ పరమపురుషుని వ్యక్తరూపమే అనీ పురుషసూక్తం వివరిస్తోంది. దేవతలు నిర్వహించే సృష్టియజ్ఞాన్ని మరింత విపులంగా వర్ణిస్తుంది శతపథబ్రాహ్మణం.

(చూ. అనుబంధం - 4)

బద్ధస్థితిలో ఉన్నవాడు కర్మలకు అంటుకొంటాడు. ముక్తస్థితిలో ఉన్నవాడు కర్మలకు అంటుకోడు.4 బద్ధస్థితిలో ఉన్నవాడు ఫలాపేక్షతో కర్మల్ని ఆచరిస్తాడు. ముక్తస్థితిలో ఉన్నవాడు ఫలాలపై దృష్టి లేక యజ్ఞార్థంగా ఆచరిస్తాడు.5 బద్ధస్థితిలో ఉన్నవాడు సుఖదుఃఖాది ద్వంద్వాలకు లోను అవుతాడు. ముక్తస్థితిలో ఉన్నవాడు ద్వంద్వాలకు అతీతుడై సర్వత్రా సమత్వాన్ని కలిగి ఉంటాడు.6 బద్ధస్థితిలో ఉన్నవాడు కర్మాచరణలో చిక్కుకుంటాడు. ముక్తస్థితిలో ఉన్నవాడు కర్మాచరణలో కౌశలాన్ని చూపుతాడు.7

యోగి అయినవాడు ఎలా ఉండాలో వివరిస్తూ తాను ఎలా ఉంటున్నాడో ఇలా చెబుతున్నాడు కృష్ణుడు: "ఈ మూడు లోకాల్లోనూ నేను చేసితీరాలన్న పని ఏదీలేదు. ఏదైనా ఆచరించి నేను పొందగోరేది ఏదీలేదు. నేను పొందనిదీ ఏదీలేదు. అయినప్పటికీ నేను కర్మల్లో నిరంతరం వర్తిస్తూనే ఉన్నాను"8. తనస్థితిలో నిలబడి తనవలె స్వధర్మాన్ని ఆచరిస్తూ తనతో అద్వైతస్థితిని అనుభవించమన్ని కృష్ణుడి ఉపదేశం. అతడు ఇంకా ఇలా అంటున్నాడు: "తెలియనివారు ఫలితాలకోసం ఎంతపట్టుదలతో పనిచేస్తున్నారో యోగులైనవారు ఫలితాలపై ఆసక్తిని విడిచి అంతపట్టుదలతోనూ లోకశ్రేయస్సుకై పనిచేయాలి."9

---

4. "తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర" - భగవద్గీత- 3-19.
5. యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ భగవద్గీత - 5-12
6. "తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః" ॥ భగవద్గీత - 7-28
7. "........ యోగః కర్మసు కౌశలమ్ ।" భగవద్గీత - 2-50.
8. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ భగవద్గీత - 3-22
9. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్ ॥ భగవద్గీత - 3-25

బంధస్థితిలో ఉన్నవాడు స్వధర్మాన్ని తాను నిర్వహిస్తున్నానన్న అహంకారాన్ని కలిగి ఉంటాడు. యోగస్థితిలో ఉన్నవాడు కర్మలన్నీ ప్రకృతినుంచి పుట్టిన త్రిగుణాల ప్రేరేపణచే జరుగుతున్నాయనీ, ఈ గుణాలే కర్మాచరణానికి కర్తలుగాని ఈ గుణాలుగల వ్యక్తులు కారనీ గ్రహించి10, తాను చేస్తున్నానన్న అహంకారాన్ని ఆరోపించుకోకుండా తనలో వ్యక్తం అవుతున్న స్వభావాన్నీ, ఆస్వభావంనుంచి దిగివచ్చే గుణకర్మల్నీ దర్శించి యజ్ఞార్థంగా వాటి నిర్వహణ జరిగేటట్లు చూస్తాడు. ఆస్థితిలో ఉన్న వ్యక్తి వర్ణాశ్రమ ధర్మరూపమైన స్వధర్మాన్ని అనుష్ఠిస్తున్నపుడు జీవితంలోని వివిధ దశల్లో అతడినుంచి వ్యక్తం అయ్యే సకలధర్మాలకూ అంతర్యామితో అద్వైతస్థితి సిద్ధిస్తుంది. ఈస్థితిలో నిలిచేటట్లు చేసి అర్జునుడిచేత స్వధర్మాన్ని నిర్వహింపచేసేటందుకే సంగ్రామం నడుమ గీతను ఉపదేశించాడు కృష్ణుడు. కృష్ణుడి కరుణవల్ల మోహం తొలగిన అర్జునుడు ముక్తస్థితిలో నిలిచి లోకహితంగా స్వధర్మాన్ని అనుష్ఠించాడు. తాను యుద్ధం చేస్తున్నానన్న అహంకారాన్ని విడిచి తననుంచి క్షత్రియధర్మం వ్యక్తం అవుతోందనీ, అది లోకంలో జరుగుతున్న ధర్మసంస్థాపన కార్యక్రమానికి సమర్పించబడాలనీ కృష్ణుడి వెలుగులో దర్శించి సమర్పించాడు. తననుంచి ధర్మాచరణ జరుగుతుండగా తాను పరమపురుషుడితో అద్వైతస్థితిని అనుభవించాడు.

కృష్ణుడు అనుగ్రహించిన ఈ దివ్యస్థితిని సామాన్యమానవుడికి ఒంటబట్టేటట్లు చేయడానికే వేదవ్యాసుడు కృష్ణసందేశాన్ని హృదయంగాచేసి మహాభారత శరీరనిర్మాణం కావించాడు. ఈ దివ్యస్థితికే తిక్కనగారు ధర్మాద్వైతస్థితి అని పేరుపెట్టారు.

ముక్తస్థితిలో నిలిచిన మానవుడు తననుంచి వ్యక్తం అవుతున్న స్వధర్మాన్ని లోకహితంగా ఆచరిస్తాడనీ, ఆస్థితిలో అతడినుంచి

10. "గుణావర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥" - భగవద్గీత - 14-23.

వ్యక్తం అయ్యే సకలధర్మాలకూ అంతర్యామితో అద్వైతస్థితి లభిస్తుందనీ శ్రీకృష్ణ కృష్ణద్వైపాయనులు నొక్కిచెబుతున్నారు. వ్యాసుడు భారతాన్ని రచించింది ఈసత్యాన్ని బోధపరచడానికే అని దర్శించిన తిక్కనగారు, వ్యాసుడి ఉపదేశంలోని విశిష్టతను సామాన్యులకు సువ్యక్తం చెయ్యడానికి భారతోపదేశానికి ధర్మాద్వైతస్థితి అని నామకరణం చేశారు.

సాధారణంగా లోకంలో అద్వైతస్థితి అనగానే కలిగే భావం ఏమంటే, ఆస్థితిలో జీవుడు దేవుడితో ఐక్యం అవుతాడు. ఇక అక్కడ మనం ఎరుగున్న లౌకిక వ్యవహారాలకుగానీ, ధర్మాచరణాలకు గానీ తావుండదు. ఇదంతా ఇహలోకం. అద్వైతస్థితిలో జీవి అనుభవించేది ఇహలోకసంబంధి కాదు. అప్పుడు ఈ ఇహలోక కార్యక్రమాల ప్రసక్తి ఉండదూ అని. ఈవిధమైన భావనతో ఉన్న లోకం భారతం అద్వైతస్థితిని బోధిస్తోందీ అంటే తాము అనుకొన్న అద్వైతస్థితినే అనుకోవచ్చు. అదికాదనీ, భారతం బోధిస్తున్నది ధర్మాద్వైతస్థితి అనీ తిక్కనగారు స్పష్టంచేయాల్సివచ్చింది. ఈ ఉద్దేశంతోనే మహాభారతం ధర్మార్థకామాల విషయంలోనేకాక మోక్షధర్మం విషయంలోకూడా మూదల అవుతోందని తిక్కనగారు నొక్కి చెప్పారు. మోక్షం అంటే మనం కలిగించుకున్న అభిప్రాయాలనూ, ఊహించుకొంటున్న భావాలనూ భారతంయొక్క వెలుగులో సరి చూసుకొని ధర్మాద్వైతస్థితిలో మానవుడు స్థిరపడవలసి ఉంటుందని తిక్కనగారి ఉద్ఘాటన.

కృష్ణుడినుంచి ఉపదేశం పొందిన అర్జునుడు ముక్తస్థితిలో నిలిచి తననుంచి వ్యక్తం అవుతున్న సకలధర్మాల అద్వైతస్థితిని అనుభవించాడు.

యుద్ధానంతరం విరక్తుడై రాజ్యాన్ని వద్దన్న ధర్మజుణ్ణి మహర్షులూ, కృష్ణుడూ మందలించారు. కృష్ణుడు ధర్మజుణ్ణి చక్రవర్తిని చేసి భీష్ముడిబోధతో అతడు ధర్మాద్వైతస్థితిలో స్థిరపడేలాగున చూశాడు.

లోకహితనిష్ఠతో భారతాన్ని అనువదింపదలచిన తిక్కన గారికి హరిహరనాథుడు ప్రత్యక్షమై తిక్కనగారు కోరిన ప్రకారం ముక్తినిఇచ్చి ఆపైన ఆయననుంచి ధర్మాద్వైతస్థితిలో భారతరచన జరిగేటట్లు అనుగ్రహించాడు.

వ్యాసుడు ధర్మాద్వైతస్థితిలో నిలిచి ధర్మాద్వైతస్థితితో కూడిన భారతాన్ని లేఖ్యమైన ఆమ్నాయంగా రచించాడు. దాన్ని అనువదింపగోరిన తిక్కనగారికికూడా ధర్మాద్వైతస్థితి అనుగ్రహింపబడింది. భారతం మనస్సుపెట్టి చదివినవారికి వ్యాసుడు వివరించిన స్థితీ, తిక్కన పొందినస్థితీ అయిన ధర్మాద్వైతస్థితి తప్పక సిద్ధిస్తుంది.



# ధర్మం

పురుషార్థాలలో ధర్మం అంటే స్వధర్మమని అర్థం. స్వధర్మం మానవుడి స్వభావాన్ని బట్టి నిర్ణయమవుతుంది. మానవుడి స్వభావం నుంచి, అతనియొక్క గుణకర్మలు వ్యక్తమవుతూ ఉంటాయి. దానిని బట్టి అతని వర్ణం నిర్ణయమవుతుంది. ఆ వర్ణధర్మాన్ని లోకహితంగా అనుష్ఠించడమే అతడి కర్తవ్యం.

జీవిస్వభావాన్ని బట్టి వర్ణం నిర్ణయమైనట్లే వయస్సుతో మారుతున్న దేహంయొక్క స్థితులనుబట్టి నాలుగు ఆశ్రమాలు వ్యక్తిజీవితంలో చోటుచేసుకుంటున్నాయి. అవే బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస ఆశ్రమాలు. వయస్సుయొక్క స్వభావాన్ని బట్టి వ్యక్తిజీవితంలో ఈనాలుగు అవస్థలను పెద్దలు దర్శించారు మానవుడు తన వర్ణధర్మాన్ని ఈనాలుగు ఆశ్రమాలతో అనకలుపుకొని అనుష్ఠించాలి. ఈ వర్ణాశ్రమధర్మాల నిర్వహణమే స్వధర్మం. అదే పురుషార్థాలలోని ధర్మం. ఈ వర్ణాశ్రమాల స్వరూపస్వభావాల్ని వివరించి, మహాభారతం ధర్మాద్వైతస్థితిని ఎలా బోధపరుస్తున్నదీ కొంచెం వివరంగా చూద్దాం.



## III. సమన్వ్యయ ఉపసంహారం

ధర్మం

వర్ణధర్మాలు - ధర్మాద్వైతస్థితి

ఆశ్రమధర్మాలు - ధర్మాద్వైతస్థితి

అర్థకామాలు - ధర్మాద్వైతస్థితి

దాంపత్యధర్మం - ధర్మాద్వైతస్థితి

మోక్షధర్మం - ధర్మాద్వైతస్థితి

వరుడు - నాలుగు దశలు

రక్షణ - శిక్షణ

ధర్మాద్వైతమూర్తులు

# వర్ణధర్మాలు-ధర్మాద్వైతస్థితి

ఆధునికుల్లో చాలామంది, సనాతన సంప్రదాయంతో పరిచయం లేక, వర్ణం, కులం ఒక్కటేనని పొరపడుతుంటారు. ఎవరినైనా పరామర్శించేటప్పుడు 'మీది ఏ వర్ణం? ఏకులానికి చెందినవారు?' అని ప్రశ్నించడంలో వర్ణాన్ని, కులాన్ని పర్యాయపదాలుగా వాడుతూ ఉంటారు. తాము సంప్రదాయబద్ధులమని నమ్మేవారిలో కొందరు వర్ణాలు నాలుగేననీ, వృత్తులనుబట్టి ఏర్పడిన కులాలు ఎన్నయినా ఉండవచ్చుననీ వివరిస్తున్నారు. ఈ వివరణకు ఒప్పుకుని 'బావుంది, అసలీవర్ణాల విభాగం మొట్టమొదట ఎలా జరిగింది? వాటియొక్క స్వరూప స్వభావాలేమిటి?' అని ప్రశ్నిస్తే, సంప్రదాయ బద్ధులయినవారిలో అధికసంఖ్యాకు లిచ్చే సమాధానాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. బ్రహ్మ తననుంచి వేదధర్మాన్ని నిర్వహించేటందుకు బ్రాహ్మణుల్ని, ఆ ధర్మాన్ననుసరించి, రక్షించి, పోషించేటందుకు క్షత్రియుల్ని, ఆ ప్రజలకు సంపదనుత్పాదించి, వినిమయం చేయడానికి వైశ్యుల్ని, ఈ మూడు వర్ణాలవారినీ తమ కర్మాచరణంతో సేవించేటందుకు శూద్రుల్ని వేరువేరుగా సృష్టించాడని ఒక అభిప్రాయం,

దీనికి బాధకమైన ప్రశ్న ఒకటి ఉంది. బ్రహ్మ నిజంగా ఇలాగ సృష్టించి ఉంటే, వేదధర్మాన్ని ఎరగకుండా జీవిస్తున్న ఇతర జాతుల వారిని - ఉదాహరణకు, యూరపుఖండవాసులు, అమెరికా వారు, అరేబియా దేశస్థులు మొదలైనవారిని - బ్రహ్మ ఎందుకు విడిచిపెట్టాడని ప్రశ్నవస్తుంది. దీనికి పైవిధంగా వివరించే సంప్రదాయబద్ధుల దగ్గర సమాధానం దొరకదు. నిజంగా వ్యాసాది మహర్షులూ, వేదమూ నరుడికి ప్రమాణమైతే, ఈ మధ్యకాలపు సంప్రదాయ పండితుల అభిప్రాయంలో చాతుర్వర్ణ్యాన్ని గూర్చి పొరపాట్లు ఉన్నాయని చెప్పక తప్పదు.

2. మనువు మొదట భారతదేశంలోని జనాన్ని గణవిభజన చేసి, వారివారి వృత్తుల్ని బట్టి చాతుర్వర్ణ్యాన్ని ఏర్పరిచాడని ఒక అభిప్రాయం. ఇదే చాతుర్వర్ణ్యవ్యవస్థకు ప్రారంభమైతే మనువు దేశంలో ఉన్న జనాన్ని అందరినీ నిశ్శేషంగా యిట్లా విభజించాడా? అది సాధ్యమా? అయితే, ఆ విభజనకు ముందున్న వారి చుట్టరికాలు ఎలా తెగిపోయాయి? కుటుంబాలన్నీ ఒక్కసారిగా వేరయిపోయి, అచ్చులు పోసినట్లుగా నాలుగు వర్ణాలుగా భారతీయులందరూ సర్దుకున్నారా? అది సహజమా? - ఈ ప్రశ్నలకు సరైన సమాధానం లేదు గనుక ఈ అభిప్రాయంలో కూడా విప్రతిపత్తి ఉండితీరాలి.

3. ప్రాచీనశాస్త్రకారులు తమ శాస్త్రాలలో గ్రహాలకూ, ద్రవ్యాలకూ, పశుపక్ష్యాదులకూ కూడా చాతుర్వర్ణ్యధర్మాన్ని వర్ణించారు. ఉదాహరణకు జ్యోతిశ్శాస్త్రంలో గురుశుక్రులు బ్రాహ్మణగ్రహాలు. రవికుజాలు క్షత్రియగ్రహాలు. బుధచంద్రులు వైశ్యగ్రహాలు. శని శూద్రగ్రహం.[1] అలాగే అగదనారాయణీయ విషతంత్రమనే సర్ప

1. విప్రాదితః శుక్రగురూ కుజార్కౌ ।
శశిబుధౌ శ్వేతోఽసితోఽంత్యజానామ్ ॥ - బృహజ్జాతకమ్ - 2-7.
గురుశుక్రౌ విప్రవర్ణే కుజార్కౌ క్షత్రియౌ ద్విజ
శశిసౌమ్యౌ వైశ్యవర్ణౌ శనిః శూద్రో ద్విజోత్తమ ॥ - బృహత్పరాశరహోర - 3-22.

శాస్త్రంలో సర్పాల్లో వర్ణవిభాగం ఉన్నట్లుగా చెప్పబడింది. ఆశాస్త్రంలో ఇలాఉంది - నాగజాతుల్లో శిరస్సుల ఆకారాన్నిబట్టి పదిజాతులు. అందులో ఒక్కొక్కదానిలో ఎనిమిది ఉపజాతులు. అందులో ఒక్కొక్కదానిలో మూడు విధాలుగా ఏర్పడుతాయి. ఆ నాగాలన్నీ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర లక్షణాలు కలిగి జంటలుజంటలుగా తిరుగుతూ ఉంటాయి.2 అలాగే లోహాలలో కూడా చాతుర్వర్ణ్యం చెప్పబడింది. రాగి, తగరం బ్రాహ్మణధర్మం గల లోహాలు. వెండి, బంగారం క్షత్రియలోహాలు. సీసం, ఇనుము శూద్రలోహాలు.3 పాదరసం వైశ్యధర్మంగల లోహమని చెప్పబడింది. ఈ విధంగా సృష్టియందు గల సకల జీవకోటిలో సృష్టి యజ్ఞాన్ని నిర్వహిస్తున్న వివిధ ప్రజ్ఞల్లో ఈనాలుగు వర్ణాల విభాగం పనిచేస్తున్నట్లు ద్రష్టలైన పెద్దలు ఘంటాపథంగా చెబుతున్నారు.

వర్ణవిభాగం నేపథ్యంలో ఉన్న సత్యాన్ని దర్శింపలేని రజోగుణప్రవృత్తి గలవారికి "మన పెద్దలు కులతత్త్వం, తలకెక్కి, నరులతో సరిపెట్టక జంతువుల్లో, గ్రహాల్లో, చివరకు లోహాల్లో కూడా ఈ కులతత్త్వాన్ని చొప్పించా"రని ఆవేశపడటానికి అవకాశం ఉంది. ఆ ఆవేశంతో వర్ణవిభాగంయొక్క పూర్వాపరాలను చూడగలిగే ఓపికను వారు కోల్పోతున్నారు. పెద్దలు ఈ విభాగాన్ని శాస్త్రాల్లో అంతటా వివరిస్తున్నప్పుడు మనదృష్టిని కట్టిపెట్టి, వారి దృష్టిలో ఈవిభాగం ఎలా జరిగిఉంటుందో తెలుసుకోవడానికి ప్రయత్నించడం సత్యాన్వేషియొక్క కర్తవ్యం.

---

2. దశాష్ట పంచత్రిగణ శతమూర్ధాన్వితాః క్రమాత్ ।
విప్రా న్నృపా విశా శ్శూద్రా ద్వాద్వా నాగేషు కీర్తితా॥
— నారాయణీయ అగదతంత్రము 2-4.

3. తామ్రం విప్రం హేమభూభృత్ తథా రజతమేవచ ।
నాగం వైప్రం శూద్రౌ సీసాయ సీమతౌ ॥
నాగార్జున రసతంత్రవ్యాఖ్య (కుణపనాగుడు) 17-58.

4. సృష్టియే తన స్వరూపంగా కల విశ్వరూపుడైన విరాట్పురుషుని ముఖంనుంచి బ్రాహ్మణులూ, బాహువులనుంచి రాజన్యులూ, తొడలనుంచి వైశ్య శ్రేష్ఠులూ, పాదాలనుంచి శూద్రకులాలూ పుట్టారని కొందరు వేదాన్ని వివరిస్తున్నారు.4 ఇలా వివరిస్తున్నవారిలో ఈ అంశాన్ని నమ్మి ప్రవచిస్తున్న పండితులూ ఉన్నారు. నమ్మక విమర్శిస్తున్న వారలూ ఉన్నారు. విమర్శిస్తున్నవారు, దేహభాగాలనుంచి మానవులు దిగివచ్చారనడం అసంబద్ధమూ, అనాగరికమూ అయిన ఊహ అంటున్నారు. నమ్మి ప్రవచిస్తున్నవారు, లేదు, అలాగే దేహభాగాలనుంచి దిగివచ్చారని మంకుపట్టు పడుతున్నారు. నిజానికి, పురుష సూక్తంలోని ఈమంత్రానికి ఇదే అర్థమయితే, పాశ్చాత్యులూ మొదలైనవారు విరాట్పురుషుని దేహంనుంచి దిగిరాలేదనీ, సృష్టికన్నాముందే వాళ్ళు వేరే కాపురం పెట్టుకున్నారనీ అంగీకరించవలసి ఉంటుంది. అదీగాక, సృష్టి ఆదిలో విరాట్పురుషుడినుంచి నాలుగు వర్ణాలతో నరులే ముందు పుట్టారా? పంచభూతాలు మొదలైనవి పుట్టలేదా? - అనే ప్రశ్నకు వీళ్ళకు సమాధానం దొరకదు.

కొంచెం నిదానించి చూస్తే, పురుషసూక్తానికి మనం చెప్పుకుంటున్న వ్యాఖ్యానానికీ, ఆసూక్తంలో వివరించబడ్డ సత్యానికీ చాలా అంతరం ఉందని తెలుస్తుంది. ఆ సూక్తంలోని క్రమం ఇలా ఉంది: "విరాట్పురుషుని ముఖంనుంచి బ్రాహ్మణులూ, బాహువులనుంచి రాజన్యులూ, తొడలనుంచి వైశ్య శ్రేష్ఠులూ, పాదాలనుంచి శూద్రులూ దిగివచ్చారు. 'అతని మనస్సునుంచి'

---

4. బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రోఽజాయత ॥-పురుషసూక్తమ్.

చంద్రుడు దిగివచ్చాడు. కన్నులనుంచి సూర్యుడు వ్యక్తమయ్యాడు. ముఖంనుంచి ఇంద్రుడూ, అగ్నీ దిగివచ్చారు. ప్రాణంనుంచి వాయువు వ్యక్తమైంది.''5 ''ఆపురుషుని నాభినుంచి అంతరిక్షం పుట్టింది. శిరస్సునుంచి ద్యులోకం వర్తించింది. పాదాలనుంచి భూమీ, చెవులనుంచి దిక్కులూ వ్యక్తమయ్యాయి. ఈవిధంగా దేవతలు ఆ సర్వహుతమనబడే యజ్ఞంనుంచి లోకాలను సృష్టించారు.''6 - ఈ వేదభాగాన్ని పరిశీలిస్తే మానవులకు కలిగే శంకలన్నీ తీరిపోతాయి. చాతుర్వర్ణ్యం దిగివచ్చిన తర్వాత విరాట్పురుషుని నుంచి చంద్రుడూ, సూర్యుడూ, ఇంద్రుడూ, అగ్నీ, వాయువూ, అంతరిక్షం, ద్యులోకం, భూమీ, దిక్కులూ వ్యక్తమైనాయంటే, పైన చెప్పిన చాతుర్వర్ణ్యం సృష్టికి సంబంధించినదనీ, నకులప్రసక్తి అక్కడలేదనీ తేలిపోతుంది. సృష్టియందంతటా వర్తిస్తున్న ఆ ధర్మాలు సృష్టిలో భాగమైన నకుల్లోకూడా వర్తిస్తున్నాయని బోధపడుతుంది. ఈవర్ణవిభాగం త్రిగుణాల విభాగం వంటిదేననీ, ఈసృష్టి కాలదేశాలుగా, మహాదహంకారాలుగా, పంచభూతాలుగా, తన్మాత్రలుగా, ఇంద్రియాలుగా, దేహం, మనస్సు మొదలైనవిగా ఎలా దిగివచ్చిందో అలాగే నాలుగువిధాలైన స్వభావాలుగా కూడా దిగివచ్చిందనీ, అ స్వభావాలే వర్ణాలనబడ్డాయనీ అర్థమవుతుంది. ఆస్వభావాల ననుసరించే గ్రహాలధర్మాలూ, ద్రవ్యాలవిభాగం, సర్పవృశ్చికాదుల్లో జాతులూ ఏర్పడుతున్నాయని తెలుస్తుంది.

ఈనాలుగు వర్ణాల స్వభావాలూ త్రిగుణాల కలయికలవల్ల రూపుకట్టుకుంటున్నాయని విష్ణుపురాణం ఇలా వివరిస్తోంది :

---

5. చంద్రమా మనసో జాతః చక్షోః సూర్యో అజాయత ।
ముఖా దింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత ।

6. నాభ్యా ఆసీ దంతరిక్షం । శీర్ష్ణో ద్యౌస్సమవర్తత ।
పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్ । తథాలోకాగ్ం అకల్పయన్ ।
- పురుషసూక్తమ్.

"సృష్టింపదలచిన బ్రహ్మకు మొదట సత్త్వగుణమూర్తియైన రూపం కలిగింది. వానిముఖంనుంచి సత్త్వగుణం ఉప్పొంగిన రూపం కలవారై కొందరు సంతతి కలిగారు. రజోగుణాన్ని పొందినవారై వక్షస్థలంనుంచి కొందరు సంతతి కలిగారు. రజస్తమస్సులచే ఉప్పొంగినవారై, తొడలనుంచి కొందరు సంతతి కలిగారు. తమస్సు ప్రధానగుణంగా కలవారై పాదాలనుంచి కొందరు పుట్టారు. వీరే వరుసగా బ్రాహ్మణులూ, క్షత్త్రియులూ, వైశ్యులూ, శూద్రులూ— అనే చాతుర్వర్ణాలవారయ్యారు. వీరందరినీ సృష్టియజ్ఞం నిర్వహించేటందుకు సాధనాలుగా బ్రహ్మ సృష్టిచేశాడు."7

ఈ విధంగా సత్త్వగుణంనుంచి బ్రాహ్మణధర్మం, రజోగుణం నుంచి క్షత్త్రియధర్మం, రజస్తమస్సుల కలయికవల్ల వైశ్యధర్మం, తమోగుణంనుంచి శూద్రధర్మం రూపుకట్టుకుని, సృష్టియందంతటా వర్తిస్తున్నాయి. మన బంధువుల్లో సూర్యనారాయణమూర్తి ఒకడు ఉన్నాడనుకొందాం. ఆసూర్యనారాయణుడికీ, ఆకాశంలో వెలుగుతున్న సూర్యనారాయణుడికీ ఎంత తేడాఉందో వర్ణంగురించి మనం అనుకొంటున్నదానికీ, సృష్టిలో ఉన్న వర్ణధర్మానికీ అంత తేడా ఉంది.

7. సత్త్వాభిధాయినః పూర్వం సిసృక్షో బ్రహ్మణో జగత్ ।
అజాయన్త ద్విజశ్రేష్ఠ సత్త్వోద్రిక్తా ముఖాత్ ప్రజాః ॥
వక్షసో రజసోద్రిక్తా స్తథాఽన్యా బ్రహ్మణోఽభవన్ ।
రజసా తమసా చైవ సముద్రిక్తా స్తథోరుతః॥
పద్భ్యామన్యాః ప్రజా బ్రహ్మ ససర్జ ద్విజసత్తమ ।
తమః ప్రధానా స్తా స్సర్వా శ్చాతుర్వర్ణ్య మిదం తతః॥
బ్రాహ్మణాః క్షత్త్రియా వైశ్యా శ్శూద్రాశ్చ ద్విజసత్తమ ।
పాదోరువక్షస్స్థలతో ముఖతశ్చ సముద్గతాః॥
యజ్ఞ నిష్పత్తయే సర్వ మేతద్బ్రహ్మా చకార వై ।
చాతుర్వర్ణ్యం మహాభాగ యజ్ఞసాధన ముత్తమమ్॥

— విష్ణుపురాణం-ప్రథమాంశం-6వ అధ్యాయం - 3-7, 1-6-3,4,5,6.

మురుగుకాల్వలో ఉన్నదీ నీరే, వర్షంకురుస్తున్నప్పుడున్నదీ నీరే. కానీ, రెండూ ఒకటనగలమా? అలాగే, స్వచ్ఛమైన వర్షజలం లాంటి వర్ణధర్మంలోని వర్ణమనే పదం తరతరాల సంస్కారాల మురుగుతో కలిసి, మనకు కూడని అర్థాన్ని తట్టేటట్లు చేస్తోంది. వివేకం అనే సూర్యరశ్మితో మన సంస్కారాలు పవిత్రీకరణం చేయబడ్డప్పుడు వర్ణాశ్రమధర్మాలు సకలచరాచరజగత్తులో వర్తిస్తున్న శాశ్వతధర్మాలన్న దర్శనం కలుగుతుంది. ఆ దర్శనంతోనే వేదవ్యాసుడు లలితాసహస్రనామంలో పరాప్రకృతిని "ఆబ్రహ్మకీటజననీ, వర్ణాశ్రమ విధాయినీ" అని కీర్తించాడు.

ఈవర్ణధర్మాలే సృష్టియందలి జీవుల్లో గుణాలుగా వ్యక్తమవుతాయి. ఆగుణాలనుంచి కర్మలు రూపుదిద్దుకుంటూ ఉంటాయి. కాబట్టే, గుణకర్మల ననుసరించి నేనీ జగత్తును నాలుగువర్ణాలుగా విభజిస్తున్నానని కృష్ణుడు గీతలో చెప్పాడు8. వర్ణవిభాగం జన్మనుబట్టిగాక గుణకర్మలనుబట్టి రూపుకట్టుకుంటోందన్న గీతాచార్యుని వాక్యమే సకలవర్ణధర్మాలకూ మాదల. ఈసత్యాన్నే మహాభారతంలోని అరణ్యపర్వంలో పామయి పడిఉన్న నహుషుడికీ, యుధిష్ఠిరుడికీ జరిగిన సంవాదంలో వ్యాసుడు మరింత నిష్కర్ష చేసి చెప్పి, ధర్మాద్వైతస్థితిని స్థాపించాడు. ఆ సంవాదం ఇలా సాగుతుంది -

సర్పం :-ఓ రాజా! బ్రాహ్మణుడనగా ఎవరు? తెలిసికొనదగినది ఎట్టిది? నీవాక్యాలతో నీ అతీతప్రజ్ఞను కొలవగలను.

యుధిష్ఠిరుడు :-సత్యం, దానం, క్షమ, శీలం, కఠినహృదయం లేకుండుట, తపస్సు, జాలిపడే స్వభావం ఎవడిలో కనిపిస్తాయో అతడే బ్రాహ్మణుడుగా తెలియబడుతున్నాడు.

---

8. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" - భగవద్గీత-4-13.

తెలిసికొనదగినది పరబ్రహ్మం. ఎక్కడ దుఃఖంగానీ, సుఖంగానీ ఉండవో, ఎక్కడకు పోయినవారు శోకించరో, అదే వేద్యం. ఇంకా ఏమి పలుకదలచావో పలుకవలసింది.

సర్పం :- చాతుర్వర్ణ్యవిభాగం, సత్యం యొక్క అస్తిత్వం, పరబ్రహ్మం కూడా ప్రమాణాలు కలవేకదా! శూద్రుల్లో ఈ సత్యదానాలు, అక్రోధం, కఠినహృదయం లేకపోవడం, జాలిపడే స్వభావం, తెలియదగిన పరబ్రహ్మజ్ఞానం, సుఖ దుఃఖాలు లేకపోవడం - అనే లక్షణాలు ఉన్నప్పుడు వారిలో హీనత్వస్థితి మరొకటి ఉండాలి కదా అని ప్రశ్నిస్తున్నాను.

యుధి :- శూద్రునియందు చెప్పబడిన లక్షణాలు లేని శూద్రుడు శూద్రుడు కాడు. బ్రాహ్మణునియందు చెప్పబడిన లక్షణాలు లేని బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు కాడు.

ఈ చెప్పబడిన బ్రాహ్మణ ప్రవర్తన ఎవనిలో ఉంటుందో వాడే బ్రాహ్మణుడు. ఎవనిలో ఉండదో వాడు శూద్రుడు అని నిర్ధేశం చేయాలి.

నీచే పలుకబడిన వేద్యమైన పరబ్రహ్మం ఏది ఉందో అది ఉండుట, లేకుండుట అనుసరించి, హీనుడు, బ్రాహ్మణస్థితిని పొందినవాడు గమనింపబడాలి. (బ్రహ్మజ్ఞానం కలుగుట, కలుగకపోవుటనుబట్టి హీనుడూ, బ్రాహ్మణస్థితిని పొందినవాడూ గమనింపబడాలి.)

ఈ విధమైన అభిప్రాయాన్ని అనుసరించి ఈ రెండు లక్షణాలూ లేకపోవడం ఉండదు. వేడిమి, చల్లదనం అనేవాటి నడుమ అవి లేకపోవడం ఎలా సంభవం ?

ఈ విధమైన లేకుండా ఉండటం సుఖదుఃఖాలమధ్య సాధ్యం. ఇది నా అభిప్రాయం.

సర్వం:-బ్రాహ్మణులు ప్రవర్తనచేత మాత్రమే నిర్ణయింపబడ్డ ప్పుడు జాతి అనేది ఇక వ్యర్థవిషయమేకదా ? (జాతి అనగా పుట్టుక)

యుధి :-అన్ని ధర్మాల సాంకర్యం ఉండటంచేత నరులలో జాతి అనేది పరీక్షించి నిర్ణయించడం కష్టం.

అందరికీ ఎప్పుడూ అన్నివిధాలైన సంతతీ కలుగుతారు. వాక్కులోనూ, మైథునం (దాంపత్యం)లోనూ, జననమరణాల లోనూ నరులంతా సమానమే కదా !

యజ్ఞం చేస్తున్నాం అనే మంత్రాదుల వాక్యాలకు కూడా ఋషివాక్యే ప్రమాణం, కనుక ప్రవర్తనమే ప్రధానమని తత్త్వం తెలిసినవారు పలుకుతున్నారు. (పరబ్రహ్మంనుంచి పుట్టిన వేద మంత్రాలకు కూడా ఋషివాక్కులే ప్రమాణాలు. అనగా వేదార్థానికి ఋషులిచ్చిన వాక్యాలే ఆధారాలు. అలాగే, ప్రవర్తనమే ప్రధాన మని తెలిసినవారు చెబుతున్నారు.)

జీవుడికి బొడ్డుకోయ్యడానికిముందే జాతకర్మ చెప్పబడింది. (బొడ్డుకోసే సంస్కారానికిముందే జన్మమెత్తడం జరుగుతుంది. మానవుడు కలిగించే సంస్కారంకన్నా ముందు కలిగే సంస్కారమే జన్మ) ఆ స్థితిలో తల్లే గాయత్రి; తండ్రే గురువు, (తల్లే జీవుడుగా మేల్కొనేటందుకు స్థితిని ఇస్తోంది; తండ్రే మేల్కొల్పును కలుగ జేస్తున్నాడు.)

వేదం పుట్టునంతవరకూ జీవుడు శూద్రుడవుతున్నాడు. (జ్ఞానం కలుగని జీవుడు శూద్రుడు.) ఈ రెండువిధాలైన మనస్సులనూ స్వాయంభువ మనువు వివరించాడు.(జ్ఞానం కలగకమునుపు మనస్సూ, కలిగిన తర్వాత మనస్సూ అనే రెండువిధాలైన స్థితి).

ప్రవర్తనతో సంబంధం లేకుండానే వర్ణాలు సార్థకమైతే సంకరత్వమే బలీయమైన ధర్మం అవుతుంది గదా !

ఈ నరులవిషయంలో ఎక్కడ సంస్కరింపబడిన ప్రవర్తన కనబడుతుందో అతడే బ్రాహ్మణుడని ఇందుకే చెప్పాను.9

ఈ సంవాదంలో ప్రవర్తన వర్ణాన్ని నిర్ణయిస్తోందని స్పష్టంగా చెప్పబడింది. మానవులు వర్ణస్వరూపాన్ని మర్చిపోయి పుట్టుకకూ వర్ణానికీ ముడిపెట్టడం చాలాకాలం క్రిందటే ప్రారంభించారు. భారత కాలంనాటికే ఈ అభిప్రాయం పాతుకపోవడం మొదలుపెట్టినట్లుగా భారతంలోనే తెలుస్తుంది. ఎన్నిసార్లు గుర్తుచేసినా మళ్ళీ మర్చిపోవడానికి అవకాశమున్న ఈసత్యాన్ని నిష్కర్షచేసి, కృష్ణుడు గీతలో చెప్పాడు. వ్యాసుడు సర్ప యుధిష్ఠిర సంవాదంలో చాలా లోతుగా చర్చించి సృష్టిలో వ్యక్తమవుతున్న వర్ణంయొక్క స్వస్వరూపాన్ని మన హృదయాల్లో మళ్ళీ ప్రతిష్ఠించాడు. ఇదే సత్యాన్ని శాంతిపర్వంలో భీష్మాచార్యుడు మరొక్కసారి నొక్కి చెప్పాడు. పుట్టుకపైన, కులంపైన, వేదాధ్యయనంపైన, పాండిత్యంపైన బ్రాహ్మణత్వం ఆధారపడి ఉండదనీ కేవలం ప్రవర్తన ఒక్కటే బ్రాహ్మణత్వాన్ని నిర్ణయిస్తోందనీ ధర్మజుడికి వివరిస్తాడు.10

వ్యాస కృష్ణులు చూపే మార్గానికీ, ధర్మజుడు చేసిన నిరయానికీ, ధర్మజుడికి భీష్ముడు చేసిన ఉపదేశానికీ విరుద్ధంగా కనబడ్డే చిన్న ఇతిహాసం ఒక్కటి అనుశాసనికపర్వంలో మనకు తగులుతుంది. 11 ఉత్తముడైనప్పటికీ శూద్రుడికి మంత్రోపదేశం చేయ

9. వనపర్వం - 181వ అధ్యాయం - 20 నుండి 37 వరకు.

(చూ. అనుబంధం. 2.)

10. న జాతిః నకులం తాత నస్వాధ్యాయం శ్రుతం నచ ।
కారణాని ద్విజత్వస్య వృత్తమేవాస్య కారణమ్ ॥

— సంస్కృతభారతం - శాంతి

11. ఆం. మ. భా - అనుశాసనిక - 1-276-282.

రాదనీ, చేసిన బ్రాహ్మణుడు పతనమవుతాడనీ ఈ ఇతిహాస తాత్పర్యం. ప్రవర్తనే బ్రాహ్మణత్వాన్ని నిర్ణయిస్తోందని వ్యాస కృష్ణుల మార్గంలో నొక్కి చెప్పిన భీష్ముడి నోటివెంట ఇలాంటి ఇతిహాసం వస్తుందని చదువరి ఊహించడు. శాంతిపర్వంలో ప్రవర్తనే వర్ణాన్ని నిర్ణయిస్తోందన్న భీష్ముడు అనుశాసనికపర్వంలోకి వచ్చే టప్పటికి, ఉత్తముడైనప్పటికీ శూద్రుడికి కేవలం పుట్టుక కారణంచేత ఉపదేశం చేయకూడదని చెబుతాడా? పైగా వర్ణం ప్రవర్తననుబట్టే గుర్తింపబడాలని నహుషుడితో నిర్ధారించి చెప్పిన ధర్మజుడికి చెప్పినట్లు ఉంటుంది ఈ ఇతిహాసం. భారతసందేశం అనే పాయసాన్ని స్వీకరిస్తున్న పాఠకుడికి ఈ ఇతిహాసం పంటిక్రింద రాయిలా తగులుతుంది. తరువాతికాలం వా-రెవ్వరో తమకు తోచిన ఇతిహాసానికి భీష్మ ధర్మజ సంవాదంలో చోటు కల్పించారు. పవిత్రగ్రంధాలను సాధ్యమైనంతవరకూ మలినపరుచుకోవడం కలియుగ భారతీయమైన రక్తంలోని ఒక కూడని దుర్గుణం. పవిత్రగ్రంధాలు చెప్పినట్లు మనం నడుచుకుందామని గాక మనం అనుకున్నట్లు ఆ పవిత్రగ్రంధాలు చెబితే బాగుండును అని కోరుకునేవారు అన్నికాలాల్లోనూ ఉంటూ ఉంటారు. వారే పవిత్రగ్రంధాల ఎడల ఇలాంటి అపచారాలకు తలపెడుతూ ఉంటారు. సత్యాన్వేషకులు భాగవతంలో దాసీపుత్రుడైన నారదునకు ఋషులు ఉపదేశంచేసిన సంగతి ఈసందర్భంలో గుర్తుచేసుకోవలసి ఉంటుంది. 12

ధర్మవ్యాధుణ్ణి చేరి కనువిప్పునుపొంది కర్తవ్యాన్ని దర్శించిన కౌశికుడు అతడి బోధలను ఆకళించుకొని, అతడి జీవితమార్గాన్ని అవగతం చేసుకొని ఈ విధంగా కీర్తిస్తున్నాడు -

12. ఆంధ్రమహాభాగవతం - ప్రథమ - 101-127

"జన్మమిట్టిది, చరిత్రంబు చందమిట్టి
దెన్నఁడును నిట్టి చోద్యమే నెందుఁ జూడ
నింక జన్మాంతరముదాఁక నేల? యిపుడ
పుణ్యచరితమై నీవు విప్రుఁడవ కావె!

పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును
నిజము శూద్రుకంటె నీచతముఁడు
సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యు
నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు." 13

శూద్రకులంలో పుట్టినప్పటికీ తాను ఉపదేశం పొందటమే కాక బ్రాహ్మణులకు సైతం జీవితమార్గాన్ని నిర్దేశించే పరమగురువుగా ధర్మవ్యాధుడు భారతంలో కీర్తింపబడ్డాడు.

భారతకాలంనాటికే మానవసమాజంలో వర్ణధర్మాలకూ పుట్టుకకూ ముడివేసే అనాచారం వేళ్ళూనసాగిందని చెప్పుకున్నాం. కాబట్టే పుట్టుకనుబట్టికాక గుణకర్మల్నిబట్టి వర్ణవిభాగం జరుగుతుందని కృష్ణుడు స్పష్టంచేయవలసివచ్చింది. సర్ప యుధిష్ఠిర సంవాదం ద్వారా, ధర్మవ్యాధోపాఖ్యానంద్వారా భీష్ముడిబోధను గ్రంథస్థం చేయడంద్వారా వేదవ్యాసుడు వివరంగా తెలియజెప్పవలసివచ్చింది.

వేదహృదయాన్ని ఆవిష్కరించిన ఈ వ్యాసమార్గం సామాన్యులకు సత్యదర్శనాన్ని కలిగించడమే కాక ఉపనిషత్కర్తలకు సైతం ప్రచోదనాన్ని అందించింది.

వ్యాసుడు చేసిన ఈ ధర్మసంస్థాపనాన్ని చూసి, ప్రేరణ పొందిన ఒక వేదపండితుడు వ్యాసుని భావాన్ని క్రోడీకరిస్తూ ఒక ఉపనిషత్తును రచించాడు. దానిపేరు వజ్రసూచికోపనిషత్.14 అది ఇలా సాగుతుంది :

---

13. ఆం. మ. భా. అరణ్య - 5-136, 137.
14. చూ. అనుబంధం [illegible]

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులని నాలుగు వర్ణాలు. వాటిలో బ్రాహ్మణుడే ప్రాధాన్యం వహిస్తున్నాడు. ఇది వేద వచనాలకు, స్మృతివాక్యాలకు, అనురూపమైన సత్యం. ఇందులో ఒక మర్మం ఉంది. బ్రాహ్మణుడంటే ఎవడు? జీవుడా? దేహమా? జాతా? జ్ఞానమా? కర్మమా? ధర్మాన్ని అనుసరించా?

"అందులో జీవుడు బ్రాహ్మణుడంటే అది పొసగదు. జరిగినవి, జరుగబోయేవి అయిన అనేక దేహాల్లో జీవుడు ఒకేరూపం కలవాడు. కనుక జీవుడు బ్రాహ్మణుడనరాదు. ఒకడే కర్మవశాన అనేక దేహాల్లో సంభవిస్తున్నాడు. సర్వశరీరాల్లోను, జీవుడు ఏకరూపే కనుక జీవుని బట్టి బ్రాహ్మణ నిర్ణయం సరికాదు.

"అయితే, దేహాలను బ్రాహ్మణుడనవచ్చునా? అదికూడా కుదరదు. చండాలురవరకూ గల మనుష్యులందరికీ దేహాలు పంచ భూతాలతోనే ఏర్పడుతున్నాయి. జరామరణాలు, ధర్మాధర్మాలు మొదలైన ప్రవర్తనల్లోకూడా దేహధర్మాలు సమానమే. కనుక దేహాన్నిబట్టి బ్రాహ్మణనిర్ణయం పొసగదు.

పోనీ, తెల్లనివాడు బ్రాహ్మణుడు, ఎఱ్ఱనివాడు క్షత్రియుడు, పచ్చనివాడు వైశ్యుడు, నల్లనివాడు శూద్రుడు అనే నియమం వర్తిస్తుందా? కాబట్టి, రంగునుబట్టి నిర్ణయం కుదరదు. అంతేగాక, తండ్రీ మొదలైనవారిని చంపి దేహంతో కాల్చినపుడు కొడుకులు మొదలైనవారికి బ్రహ్మహత్యా మొదలగు దోషాలు సంభవిస్తున్నాయి. ఇదికూడా అన్నివర్ణాలవారికీ సమానమే. కనుక దేహం బ్రాహ్మణుడు కాదు.

"పోనీ పుట్టుకనుబట్టి బ్రాహ్మణుడు ఏర్పడుతున్నాడందామా? అదీ పొసగదు. నరజాతికన్నా ఇతరమైన జంతువుల్లోకూడా అనేక జాతులు ఉన్నాయికదా! దానినిబట్టి జంతువులకు వర్ణనిర్ణయం

చేస్తున్నామా? (జంతువుల్లోకూడా వర్ణవిభాగం ఉన్నదన్న సత్యాన్ని ఈపండితుడు ఎందువల్లనో గ్రహించలేకపోయాడు) మరి మహర్షులు జాతికి (పుట్టుకకు) కట్టుబడ్డవారు కారు. అనేక విధాలుగా పుట్టినవారున్నారు. ఋష్యశృంగుడు జింకకు పుట్టాడు. కౌశికుడు కుశానికి పుట్టాడు. జాంబుకుడు జంబుకానికి పుట్టాడు. వాల్మీకి వల్మీకంనుంచి పుట్టాడు. వ్యాసుడు బెస్తకన్యకు పుట్టాడు. గౌతముడు కుందేలుకు పుట్టాడు. వశిష్ఠుడు ఊర్వశికి పుట్టాడు. అగస్త్యుడు కలశంలో పుట్టాడు అని వింటున్నాం గదా! వీళ్ళు జాతితో సంబంధం లేకుండానే జ్ఞానంచేత మొదటివారుగా ప్రతిపాదింపబడ్డారు. ఇలాంటి ఋషులు అనేకులున్నారు. కనుక జాతిని బట్టి నిర్ణయించడం సరిగాదు (జాతి అనగా పుట్టుక).

"అయితే జ్ఞానాన్ని బ్రాహ్మణుడంటామా? క్షత్రియాదుల్లో కూడా జ్ఞానం కలిగి పరమార్థదర్శనం చేసినవారు పలువురున్నారు కనుక జ్ఞానం బ్రాహ్మణుడు కాదు.

"పోనీ కర్మచేత బ్రాహ్మణుడందామా? అదీ కాదు. అన్ని జీవులకు ప్రారబ్ధం, సంచితం, ఆగామి అయిన కర్మవిషయంలో సమానధర్మాన్ని చూస్తున్నాం. కర్మచేత ప్రేరేపింపబడి జీవులు కర్మల నాచరిస్తున్నారు. కనుక కర్మనుబట్టి బ్రాహ్మణుడనలేము.

"ఇక, ధార్మికుడైన వాడిని బ్రాహ్మణుడనవచ్చునా! అనరాదు. క్షత్రియాదుల్లోకూడా హిరణ్యదానాలు మొదలైనవి చేసినవారు అనేకులున్నారు. (ఇచ్చట దానం అనే అర్థంలో ధర్మం వాడబడింది. ఈ అర్థసాంకర్యం ఈఉపనిషత్తు చాలా అర్వాచీన మైనదని తెలియజేస్తోంది). కనుక ధార్మికుడు బ్రాహ్మణుడనటానికి వీల్లేదు.

"అయితే, బ్రాహ్మణుడెవ్వరు? ఆత్మను అద్వితీయంగా చూచినవాడు. జాతి గుణక్రియలు లేనిదానినిగా చూసినవాడు,

ఊర్మికలు ఆరు, భావాలు ఆరు మొదలైన సర్వదోషాలూ లేనిదిగా దర్శించినవాడు. (షడూర్మికలు మొదలైనపదాలు అర్వాచీనాలు). ఆత్మను సత్యజ్ఞానానందరూపంగా, అనంతంగా, స్వయం స్వరూపంగా, నిర్వికల్పంగా ఎరిగినవాడు. ఆత్మ సమస్తకల్పాలకు ఆధారమనీ, సర్వజీవులయందూ అంతర్యామి అనీ, ఆకాశంవలె లోపలా వెలుపలా అనుస్యూతంగా ఉన్నదనీ తెలిసినవాడు. అఖండానంద స్వభావంగా, ప్రమాణాల కతీతంగా, అనుభవైకవేద్యంగా ఎరిగినవాడు. పరోక్షతలేక, అరచేతిలోని ఉసిరిపండువలె వెలుగుతున్న ఆత్మను ప్రత్యక్షం చేసుకుని, కృతార్థుడైనవాడు. అలాంటి బ్రాహ్మణుడు కామరాగాది దోషాలు లేకుండా, శమదమాది గుణసంపన్నుడై, మాత్సర్యం, తృష్ణ, ఆశ, మోహం లేకుండా ఉండేవాడు. దంభం, అహంకారం మొదలైనవాటిచే రేగేటటువంటి సుడిగుండాలను తాకనివాడు. ఇలాంటి ముక్తలక్షణాలు గలవాడే బ్రాహ్మణుడు. అలా అనే శ్రుతి, స్మృతి, పురాణం, ఇతిహాసం అభిప్రాయపడుతున్నాయి. ఇవిలేనివాడికి బ్రాహ్మణత్వసిద్ధిలేదు. ఆత్మను అద్వితీయంగా, సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మగా భావన చేయాలి.

మహాభారత పఠనానంతరం తర్క వేదాంత పండితుడెవరో వేదధర్మాన్నీ, వ్యాసహృదయాన్నీ పట్టి యివ్వాలన్న ప్రయత్నంలో ఈ ఉపనిషత్తు వ్రాశాడని స్పష్టమవుతోంది. స్వభావాన్నిబట్టి వజ్రసూచికోపనిషత్తనికూడా అతడే కోరి పేరుపెట్టిఉంటాడు. మనకు దొరికే ఉపనిషత్తుల్లో అన్నీ ప్రాచీనమైనవేకావు. కొన్ని అర్వాచీనమైనవికూడా ఉన్నాయి. ప్రాచీనమైనా, అర్వాచీనమైనా ఆ ఉపనిషత్తుల్లో ప్రతిపాదింపబడిన సత్యమే మనకు ముఖ్యం. ఈ వజ్రసూచికోపనిషత్తు రచించిన పండితుడు వ్యాసహృదయాన్ని పూర్తిగా

పట్టలేకపోయినా, వ్యాససందేశాన్ని అభిమానించి తన సరస్వతిని అతడి అడుగుజాడల్లో నడిపినందుకు మనం కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

## కులాల స్వరూపం :

తేలినది ఏమంటే నాలుగు వర్ణాల విభాగం సృష్టికి అంతటికీ సంబంధించినదని. ఇది సకల చరాచరజగత్తుతో పాటుగా, ఆ జగత్తులో భాగమైన నరులలోకూడా వర్తిస్తోంది. వ్యక్తులయొక్క గుణకర్మల రూపంలో వ్యక్తమవుతోంది. "మరయితే కులాలు? అవిఎలా ఏర్పడ్డాయి ?" అన్న ప్రశ్న వస్తుంది. 'కులం' అన్న పదానికి వంశం అన్న అర్థంతో పాటు, గుంపు అన్న అర్థంకూడా ఉంది. సమాజంలో ఒక్కొక్క వృత్తిని నిర్వహించే గుంపును ఆ వృత్తిపేరుతో పేర్కొనడం అలవాటయింది. కమ్మరిపని చేసేవారు కమ్మరులయ్యారు. కుమ్మరిపని చేసేవారు కుమ్మరులయ్యారు. పంటభూమిని కాచి, రక్షించుకొనేవారు కాపులయ్యారు. దూదిని ఏకి, పరుపులు, దిళ్ళు కుట్టేవారు దూదేకులవాళ్ళు అయ్యారు. ఈ విధంగా దాదాపుగా కులాలపేర్లన్నీ వృత్తులనిబట్టి రూపుకట్టుకున్నవే. ఏ పనిచేసేవాళ్ళని ఆ పనిపేరుతో పిలవడం, ఆ పని చేస్తున్నవారంతా సౌకర్యంకోసం ఒకేచోట జీవించడానికి ఇష్టపడటంతో వాళ్ళ వాడలకుకూడా కుమ్మరివీధి అనీ, సాలిపేట అనీ, మేదరిబజారు అనీ, ఇలా వృత్తులను అనుసరించి పేర్లురావడం జరిగింది. ఇప్పటికీ 'బ్యాంకుకాలనీ' 'ఎల్.ఐ.సీ. క్వార్టర్సు', 'పోలీసుక్వార్టర్సు', 'కంటోన్మెంట్' అనే క్రొత్తపేర్లతో పాత సంప్రదాయమే కొనసాగుతోంది. ఒక పని చేస్తున్నవాళ్ళంతా ఒకచోట ఉండటంలోగల సౌకర్యమే ఈ సంప్రదాయం కొనసాగడానికి కారణం. వృత్తివిద్యల్లో అయితే, ఈ సౌకర్యం మరీ ఎక్కువగా ఉంటుంది. ఒకరిపనిని ఒకరు అవసరాన్నిబట్టి అందిపుచ్చుకోవడానికి వీలుగా ఉంటుంది. ఈ సౌకర్యాన్ని గమనించే

గ్రామనిర్మాణంలో ఒక్కొక్క వృత్తికి ఒక్కొక్క వాడను 'కేటాయిం'చుకుంటూ వచ్చేవారు మన పూర్వులు.

ఒకపని చేస్తున్నవారు ఒకచోట ఉండటం ఎంత అవసరమో, ఒకటిగా ఉండటంకూడా అంతే అవసరం. ఈ సత్యాన్ని ఆధునికులు కూడా గమనిస్తూనే ఉన్నారు. గమనించే, ఒకపని చేస్తున్నవారంతా ఒక 'యూనియన్'గా ఏర్పడుతున్నారు. 'యూనియన్' ఏర్పరచుకోవడం అంటే కులసంప్రదాయాన్ని అనుకరించడమేగదా! కాకపోతే కులాలకున్నంత సౌకర్యాలు 'యూనియన్ల'కు లేవు.

మానవుడు చేసే పనినిబట్టి అతడు తీసుకొనే ఆహారం, చేసుకునే అలవాట్లు రూపుకట్టుకొంటూ ఉంటాయి. అలాగే ఒక్కొక్క వృత్తివిద్యని అనుష్ఠించేవారి ఆహారవిహారాలు, ఆచార వ్యవహారాలు ఒక్కొక్క తరహాలో ఉంటాయి. ఆ వృత్తివిద్యను అనుష్ఠించేవారి కుటుంబాల్లో ఒకళ్ళతో ఒకళ్ళు వియ్యమందితే ఆ క్రొత్త దంపతులకు వృత్తి విషయంలోను, ఆహారవిహారాది విషయాల్లోను అనగలిసిపోవడానికి ఆట్టేకాలంపట్టదు. ఈ సత్యాన్ని గమనించుకోవడం వల్లనే ఏ కులంవారిని ఆ కులంవారు వివాహం చేసుకునే సంప్రదాయం రూపుదాల్చింది. ఆధునికుల్లోకూడా ఒక 'డాక్టరు' మరొక 'డాక్టరు'ని, ఒక 'టీచరు' మరొక 'టీచరు'ని వివాహం చేసుకుని సుఖపడాలని కోరుకుంటున్నారుగదా! ఒకేవృత్తిని నిర్వహిస్తున్న స్త్రీపురుషులు దంపతులవ్వడంలో ప్రత్యేకమైన సౌకర్యం ఉండటం వల్లనే ఈ వివాహ సంప్రదాయం శతాబ్దుల మలుపులను దాటివచ్చి ఆధునికులమీదకూడా తన ప్రభావాన్ని చూపిస్తోంది. ఈ విధంగా ఏదో ఒక రూపంలో కులం అనే కల్పన మానవులమీద తన ప్రభావాన్ని చూపిస్తూనేఉంది. దాన్ని సద్వినియోగపరుచుకోవడంలోనే మానవుడు తనకుగల వివేకాన్ని చూపించగలిగాలి.

ఒక ఇంటిలో పదిమంది సభ్యులు ఉన్నప్పుడు ఇంటికి కావలసిన పనుల్లో, తాము చేయగలిగిన పనులను ఎంచుకొని, పదిమందీ పది పనులూ చేసుకుంటూ సుఖజీవనాన్ని అనుభవిస్తూ ఉంటారు.అలాగే సమాజం అనేది ఒక పెద్ద కుటుంబం. ఆ కుటుంబానికి అవసరమైన పనుల్లో ఎవరు చేయగలిగింది వారు చేస్తూ, అందరూ కలిసిమెలిసి సుఖజీవనాన్ని అనుభవించేటట్లుగా ప్రకృతి ఏర్పాటుచేసిపెట్టింది. సమాజంలో ప్రతిఒక్కడూ మరొకడిపై ఆధారపడిఉంటాడు. మరోలా చూస్తే ప్రతిఒక్కడూ మరొకణ్ణి సేవించగలిగిఉంటాడు. ఏ పని చేసేవాడు లేకపోయినా సమాజానికి లోటే. సాలివాడు నెయ్యకపోతే కట్టేందుకు బట్టలుండవు. కుమ్మరివాడు చేయకపోతే ఇళ్ళల్లో కుండలుండవు. వడ్రంగులు పనులలోకి దిగకపోతే బళ్ళు, నాగళ్ళు ఉండవు. వ్యవసాయదారుడు బురదలోకి దిగకపోతే తిండికి గింజలుండవు. ఈ విధంగా వృత్తులన్నీ ఆవశ్యకమైనవీ, పరస్పర పరిపోషకమైనవీను. వీటిలో ఏవృత్తీఎక్కువకాదు, ఏవృత్తీ తక్కువదీకాదు. ప్రకృతి పశువులద్వారా పాలను అమర్చి కాచుకోమంటే, మనిషి తన సొంత తెలివిని ఉపయోగించి, రెండు ఉప్పురాళ్ళను వేసుకొన్నాడనుకోండి. అప్పుడు ఆ పాలు విరిగిపోతాయి. ఆదోషం మనిషిదేకాని ప్రకృతిదికాదు. అలాగే ప్రకృతి, మానవులు వృత్తివిద్యలను దర్శించే శక్తినిచ్చింది. ఆ విద్యలతో అన్నదమ్ములై కలిసిఉండే అవకాశాన్ని కలిగించింది. ప్రతిఒక్కడూ మరొకడికి పని చేసిపెట్టేటట్లు, ప్రతిఒక్కడూ మరొకడిపై ఆధారపడేటట్లు ఏర్పాటుచేసి, సాంఘిక సహజీవనానికి చక్కని బాటలు వేసింది. ఈ సహజీవన వ్యవస్థను దర్శించలేనివాళ్ళూ, సహజీవనానికి అవసరమైన పరిణామాన్ని ఇంకా పొందనివాళ్ళూ, తమతమ మానసిక వికారాలతో సృష్టించుకొన్నవే కులభేదాలు,కులతత్త్వాలు, కులాల్లో ఎక్కువతక్కువలూను. ఎక్కువతక్కువలకు ఒక్క మానవుడి బుఱ్ఱలోతప్ప మరెక్కడా చోటులేదు. పచ్చకామెర్లరోగి లోకం

పచ్చగా ఉంది అన్నట్లు, మనిషి, తన పుట్టలో పుట్టిన ఎక్కువ తక్కువలను ప్రకృతి కంతకూ ఆపాదిస్తూ తృప్తిపడాలని చూస్తూ ఉంటాడు. ప్రవర్తనలో పద్ధతిలేని పిల్లలు ఇంటిని నానారకాలుగా పాడుచేసినప్పుడు పెద్దలైనవారు ఆ పిల్లలకి జాగ్రత్తచెప్పి, ఆ ఇంటిని ఓర్పుతో మళ్ళీ మంచిస్థితిలోకి తెచ్చుకుంటున్నట్లుగా కులాలకూ, ద్వేషాలకూ, కులాలకూ, ఎక్కువతక్కువలకూ, కులాలకూ, కుల తత్త్వాలకూ ఏమీ సంబంధం లేదని గ్రహించి, భేదాలకు అతీతమైన సర్వసమత్వస్థితిని ఎప్పటికప్పుడు మనం స్థాపించుకొంటూ ఉండాలి. ఇంటిని పాడుచేశారని ఇల్లే పడగొట్టుకోంగదా ! అలాగే, తత్త్వాలు రెచ్చిపోతున్నాయని, ఆవశ్యకమైన వ్యవస్థను పోగొట్టుకోనక్కరలేదు. ఇంటిలో పాము దూరిందని ఇంటినే తగులబెట్టనక్కర్లేదు.

భేదదృష్టి కలవారు పాషండులవుతారుగాని పండితులు కారు. సమదర్శనం కలవారే పండితులు. ఆమాట కృష్ణుడే చెప్పాడు- విద్యావినయసంపన్నునిలోను, బ్రాహ్మణునిలోను, గోవులోను, ఏనుగులోను, కుక్కలోను, కుక్కను చంపి తినేవాడిలోను ఒకే దైవ తత్త్వాన్ని దర్శించగలవాడే పండితుడని గీతాచార్యుడు నిర్వ చించాడు.15 ఆ ఆచార్యునివాక్కే మనకు మూదల. కృష్ణుడు ఉపదేశిస్తున్న సమదర్శనస్థితి మనకు ఒంటబట్టేటట్లు చేసేటందుకే వేదవ్యాసుడు భారతంలో ధర్మవ్యాధోపాఖ్యానాన్ని ప్రత్యేకంగా వివరించాడు. ధర్మవ్యాధుడు తాను బోయవాడైనా కౌశికునివంటి బ్రాహ్మణునకు కళ్ళు తెరిపించిన పరమగురువు. అతని జీవితాన్ని ఆదర్శంగా స్వీకరించి స్త్రీలు సైతం తరించారు. వ్యాసుడు తానుద్దే శించిన ధర్మాద్వైతస్థితిని ధర్మవ్యాధునిద్వారా లోకానికి స్థాపించ గలిగాడు. ఆ ఉపాఖ్యానాన్ని నిత్యం పారాయణచేస్తే, మనిషికి

15. విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః । భగవద్గీత _ 5-18

తొలగవలసిన వికారాలు తొలగి, సమదర్శనస్థితి అలవడుతుంది. భేద దృష్టినుంచి వేదదృష్టికి మనిషి తనను తాను మళ్ళించుకోవాలని వ్యాసుని ఉపదేశం.

## వర్ణాలు – గుణకర్మలు :

నరజాతిలో వర్తిస్తున్న నాలుగు వర్ణాల గుణకర్మలు వివిధంగా ఉంటాయని శ్రీకృష్ణుడు ఇలా వివరిస్తున్నాడు : మనస్సు శాంతించడం, ఇంద్రియాలు నిగ్రహింపబడటం, తపస్సు, శుచిత్వం, ఓర్పు, సూటియైన ప్రవర్తన, విజ్ఞానం, ఆస్తిక్యబుద్ధి, బ్రాహ్మణస్వభావం కలవాడికి సహజకర్మలు.16

పరాక్రమం, కీర్తి, ధైర్యం, దాక్షిణ్యం, యుద్ధంలో పారిపోకుండా ఉండటం, దానం, ఈశ్వరత్వం కలిగిఉండటం, క్షత్రియులకు స్వాభావికమైన కర్మలు.17

భూమిని పండించడం, పశుగణాలను రక్షించడం, వస్తు సంపదను వినిమయం చేయడం వైశ్యస్వభావం కలవాడికి సహజమైన కర్మలు.18

పరిచర్యచేయడం శూద్రస్వభావం కలవారికి సహజమైన కర్మ.19

---

16. శమో దమ స్తపశ్శౌచం క్షాంతి రార్జవమేవచ ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్ ॥
17. శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥
18. కృషి గోరక్ష వాణిజ్యం, వైశ్యం కర్మ స్వభావజమ్ ।
19. పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥

— భగవద్గీత – 18 అ. 43, 44

శాంతిపర్వంలో ధర్మరాజుడు భీష్మునికి వర్ణాశ్రమధర్మాలు వివరించమని కోరినప్పుడు భీష్ముడు వర్ణధర్మాలు ఇలా వివరించాడు.20

"కోపంలేకుండటం, సత్యం పలకడం, పరస్త్రీలపై దృష్టి లేకుండా ఉండటం, ద్రోహబుద్ధి లేకుండా ఉండటం అన్నివర్ణాలవారికీ ఉండి తీరవలసిన సామాన్య ధర్మాలు.

"బ్రాహ్మణుడికి దమం పరమధర్మం. అధ్యయనం ఎప్పుడూ చేయదగింది. దానిచే శాసించబడిన సర్వకర్మలనూ అతడు నిష్ఠతో నడపాలి. కాని మార్గం పట్టక కరుణకలిగి శాంతితో కర్మాచరణం నడుపుతుండగా ఉదాత్తమైనరీతిలో ధనం ఒనగూడినప్పుడు, దాన్ని సంతానానికీ - అర్హులైనవారికి - ధర్మంగా పంచుతూ, అహంకార మెరుగనివాడై బ్రాహ్మణుడు చరించాలి.

"యజనం, దానం, అధ్యయనం, ధర్మంకోరకు చేసే హింస, ప్రజలు అనురాగమందేటట్లుగా పరిపాలించడం, యుద్ధంలో ప్రాణాలు ఒడ్డి పోరాడటం క్షత్రియ ధర్మాలు. వీటిలో యుద్ధం క్షత్రియునకు చెప్పుకోదగ్గ ధర్మం.

"అధ్యయనం, దానం యజనం, వైశ్యుడు కూడా నిర్వహించాలి. ధర్మంగా ధనాన్ని సముపార్జించి, కూడబెట్టాలి. పశువులను రక్షించడం వైశ్యులకు మహాధర్మం.

"ఈ మూడువర్ణాలవారికీ చేదోడువాదోడుగా ఉండటం శూద్రునకు ధర్మం. రాజానుమతిలేకుండా శూద్రుడు ధనధాన్యాలను కూడబెట్టుకోరాదు. శ్రద్ధకలిగి సేవించడంలోనే శూద్రుని జీవితం పవిత్రం కాగలదు."

---

20. ఆం. మ. భా - శాంతి - 2-222 నుండి 229

మొదటి మూడువర్ణాలకూ, యజ్ఞవిధి , శ్రద్ధ ప్రధానధర్మం. యజ్ఞంకంటె అధికమైనది లేదుగదా ! యజ్ఞకర్త సర్వాధికు డవుతున్నాడు.

ధర్మశాస్త్రాలను, పురాణేతిహాసాలను పరిశీలించినమీదట మనకు బోధపడే వర్ణధర్మాల గుణకర్మలు ఈ విధంగా ఉంటాయి :

1. బ్రాహ్మణుడు తాను వేదాన్ని అధ్యయనం చేయాలి, మిగిలినవారితో చేయించాలి. (సృష్టిలో అంతర్యామిగాఉన్న వేదంతో తాను శ్రుతికుదుర్చుకుని, మిగిలినవారికి శ్రుతికుదుర్చుకునే శిక్షణను ఇవ్వాలి.) తాను యజ్ఞం చేయాలి, తోడివారితో యజ్ఞాలను చేయించాలి. (ఈసృష్టే దేవతలు చేస్తున్న యజ్ఞం. ఆయజ్ఞాన్ని దర్శించి, అనుకరించడానికే నరుడు యజ్ఞయాగాలను సృష్టిని అనుసరించి నెలకొల్పుకున్నాడు. సృష్టియజ్ఞంవెడల మేల్కొల్పు పొందడమే మానవుడు చేస్తున్న యజ్ఞయాగాదులకు గమ్యం. ఆదృష్టితో తాను యజ్ఞం చేస్తూ, తోడివారితో యజ్ఞం చేయించేవాడు బ్రాహ్మణుడు.) తనవద్ద ఉన్నది తోడివారికి అవసర మైనప్పుడు, తనదగ్గరకు ఆవస్తుసంపద చేరినది వారి అవసరాన్ని తీర్చడంకొరకేనని గ్రహించి, దానంచేస్తాడు బ్రాహ్మణుడు, అలాగే, లోకహితార్థమై, ఇతరులనుంచి, ఆవశ్యకమైన వస్తుసంపదను అడిగి పుచ్చుకోవడానికి బ్రాహ్మణుడు మొగమోటమి చెందడు.

తాను సమాజానికి ముఖమై, తనకొరకుగాక సమాజంకొరకు జీవించేవాడు బ్రాహ్మణుడు. మిగిలిన మూడువర్ణాల తమ్ముళ్ళకు తనను అన్నగా దర్శించి, ఆ తమ్ముళ్ళ శ్రేయస్సుకొరకే తన అస్తిత్వమని గ్రహించి వర్తించేవాడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడు సమాజానికి తలవంటివాడు. తల ఉన్నప్పుడే మిగిలిన శరీరానికి పరిపూర్ణత సిద్ధిస్తుంది. మిగిలిన శరీరం ఉన్నప్పుడే తలకు సార్థకత

లభిస్తుంది. బ్రాహ్మణధర్మం అనుష్ఠించేవారు అరుదైనపుడు మిగిలిన సమాజం తలలేని మొండెమై, దారితెన్నూ కనబడక కొట్టుమిట్టాడుతుంది.

2. మిగిలిన మూడువర్ణాలవారికీ దెబ్బతగలకుండా రక్షించేవాడు క్షత్రియుడు. సమాజానికి ధర్మమార్గాన శిక్షణను ఈయడం బ్రాహ్మణుని బాధ్యత. సమాజం ధర్మమార్గంలో నడిచేటట్లు చూస్తూ, ధర్మాన్ని అనుసరించేవారికి రక్షణ, అనుసరించనివారికి శిక్షణ ఈయడం క్షత్రియుని బాధ్యత. క్షత్రియధర్మానికి బ్రాహ్మణధర్మం గురుత్వం నెరపుతుంది. ధర్మం అంటే చెప్పగలిగింది బ్రాహ్మణుడు. ఆధర్మాన్ని సమాజంలో అమలుపరచవలసినవాడు క్షత్రియుడు. కాబట్టే మన పురాణేతిహాసాల్లో మహర్షులు కులగురువులై రాజవంశాలకు పథనిర్దేశం చేస్తూ ఉంటారు. రఘువంశానికి వసిష్ఠుడు ఈ బాధ్యత నిర్వహించాడు.

సమాజంలో బలవంతులు బలహీనుల్ని పీడించకుండా, దుర్మార్గులు సన్మార్గుల్ని రాపాడకుండా, ఒకరి గృహ దార సంపత్తులను మరొకరు వశపరచుకోకుండా చూడవలసినవాడు క్షత్రియుడు. ఈ ధర్మనిర్వహణకోసం అతడు యుద్ధం చేయవలసివస్తే, ఆ ధర్మయుద్ధం అతనికి పరమధర్మం అవుతుంది. కాబట్టి క్షత్రియుడు యుద్ధానికి వెనుదీయరాదు. యుద్ధంలో వెన్నిచ్చి పారిపోరాదు. ధర్మనిర్వహణకోసం జరపవలసివచ్చిన హింసకూడా ధర్మమే అవుతుంది. కనుక ధర్మహింసకు క్షత్రియుడు వెనుకాడకూడదు. వెనుకాడితే సమాజానికి రక్షణ ఉండదు.

సూర్యుడు ఒకచోట ఉన్నా సూర్యునివెలుగు లోకమంతా ప్రసరించినట్లు, రాజైన క్షత్రియుడు ఒకచోట ఉన్నా, అతడి ప్రభావం రాజ్యమంతటా అంతర్యామిగా ఉండాలి. ధర్మాన్ని ఆచరించే

సమయంలో అనురోధంగా, అధర్మంగా ప్రవర్తించే సమయంలో ప్రతిరోధంగా రాజుయొక్క ఉనికి ప్రజలమనస్సుల్లో మెదలాలి. అలాంటివాడే నిజమైనరాజు. ఈసత్యాన్ని తెలియజెప్పడానికే విష్ణ్వంశ లేనివాడు పృథివీపతి కాలేడని పెద్దలమాట. విష్ణువు అంటే విశ్వంగా వ్యాపించి ఉన్నవాడని అర్థం. అలాగే, రాజు తన ఆచరణరూపంలో, ఆజ్ఞలరూపంలో రాజ్యమంతటా వ్యాపించ గలగాలి. అప్పుడు మాత్రమే, అతడు ప్రభువుగా మనగలడు.

ఈవిధంగా శక్తియుక్తులతో, ధైర్యసాహసాలతో మిగిలిన సమాజాన్ని కంటికిరెప్పలా కాచుకొనేవాడు క్షత్రియుడు. బ్రాహ్మణుడి వాణి సమాజానికి వెలుగుబాట చూపుతుంది; క్షత్రియుని బాహువు సమాజాన్ని బాటలో నడుపుతుంది.

3. మానవుడికి కావలసిన వస్తుసంపదలన్నీ ఒకేచోట లభించడం సాధ్యంకాదు. విభిన్న ప్రదేశాలలో వివిధ వస్తుసంపదలు లభ్యమవుతూ ఉంటాయి. ప్రతిమానవుడూ తనకు కావలసిన వస్తు సంపదలన్నిటికీ అవి దొరికే చోటుకల్లా వెళ్ళి, సేకరించి తెచ్చుకోవాలంటే ఇక వాడి స్వధర్మనిర్వహణకు వ్యవధి ఉండదు. కనుక మానవులకు కావలసిన వస్తుసంపదలన్నింటినీ ఒకచోటకుచేర్చి, నేర్పుతో ఓర్పుగా అందించగలిగే ధర్మంగలవారుండాలి. ఆ ధర్మం గలవారే వైశ్యులు అనబడతారు. తమకు ప్రకృతి యిచ్చిన సహజ నైపుణ్యంతో వాళ్ళు మానవుడికి కావలసిన నిత్యావసరవస్తు సముదాయాన్ని క్రీడగా అందిస్తూంటారు. వీరు చేస్తున్న ఈ సేవను అందుకొంటూ మిగిలిన మూడువర్ణాలవారూ తమతమ ధర్మాల నిర్వహణలో నిశ్చింతగా పనిచేస్తూ ఉంటారు.

పసువులను పోషించడం, సమాజానికి కావలసిన పాడిని అందించడం, ఆ పసువుల సాయంతో వ్యవసాయాన్ని చేయించి,

మట్టినుంచి ప్రాణాధారమైన సస్యాన్ని పిండి మిగిలినవారికి పంచడం వైశ్యుల ధర్మం. మిగిలిన మూడువర్ణాలవారిక్కి పాడి పంట వస్తు సంపదలు సమకూర్చి, సామాజిక జీవనాన్ని సర్వసంపదలతో, సంతృప్తితో సాగేటట్లు చూచే ధర్మం గలవారు వైశ్యులు.

4. పై మూడువర్ణాలవారికీ వారివారి స్వధర్మ నిర్వహణలో చేదోడువాదోడుగా సాయపడగలిగే ధర్మం గలవారు శూద్రులు. వీరికి పరిచర్య చేయడంలో నేర్పూ, పరిచర్యచేయడంవల్ల తృప్తీ ఉంటాయి. ఒకరు చెప్పినట్లుగా చేసుకుంటూపోవడమే స్వభావంగా గలవారిని మనం చూస్తూనే ఉంటాం. చేయడం వారిస్వభావం. కనుక వారు చేస్తూనే ఉంటారు. ఆస్వభావం ఉన్నవారు ఎక్కువ. ఆలోచించలేరు. ప్రణాళికలు వేయమంటే వేయలేరు. పెత్తనం చేయమంటే చేయలేరు. కారణం- అది వారి స్వభావం కాదుగనుక. వీళ్ళు మిగిలిన మూడు వర్ణాలతో కలిసిపోయి వారిని సేవించడమే జీవిత పరమావధిగా కలిగిఉంటారు.

మనకు పనిచేసి పెడుతున్న శరీరభాగాలు వాటి ఆహారం కోసం వేరే తిప్పలుపడనవసరంలేనట్లుగా, మిగిలిన మూడువర్ణాల వారినీ సేవిస్తున్న శూద్రులకు తమనుగూర్చి తాము ఆలోచించ వలసిన అవసరం ఉండదు. అలాంటి అవసరం కలుగనూకూడదు. ఈఉద్దేశంతోనే శూద్రుడు వేరే ధనధాన్యాలు కూడబెట్టుకో నక్కరలేదని చెప్పబడింది. మనం చూస్తున్న కుటుంబాల్లో చాలా మంది గృహిణులు ఈ శూద్రధర్మాన్నే వరిస్తూ ఉంటారు. భర్త చెప్పినట్లు చేసుకుపోతూ భర్తనీ,బిడ్డల్నీ, అతిథి అభ్యాగతుల్నీ,బంధు మిత్రుల్నీ సేవించడమే స్వభావంగా కలిగి ఉంటారు. వారిని సేవించడంలోనే ఆనందాన్ని అనుభవిస్తూ, వాళ్ళందరకూ పెట్టగా, మిగిలింది ప్రసాదంగా స్వీకరిస్తూ, నిత్యతృప్తితో, నిండుగా జీవిస్తుంటారు. ఆ స్త్రీమూర్తులకు తమనుగూర్చి తామాలోచించు

కోవడం చేతగాదు. ఆలోచించుకోవలసిన ఆవశ్యకతా ఉండదు. శూద్రధర్మస్వరూపం ఇలా ఉంటుంది.

సమర్పణ అనేది శూద్రుడికి పుట్టుకతో వచ్చే గుణం. అతడు పుట్టినప్పటినుంచీ చేసేది తనదికాని పనే. వేదాల్లో ఏమిచెప్పబడిందో శూద్రుడు అది చేస్తున్నాడు. తోడివారి శ్రేయస్సుకు తన శారీరక శ్రమను సమర్పణం చేస్తున్నాడు. కాబట్టే, శూద్రుడు జన్మచేతనే శ్రేష్ఠుడవుతున్నాడని శాస్త్రాలు చెబుతున్నాయి.20 ఈ సత్యాన్ని దృష్టిలో పెట్టుకునే మనపెద్దలు శూద్రులూ, స్త్రీలూ వేదం చదవకపోయినా పరవాలేదన్నారు. ఒక ఇంటిలో ఒకగోష్ఠి జరుగుతున్నప్పుడు ఆఇంటి ఇల్లాలుకూడా ఆగోష్ఠిలో కూర్చుండిపోతే, గోష్ఠి పూర్తిచేసుకొని, ఆకలితోలేచిన పెద్దలకి భోజనం ఉండదు. కాబట్టే, ధర్మశాస్త్రాలు శూద్రులూ, స్త్రీలూ తమతమ గుణకర్మలచేతనే ముక్తస్థితిని పొందుతున్నారని దర్శించి, వారు వేదం చదవకపోయినా పరవాలేదన్నారు. ఈసత్యాన్ని గ్రహించలేని పాషండులు తరువాత తరువాత శూద్రులూ, స్త్రీలూ వేదాలు చదువకూడదని తమ అల్పత్వానికి నిదర్శనమైన సిద్ధాంతాలను పుట్టించి, తాము చెబితే జనం నమ్మరేమోననే జడుపుతో అక్కడక్కడా పవిత్రగ్రంథాల్లో కూడా చొప్పించి పుణ్యంకట్టుకున్నారు.

వ్యాసకృష్ణుల వెలుగులో మనకు లభించే శాస్త్రగ్రంథాలను పరిశీలిస్తే, ఏవి ఋషిప్రోక్తాలో, ఏవి పండితుల ప్రక్షిప్తాలో ఇట్టే తేలిపోతాయి. ఈసత్యాన్నే తిక్కనగారు అనుభవించారు. పండితుల చేతులమీదుగా కలుగలుపుగా జాతికి అందే వేదవాఙ్మయానికి భారతం మూదలగా నిలుస్తుందని చెప్పారు. వేదాలు, స్మృతులు,

20. విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాంతు వీర్యతః
వైశ్యానాం ధానధనతః శూద్రాణామేవ జన్మతః. – మనుస్మృతి – 2-155

బహుపురాణవర్గాలు పఠించే పాఠకుడికి ఏది ద్రష్టలిచ్చిన దర్శనమో, ఏది పండితులు చొప్పించిన ప్రక్షిప్తమో తెలియాలంటే భారతాన్ని ఒకసారిచూస్తే సరిపోతుందని తిక్కనగారి అభిప్రాయం.

## అవగాహనలో పొరపాట్లు :

ప్రస్తుత సమాజంలో వర్ణాలనుగూర్చి సరైన అవగాహన కరువవ్వడంవల్ల ఈ అంశాన్నిగూర్చి ఇంత చర్చించవలసివచ్చింది. మనం గతానుగతికంగా పడుతూ వస్తున్న పొరపాట్లు రెండు.

1. జన్మకూ,వర్ణానికీ ముడిపెట్టడం. ఒకవర్ణధర్మంగల దంపతులకు జన్మించినవారు అందరూ అదే వర్ణధర్మానికి చెందినవారు కానక్కరలేదు. ఒకేబ్రహ్మనుంచి నాలుగువర్ణాల ధర్మాలు రూపుకట్టుకున్నాయని మనమే చెప్పుకుంటున్నాంగదా ! అలాగే, ఒక దంపతులకు నాలుగు వర్ణాల సంతతి కలిగే అవకాశం లేదని ఎలాచెప్పగలం ? అందరికీ అన్నిరకాల సంతతీ కలుగుతూ ఉంటారనీ, వాక్కులోను, మైథునంలోను, జనన మరణాల్లోను నరులంతా సమానమేననీ ధర్మరాజే నహుషుడికి వివరించాడు. గుణకర్మలనిబట్టిగాక కేవలం పుట్టకనుబట్టే వర్ణనిర్ణయంజరిగితే సంకరత్వం ఏర్పడుతుందని కూడా చెప్పాడు. బ్రాహ్మణధర్మం గల వారికి పుట్టినవారిలో వైశ్యస్వభావం కలవారుండవచ్చు. వైశ్యునకు పుట్టినవారిలో బ్రాహ్మణస్వభావం కలిగినవారుండవచ్చు. అప్పుడు వారు తమతమ గుణకర్మలనుబట్టి వర్ణాన్ని నిర్ణయించుకోవాలిగాని, పుట్టుకను ప్రధానంగా తీసుకొంటే ధర్మజుడు చెప్పినట్లు సంకరత్వమే బలీయమైన ధర్మం అవుతుంది. శంతనుడి అన్నగారైన దేవాపి తాను క్షత్రియవంశంలో పుట్టినప్పటికీ, తన బ్రాహ్మణ ప్రవృత్తిని గమనించుకొని, బాల్యంలోనే తపోవనానికి చేరుకున్నాడు. ఆకారణం చేతనే శంతనుడు రాజయ్యాడు21 ఈ విధంగా ఆవశ్యకత ఏర్పడినప్పుడు గుణకర్మలనుబట్టి వర్ణనిర్ణయం చేసుకోవలసి ఉంటుంది.

---

21. "....అందు దేవాపి బాల్యంబుననంద తపోవనంబున కరిగిన శంతనుండు రాజయ్యె" ఆం. మ. భా - ఆది-4-113.

2. వర్ణాలూ, కులాలూ ఒకటని పొరపడటం. నేడు మనం శూద్రులని లెక్కకడుతున్న కులాలవారిలో భూములు కలిగి, పాడీ పంటా వృద్ధిచేసుకుంటూ తామే పదిమందికి పెట్టగలవారున్నారు. వర్ణధర్మం ప్రకారం వారిది వైశ్యధర్మం అవుతుందిగాని శూద్ర ధర్మంకాదు. మరొకరిపై ఆధారపడి సేవించే స్వభావం కలవాడు మాత్రమే శూద్రుడవుతాడు. శూద్రుడంటే తప్పుఅర్థం ఏమీలేదు. శ్రమచేసి జీవించేవాడని అర్థం. అలాగే మనం శూద్రులని పిలిచే వారిలో దేశసరిహద్దుల్లో వీరోచితంగా పోరాడే సైనికులుగా రూపొందినవారున్నారు. వర్ణధర్మం ప్రకారం వారు క్షత్రియు లవుతారు. మనం బ్రాహ్మణులని పిలిచేవారిలో మరొకడిపై ఆధారపడి భృత్యులై జీవించేవారున్నారు. వర్ణధర్మంప్రకారం వారు శూద్రులవుతారు. ఈ విధంగా కేవలం పుట్టుకనుబట్టికాక, గుణధర్మాలను అనుసరించి వర్ణాలను నిర్ణయించుకోవలసి ఉంటుంది అన్న సత్యాన్ని నొక్కిచెప్పడంకోసమే ఇంత చర్చ చేయవలసి వచ్చింది. ఈ విషయంలో భారతం ఎలా మూందలగా నిలుస్తుందో కూడా నిరూపించడం జరిగింది.

## దేహనిర్మాణంలో వర్ణ ధర్మాలు :

సృష్టియందంతటా వర్తిస్తున్న నాలుగువర్ణధర్మాలు మన శరీరనిర్మాణంలో కూడా పనిచేస్తున్నాయి. శరీరంలో ముఖం (నోరు) బ్రాహ్మణధర్మం నిర్వహిస్తోంది. నోటిద్వారా మనం తీసుకొనే ఆహారం హవిస్సుగా ఉదరం అనే యజ్ఞశాలలోనికి ప్రవేశించి, ఆకలి అనే వైశ్వానరాగ్నికి సమర్పింపబడుతోంది. ఆయజ్ఞఫలంగానే మనం జీవించి ఉండటం సాధ్యమవుతోంది. మనశరీరంలోని దేవతలు అందరూ ఆవైశ్వానరాగ్నినుంచే తమతమ హవిర్భాగాలను అందు కొంటున్నారు. మనం మనకు సహకరిస్తున్న కన్ను, ముక్కు, చెవి మొదలైనవాటికి వేరువేరుగా విస్తళ్ళు వేసి వడ్డించడంలేదుగదా ! వైశ్వానరాగ్ని మనము తీసుకున్న ఆహారాన్ని శక్తిగా మార్చి శరీర

భాగాలన్నిటికీ తగినరీతిలో అందిస్తోంది. ఆ అగ్నే ముఖంగా కలిగి, మనం శరీరంలోని మిగిలిన దేవతలందరూ హవిర్భాగాలను స్వీకరించి వర్ధిల్లుతున్నారు. కనుకనే దేవతలు అగ్నిముఖులని వేదం కీర్తిస్తూ ఉన్నది.22 ఆ యజ్ఞఫలంగానే ముఖంనుంచి వాక్కు వ్యక్తమవుతోంది. గోవుసారం క్షీరంగా దిగివచ్చినట్లు మానవశరీరసారం వాక్కుగా వ్యక్తమవుతోంది.

శరీరంలోని బాహువులు క్షత్రియధర్మంనుంచి రూపుకట్టుకున్నాయి. మిగిలిన శరీరానికి దెబ్బతగలకుండా రక్షించేవి బాహువులేకదా! తాముుడగా మిగిలినశరీరానికి దెబ్బతగలనీయవవి. మనం కాలుజారి నేలకొరగబోతుంటే శరీరంలోని మిగిలినభాగాలన్నిటికన్నా ముందుగా చేతులువెళ్ళి నేలనుపోటీపడతాయి. రక్షణధర్మం బాహువులుగా రూపుకట్టుకోవడమే దీనికి కారణం.

తొడలు వైశ్యధర్మంనుంచి రూపుకట్టుకున్నాయి. వీటివల్లనే శరీరం స్థిరత్వాన్ని పొందుతుంది. పాదాలు శూద్రధర్మంనుంచి రూపుకట్టుకున్నాయి. మొత్తం శరీరాన్ని మోస్తూ, సేవించేవి పాదాలేగదా! ఈ విధంగా నాలుగువర్ణధర్మాలూ జీవుల శరీరాల్లో ఆయాభాగాలుగా రూపుకట్టుకొని వ్యక్తమవుతున్నాయి. ఈసత్యాన్ని దర్శించినవారు కాబట్టే ఋషులు విరాట్పురుషుని ముఖంనుంచి బ్రాహ్మణులూ, బాహువులనుంచి రాజన్యులూ, తొడలనుంచి వైశ్యశ్రేష్ఠులూ, పాదాలనుంచి శూద్రులూ జన్మించారని సత్యాన్ని చిత్రంగా చెప్పారు. మన శరీరభాగాలుగా రూపుకట్టుకుంటున్న ఆ ధర్మాలను దర్శించి, విరాట్పురుషుని శరీరభాగాలనుంచి ఆధర్మాలు దిగివస్తున్నట్లు దర్శించి కీర్తించారు. మానవశరీరంలో నాలుగు వర్ణధర్మాలూ వ్యక్తమై పనిచేస్తున్నట్లే మానవసమాజంలో కూడా

22. 'అగ్నిముఖావై దేవాః'

వ్యక్తమయి, పనిచేస్తూఉంటాయని దర్శించారు. ఆ ధర్మాలు శరీర భాగాలుగా రూపుకట్టుకున్నట్లే వ్యక్తుల స్వభావాలుగా కూడా రూపుకట్టుకుని వర్ధిల్లుతున్నాయని తెలుసుకున్నారు. గుణకర్మలుగా ఆ వర్ణధర్మాలు మానవులనుంచి వ్యక్తమవుతున్నాయి గనుక, గుణ కర్మలను బట్టి మానవుడు తనది ఏవర్ణమో తెలుసుకొని, ఆ వర్ణ ధర్మనిర్వహణమే జీవిత పరమావధిగా పెట్టుకోవాలని సత్యాన్ని అనుసరించి శాసించారు.

## వర్ణధర్మాలు – మానవకర్తవ్యం :

మానవుడు తననుంచి వ్యక్తమవుతున్న గుణకర్మలసాయంతో తన స్వభావాన్ని దర్శించి, తనకున్న అభిరుచినిబట్టి తా నేవర్ణానికి చెందుతాడో నిర్ణయించుకుని, ఆ వర్ణధర్మాన్ని లోకహితార్థంగా ఆచరించాలి. తాత్కాలికమైన ఆవేశాలకూ, ప్రలోభాలకూ గురై, పరధర్మాన్ని ఆశ్రయించకూడదు. అలా ఆశ్రయిస్తే అది తన స్వధర్మం కాదుగనుక నైపుణ్యం చాలక దెబ్బతింటాడు. బోధించేం దుకు అనువైన స్వభావంగల ఒకవ్యక్తి బోధనవల్లకన్నా వాణిజ్యం వల్ల ఎక్కువ లాభం వస్తుందని ఆశపడి 'దుకాణం' తెరిస్తే, దుఃఖమే మిగులుతుంది. కష్టించి పనిచేసే స్వభావంగలవ్యక్తి ఎక్కువ గౌరవం లభిస్తుందిగదా అని ఏ జమాఖర్చులు సరిచూసేపనో చేపడితే అది మానసిక శ్రమతో కూడుకున్నది గనుక, అతని మనస్సు అందుకు సిద్ధంగా లేదుగనుక నానాహైరానా పడవలసివస్తుంది.

ఒక వ్యక్తియొక్క మానసికమైన శక్తియుక్తులు, దేహావ యవాలయొక్క నిర్మాణం అతని స్వభావానికి అనుగుణంగా ఉంటాయి. చిత్రకారుని చేతులు సున్నితంగా, కుంచెపట్టడానికి మాత్రమే పనికి వస్తాయి. కుమ్మరిపని చేసేవాని చేతులు మోటుదనంతో ఇనుపవస్తువు లతో పోటీపడతాయి. బోధనకు పనికివచ్చేవాని శరీరం 'కుర్చీ'లో కూర్చోవడానికి వీలుగా ఉంటుంది. నాగలిపట్టేవాని శరీరం ఎండలక్కీ

నాలకీ, మోటుపనులకీ తట్టుకోగలుగుతుంది. వాణిజ్యంచేసే స్వభావం గలవాడు ఉదయంనుంచి రాత్రివరకు వ్యాపారంలోనే కూర్చుండిపోతాడు. ఆ స్వభావం లేనివాడికి ఆ పని చెబితే వాడి తల ప్రాణం తోకకు వస్తుంది. ఒకే ఆహారం బరువులు మోసేవాడికి శరీర దార్ఢ్యాన్ని ఇస్తోంది. అదే ఆహారాన్ని బోధనాస్వభావం గల వాడు స్వీకరిస్తే వాడి బోధనకు తగిన నిష్పత్తిలోనే శక్తిలభిస్తోంది. ఈ విధంగా వర్ణధర్మాలు అన్ని కక్ష్యల్లోను పనిచేస్తూ ఉంటాయి. కాబట్టి వ్యక్తి తన స్వధర్మాన్ని గుర్తించి, ఆ స్వధర్మంలో చెదర కుండా నిలబడగలిగినప్పుడు మాత్రమే సార్థకతను పొందుతాడు. గీతలో కృష్ణుడు ఈ సందర్భంలో ఇలా హెచ్చరిస్తున్నాడు- "తక్కువగా కనబడినప్పటికీ, దోషంతో కూడుకున్నదిగా అనిపించినప్పటికీ, తన స్వభావానికి సహజమైన కర్మను మానవుడు విడిచిపెట్టకూడదు. అగ్నితో ధూమం తప్పనిసరైనట్లు, ఏ కర్మతోనైనా ఎంతో కొంత దోషం కూడుకొనే ఉంటుంది. ఈ సత్యాన్ని గమనించి, వ్యక్తి స్వధర్మ నిర్వహణకు అంకితమైనపుడు సర్వపాపాలనుంచీ విమోచనం పొందుతాడు"23

మనం ఒక నాటకం చూస్తున్నప్పుడు ఆ నాటకంలో నటించిన నటుల్ని మెచ్చుకోవడం దేనిమీద ఆధారపడి ఉంటుంది? పెద్ద పాత్ర ధరించినవాణ్ణి మెచ్చుకోవడం, చిన్నపాత్ర ధరించిన వాడు మెప్పుదలకు అనర్హుడనుకోవడం ఉండదుగదా! పాత్ర చిన్నదిగాని, పెద్దదిగాని- నటుడు ఆ పాత్రకు తగ్గట్టు నటించినపుడు మనం హృదయ

23. సహజం కర్మ కౌంతేయ సదోషమపి నత్యజేత్।
సర్వారమ్భాహి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః॥
"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కల్బిషమ్॥
- భగవద్గీత 18-48, 47.

(12)

పూర్వకంగా మెచ్చుకుంటాం. అది రాజుపాత్రా, లేక సేవకుడిపాత్రా, అది యువకపాత్రా, లేక ముసలిపాత్రా అన్నదాన్నిబట్టి మన మెచ్చుకోవడం ఉండదుగదా! అది ఏ పాత్రయినాసరే, ఎలాంటి పాత్ర అయినాసరే- ఆ పాత్రను నటించిన నటుడు పాత్రకు తగినట్లు నటిస్తే, మనకు నచ్చితీరుతుంది. అలాకాక పాత్ర స్వభావాన్ని మరచి, ఏ నటుడు మరొక నటుణ్ణి అతిక్రమించినా, పాత్రకు తగ్గట్టు నటించలేక పోయినా, మనం మెచ్చుకోలేం. నటులందరూ తమతమ పాత్రలకు న్యాయం చేకూర్చి, నాటకాన్ని రక్తి కట్టించాలనేది మన కోరిక. అలాగే, ఈ సృష్టిరంగంలోకూడా ప్రతివ్యక్తికీ ఒక పాత్ర ఉంది. ఆ పాత్ర స్వభావమే అతని స్వధర్మంగా వ్యక్తమవుతుంది. స్వధర్మాన్ని సక్రమమార్గంలో నిర్వహించటమే పాత్రపోషణ. అలా నిర్వహించినపుడు మాత్రమే అతడు మిగతా సృష్టితో శ్రుతికలపగలుగుతాడు. అప్పుడే అతడికి ధర్మాద్వైతస్థితి సిద్ధిస్తుంది. ఈ సత్యాన్నే కృష్ణుడు గీతలో స్థాపించాడు.

భారతకాలంనాటికే వర్ణధర్మాల నిర్వహణలో వ్యక్తులు రకరకాల పోకడలుపోయారు. కొందరు స్వధర్మంలో నిలబడటానికి యత్నించి, నిలబడలేకపోయారు. కొందరు పరధర్మాన్ని ఆశ్రయించి జీవితాన్ని భయావహం చేసుకున్నారు. ఇంకాకొందరు వర్ణధర్మాల నిర్వహణలో చిత్రమైన కోణాల్లో నిలబడ్డారు. కొందరు మాత్రమే తుదివరకూ స్వధర్మంలో నిలబడగలిగారు. అదికూడా అతికష్టంమీద. భారతంలోని ఆయాపాత్రల్ని పరిశీలిస్తే, ఆ పాత్రలు పోయిన పోకడల్నిబట్టి వర్ణధర్మస్వరూపం ఎలాంటిదో, దానిమెడల మానవులు ఎలా వర్తించాలో మనకు స్పష్టపడుతుంది. ప్రధానమైన వ్యక్తులు వర్ణధర్మాలమెడల ఎలా ప్రవర్తించి, ఎలాంటి ఫలితాలను పొందారో కొంచెం వివరంగా చూద్దాం.

## వర్ణధర్మనిర్వహణలో భీష్ముడు :

గంగా శంతనులకు పుట్టిన భీష్ముడిది ఒకవిశిష్టమైన వ్యక్తిత్వం. ఇతనిలో క్షాత్రం, బ్రాహ్మం - రెండూ కనబడతాయి. కొంచెం సూక్ష్మంగా పరిశీలిస్తే బ్రహ్మతేజస్సు నేపథ్యంగా కలిగి, క్షత్రియ ధర్మాన్ని స్వధర్మంగా నిర్వర్తించినట్లు స్పష్టమవుతుంది. గురువైన పరశురాముణ్ణే యుద్ధంలో ఓడించిన భీష్ముడు అపరవయస్సున కురుక్షేత్ర మహాసంగ్రామంలో కూడా తన యుద్ధసామర్థ్యం చూపి, అర్జునుడంతటివాణ్ణి హడలగొట్టాడు. ఆయుధంపట్టనన్న కృష్ణుడిచేత ఆయుధంపట్టించి, భక్తుడిముందు భగవంతుడు ఓడిపోతాడని నిరూపించాడు. కాబట్టి, ప్రధానమైన గుణకర్మల్ని లెక్కలోనికి తీసుకున్నప్పుడు భీష్ముడు అనన్యసామాన్యమైన క్షాత్రధర్మం మూర్తీభవించినవాడు.

భీష్ముడిలో వ్యక్తిత్వంపాలు ఎక్కువ. అతడు తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడానికే ఎక్కువగా ప్రయత్నించాడు. శంతనుడు సత్యవతిని చూసేటంతవరకూ కథ ఋజుమార్గంలో నడిచింది. దేవవ్రతుడంతటివాడు (భీష్ముడు) తమకు రాజుకాబోతున్నాడుగదాఅని ప్రజలు ఉవ్విళ్ళూరారు. సత్యవతిని తండ్రికిచ్చి వివాహం చేయడానికై తాను వివాహమాడనని భీషణమైన ప్రతిజ్ఞ చేశాడు భీష్ముడు. ఈ ప్రతిజ్ఞతో కథ మలుపుతిరిగింది. సత్యవతి సంతానమైన చిత్రాంగద విచిత్రవీర్యులిద్దరూ అకాలమరణం పొందారు. అప్పుడు సత్యవతి భీష్ముణ్ణి చేరబిలిచి, వంశపరిస్థితీ, రాజ్యపరిస్థితీ వివరించింది. "ఎవరి సంతతికి రాజ్యాధికారం సంక్రమించడంకోసం నీవు వివాహాన్ని విరమించావో, ఆ చిత్రాంగద విచిత్రవీర్యులు ఇరువురూ తాము మిగలలేదు సరికదా, వంశాంకురాలను కూడా మనకి అందించలేదు. కాబట్టి, ఈవంశానికి మిగిలింది నీవు ఒక్కడవే. రాజ్యాన్ని స్వీకరించి గృహస్థువై సంతతిని పొందవలసింది" అని కోరింది.

భీష్ముడు చేసిన ప్రతిజ్ఞను విడిచిపెట్టలేనన్నాడు. భగ్నప్రతుడయ్యేటందుకు సిద్ధపడలేనన్నాడు. 'చంద్రుడు "చల్లదనాన్ని విడిచిపెట్టవచ్చు. సూర్యుడు తన తేజాన్ని విడిచిపెట్టవచ్చు. అగ్ని తన స్వభావమైన వేడిమిని విడిచిపెట్టవచ్చు. కాని, నేనుమాత్రం తండ్రి కొరకు చేసిన ప్రతిజ్ఞ విడువలేను!"24 అన్నాడు. ఈ సన్నివేశంలో లోకహితానికీ, భీష్ముడి వ్యక్తిత్వానికీ పోటీ వచ్చినట్లయ్యింది. భీష్ముడు లోకహితంకన్నా వ్యక్తిత్వంవైపుకే మొగ్గాడు. లోకహితాన్ని విస్మరించేటంత అజ్ఞానా భీష్ముడు? కాదు. కాని, అతని వ్యక్తిత్వం లోకహితంతో రాజీపడలేకపోయింది. అప్పు డతను అనాదిగా వస్తున్న సంప్రదాయం ప్రకారం పూజ్యులైన బ్రాహ్మణోత్తముల్ని పూజించి, నియోగించి, అంబికా అంబాలికల క్షేత్రాలనుంచి వంశాంకురాలను పొందుదామని ధర్మమైన మార్గాన్ని తల్లికి సూచించాడు. అప్పుడు సత్యవతి వ్యాసుడు తన కొడుకని ఎరుకపరచి, అతణ్ణి నియోగించాలని సంకల్పించింది. భీష్ముడు ఆమె నిర్ణయానికి సంతోషించి, వ్యాసుడున్న దిక్కుకు తిరిగి పూజ్యభావంతో అతడికి నమస్కరించాడు.

తల్లి స్మరించడంతో ప్రత్యక్షమైన వ్యాసుడు ఆమెనుంచి కథంతా విన్నాడు. వ్యాసుడు పరాశరమహర్షి కృపవల్ల సత్యవతికి సద్యోగర్భాన కలిగినవాడు. జన్మించగానే తల్లికి నమస్కరించి, మునిపుత్రుడై లోకహితార్థమై తపస్సు చేయడానికి కృష్ణద్వీపానికి తరలివెళ్ళినవాడు. అలాంటి తేజోమూర్తి లోకహితార్థమై తల్లి ఆజ్ఞాపించినపుడు వితంతువులనికూడా సంకోచించకుండా వంశాంకురాలను ప్రసాదించాడు. ఒకమహాతపస్వి వితంతువుతో సంగమించడం సామాన్య పరిస్థితిలో పూర్తిగా అధర్మం. అదే లోకహితంకోసం పరమపవిత్రకార్యంగా వ్యాసుడు నిరూపించాడు. తానున్న స్థితి

24. ఆం. మ. భా - ఆది - 4-223.

నుంచి లోకహితానికి ఆవశ్యకమైన స్థితికి క్షణమాత్రంలో దిగి వచ్చాడు వ్యాసుడు. భీష్ముడు వ్యక్తిత్వ పరిధిని చెరుపుకోని లోకహితంతో తానుగా చేతులుకలపలేకపోయాడు. అప్పటినుంచీ భీష్ముడనే సూర్యుడికి గ్రహణం పట్టినట్లయ్యింది.

ఈ సందర్భంలో భీష్ముడు రాజ్యక్షేమానికి కావలసినదంతా చేశాడు. కాని తాను స్వయంగా చేయలేకపోయాడు. తాను ప్రతిజ్ఞను విడిచిపెట్టకుండా, రాజ్యక్షేమానికి భంగం కలగకుండా మధ్యేమార్గాన్ని అనుసరించాలని కోరుకున్నాడు. చిత్రంగా భీష్ముని జీవితం ఈ సన్నివేశంనుంచీ అనుకోని మలుపుతిరిగింది. ఆపైన ఏ సందర్భంలోనూ స్వయంగా కలగజేసుకుని, ధర్మాధర్మాలను నిర్ణయించి, తనవారిని నడిపించలేకపోయాడు. ఈ సన్నివేశంలో వ్యాసుడు దయ చూపినట్లే తరువాత తరువాత కృష్ణుడు కలగజేసుకోవలసివచ్చింది. వ్యాస కృష్ణులు-కర్తవ్యాన్ని నిర్వహిస్తుండగా, వారితో తులతూగగల భీష్ముడు ఒకరకమైన ఉపేక్షాభావంతో దాదాపు ప్రేక్షకుడిగా మిగిలిపోయాడు. ఆ ఉపేక్షాభావానికి నాంది ఈ సన్నివేశంలోనే పడింది. కాబట్టే భీష్ముడనే సూర్యుడికి గ్రహణం పట్టిందని చెప్పవలసి వచ్చింది.

భీష్ముడు చాలా గట్టివాడు. తాననుకొన్న పద్ధతికి తాను కట్టుపడ్డాడు. ధృతరాష్ట్రపాండురాజుల్ని పెంచి పెద్దచేశాడు. వాళ్ళ సంతతికి విద్యనేర్పించి తీర్చిదిద్దాడు. వంశానికి పెద్దదిక్కుగా నిలిచాడు. అంతవరకూ బాగానేఉంది. ఆపైన భీష్ముడు ఇరుకున పడ్డాడు. ధృతరాష్ట్రుడి పద్ధతి అతడికి నచ్చలేదు. కౌరవులధోరణి అతడికి దుర్భరంగా తోచింది. అప్పుడు కర్తవ్యం ఏమిటో నిర్ణయించుకోవడానికి అతడు మధన పడ్డాడు. ధృతరాష్ట్రుడికీ కౌరవులకూ నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. వారు వినలేదు. అధర్మమార్గాన్ని వారు విడలేదు సరికదా, ధర్మాన్నీ, ధర్మపరులనీ తుడముట్టించ

దాన్ని వారు ప్రయత్నాలు చేయసాగారు. అప్పుడే గనుక భీష్ముడు పెద్దరికంతో వచ్చి చెప్పడానికి యత్నించడంతో ఊరుకోకుండా తన క్షత్రియ ధర్మాన్ని చూపించి ఉన్నట్లయితే కథ కురుక్షేత్రందాకా నడిచేదికాదు. ఈ రాజ్యాన్ని తాను వదలిపెట్టేశాను గదా అను కున్నాడు తప్ప, కీలకవేళల్లో అధర్మం తాండవించినప్పుడు లోక హితార్థమై క్షత్రియధర్మాన్ని అవలంబించి, అధర్మానికి ఎదురుగా ధనస్సుపట్టి నిలవలేకపోయాడు. అతడు నిలబడితేచాలు, యుద్ధం చేయనక్కరలేదు - ధృతరాష్ట్రుడూ, అతని పుత్రులూ, వాళ్ళ పరి వారం కుక్కినపేనల్లా పడిఉండేవారు. కానీ భీష్ముడు వ్యక్తిగత నిర్ణయానికే కట్టుపడిపోయాడు.

అతడి దృష్టి ఇది - “నేను రాజ్యాధికారాన్ని ప్రతిజ్ఞాపూర్వ కంగా వదులుకున్నాను. ఆవంశానికి చెందిన ఒకపెద్దగా మాత్రమే ఉండదలిచాను. పెద్దగా మంచీ చెడూ చెప్పడం నాధర్మం. వినడం, వినకపోవడం వారి ఇష్టం. అంతకుమించి నాకు కలగజేసుకోవడానికి అవ కాశంలేదు. ఏది ఎలా జరగాలో అదలా జరుగుతుంది. అధర్మం ధర్మంచేతిలో ఓడిపోక తప్పదు. పైగా, ధర్మరక్షణార్థమై పురాణ పురుషుడే కృష్ణుడుగా దిగివచ్చాడు. కాబట్టి, బెంగలేదు. నాలాంటి వాడు చేయలేనిది అతడు చేయగలడు.” ఈ విధమైన ఉపేక్షాభావం తోనే భీష్ముడు కడదాకా తనపాత్రను తనకు తానుగా పరిమితం చేసు కుంటూ వచ్చాడు.

చివరకు ధర్మాధర్మాలకు యుద్ధరంగంగా నిలిచిన కురుక్షేత్ర మహాసంగ్రామంలో కూడా భీష్ముడు తన స్వధర్మాన్ని అధర్మానికే సమర్పించాడు. ఇంత తెలిసి భీష్ముడు ఇలాఎందుకు చేశాడన్నది చెప్పడం కష్టం. “అర్థానికి పురుషుడు దాసుడు, అందువల్ల ఇలా చేస్తు న్నాను.”25 అని యుద్ధరంగంలో అతడు చెప్పుకున్న వివరణకూడా

25. “అర్థస్య పురుషో దాసః” - సం. భా. - భీష్మ - 6-41-36

సమగ్రమైంది కాదు. సరిపెట్టుకోవడానికి చేసిన ప్రయత్నమే అది. నిజానికి అతడిరాజ్యం ధృతరాష్ట్రాదులకు దక్కింది కానీ, ధృతరాష్ట్రాదుల ఉప్పుతిని బ్రతకవలసిన ఆవశ్యకత అతనికేముంది? ఒక చిత్రమైన బలహీనత భీష్ముడిలో పనిచేసి ఉండవచ్చు. ధృతరాష్ట్ర పాండురాజు లిరువుర్నీ తానే తన చేతులతో పెంచాడు. ధృతరాష్ట్రుడు సింహాసనం ఎక్కినప్పటినుంచీ అతణ్ణి కనిపెట్టుకొని ఉంటున్నాడు. ఇంతలో పాండురాజు కాలంచేశాడు. ధర్మరాజు ఇంద్రప్రస్థాన్ని రాజధానిగా చేసుకుని తన రాజ్యభాగాన్ని పరిపాలించడం ప్రారంభించినపుడు కూడా భీష్ముడు ఇంద్రప్రస్థానికి తరలివెళ్ళలేదు. హస్తినలో ధృతరాష్ట్రుడి దగ్గరే ఉండిపోయాడు. గ్రుడ్డిరాజుని కనిపెట్టుకుని ఉండటమే తన బాధ్యతగా భావించాడేమో! బహుశః ఈ బలహీనతతోనే చివరకు యుద్ధరంగంలో కూడా ధృతరాష్ట్రుడివైపు నిలబడ్డాడేమో ననిపిస్తుంది. కొడుకుల తరాన్నుంచి మనుమల తరానికి దూకడానికి జంకాడేమో ననిపిస్తుంది. ధృతరాష్ట్రుడు తనకు కొడుకు అవుతాడు. ధర్మజుడు మనుమడు. కొడుకును వదలి మనుమణ్ణి చేరడం తగదనుకొన్నాడేమో! పైగా కొడుకు గ్రుడ్డివాడు. అతడి బాధ్యత తనకున్నది. రాజ్యం తనది కాదనుకున్నాడు గనుక తాను ధృతరాష్ట్రుడి ఉప్పుతింటున్నట్లుగా భావించుకొన్నాడేమో! కాబట్టే అర్థానికి పురుషుడు దాసుడని చెప్పిఉంటాడు. ఈ సందర్భంలో కూడా అతడిమీద లోకహితదృష్టికన్నా మానవసమాజమైన పద్ధతులూ, బలహీనతలే ఎక్కువప్రభావాన్ని చూపించాయి.

భీష్ముడు తన తప్పును గ్రహించకపోలేదు. గ్రహించాడు. ధర్మపక్షాన నిలిచిన ధర్మరాజు "తాతా! మిమ్మల్ని యుద్ధంలో జయించే ఉపాయం ఏమిటి?" అని అడిగినప్పుడు, చిరునవ్వుతో "ఇప్పుడు సమయం కాదు" అన్నాడు. తాను యుద్ధంచేసిన పదిరోజులూ దుర్యోధనుడి పక్షంలో విజృంభించి, పాండవసైన్యాన్ని భీకరంగా

వధించాడు. పాండవులమీద ఏమాత్రం ప్రేమనుగాని, మొగ మోటమినిగాని, చూపించలేదు.

ఎనిమిదవనాడు భీష్ముడికి పాండవ పక్షపాతం ఉన్నదని నమ్మి, కర్ణుణ్ణి యుద్ధాన్ని నడిపించమని అడుగుతాడు దుర్యోధనుడు. భీష్ముడు యుద్ధభూమినుంచి తప్పుకుంటే, అలాగే కదనరంగంలోకి వస్తా నంటాడు కర్ణుడు. దుర్యోధనుడు సంతోషంతో భీష్ముణ్ణిచేరి, "చేసింది చాలు, యుద్ధభూమినుంచి తప్పుకో" అంటాడు. తప్పుకొని కర్ణుణ్ణి ప్రవేశపెట్టమంటాడు. భీష్ముడు చాలా బాధపడతాడు.26 పాండవుల నిజస్థితిని వివరించి, మర్నాటినుంచీ మరింత విజృంభిస్తాడు. తాను దుర్యోధనుడికి అక్కరలేదని తెలుసుకున్న భీష్ముడు ఈ విధంగా దైవం తనకు అనుకూలించాడని భావించి తరువాత చేర వచ్చిన ధర్మరాజుడికి తనను వధించే ఉపాయాన్ని సంతోషంతో వివరి స్తాడు. ఆ మర్నాటి యుద్ధంలో తనను పడగొట్టమని కోరుకుంటాడు కూడా.

మొత్తంమీద వధోపాయాన్ని వివరించడంతో మళ్ళీ ఇన్నా ళ్ళకు లోకహితంతో శ్రుతికలిపినవాడయ్యాడు భీష్ముడు. భీష్ము డనే సూర్యుడికి పట్టిన గ్రహణం విడిచింది. అంపశయ్యపై ఒరిగిన భీష్ముడికి కర్ణుడితోసహా అందరూ మోకరిల్లారు. ఆపైన భీష్ముడు అందరికీ చెందిన వ్యక్తిఅయి, దివ్యతేజస్సుతో వెలిగాడు.

కురుక్షేత్ర మహాసంగ్రామం ముగిసినతర్వాత అంపశయ్యపై ఉత్తరాయణం కొరకు వేచిఉన్న భీష్ముడి దగ్గరికి ధర్మజుణ్ణి తీసుకు వెడతాడు కృష్ణుడు. అప్పటికే కృష్ణుడు తానెక్కడున్నా భీష్ముడు స్మరించేటప్పటికి భీష్ముడి దగ్గర ఉండటం ప్రారంభించాడు. తనతో తాదాత్మ్యస్థితిని అనుభవిస్తున్న భీష్ముడికి ధర్మజుణ్ణి చూపి కృష్ణుడు

26. ఆం. మ. భా - భీష్మ - 3-170, 171, 172, 173.

"ఇతను బంధువులను చంపానన్న బాధతో స్వధర్మంలో స్థిరపడలేక పోతున్నాడు. ఇతని సందేహాలు బాపి, కావలసిన ధర్మాలన్నీ బోధించి, కర్తవ్యోన్ముఖుణ్ణి చెయ్యవలసింది" అన్నాడు. "నీవు ఉండగా నేనా చెయ్యడం?" అన్నాడు వినయంతో భీష్ముడు. శరీరానికి తగిలిన గాయాలు విపరీతంగా బాధపెడుతున్నాయనీ, మనస్సు వివశమైన స్థితిలో ఉన్నదనీ చెప్పాడు. కృష్ణుడు "నీ గాయాలు నిన్ను బాధించవు. నీ మనస్సుకు స్వస్థత చేకూరడమే గాక, సకల లోకాలలోని అంశాలూ కోరినంతమాత్రాన స్పష్టంగా దర్శనమిస్తాయి", అని బుజ్జగించి, "నేను చెప్పినప్పుడు గాక, నీవంటి భక్తులద్వారా పలికినప్పుడే నాకు తృప్తిగా ఉంటుంది" అన్నాడు. కృష్ణుడి ఆజ్ఞను శిరసా వహించి, సకలధర్మాలూ ధర్మజుడికి బోధించి, స్వధర్మోన్ముఖుణ్ణి చేసి, ఆచార్యుడైనాడు భీష్ముడు. యుద్ధానికి ముందు అర్జునుడియెడల కృష్ణుడు నిర్వహించిన బాధ్యతనే యుద్ధం తరువాత ధర్మజునికొరకు భీష్ముడు నిర్వహించాడు. నేపథ్యంలో వెలుగుతున్న బ్రహ్మతేజం భీష్ముడినుంచి బోధగా వ్యక్తమయ్యింది. చివరికి అతడు కృష్ణుణ్ణి కీర్తిస్తూ, కృష్ణుడిలో కలిసిపోయాడు.

### వర్ణధర్మనిర్వహణలో ద్రోణుడు :

ద్రోణుడు భరద్వాజమహర్షి కుమారుడు. తండ్రి దగ్గర వేదాధ్యయనం చేశాడు. ఆ అధ్యయనంలో పాంచాలపతి అయిన పృషతుని కుమారుడు ద్రుపదుడు ఇతడికి సహాధ్యాయి. విద్యాభ్యాసానంతరం ద్రుపదుడు పాంచాలదేశానికి ప్రభువయ్యాడు. ద్రోణుడు అగ్నివేశుడనే మహామునివల్ల ధనుర్విద్యలో ప్రావీణ్యం పొంది తండ్రి ఆదేశంతో కృపాచార్యుని చెల్లెలయిన కృపిని వివాహమాడాడు. ఆదంపతులకు అశ్వత్థామ పుట్టాడు. తోడిపిల్లలు పాలు త్రాగుతూ ఉండటం చూసి అశ్వత్థామ పాలకొరకు గోలచేశాడు. కొడుకుకోసం

సంపదను కోరి ద్రోణుడు పరశురాముడి దగ్గరకు వెళ్ళాడు. అప్పటికే సంపదలన్నింటినీ పంచిపెట్టిన పరశురాముడు కోరితే శస్త్రాస్త్రాల నీయగలనని చెప్పగా, అతనినుంచి దివ్యాస్త్రాలను ప్రయోగరహస్య మంత్రాలతో ఉపదేశమంది, చిన్ననాటిస్నేహితుడైన ద్రుపదుని వద్దకుపోయి, పరిచయం చేసుకున్నాడు. అతడు "నీవెక్కడ, నేనెక్కడ? నిన్ను నేనెరగను" అని నీచంగా మాట్లాడి అవమానించాడు. ఆపైన ద్రోణుడు హస్తినకు చేరడం, భీష్ముడిచేత కురుకులానికి ధనుర్విద్యాగురువుగా నియమింపబడటం జరిగింది.

హస్తినాపురం ప్రవేశించేవరకూ ద్రోణుడు పరిపూర్ణమైన బ్రాహ్మణధర్మాన్ని అనుసరించాడు. హస్తినాపురంచేరి, రాజాస్థానంలో అడుగు పెట్టినప్పట్నుంచీ క్రమంగా బ్రాహ్మణధర్మం నుంచి క్షత్రియధర్మంవైపుకు మొగ్గాడు. విలువిద్యనేర్పడంతో సరిపెట్టుకోకుండా యుద్ధాల్లో పాల్గొని క్షత్రియునివలె పోరాడాడు. బ్రాహ్మణుడు సర్వవర్ణ ధర్మాలనీ ఆవశ్యకతనుబట్టి లోకహితంగా అనుష్ఠించవచ్చునని మనుస్మృతి చెబుతోంది.27 దాని ప్రకారం ద్రోణుడు క్షత్రియధర్మాన్ని ఆచరించాడందామా - అతడు లోకహితానికి వ్యతిరేకంగా అధర్మయుద్ధాల్లో పాల్గొని పోరాడాడు. అంతే కాక, ధృతరాష్ట్రుడి ఉప్పుతినటానికి సిద్ధపడటంతో అతడు రాజభృత్యుడై, శూద్రధర్మాన్ని కూడా కలుపుకొన్నవాడయ్యాడు. ఈ స్థితులకు దిగజారడంవల్ల తనది వస్తుతః బ్రాహ్మణ ధర్మమైనా, అధర్మాన్ని ఆచరిస్తున్న రాజునీ, రాజకుమారుల్నీ ఆజ్ఞాపించలేక పోయాడు. పోనీ, తనకు నచ్చనపుడు విడిచిపెట్టడమైనా అతడికి చేతకాలేదు. అంతరాత్మను చంపుకొని, అధర్మపక్షానికి కొమ్ముకాశాడు.

27. "సేనాపత్యంచ రాజ్యంచ దండనేతృత్వమేవచ
కృషి ర్వాణిజ్య పేతృత్వే బ్రహ్మవిప్రో హ్మణో జనః" మనుస్మృతి

స్వధర్మాన్ని నిలబెట్టుకొని, లోకహితంతో శ్రుతికల్పడం అతనికి చేతకాలేదు.

ద్రోణుడు తనపై పూర్తిగా బ్రాహ్మణ ధర్మాన్ని పనిచేయ నిచ్చినా, లేక, పూర్తిగా క్షత్రియధర్మాన్ని అనుసరించినా, అతడు అధర్మాన్ని ఎదిరించి ఉండేవాడే కానీ, తనకు నచ్చనిచోట చేతులు ముడుచుకుని నిలబడి ఉండేవాడు కాదు. దీన్నిబట్టి చూస్తే, అతని పైన శూద్రధర్మం (భృత్యధర్మం) కూడా ఎక్కువ ప్రభావాన్ని చూపించిందనిపిస్తుంది. ద్రుపదుడు తనను అవమానించాడన్న కోపం క్రమంగా అతణ్ణి ఈస్థితికి కొనివచ్చి వదలిపెట్టింది. అప్పుడే అతడు కోపించకుండా, తన ధర్మాన్ని తాను నిల్పుకొన్నట్టయితే ఇంత క్రిందకు పడిపోయిఉండేవాడు కాడేమో!

అయితే ఈ సందర్భంలో మనం మరో సూక్ష్మాన్ని కూడా గుర్తుంచుకోవాలి. ద్రోణుడు తన ప్రవర్తనకు భీష్ముణ్ణి ఆదర్శంగా పెట్టుకున్నట్లు కనిపిస్తుంది. భీష్ముడంటే అతడికి ఎనలేని గౌరవం. భీష్ముడేగదా కోరి ద్రోణుణ్ణి కురుకులగురువును చేసింది! భీష్ముడు ఉపేక్షాభావాన్ని విడిచి, విజృంభించి ఉన్నట్లయితే ద్రోణుడు కూడా చేయికలిపి ఉండేవాడు. అలా జరగకపోవడం వల్ల భీష్ముడికి సహచరుడిగా ద్రోణుడు మిగిలిపోయాడనిపిస్తుంది. ఒకరు కురువృద్ధు; మరొకరు గురువృద్ధు. ఇరువురూ చిత్రమైన స్థితిలోపడి, లోకహితంతో సకాలంలో చేతులుకలపలేకపోయారు. చివరివరకూ ద్రోణుడు కౌరవుల పక్షాన నిలవడానికి భీష్ముడియెడల అతనికి గల గౌరవమే కారణమని చెప్పక తప్పదు. దీనికితోడు ధృతరాష్ట్రుడి ఉప్పుతినడం వల్ల గురువుగా ఉండవలసిన తాను అలా ఉండలేకపోవడమే కాక, తన ఇష్టానికి పూర్తి వ్యతిరేకంగా పనిచేయవలసి వచ్చింది. పరధర్మాలయిన క్షత్రియభృత్యధర్మాలమధ్య చిక్కుకొని, అతని స్వధర్మమైన బ్రాహ్మణధర్మం నలిగిపోసాగింది.

కృష్ణరాయబారం విఫలమైనప్పటినుంచి ద్రోణుడిలోని బ్రాహ్మణుడు మేల్కోవడం ప్రారంభించాడు. దుర్యోధనాదులకు నచ్చ చెప్పడానికి ద్రోణుడు యత్నించాడు. కాని, ఫలితం లేకపోయింది. కురుక్షేత్ర మహాసంగ్రామంలో భీష్ముడితో, తనకున్న స్నేహ ధర్మాన్నీ, ధృతరాష్ట్రుడి యెడల తనకున్న భృత్యధర్మాన్నీ పాటించి ఇష్టంలేకపోయినా చేయక తప్పదన్నట్లు, అధర్మపక్షాన నిలబడి పోర సాగాడు. యుద్ధం జరుగుతున్నకొద్దీ అతనిలో బ్రాహ్మణ ధర్మానికీ, క్షత్రియ భృత్య ధర్మాలకీ అంతర్యుద్ధం ప్రారంభమయ్యింది. తాను ఈ స్థితికి దిగజారిపోయినందుకు అంతులేని వేదన కలిగింది. ఆ వేదనను ఆపుకోలేక దుర్యోధనుడితోనే ఇలా అన్నాడు :

"అన్ని విధంబులం బఱచి యైనను నక్కటికంబు లేక వా
రి న్నెఱిమాలి కానలఁ జరింపఁగఁ బంచినఁ బోయి వచ్చి య
య్యన్నయుఁ దమ్ములుం దమకు నయ్యెసగం బిల వేఁడి కానకె
ట్లున్నను వారి మార్గమునట క్కోర్చితి నేనొక బ్రాహ్మణుండనే" 28

తాను బ్రాహ్మణ ధర్మాన్నుంచి తప్పి చరించానని ఒప్పుకొని నొచ్చుకున్నాడు. అయినప్పటికీ క్షత్రియోచితంగా యుద్ధం చేస్తూనే ఉన్నాడు.

చివరిదశలో అశ్వత్థామ చనిపోయాడని భీముడు చెప్పినప్పటికీ విశ్వసించకుండా, ఘోరంగా పోరాడుతున్న ద్రోణుడిదగ్గరకు మహార్షులైన విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, గౌతముడు, కశ్యపుడు, వసిష్ఠుడు, అత్రి మొదలైనవారంతా కలిసివచ్చి ద్రోణుడితో "భారద్వాజా! నీవు బ్రాహ్మణుడవు. వేదవేదాంగ విదుడవు. నీకు సంగ్రామం చేయటం ధర్మమా? ఇంతకుముందు చేస్తే చేశావు - నీకు కాలం పూర్తమయ్యింది. ఇక సమరంనుంచి విరమించడం మేలు.

28. ఆం. మ. భా-ద్రోణ -5-32.

మోమాటవిని, విల్లంబులు ప్రక్కనబెట్టి శాంతినిపొందు" అన్నారు.29 మహర్షుల మాటలతో ద్రోణుడికి కర్తవ్యం బోధపడింది. అశ్వత్థామపోయినట్లు ధర్మరాజు చెబితే నమ్ముతానని ద్రోణుడు కోరగా కృష్ణుడి ఆజ్ఞపై ధర్మజుడు అలాగే చెప్పాడు. ఆపైన ద్రోణుడు అస్త్రసన్న్యాసంచేసి అంతర్ముఖుడై ఊర్ధ్వలోకాలకేగాడు. ఆతరువాత అతడిశవాన్ని పట్టుకొని, దానితలను నరికాడు ధృష్టద్యుమ్నుడు.

బ్రాహ్మణధర్మంనుంచి తప్పి, లోకహితాన్ని విస్మరించినందుకు పశ్చాత్తాపపడడంతో ద్రోణుడుచేసిన పాపానికి పరిహారం కలిగింది. అందువల్లనే మహర్షులంతా కలిసివచ్చి అతణ్ణి నిజధర్మంలోనికి మేల్కొల్పి ఊర్ధ్వలోకాలకు సాగనంపారు. ద్రోణుడు వస్తుతః చెడ్డవాడుకాడు. తాత్కాలికమైన స్థితిగతులవలన, ఆవేశాలవలన స్వధర్మంనుంచి చెదిరినవాడు. చెదిరినందుకు తగిన ఫలితం అనుభవించి, మధనపడి అదృష్టవశాన చివరిక్షణాల్లో స్వధర్మంలోకి మేలుకున్నాడు.

## వర్ణధర్మనిర్వహణలో అశ్వత్థామ :

ద్రోణుడికీ కృపికీ జన్మించిన ఏకైక సంతానం అశ్వత్థామ. పుట్టుకతోనే బ్రాహ్మణధర్మం ఇతనియందు వ్యక్తమయినప్పటికీ, ఇతనిలో రజోగుణపాలు ఎక్కువ. తండ్రి హస్తినకు చేరడంతో ఆ రజోగుణానికి రాచరికంతో సహవాసం అబ్బింది. క్రమంగా, అతణ్ణి బ్రాహ్మణధర్మంనుంచి ప్రక్కకులాగింది. రాజకుమారులతోకూడి, అశ్వత్థామ తానుకూడా క్షత్రియునివలె ప్రవర్తించసాగాడు. యుద్ధాల్లో యథేచ్ఛగా పాల్గొన్నాడు. అర్జునుడితో సాటిగా విలువిద్య నేర్చుకున్నాడు.

29. ఆం. మహాభా. - 5-308

ధర్మాధర్మాలు తెలిసికూడా ద్రోణుడిలాగానే దుర్యోధనుడి వైపే నిలిచాడు. కురుక్షేత్ర మహాసంగ్రామంలో అధర్మపక్షాన నిలిచిన ఇతనికి ద్రోణుడికి ఉన్నపాటి వివేకంకూడా లేదు. యుద్ధంలో బలాబలాలు తేల్చుకుందామనుకున్నాడుతప్ప, ధర్మాధర్మాలు అతడికి స్పృహలోలేవు. నడిమివైష్ణవానికి నామాలు దట్టం అన్నట్లు, స్వధర్మమైన బ్రాహ్మణత్వాన్నుంచి పరధర్మమైన క్షత్రియత్వం వైపుకు తూలిన అశ్వత్థామ క్షత్రియత్వంలో ఉన్మాదాన్ని రంగరించుకున్నాడు. తొడలు విరిగి పడిఉన్న తన మిత్రుడూ, ప్రభువూ అయిఉన్నదుర్యోధనుణ్ణి తృప్తిపరిచేటందుకుగాను నిద్రపోతున్న ఉపపాండవ ధృష్టద్యుమ్నాదుల్ని చంపివేయడానికి సంకల్పించాడు. కృపాచార్యుడూ, కృతవర్మ "అలిసి నిద్రిస్తున్నవాళ్ళను రాత్రిపూట చంపడం అధర్మం, తెల్లవారగానే సంహరించవచ్చు" అని అశ్వత్థామకు నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. కానీ అశ్వత్థామ వినిపించుకోలేదు. పాండవులు అందర్నీ ధర్మం ప్రకారమే చంపారా, నేను వాళ్ళను ధర్మం ప్రకారం చంపడానికి ?" అని ఎదురు ప్రశ్నించాడు.30

అశ్వత్థామకు తాను పరధర్మాన్ని ఆశ్రయించినట్లు పూర్తిగా తెలుసు. ఉపపాండవవధకుముందు కృపాచార్య కృతవర్మలతో అతడికి జరిగిన సంభాషణల్లో అతనే ఇలా చెప్పాడు. "ప్రజాపతి ప్రజల సృజించి విప్రునకు దమంబును, క్షత్రియునకుఁ దేజంబును, వైశ్యునకు దక్షత్వంబును, శూద్రునకుఁ ద్రివర్ణానుకూలతయు వలయు గుణంబులుగా విధించెంగావున శాంతుండుగాని విప్రుండును, తేజస్వి గాని రాజును, దక్షుండుగాని వైశ్యుండును, ద్రివర్ణానుకూలుడుగాని శూద్రుండును నిందబడుదురది యిట్లుండె-నేనును విప్రకులంబునందు

30. "..........వారె కాదె చెడఁగొట్టిరి సంగరధర్మ సేతువున్"
ఆం. మ. భా-సౌప్తిక-1-85.

జనపూజితంబైన వంశంబునందు జనియించి భాగ్యహీనతవలన రాజోచితధర్మంబనుష్ఠించితి. నడుమ నా నిష్ఠ వదలి విప్రధర్మంబు మహనీయంబయినది యాచరించువాడనగుట నామదికింజూడ మేలై యుండదు".31

తాను చేస్తున్నది తప్పని తెలిసినా అతడి ఆవేశం అతణ్ణి వెనక్కు తిరగనీయలేదు. అయితే, ఇతడిలో ఒక విశిష్టగుణం ఉంది. అదే రుద్రభక్తి. పాండవ శిబిరాలను సమీపిస్తున్నపుడు శివుడు భూతాకారంలో అశ్వత్థామని ఎదుర్కొంటాడు. తాను ఎదుర్కొన్నది భూతమేనని భావించి అశ్వత్థామ దానితో పోరాడ యత్నించి విఫలుడవుతాడు. అప్పు డతడికి తన యిష్టదైవమయిన ఈశ్వరుడు గుర్తుకువస్తాడు. ఈశ్వరధ్యానంలో నిమగ్నుడైన అశ్వత్థామముందు ఒక బంగారు వేదిక సాక్షాత్కరిస్తుంది. వేదికపైన అగ్నిజ్వాలలూ, వేదికచుట్టూ వివిధ వర్ణరూపాలతో ప్రమథులూ సాక్షాత్కరిస్తారు. అశ్వత్థామ అగ్నులను మరింత రగుల్కొల్పి, ఆ జ్వాలలకు తనను తాను సమర్పించుకుంటాడు. ఆ సమర్పణతో శివుడు సాక్షాత్కరిస్తాడు. తాను కృష్ణుడిపై గల ప్రేమతో శిబిరాలకు రక్షగా నిలిచాననీ, ఇక వారికాలంతీరింది కనుక వారిని సంహరించవచ్చుననీ చెప్పి, ఖడ్గాన్ని ఒకదాన్ని అందించి, తేజోరూపంలో అతనిలో ప్రవేశిస్తాడు. ఆపైన అశ్వత్థామ విజృంభిస్తాడు.

ఉపపాండవాదులకు కాలంతీరిందన్నసంగతి కృష్ణుడికి తెలుసు. కనుకనే ఆ రాత్రి పాండవులను మరొకచోట నిలిపివేశాడు కృష్ణుడు. మర్నాటి ఉదయం పాండవులకు ఉపపాండవవధవార్త తెలిసింది. ద్రౌపది ఆ వార్తవిని నరికిన అరటిచెట్టులా పడిపోయింది. భీముణ్ణి పోయి అశ్వత్థామనిపట్టి పరాభవించమంది. భీముడు కోపంతో

31. ఆంధ్ర మహా భా-సౌప్తిక-1-48.

ఊగుతూ బయల్దేరాడు. ధర్మరాజుడితో చెప్పి అతనివెనుక కృష్ణార్జునులు బయలుదేరారు.

అశ్వత్థామ పాండవులసతుల గర్భాలతోసహా అపాండవం అయిపోవాలని సంకల్పించి బ్రహ్మశిరోనామాస్త్రాన్ని ప్రయోగించాడు. అర్జునుడు దాన్ని ఉపసంహరించడానికి తానూ ఒక బ్రహ్మశిరోనామాస్త్రాన్ని విడిచాడు. రెండింటికీ జరిగే పోరాటంతో జగత్తు కంపించినట్లయ్యింది. ఆ సందర్భంలో వారిని కలిసిన వ్యాసుడు లోకహితంకోసం యిరువురూ అస్త్రాలు ఉపసంహరించుకోవలసిందిగా ఆదేశించాడు. అర్జునుడు ఉపసంహరించాడు. అశ్వత్థామ తనకు చేతగాదన్నాడు. ఈ అస్త్రాన్ని అశ్వత్థామకుపదేశించిన ద్రోణుడు ఎలా ఉపసంహరించుకోవాలో అతడికి చెప్పలేదు. పైగా ఎట్టిపరిస్థితులలోనూ, ఎవ్వరిమీదా ప్రయోగించవద్దని ఆదేశించాడు. అశ్వత్థామ గుర్వాజ్ఞను ధిక్కరించాడు.

కృష్ణుడు ఉత్తరగర్భాన్నిమాత్రం విడచిపెట్టమని కోరాడు. అశ్వత్థామకు ఆ కోరిక కృష్ణుడు పక్షపాతబుద్ధితో కోరుతున్నట్లు తోచిందితప్ప, లోకహితంకోసమనీ, వంశాంకురాన్ని నిలపటంకోసమనీ తట్టలేదు.32 అతడు కృష్ణుని కోరికను మన్నించలేదు. అప్పుడు కృష్ణుడు "నీవు ఆ బిడ్డప్రాణాన్ని హరించినా నేనతడికి ప్రాణంపోసి ఆయువునిస్తాను" అన్నాడు. అశ్వత్థామ అవహేళనగా చూశాడు.33 అప్పుడు కృష్ణుడు ఉత్తరగర్భంలో పరీక్షిత్తు పుట్టే విధం ముందుగానే పెద్దలు చెప్పారనీ, అతడు పుట్టి వంశాన్ని నిలిపి రాజ్యాన్ని రక్షిస్తాడనీ చెప్పి, బాలఘాతకుడైన అతణ్ణి ఇలా శపిం

---

32. "పక్షపాతంబున నీవిట్లు పలికిన నేనట్లొలజేయుదు ?........"

ఆం. మ. భా - సౌప్తిక-2-83.

33. "అనినవిని నగుచుఁ గుంభజ తనయుండిట్లనియె - నప్రదగ్ధుని బ్రతికించిన మేలకాదె నీవి న్ననువు నెఱింగెదము కాక సరసభదీనన్"

ఆం. మ. భా - సౌప్తిక - 2-85

శపించాడు-"నీకు ఆహారం దొరకదు. సహాయం లభించదు. దుర్వాసన కొట్టే రక్తంతో తడిసిన ఒంటితో మూడు వేలసంవత్సరాలు తిరుగుతూ ఉండు. నీవు చూస్తుండగానే పరీక్షిత్తూ, అతడి కుమారుడైన జనమేజయుడూ రాజ్యాన్ని చక్కగా పాలిస్తూ ఉంటారు".

అప్పుడు వ్యాసుడు అశ్వత్థామతో "బ్రాహ్మణుడవైనప్పటికీ నీవు క్రూరకర్మకు రోయలేదు. నా వాక్యాలు కూడా లక్ష్యపెట్టకుండా ఈ పాపకర్మను చేశావు. నీవు కృష్ణుడు అన్నట్లే అయిపోతావు" అన్నాడు.34 అశ్వత్థామ "నీవు మనుష్యులలోనే ఉండిపోతా"వని వ్యాసుడికి ప్రతిశాపమిచ్చి, తన శిరోరత్నాన్ని భీముడికిచ్చి, వెళ్ళిపోతాడు.35



మానవాళి అభ్యుదయంకోసం దిగివచ్చిన వ్యాసుడికి అశ్వత్థామ తాను శాపమిచ్చానని అనుకొన్నా అది వ్యాసుడికి వరమే. వేద వ్యాసుడు మనుష్యులతో ఉండటానికే దిగివచ్చాడు గదా !



ఉపపాండవవధలో అశ్వత్థామ ఉన్మాదియై విజృంభించినా వారిని వధించమని అప్పగించింది శివుడేగనుక అశ్వత్థామ అధర్మం చేసినట్లు కాలేదు. లయకారుడైన రుద్రునికి కూలిపుచ్చుకోని ఉపకరణంగా సహకరించినవాడయ్యాడు. అంతటితో సరిపెట్టుకొనిఉంటే అశ్వత్థామస్థితి అధ్వానమయ్యేదికాదు. అప్పటివరకూ అతడి కూడని ఆవేశాలుకూడా ప్రకృతి తన ప్రణాళికకు అనుగుణంగా ఉపయోగించుకుంటూ వచ్చింది. ఆపైన అతని ప్రవర్తన అవతారపురుషుడికే అసహ్యమైంది. అపాండవం కావాలని అతడు సంకల్పించడం లోకహితానికి విరుద్ధం. అతని హృదయంలో లోకహితానికీ, రాజ్య క్షేమానికీ కాస్తంత చోటు ఉన్నదేమో చూద్దామని కృష్ణుడంతటి

34. ఆం. మ. భా-సౌప్తిక - 2-87

35. ఆం. మ. భా-సౌప్తిక-2-88.

వాడు ఉత్తరగర్భాన్ని వదిలిపెట్టమని నోరుతెరిచి అడిగాడు. లోక హిత దృష్టిలేని అశ్వత్థామకు, కృష్ణుడిలో చెల్లెలి మనుమణ్ణి బ్రతికించుకోవాలన్న పక్షపాతబుద్ధి కనబడింది. అతడిచూపు అంతకన్న పైకిపోలేదు. లోకహితమే ధ్యేయంగా పెట్టుకున్న కృష్ణుడికి మొగమాటమే లేదు. "నీవు ప్రాణాలుతీస్తే నేను పోస్తాను" అన్నాడు. అప్పటికీకూడా అశ్వత్థామ కన్నులపైకప్పినపొర తొలగలేదు. కృష్ణుడి పక్షపాతబుద్ధి తారస్థాయినందుకుంటోందన్న హేళనభావమే అతడికి కలిగింది. అప్పుడు కృష్ణుడు అశ్వత్థామను శపించాడు. పరీక్షిత్తూ, అతడి వారసులూ పరిపాలిస్తూఉంటే శాపాన్ని అనుభవిస్తూ కళ్ళారా చూడమన్నాడు. "కన్నుమూసుకుంటే వెలుగు నీకు కనబడదే గాని, వెలుగు మాసిపోదు. నీవు అడ్డినంతమాత్రాన లోకహితం దెబ్బతినదు" అని కృష్ణుడు శాపంద్వారా అశ్వత్థామకు ఇచ్చిన సందేశం. ఈ సత్యాన్ని కృష్ణుడితో సమానంగా దర్శించిన వ్యాసుడు, కృష్ణుడు శపించగానే 'తథాస్తు' అన్నాడు. కృష్ణుడుగానీ, వ్యాసుడు గానీ శాపమిచ్చిన సన్నివేశం ఇదొక్కటే. ఆ అవకాశం అశ్వత్థామకే దక్కింది. పరధర్మం ఎంతటి భయావహస్థితికి కొనిపోతుందో అశ్వత్థామ జీవితం నిరూపిస్తోంది. అందుకే అన్నాడు కృష్ణుడు "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అని.36

## ధర్మనిర్వహణలో విదురుడు :

మాండవ్యమునిచే శపించబడిన యముడు వేదవ్యాసునకూ, అంబిక దాసి అయిన శూద్రవనితకూ విదురుడై జన్మించాడు. శాపకారణాన శూద్రయోనియందు జన్మించినప్పటికీ లోకహితాన్ని కోరిన అతని జీవితమార్గం బ్రాహ్మణధర్మాన్ని అనుసరించింది. సత్త్వగుణ సంపన్నుడైన విదురుడు ధృతరాష్ట్రుణ్ణీ, అతని కొడుకుల్నీ సరయిన దారిలోనికి తీసుకురావాలని జీవితమంతా కృషి చేశాడు. విదురుడి

36. భగవద్గీత—3—35.

నీతివాక్యాలను ధృతరాష్ట్రుడు తనకు నిద్రపట్టనప్పుడు మాత్రం కేవలం మత్తుమందుగా వాడుకున్నా, ఆబోధలు ఆచరింపదలచిన ముముక్షువులకు మాత్రం కరదీపికలై నేటికీ వెలుగునిస్తూనే ఉన్నాయి. ధృతరాష్ట్రుడు విదురుడి ఉపదేశం వినలేదు, విదురుడు లేకుండా మనలేదు. పరిపూర్ణ కుటిలబుద్ధి అయిన ధృతరాష్ట్రుడికి విదురుడి సాన్నిధ్యం కొంత వెరపును కలిగించేది. కాబట్టి, అతని వాక్కులకు తట్టుకోలేక దూరంగా ఉంచుదామనుకునేవాడు. ఆ వాక్కులలోని చల్లదనమే రాగద్వేషాలతో ఉడికిపోతున్న తన మనస్సుకు ఉపశమన మని అనుభవంలో గ్రహించినవాడు గనుక, మళ్ళీ పిలిపించుకొని బతిమాలుకునేవాడు.

విదురుడు మొగమోటమి లేనివాడు. ఇది ధర్మం, ఇది అధర్మం అని చెప్పడానికి అతడు ఎప్పుడూ జంకలేదు. భీష్మాదులు సైతం నోరు మెదపని వస్త్రాపహరణాది సన్నివేశాల్లో కూడా విదురుడు నోరు తెరచి ధర్మాన్ని ఘోషించాడు. పాండవ పక్షపాతి అని దుర్యోధనాదులు పనిగట్టుకొని పదేపదే ప్రకటించినా అతడు పట్టించుకోలేదు. ధర్మబుద్ధులైన పాండవులకు హితంకోరడానికీ సహకరించడానికీ కూడా జంకలేదు. లాక్షాగృహంగూర్చి సంకేతభాషలో ధర్మజుణ్ణి హెచ్చరించింది విదురుడు. ఆగృహంనుంచి అరణ్యంవరకూ సొరంగాన్ని త్రవ్వించిందీ విదురుడే. ఈ సన్నివేశాలవల్లనే విదురుడంటే పాండవులకు అమితమైన అభిమానం ఏర్పడింది.

విదురుడంటే పాండవులకు ఇష్టమని గ్రహించిన ధృతరాష్ట్రుడు పాండవులను ఎప్పుడు పిలిపించాలన్నా విదురుణ్ణే నియోగించేవాడు. తనకు ఇష్టంలేకున్నా రాజాజ్ఞగా విదురుడు ఆ విధిని నిర్వహిస్తూ ఉండేవాడు. బోయవాడు వలవేసి పక్షులను పట్టినట్లు ధృతరాష్ట్రుడు విదురుణ్ణిపంపి పాండవులను రాబట్టేవాడు. ఒకప్రక్క రాజాజ్ఞను నిర్వహిస్తూనే మరొకప్రక్క మొగమోటమి లేకుండా ధర్మాన్ని

నొక్కి చెప్పేవాడు విదురుడు. అంతేకాదు, ధర్మమార్గానికి తన పరిధిమేరకు తాను సహకరిస్తూ ఉండేవాడు.

తన స్వధర్మం లోకహితానికి సమర్పించినవాడు ధృతరాష్ట్రుడి కొలువులో ఇతడొక్కడే. కనుకనే దుర్యోధనుడు పెద్దలందరినీ పిలిచి, పెద్ద విందు ఏర్పాటుచేసి, మొగమోటపెట్టజూచినా, అతని విందుకు అంగీకరించకుండా కృష్ణుడు విదురుడి ఇంట్లోనే ఆతిథ్యం స్వీకరించాడు. భగవంతుడికి కావలసింది ఆడంబరాలు, ఆర్భాటాలు కావు. అతడికి కావలసింది తన స్వరూపమైన లోకహితానికి స్వధర్మాన్ని సమర్పించడం. అది చేసినవాడు విదురుడు. కాబట్టి విదురుడికే ఆ అదృష్టం దక్కింది. ఈ సందర్భంలో భీష్మాదులుసైతం విదురుడిముందు తేలిపోయారు.

ఉపప్లావ్యంనుంచి వచ్చిన సంజయుడిమాటలతో కల్లోలిత మనస్కుడైన ధృతరాష్ట్రుడు విదుర్ణి పిలిపించుకొని, నిద్రరావడం లేదు, ఏమైనా కొన్ని నీతివాక్యాలు చెప్పమంటాడు. విదురుడు కాసేపు నీతులుచెప్పి, పాండవుల ప్రసక్తి తెస్తాడు. "ఆ ప్రసక్తి వద్దు, పూర్వం చెప్పిన నీతుల్లాంటివే మరికొన్ని చెప్పు" అంటాడు ధృతరాష్ట్రుడు. ఇలా కొంతసేపు అయినతర్వాత ధృతరాష్ట్రుడు, "నీతులు చాలు, కొంత పరమార్థదృష్టిని కలిగించే వాక్యాలు చెప్పు" అంటాడు. అప్పుడు విదురుడు, "నేను శూద్రవనితకు పుట్టినవాణ్ణి పరమార్థ దర్శనాన్ని ఉపదేశించడం నాకు అంగీకారం కానిపని.37 నీవుకోరిన పరమార్థాన్ని వివరించగలవాడు సనత్సుజాతుడు. ఆ మహానీయుడిద్వారానే నీవు వినాలి" అని అతణ్ణి స్మరిస్తాడు. సనత్సుజాతుడు సాక్షాత్కరించి, విదురుడి కోరికపై

37. "...నేను శూద్రయోనిజాతుండ వేదాంతవేద్యంబులగు నర్థంబులు నాకగోచరంబులు..." ఆం. మ. భా - ఉద్యోగ - 2-102.

ధృతరాష్ట్రుడికి పరమార్థం బోధిస్తాడు. ఈ సందర్భంలో విదురుడు శూద్రుణ్ణని చెప్పడంలో రెండురకాలయిన కారణాలు గోచరిస్తాయి. మొదటిది: వినయం విదురుడిసొమ్ము. తాను అనుసరించేది బ్రాహ్మణ ధర్మమే అయినా, సేవాభావం తనకు ఇష్టం కనుక ప్రపన్నుడై వినయంతో తాను శూద్రుడనని చెప్పుకునేవాడు. ఇక, రెండవ కారణం : మనం ఎంతచెప్పినా అంధరాజుకు అంతంతమాత్రంగానే అందుతుంది. సనత్సుజాతుడు అంతటి మహనీయుడి సాన్నిధ్యం వల్లనైనా, అన్నగారిలో కావలసిన మార్పు వస్తుందేమోనని భావించడం - మొత్తంమీద విదురుడు ఎంత ప్రయత్నించినా గుడ్డిరాజే గెలిచాడు.

విదురుడి ప్రవర్తనలో యమం మూర్తీభవించి ఉంటుంది. మరి అతడు యముడుగదా ! కానీ శపించబడ్డవాడు. కాబట్టే, అతడిమాట ఎవ్వరూ వినలేదేమో ! శాపనిర్వహణకు శూద్రుడినని చెప్పుకున్నా, సేవాభావాన్ని అభ్యసించినా, అతడినుంచి వ్యక్తమయ్యింది శమదమాది గుణసంపన్నమైన పరిపూర్ణ బ్రాహ్మణత్వం. ఆ స్వధర్మాన్ని అతడు లోకహితానికి సమర్పించుకున్నాడు. విదురుడి ఉనికి కౌరవుల కొలువుకూటంలోనైనా, హృదయం కృష్ణుడితోను, అతడి ప్రణాళికతోను నడిచింది.

ద్రోణుడు బ్రాహ్మణుడని సమర్థించడంకన్నా విదురుడు బ్రాహ్మణధర్మం మూర్తీభవించిన వినయసంపన్నుడైన శూద్రుడని కీర్తించడంలో ఎక్కువ పరమార్థం గోచరిస్తుంది. గుణకర్మ విభాగాన్నిబట్టి చాతుర్వర్ణ్యం ఉంటుందని ప్రతిపాదనచేసిన కృష్ణ వ్యాసుల సిద్ధాంతాలకు విదురుడు సజీవవ్యాఖ్యానం అనవచ్చు.

### వర్ణధర్మనిర్వహణలో ధర్మవ్యాధుడు :

ధర్మవ్యాధుడు పూర్వజన్మలో బ్రాహ్మణధర్మాన్ని అనుసరించినవాడు. వేదవేదాంగపారంగతుడు. ఒక రాజపుత్రుడితో

స్నేహంచేసి, ధనుర్వేదాన్నికూడా నేర్చాడు. అతడితో కలిసి, వేటకుపోయి, మృగాలను వేటాడుతూఉండగా అతడు వేసిన ఒక బాణం లతలమధ్యలో తపస్సుచేసుకుంటున్న మునికి తగిలింది. ఆ ముని 'హా' అని అరచి పడిపోయాడు. బాధతో భూమిపై పడి దొర్లుతున్న ఆ మునిదగ్గరకు ఇతడు చేరాడు. ఆ ముని ఇతణ్ణిచూసి కోపంతో "బ్రాహ్మణుడవైనప్పటికీ, పాపప్రవర్తనతో శూద్రకర్మల్ని ఆచరించావు. నీవాచరించిన కర్మనుబట్టి పైజన్మలో వ్యాధుడవై పుడతావు" అని శపించాడు. "తెలియక తప్పుచేశాను, క్షమించండి. దుర్భరమైన పుట్టుకను ప్రసాదించకండి" అని అతడు వేడుకున్నాడు. అతడి పశ్చాత్తాపాన్ని గ్రహించి, ఆ ముని "నీకు ఎరుకుల కులంలో పుట్టుకతప్పదు. కానీ, ధర్మాలన్నిటి ఎరుక నీకుంటుంది. తల్లిదండ్రుల్ని భక్తితో కొలుస్తావు. పెద్దలసేవతో పరమశుభాన్ని పొందగల నీకు ఈ జరిగిన కథకూడా గుర్తుఉంటుంది. ఆపై జన్మలో నీవు మళ్ళీ బ్రాహ్మణుడివవుతావు" అని అనుగ్రహించాడు.38 ఆ ముని శరీరాన్నుంచి బాణాన్ని తీసివేసి, తగినసేవచేసి, అతణ్ణి తృప్తిపరచిన ఇతడు ధర్మవ్యాధుడై పుట్టాడు. అనగా, ఒకబ్రాహ్మణుడు తాను చేసిన కర్మదోషంవల్ల ఈజన్మ ఎత్తవలసివచ్చింది.

ధర్మవ్యాధుడు తన వంశాచారప్రకారం మాంసవిక్రయశాలను చక్కగా నిర్వహించాడు. తాను మాంసం తినడు, జంతువులను చంపడు. చంపిన జంతువులను కొనితెచ్చి, కావలసినవారికి మాంసాన్ని విక్రయిస్తూ ఉంటాడు. ఎవరి ఆహారం వారు తినడం తప్పుగాదని అతని ఉద్దేశం. హింసాహింసల విషయంలోను, ధర్మాచరణ విషయంలోను ఇతడు చక్కని ధర్మాద్వైతస్థితిని ఉపదేశించాడు.

38. ఆం. మ. భా - అరణ్య - 5-130-135.

తనకు కలిగిన ధర్మదర్శనానికి తల్లిదండ్రులసేవే కారణమని ఇతడు నొక్కి చెప్పాడు. బిడ్డలకు తల్లిదండ్రులు దైవం; భార్యకు భర్త దైవం - ఈరీతిగా దైవం మన ఎదుటనే తిరుగుతున్నాడు. ఎరిగి సేవించినవారికి ఎరుక లభించగలదు. ఇది ధర్మవ్యాధుని అనుభవం; ఉపదేశం. ఈ ఉపదేశాన్ని స్వీకరించి, ఎందరెందరో తరించారు. కథలో చెప్పబడిన పతివ్రత అలా తరించినవారిలో ఒకతె. ఆమెచే పంపబడిన కౌశికుడనే బ్రాహ్మణ యువకుడు ధర్మవ్యాధుని చేతలకూ బోధలకూ ప్రభావితుడై తనను తాను దిద్దుకున్నాడు. తల్లిదండ్రులకన్నా తపస్సే ముఖ్యమనుకొన్న కౌశికుడు, తల్లిదండ్రులసేవే నిజమైన తపస్సని దర్శించాడు. ఈవిధంగా అన్ని వర్ణాలవారిచే, అన్నితరహాలవారిచే ఆరాధింపబడ్డ పరమగురువు ధర్మవ్యాధుడు.

ఇతనిలో ఒక చిత్రమైన సమన్వయ దృక్పథం దర్శనమిస్తుంది. తాతతండ్రులనుండి వస్తున్న వంశాచారాన్ని ఇతడు వదలిపెట్టలేదు. సమాజానికి తమవంశం చేస్తూవచ్చిన సేవను క్రమశిక్షణతో కొనసాగించాడు. మరొకప్రక్క తనలో బ్రాహ్మణత్వాన్ని దర్శించి చేరువైనవారికి గురువై చేయూత నిచ్చాడు. విదురుడిలాగా, తాను శూద్రవంశంలో పుట్టానని ఇతడు మొగమోటపడలేదు.

ధర్మవ్యాధుడు తన పూర్వకథను ఎరిగిన జ్ఞాని.తన స్వభావమూ, ఆ స్వభావంనుంచి దిగివచ్చే గుణకర్మలూ బ్రాహ్మణధర్మాన్ని అనుసరిస్తున్నాయని అతడికి తెలుసు. అలాగే, తాను పూర్వజన్మలో ఆచరించిన కూడని వేటా, దానివల్ల మునికి కలిగిన బాధా, తనకు ఈ బోయజన్మను ప్రసాదించాయనికూడా తెలుసు. మానవుడి జన్మల పరంపరపై స్వభావమూ, గుణకర్మల ప్రభావంతోపాటు, పూర్వజన్మల్లో ఆ గుణకర్మల్ని తప్పి ఆచరించిన కర్మల ప్రభావంకూడా ఉంటుందని అతడు తన అనుభవంతో గ్రహించాడు. కాబట్టి,

మాంసవిక్రయశాలలో తనకు ప్రాప్తించిన బోయధర్మాన్ని, సంసార జీవులకు చేయూతనివ్వడంలో తనను వరించిన బ్రాహ్మణధర్మాన్ని సద్వినియోగపరచుకొని ధన్యత చెందాడు.

సామాన్యంగా జీవి తన గుణకర్మలకు అనుగుణమైన వాతావరణంలోనే జన్మిస్తూ ఉంటాడు. కొన్ని ప్రత్యేకసందర్భాల్లో, అనగా, తన గుణకర్మలకు తగని కర్మలు ఆచరించినపుడు, తన గుణకర్మలకు చిత్రమైన శిక్షణ అవశ్యకమైనపుడు తన స్వభావానికి తగని వాతావరణంలో జన్మ ఎత్తుతాడు. అప్పుడతడు తన స్వభావానికీ, తానున్న వాతావరణానికీ పొత్తుకుదరడంలేదని ఘర్షణపడకూడదనీ, ఆ స్వభావమూ, ఈ వాతావరణమూ తనకు ఎలా, ఎందుకు సిద్ధించాయో దర్శించడానికి యత్నించి, జీవితాన్ని సద్వినియోగపరుచుకోవాలనీ ధర్మవ్యాధుడి కథద్వారా మనకు అందే సందేశం. ఇదే ధర్మవ్యాధుడు తనజీవితంలో అనుభవించిన ధర్మాద్వైతస్థితి. కుల (వంశ) ధర్మానికీ, వర్ణధర్మానికీ ఘర్షణలేకుండా జీవితాన్ని తీర్చిదిద్దుకుని పరమధర్మంతో శ్రుతికలిపి, పరమగురువుగా ఆరాధింపబడ్డవాడు ధర్మవ్యాధుడు.

## వర్ణధర్మనిర్వహణలో కర్ణుడు :

కర్ణుడు దుర్వాసుడి వరప్రభావంవల్ల కుంతికి కన్యగా ఉన్నప్పుడు సూర్యుడివల్ల కలిగినవాడు. అనుకోని సన్నివేశానికి తట్టుకోలేని కుంతి అతణ్ణి పేటికలోపెట్టి నదిలో వదిలింది. ఆబిడ్డ బిడ్డలులేని సూతుడికి దొరికాడు. సూతుడు, అతని భార్య రాధ దేవుడిచ్చిన బిడ్డగా అతణ్ణి పెంచుకున్నారు. అతడు నలుగురిలో సూతపుత్రుడిగానే చెల్లుబడి కాసాగాడు.

కర్ణుడిలో ఉన్నది క్షత్రియధర్మం. సూర్యరశ్మివంటి ఆ ధర్మం కులమనే అరచేతిని అడ్డుపెడితే ఆగేదికాదు. కుమారాస్త్రవిద్యా

ప్రదర్శనంలో అర్జునుడు చూపిన అస్త్రవిద్యాప్రదర్శనకు అందరూ మురిసిపోతున్నవేళ రంగద్వారందగ్గర నిలిచిన కర్ణుడు భుజాస్ఫాలనం చేశాడు. ఆధ్వనికి దద్దరిల్లిపోయిన పాండవులు ద్రోణుడిదగ్గరకు చేరారు. కౌరవులు దుర్యోధనుడిచుట్టూ మూగారు.39 కర్ణుడు రంగంలోకి ప్రవేశించి, అర్జునుణ్ణి ఆక్షేపించి, ద్రోణుడి అనుమతి పొంది, అర్జునుడుచూపిన అస్త్రవిద్యలన్నీ అవలీలగా చూపాడు. ఆపైన అర్జునుడితో ద్వంద్వయుద్ధాన్ని కోరాడు. ద్వంద్వయుద్ధం ప్రారంభమైంది. భీకరంగా సాగుతోంది. కుంతి ఒకసారి మూర్ఛపోయి తేరుకొంది. ఇంతలో కృపాచార్యుడు ఇద్దరినీ ఆపి అర్జునుడు సత్క్షత్రియుడని చెప్పి, మరి నీతల్లిదండ్రులెవరని ప్రశ్నించాడు. అర్జునుడితో ద్వంద్వయుద్ధంలో పాల్గొనడానికి నీఅర్హత ఏమిటో నిరూపించుకోమన్నాడు. కర్ణుడు సిగ్గుతో తలవంచుకొన్నాడు.అప్పుడు దుర్యోధనుడు కలుగజేసుకొని "వంశం, శౌర్యం, సేన-ఈ మూడిటిలో ఏఒక్కటి ఉన్నవాడైనా రాజనబడతాడు. ఇతడు రాజయితేగాని అర్జునుడితో పోరాడడానికి పనికిరాడంటే నేనిప్పుడే ఇతణ్ణి అంగ రాజ్యాన్నిచ్చి అభిషేకిస్తున్నా" నన్నాడు.

ఆపైన ఏయుద్ధంలోనూ కర్ణుడికి కులం అడ్డురాలేదు. అతణ్ణి ఎవ్వరూ యుద్ధం చేయడానికి అనర్హుడనలేదు. పైగా,కౌరవపక్షంలో ఇంకెవరన్నా ధర్మజుడికి బెంగలేదుగాని కర్ణుడి పరాక్రమం గుర్తుకు వచ్చినప్పుడు అతడికి నిద్రపట్టేదికాదు.40 ఈవిధంగా ఎవ్వరడ్డు పెట్టినా ఆగకుండా కర్ణుడిలోని క్షత్రియధర్మం విజృంభించి,

39. ఆం. మ. భా - ఆదిపర్వం - 6-28.

40. "వినవయ్య కర్ణు గర్వం బని నాతఁడభేద్యకవచుఁడగుటయు విలునే
ర్పును వతని బాహువిక్రమమును దలఁచిననాఁడు గన్నుమూయదు నాకున్.
అరణ్య - 1-270

అతణ్ణి అంగరాజుగా, దుర్యోధనుడి ప్రాణమిత్రుడిగా, ధర్మరాజుడి హృదయానికి శూలప్రపోటుగా నిలబెట్టింది. కాబట్టి కులం పేరిట కర్ణుడికి అన్యాయం చేద్దామని ప్రయత్నించినా జరగలేదు. వర్ణ ధర్మాన్ని ఎవ్వరూ వారించలేరు.

మరయితే కర్ణుడి పతనానికి కారకులెవరు ? అతణ్ణి శాపాలెందుకు చుట్టుముట్టాయి ? అనన్యసామాన్యమైన సామర్థ్యం, త్యాగనిరతి ఉండికూడా కర్ణుడు శప్తుడై ఎందుకు నేలకొరగవలసి వచ్చింది?- ఈవిషయాలనుగూర్చి ఆలోచించినపుడు స్థూలదృష్టికి నాటి సమాజం కర్ణుడికి అన్యాయంచేసిందనిపిస్తుంది. సూక్ష్మదృష్టితో చూసినపుడు కర్ణుడి పతనానికి కారణం కర్ణుడేనని బోధపడుతుంది.

ప్రతివ్యక్తికీ రెండుజీవితాలు ఉంటాయని చెప్పుకున్నాం. ఒకటి వ్యక్తిగతజీవితం, రెండవది సామాజికజీవితం. వ్యక్తిగత జీవితంలో కర్ణుడు మహోన్నతస్థితిని పొందినవాడు. అతడి త్యాగనిరతి, స్నేహబంధం, బ్రాహ్మణభక్తి అనన్యసామాన్యమైనవి. అడిగినవారికి లేదని ఎరుగడు. బ్రాహ్మణుడు కోరితే ప్రాణాలను సయితం ఈయగలడు. ఎటువంటి విషమపరిస్థితుల్లోనైనా స్నేహానికి ప్రాణం పెడతాడు. ఎంతటిదయినా ఆడినమాటను నిలబెట్టుకోవడానికే యత్నిస్తాడు. ఇవన్నీ ఇతడి వ్యక్తిగత సద్గుణాలు.

కర్ణుడి సామాజిక జీవితం ప్రభువులతోను, ప్రజాపాలనతోను ముడిపెట్టుకొనిఉంది. దుర్యోధనుడు చెప్పినట్లు ధృతరాష్ట్రుడు చేస్తాడు. కర్ణుడు చెప్పినట్లు దుర్యోధనుడు కర్తవ్యాన్ని నిర్ణయిస్తాడు. కురుసభలో ప్రధాన కార్యక్రమం ఏదైనా జరిగిందంటే దానివెనుక కర్ణుడి ప్రేరణ ఉందన్నమాటే. కాబట్టే "కర్ణునితల భారతం" అన్న ఆభాణకం లోకమంతటా ఏర్పడింది. సామాజికజీవితంలో కర్ణుడు నీచుడని చెప్పక తప్పదు. అసలు ఇతడి సామాజికజీవితం పాండవులయెడల ఈర్ష్యతో

ప్రారంభమైంది. కుమారాస్త్రవిద్యాప్రదర్శనలో ఇతడి ప్రవర్తన ఎంత వీరోచితమో అంత ఈర్ష్యాయుతంకూడా. దాన్ని గమనించిన కృపాచార్యుడు కర్ణుడి సామర్థ్యాన్ని, ఆసామర్థ్యాన్ని రెచ్చగొడుతున్న అతడి ఈర్ష్యనీ చూసి కలవరపడ్డాడు. ఏవిధంగానైనా ఇతణ్ణి రంగం నుంచి తప్పించకపోతే రాజవంశానికి ముప్పని భావించి కులం అన్న అడ్డుపుల్ల వేశాడు. కొంచెం జాగ్రత్తగా ఈఘట్టాన్ని చదివితే, కేవలం కర్ణుణ్ణి రంగంనుండి తప్పించి రాజవంశానికి ముప్పు తప్పించడానికే కృపాచార్యుడు యుద్ధాన్ని మధ్యలో ఆపి కర్ణుణ్ణి తల్లిదండ్రుల పేర్లు అడిగినట్లు బోధపడుతుంది. నిజంగా అస్త్రవిద్యాప్రదర్శనలో ద్వంద్వ యుద్ధంలో పాల్గొనడానికి కులగోత్రాల ప్రసక్తి తప్పనిసరయితే యుద్ధం ప్రారంభించేముందే ఆప్రసక్తి ద్రోణుడో, కృపాచార్యుడో తెచ్చిఉండేవారే. ఈ సందర్భంలో కృపాచార్యుడికి కర్ణుణ్ణి ద్వేషించడం ముఖ్యంకాదు. రాజవంశాన్ని, ఆ వంశగౌరవాన్ని నిలపాలనీ, అది తన ధర్మమనీ, ఆతడు ఉద్దేశపడ్డాడు.

అలాగే ద్రోణాచార్యుడు కర్ణుడికి బ్రహ్మాస్త్రాన్ని ఇవ్వడానికి నిరాకరించడంలోకూడా కర్ణుడి ప్రవర్తనలోని లోటుపాట్లే కారణమని బోధపడుతుంది. వ్యక్తి సమర్థుడా, కాదా అన్నది ఒక్కటే ముఖ్యంకాదు. ఆ సామర్థ్యాన్ని దేనికొరకు వినియోగిస్తున్నాడు అన్నది ముఖ్యం. ఈ ఉద్దేశంతోనే ద్రోణాచార్యుడు విలువిద్య నేర్పేటప్పుడు ఎవరియెడల ఎలా ప్రవర్తించాలో వారియెడల అలా ప్రవర్తించాడని అనిపిస్తుంది. అతడికి కొడుకైన అశ్వత్థామ అంటే అంతులేని మమకారం. కొడుకు పోయాడని తెలిస్తే ప్రాణాలని విడిచేటంత మమకార మది. అయినప్పటికీ అశ్వత్థామ ఆవేశపరుడనీ, యుద్ధరంగంలో ఇతడి ఆవేశం ఉన్మాదం కాగలదనీ, గ్రహించి బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించడం మాత్రమే చెప్పి ఉపసంహరించే విధానాన్ని ఉపదేశించలేదు. పైగా

ఆ అస్త్రాన్ని మానవులమీద ఎప్పుడూ ప్రయోగించవద్దని ఆదేశించాడు. సంయమనం గల అర్జునుడికి మాత్రమే బ్రహ్మశిరో నామకాస్త్రాన్ని ప్రయోగ ఉపసంహార వివరాలతో ఉపదేశించాడు. ఏకలవ్యుడి విషయంలో కూడా ద్రోణుడు ఈపద్ధతినే అవలంబించాడు. ఏకలవ్యుడు అనితరసాధ్యమైన సామర్థ్యం, అనన్యసామాన్యమైన గురుభక్తి కలిగినవాడన్నమాట నిజమే. కాని అతడి ప్రవృత్తి లోక హితమైంది కాదు. అది గ్రహించిన ద్రోణుడు తన ప్రతిమను పెట్టుకొన్నంతమాత్రాన ఇంతవాడయ్యాడన్న వ్యామోహం లేకుండా బొటనవ్రేలు కోసిమ్మని ఏకలవ్యుణ్ణి కోరాడు. తరువాత తరువాత ఏకలవ్యుడు, అతడి బృందం ధర్మానికీ, దైవానికీ వ్యతిరేకంగా నిలిచి పోరాడిన సత్యం మనకి విదితమే.41 ఈ దృష్టితోనే ద్రోణుడు కర్ణుడికి బ్రహ్మాస్త్రాన్ని ఇవ్వడానికి నిరాకరించినట్లు మనం గ్రహించ వలసి ఉంటుంది. తనను చంప పుట్టిన ధృష్టద్యుమ్నుడికి కూడా విలువిద్య నేర్పిన మనీషి ద్రోణుడు ! కర్ణుడి కులగోత్రాలతో నిమిత్తం లేకుండా రాజకుమారులతో కలిసి తనచెంత విలువిద్య నేర్చే అవకాశాన్ని కలిగించినవాడు ద్రోణుడు. అర్హతఉన్నంతవరకు విలువిద్యను కోరినవారికి నేర్పేటందుకు అతడు సిద్ధమే. అర్హతనుమించి అస్త్ర ప్రదానం చేయమని కోరినప్పుడుమాత్రం, రాజ్యక్షేమాన్ని, లోక హితాన్ని దృష్టిలోపెట్టుకుని అతడు కాదంటూవచ్చినట్లు సూక్ష్మ దృష్టితో చూచినపుడు మనకు బోధపడుతుంది. రాజ్యక్షేమాన్ని దృష్టిలోపెట్టుకొని వివేకంతో ప్రవర్తించగల సంయమి కనుకనే ద్రోణుణ్ణి కోరి కురుకుల గురువుగా భీష్ముడు నియమించుకొన్నాడని మనం గ్రహించవలసి ఉంటుంది. తన కొడుకుమీద తన కెంతటి మమకారమున్నా, దుర్యోధనాదులు చక్రవర్తిబిడ్డలైనా, ఏకలవ్యుడు

41. జరాసంధుడు మధురపై దండెత్తి వచ్చినప్పుడు ఏకలవ్యుడతని సేనాధిపతి. పౌండ్రక వాసుదేవుడు కృష్ణునిపై దండెత్తి వచ్చినప్పుడు ఏకలవ్యుడు అతని సహకారి. (హరివంశం - ఉత్తరభాగం)

తన ప్రతిమను పెట్టుకొని కనీవినీ ఎరుగని సామర్థ్యాన్ని పొందినా, కర్ణుడు సుయోధనుడి ప్రాణమిత్రుడైనా రాజ్యక్షేమాన్ని దృష్టిలో పెట్టుకున్న ద్రోణుడు వీటిని వేటినీ లెక్కపెట్టలేదు. విలువిద్య నేర్పడంలో అతడికి ఒక ప్రణాళికఉంది. ఆ ప్రణాళిక ప్రకారమే ఎవరికి ఎంతవరకూ నేర్పవచ్చో వారికి అంతవరకూ నేర్పుతూ వచ్చాడతను. ఈ విధమైన ఔచిత్యాన్ని పాటించడంతో నాటి ధర్మసంస్థాపన కార్యక్రమానికి ద్రోణుడివల్ల చాలా బలం చేకూరిందని చెప్పవచ్చు. వ్యక్తిగా ద్రోణుడు భృత్యధర్మాన్ని పాటించి, తన ఇష్టానికి వ్యతిరేకంగా ధృతరాష్ట్రుడివైపు పనిచేసినా, విలువిద్య నేర్పే గురువుగామాత్రం అతడు చూపిన సంయమనం ఆదర్శ ప్రాయమైంది.

కుమారాస్త్రవిద్యాప్రదర్శనంలో పాండవులపట్ల కర్ణుడినుండి వ్యక్తమైన ఈర్ష్యతో దుర్యోధనుడికి పాండవులపట్ల గల అసూయ చేతులు కలిపింది. ఈర్ష్యాసూయలమధ్య స్నేహం దినదినప్రవర్ధమాన మవుతూవచ్చింది. కర్ణుడున్నాడన్న ధైర్యంతో, కర్ణుడిస్తున్న ప్రేరణతో దుర్యోధనుడి దుష్కృత్యాలకు 'హద్దు' లేకుండా పోయింది.

భారతకథను మలుపుత్రిప్పిన ద్రౌపదీవస్త్రాపహరణాని ప్రేరకుడు కర్ణుడు. ద్రౌపదిని సభలోనికి దాసిగా తోడ్కొనిరమ్మ దుర్యోధనుడు ప్రాతికామిని పంపాడు. తప్పనిసరయి సభలోనికివచ్చి ద్రౌపదిని దుశ్శాసనుడు తలపట్టి ఈడ్చి సభామధ్యంలోకి తెచ్చా దుఃఖిస్తూ ద్రౌపది "ధర్మజుడు నన్నోడి తనోడెనా ? తనో నన్నోడెనా ? నేను ధర్మవిజితనా ? అధర్మవిజితనా?" అని ప్రశ్నిం నపుడు అంత సభలో ఎవ్వరూ మాట్లాడలేదు. దుర్యోధనుడి తమ్ముడైన వికర్ణుడులేచి ద్రౌపది దాసికాదని నిర్ధారించి చెప్పాడు. అప్ప

కర్ణుడు కలగజేసుకొని వికర్ణుణ్ణి ఆక్షేపిస్తూ ద్రౌపదిని తీసుకురావడం ధర్మమే నన్నాడు. "దీనికి అనేకమంది భర్తలు. కావున ఇది బంధకి. ఇలాంటిదాన్ని విగతవస్త్రనుచేసి తెచ్చినప్పటికీ అధర్మంకాదు" అన్నాడు.42 ఆ మాటలు విన్న దుర్యోధనుడు వెంటనే దుశ్శాసనుణ్ణి ద్రౌపదీవస్త్రాపహరణానికి ఆజ్ఞాపించాడు. కర్ణుడు విగతవస్త్రనైనా చేసి తీసుకురావచ్చును అని అనకుండాఉంటే ఆ ఊహ దుర్యోధనుడికి వచ్చేదీకాదు, వస్త్రాపహరణ ప్రయత్నం జరిగేదీకాదు. ఈసన్ని వేశం కర్ణుడిది ఎంతనీచస్వభావమో చాటిచెబుతోంది. కృష్ణుడియెడల ద్రౌపదికున్న విశ్వాసంతో ఆమెకు వలువలు నడిచివచ్చాయి. కర్ణుడి మాట, దుశ్శాసనుడు ఎంతప్రయత్నించినా, నెరవేరలేదు. ఆమె విగతవస్త్రకాలేదు. అప్పటికైనా అతడికి బుద్ధిరాలేదు. అంతలోనే ఆమెతో "తరుణీ! అయిదుగురు భర్తలు ఉండటంకన్నా ఒక భర్త ఉండటం తగినపని. జూదంలో నిన్ను ఓడిపోనివానిగా చూసి, తగినభర్తను ఎంచుకో" అని ఎకసక్కెమాడాడు.43 కర్ణుడిమాటవిన్న దుర్యోధనుడు తనను భర్తగా స్వీకరించమని ద్రౌపదికి సైగచేస్తూ, తనతొడమీద కూర్చోమని తొడను చూపించాడు. వెంటనే ఆ తొడల్ని రణంలో విరగగొడతానని భీముడు ప్రతిజ్ఞ చేశాడు. ఆపైన అంతులేనన్ని దుశ్శకునాలు ఎల్లెడలా కానవచ్చాయి. ఈ సందర్భంలో కర్ణుడి ఎకసక్కెపుమాటలు దుర్యోధనుడి మరణం

42. "....మరి ఏకవస్త్రయై యున్న దీని సభకుం దోడ్కొనివచ్చుట ధర్మువు గాదంటి భార్యకు దైవవిహితుండైన భర్త యొక్కరుండ యిది యనేక భర్తృక గావున బంధకి యనంబడు నిట్టిదానిని విగతవస్త్రంజేసి తెచ్చిన ధర్మవిరోధంబులేదని కర్ణుండు...." – ఆం. మ. భా - సభా - 2-228.

43. "తరుణి యేవురకంటె నొక్కరుఁడ భర్త
యగుట లగ్గు జూదంబున నాలి నోటు
వడనివానిఁగఁ దగు భర్తఁ బడయుమింక
నను చ ధాధేయుఁ దుర్లసమాడెనంత" – ఆం. మ. భా - సభా-2-248.

ఎలాఉంటుందో నిర్ణయించడానికి పనికివచ్చాయి. కర్ణుడి మాటే దుర్యోధనుడి చేతగా రూపొందుతూ ఉండటంతో కౌరవుల భవిష్యత్తు కర్ణుడి చేతిలో ఉన్నట్లయ్యింది. కౌరవులు కర్ణుణ్ణి అనుసరించారు. కర్ణుణ్ణి అతడిఈర్ష్య నడిపించింది. ఆ నడక కురుక్షేత్రం వరకూ సాగింది.

ఒకరకంగా చూస్తే కర్ణుడు స్నేహధర్మానికి కూడా పరిపూర్ణమైన న్యాయాన్ని చేకూర్చలేకపోయాడనిపిస్తుంది. దుర్యోధనుడు తనను ఎంతగా నమ్ముకున్నాడో అతడికి తెలుసు. తానేం చెపితే అది వింటాడనీ తెలుసు. కానీ అతణ్ణి మంచిమార్గంలో పెట్టాలన్న ఊహ స్నేహితుడిగా కర్ణుడికి రాలేదు. స్నేహితులిద్దరూ తమకు గల ఈర్ష్యాసూయలకు పాండవులను బలిచేద్దామనుకున్నారేతప్ప, స్నేహితులుగా ఒకరిశ్రేయస్సును ఒకరు కోరుకోవడం వారికి చేతకాలేదు. కర్ణుడు దుర్యోధనుడి కోరికను తీర్చడానికి ప్రయత్నించాడు తప్ప, దుర్యోధనుడి శ్రేయస్సును గమనించలేకపోయాడు. అతడి ఈర్ష్య దుర్యోధనుడి శ్రేయస్సును గమనించకుండా చేసింది.

పోనీ, తాననుకున్న స్నేహధర్మాన్నయినా కర్ణుడు సవ్యంగా నిర్వర్తించగలిగాడని చెప్పలేం. ఘోషయాత్రకు ప్రేరేపించినవాడు కర్ణుడు. ఘోషయాత్రలో గంధర్వుల చేతిలో ఓడి, ఆ గంధర్వుల చేతికి చిక్కిన దుర్యోధనుణ్ణి విడిచి, యుద్ధభూమినుంచి తొలిగి పోయినవాడూ కర్ణుడే. పరశురాముడివల్ల శాపంపొంది కూడా 'కృతాస్త్రుండనైతి' అని బ్రహ్మాస్త్రం తనకు సిద్ధించినట్లు దుర్యోధనుడితో అబద్ధమాడాడు కర్ణుడు.44 దుర్యోధనుడు బ్రహ్మాస్త్రం లేకపోతే తన సామర్థ్యాన్ని తక్కువగా అంచనా కడతాడేమో

44. "అధిప పరశురాము నాశ్రయించితిఁ గృతా
స్త్రుండనైతి నన్ను భండనమున
మార్కొనంగలేరు మగలిజగంబున ...." ఆం. మ. భా - శాంతి-1-27

నన్న భావంతో ప్రాణస్నేహితుడితో అబద్ధమాడటానికి వెనుదీయని వాడు కర్ణుడు. దుర్యోధనుడు, కర్ణుడు కవచకుండలాలు కలవాడని ధైర్యంతో ఉంటూవచ్చాడు. కర్ణుడు తన దానకండూతితో బ్రాహ్మణ రూపంలో వచ్చినవాడు ఇంద్రుడని తెలిసికూడా, సూర్యుడు చెబుతున్నా వినకుండా, కవచకుండలాలు దానంచేసేశాడు. అలాగే అర్జునుడు తప్ప మిగిలిన నలుగురిలో ఎవరుచిక్కినా చంపకుండా వదిలివేస్తానని కుంతికి మాట ఇచ్చాడు. కుంతికి మాట ఇచ్చినట్లు దుర్యోధనుడికి చెప్పనైనా చెప్పలేదు.

వ్యక్తిగత విద్వేషాలకుపోయి భీష్ముడితో పంతంపట్టి భీష్ముడు పడిపోయేవరకూ యుద్ధభూమిలో ప్రవేశించనన్నాడు కర్ణుడు. ప్రవేశించలేదు కూడా. ప్రాణస్నేహితుడికి ఈయవలసిన బహుమానమేనా ఇది! తొలినుండీ భీష్ముడూ, కర్ణుడూ - ఇరువురూ యుద్ధభూమిలో ఉండి ఉంటే యుద్ధం మరొకలా సాగిఉండేది. కృష్ణుడికి మరింత పనితగిలిఉండేది. ఈ విధంగా కర్ణుడు ఒక స్నేహితుడిగా కూడా దీటుగా నిలబడలేకపోయాడు. అతడికి దుర్యోధనుడంటే ప్రేమా, విశ్వాసమూ, భక్తీ అపారంగా ఉన్నమాట నిజమే. కాని కార్యాచరణలోనికి వచ్చేటప్పటికి మనసులో ఉన్నంతగా అవి వ్యక్తంకాలేకపోయాయి. అతడి మానసిక ఆవేశాలూ, పంతాలూ, పట్టింపులూ అతడికి తగనట్లుగా అతణ్ణి నడిపించాయి. కర్ణుడు మానసిక ఉద్వేగాలచేతిలో కీలుబొమ్మగా ఈ సన్నివేశాల్లో కనిపిస్తాడు. బాధ్యత తెలియనివాడి సారథ్యాన్ని నమ్ముకుంటే జీవితం ఎలా ఉంటుందో ఈతడి సారథ్యంలో నడిచిన దుర్యోధనుణ్ణి చూస్తే మనకి బోధపడుతుంది. యుద్ధంలో పాండవపక్షపాతులైన భీష్మద్రోణులు వహించినపాటి బాధ్యతను కూడా వహించలేకపోయాడు కర్ణుడు. ప్రాణస్నేహితుడు చేయవలసిన పనేనా ఇది ?

కర్ణుడి జీవితం ఆవేశాల, ఆదర్శాల కలగలుపని గ్రహించిన కృష్ణుడు రాయబారానికి వెళ్ళివస్తూ కర్ణుణ్ణి తనతో కొంతదూరం రమ్మన్నాడు. అతడి జన్మరహస్యాన్ని చెప్పి "పాండవులవైపుకు మొగ్గితే చక్రవర్తివి కాగల"వన్నాడు. "ద్రౌపది నిన్ను ఆరవభర్తగా స్వీకరిస్తుం"దన్నాడు. ఇవన్నీ అతడి హృదయపులోతులు కనుగొనేందుకు కృష్ణుడు పలికిన పలుకులు. అప్పుడు కర్ణుడు స్నేహానికే ప్రాధాన్యమిస్తాడు. స్నేహితుడితోనే ఉండిపోతానంటాడు. తనను నమ్ముకొన్న దుర్యోధనుణ్ణి విడిచి చక్రవర్తిత్వాన్ని అపేక్షించలేనంటాడు.45 కర్ణుడి హృదయంలోని ఈ స్నేహశీలతను లోకానికి తెలియజెప్పటానికే కృష్ణుడు ఆ సన్నివేశాన్ని కల్పించాడు. అంతే కాక మరొక ప్రయోజనం కూడా ఈ సన్నివేశంవల్ల సమకూడింది. కర్ణుడు తాము నడుస్తున్నదారి తప్పనీ, ఆ తప్పుకు కురుక్షేత్ర మహాసంగ్రామంలో శిక్షను అనుభవించబోతున్నామనీ, దానికి తగిన దుశ్శకునాలు కూడా స్పష్టంగా కనబడుతున్నాయనీ, తామలా వెళ్ళిపోవలసిందేననీ తన సమాధానంలో సూచిస్తాడు.46 సంయమనం కలిగిన ధర్మరాజే చక్రవర్తి కావలసినవాడని అంటాడు.47 ఈ సన్ని

45. ఆం. మ. భా - ఉద్యోగ - 39,40.

46. "అనుజులు ఋత్విజులుగ నీ పనియిటు సేయుమని నీ వుపద్రష్టవుగా
విను కురుకుమార పశువిశసనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁజేయున్"
"దానం బుణ్యభూమియగు కురుక్షేత్రంబున మముఁబోంట్లెల్లన్ సద్గతి
వడయుదురుగాక !" ఆం. మ. భా - ఉద్యోగ _ 4-45,46.

"కలవు నిమిత్తస్వప్నంబులు కౌరవ పాండవులకుఁ బోటగుదానన్
గెలుపయ్యుధిష్ఠిరునకును గలదెఱుఁగుదు నీవు సెప్పగానేమిటికిన్"
ఆం. మ. భా - ఉద్యోగ-4-50

47. "....నట్టిధార్మికుఁడాధిపత్యంబుఁజేయవలవదే శాశ్వతంబుగ
వసుధకెల్ల" - ఆం. మ. భా - ఉద్యోగ - 4-44

వేశం వరకూ కర్ణుడి ఆలోచనాసరళీ, ప్రవర్తనా వేరు; ఈ సన్నివేశం నుంచి మిగిలిన గాథలో కర్ణుడి తీరు వేరు. ఇంతకుపూర్వం ఈర్ష్యా వేశాలతో ఊగితూగిన కర్ణుడు ఈ సన్నివేశంనుంచి కృష్ణుడి స్పర్శకు ఫలమా అన్నట్లు తమది తప్పని ఒప్పుకుని తప్పుకు తగినశిక్ష అనుభవించక తప్పదన్నాడు. ఈ సత్యదర్శనం చివరివరకూ ఇతడిలో కొనసాగింది. యుద్ధం జరుగుతున్నప్పుడు దుర్యోధనుడితో కూడా ఒకానొక సందర్భంలో "మనం చేసినదానికి మనం అనుభవిస్తున్నాం" అంటాడు.48

కృష్ణుడితో సంభాషణ తర్వాత అతడు కుంతికి ఇచ్చినమాటా భీష్ముడితోడి పంతం స్నేహధర్మానికి తగనివైనా, లోకహితానికి అనుగుణంగా జరిగాయి. లోకహితంతో అతడు శ్రుతికలపాలని కలపకపోవచ్చును. కృష్ణుడి స్పర్శవల్ల చిత్రంగా అతడికి తెలియకుండానే అతడి ప్రవృత్తి లోకహితంతో చేతులు కలిపింది. కర్ణుడిలో ఈమార్పు తీసుకువచ్చేటందుకే తనరథంలోకి ఆహ్వానించాడు కర్ణుణ్ణి కృష్ణుడు. స్థూలదృష్టికి కర్ణుణ్ణి తమవైపుకి లాక్కోవడానికి కృష్ణుడు ప్రయత్నించినట్లూ, కర్ణుడు అంగీకరించకుండా తన నిర్ణయానికి కట్టుబడిఉన్నట్లూ కనిపించే ఈ సన్నివేశంవెనుక ఇంతకథ ఉంది.

---

48. "అనవిని కర్ణుఁ డిట్లనియె నగ్గురు దూఱఁగనేల యాతఁడో
పినటుల పోరుఁగాక నరుబీరము లావును నెక్కుడైన వా
ని నుడుపవచ్చునే విధియ నేర్చు విషంబిడి యిల్లుగాల్చి కా
ననమునకేఁగఁజేసి యొకనాకముఁగంటిమె గొంతిసంతతిన్."

"కావున మనసైంధవునిన్
దైవము తెగటార్చె వంతఁదలరి మనమునం
జేవసెడనేల పోరం
గా విధివంచినటులయ్యెఁ గడఁగనవలయున్."

ఆం. మ. భా - ద్రోణ - 5-48,49

కర్ణుడి జీవితంలో ఆవేశాల పెనుతుఫానును తొలగించి ఆదర్శానికి (స్నేహధర్మానికి) కట్టుబడేట్లుగా చేసేటందుకు, అతడి ఆవేశాలు లోకహితానికి అనుగుణంగా రూపుదిద్దుకొనేటందుకు కృష్ణుడు తన సాన్నిధ్యాన్ని కర్ణుడికి ప్రసాదించినట్లు సూక్ష్మదృష్టితో చూసినపుడు బోధపడుతుంది.

భారతకాలంనాటికే వర్ణ ధర్మాలు, కులధర్మాలు కలగలుపుగా చేసుకోబడ్డాయనీ, కులంనుంచి వర్ణధర్మాన్ని వేరుగా చూసి స్వీకరించడం ఎక్కువమందికి చేతకాకపోయిందనీ కర్ణుడిగాథలో మనకు స్పష్టంగా బోధపడుతూనే ఉంది. భీమాదులు కులాన్ని ఎత్తిచూపి కర్ణుణ్ణి హేళనచేయగలిగారుగదా ! కాని వర్ణధర్మం సూర్యరశ్మిలాంటిదనీ, సూర్యరశ్మి పొగమంచును కరగించుకొని చొచ్చుకుపోయినట్లు, అడ్డంకులను అతిక్రమించి తగినస్థానాన్ని పొంద గలదనీ కర్ణుడి జీవితం మనకు బోధపరుస్తుంది. కర్ణుడు శాపాలపాలు అవడానికిగాని, జీవితంలో తక్కువగా చూడబడటానికిగాని అతడి లోని లోపాలే ప్రధాన కారణమనీ, ఈ లోపాలవల్లే అనన్యసామాన్య మైన అతడి సామర్థ్యం తేజస్సును కోల్పోయిందనీ కూడా మనకు బోధపడుతుంది.

ఈ లోకంలో ఎవ్వరూ ఎవ్వరినీ కులం పేరుతోనో మరోపేరు తోనో ఎక్కువకాలం అణచిపెట్టలేరు. ఎవడిధర్మం వాడినుంచి వ్యక్తమై సమాజంలో అర్హమైనస్థితిని వాడికి సిద్ధింపజేసి తీరుతుంది. అది తప్పదు. ఆపాలని ప్రయత్నించినా ఎవ్వరూ ఆపలేరు. వ్యక్తి పైకి రావడమో, పతనమైపోవడమో ఆవ్యక్తి చేతుల్లోనే ఉంటుంది. ఎవ్వరూ ఎవ్వరినీ పడగొట్టలేరు, పైకి తేనూలేరు. ఎవడిప్రవర్తన వాడికి రక్షణో, శిక్షణో ఇస్తుంది. ఒకడిపతనానికి మరొకడు కారణమని భావించడం, బాధపడటం మానవుల బలహీనతలేతప్ప

సత్యంమాత్రం కాదు. కర్ణుడిద్వారా వ్యాసుడు లోకానికి అందిస్తున్న సందేశం ఇది.

## వక్త ధర్మనిర్వహణలో సంజయుడు :

మహాభారతంలో మనకు సూతపుత్రుడుగా పరిచయమయ్యే సంజయుడు సమదర్శి, సత్త్వగుణ సంపన్నుడూను. అతడు ఉన్నది ధృతరాష్ట్రుడి సేవలో అయినా, అతడి హితాన్ని కోరాడేతప్ప, ప్రియాన్ని పలికి అతడి మెప్పుకు ఎన్నడూ ఆశపడలేదు. తన ఉనికి వల్ల యజమాని ప్రవర్తనలో మార్పువచ్చి అతడు ఉద్ధరింపబడాలని కాంక్షించాడేతప్ప, యజమానినుంచి అతడు కోరింది మరేమీ లేదు. ఈ సత్యం ధృతరాష్ట్రుడికి బాగా తెలుసు. కేవలం సేవకుడిగా కాక, ధృతరాష్ట్రుడికి సన్నిహితుడిగా, శ్రేయస్సుకోరే ఆత్మబంధువుగా మెలిగాడు సంజయుడు. ఇతడు ఎప్పుడు ఎవరికి ఎదురుపడినా అవతలివారు తమతో సమానంగా గౌరవించారే తప్ప,కులాన్ని బట్టి గానీ, మరొకదాన్ని బట్టిగాని ఇతణ్ణి తక్కువగా చూసిన సన్నివేశాలులేవు. ఉపప్లావ్యానికి రాయబారానికి వెళ్ళినప్పుడు ధర్మజుడు, శ్రీకృష్ణుడు, అర్జునుడు ఇతడితో వర్తించిన తీరు ఇతడు ఎంతటివాడో మనకు తెలియజేస్తుంది.

ధృతరాష్ట్రుడి ప్రవర్తన తనకు నచ్చనపుడు స్పష్టంగా అతడితోనే చెప్పగల ధైర్యవంతుడూ, ఋజువర్తనుడూ సంజయుడు. అతడు చెప్పదలచింది ధృతరాష్ట్రుడికి నేరుగా చెప్పాడుతప్ప, ధృతరాష్ట్రుణ్ణి గూర్చి ఇంకెవరి దగ్గరా తక్కువ చేసి మాట్లాడి ఎరుగడు. ధర్మానికి విరుద్ధంగా, తన ఇష్టానికి వ్యతిరేకంగా రాయబారాన్ని నిర్వహించిరమ్మని పాండవుల దగ్గరకు ధృతరాష్ట్రుడు పంపినపుడు పాండవుల సన్నిధిలో అతడు ప్రవర్తించిన తీరు అతడి రాజభక్తినీ, బాధ్యతాయుతమైన గాంభీర్యాన్నీ తెలియజేస్తుంది. ఇతడి ఈ

గాంభీర్యం ధర్మజ కృష్ణాదులనే ముగ్ధుల్ని చేసింది. సంజయుడికి పాండవులంటే ప్రాణం. వారికి న్యాయంజరగాలని నిత్యం కోరుకొనే వాడతను. కాని, రాయబారానికి వచ్చినపుడు చక్రవర్తి అయిన ధృతరాష్ట్రుడి సంకల్పానికి అనుగుణంగా భాషించాడు, ప్రవర్తించాడుతప్ప, తన స్వభావాన్ని ఎక్కడా బయటపడనీయలేదు. చక్రవర్తి ఉద్దేశం ప్రకారం ప్రవర్తించి, తిఠిగివెళ్ళి అతడితో రాయబార పర్యవసానాన్ని గూర్చి చెప్పేముందు మొగమోటమి లేకుండా “నీవు చేస్తున్నది అధర్మం. ఇది పద్ధతికాదు. కొడుకుల ప్రవర్తనయెడల నీవు చూపుతున్న ఉపేక్ష నీ వంశాన్నే కాల్చివేయగలదు. ధర్మాత్ముడైన ధర్మజుడు విజృంభించేటంతవరకే ఇదంతా. అతడు విజృంభించిన తర్వాత మరల్చడం మనతరం కాదు” అని తీవ్రంగా మందలిస్తాడు.49 ప్రవర్తనలో ఈవిధమైన ఔచిత్యాన్ని చూపగలగటానికి అతడి జీవితంలో అపారమైన సాధన జరిగి ఉండాలి.

సంజయుడు వ్యాసుడి శిష్యుడు. వ్యాసుడి స్పర్శా, వెలుగూ ఇతణ్ణి ఆవరించి నడిచాయని భారతగాథలో మనకు స్పష్టపడుతుంది పాండవులు పంపిన సందేశాలన్నీ సావధానంగా విని కర్తవ్యో న్ముఖుడు కావలసిందిపోయి, ఇరుపక్షాలకూ బలాబలాల్లో గల తా తమ్యాల్ని వివరించి చెప్పమంటాడు ధృతరాష్ట్రుడు. “నీకు ఒంటరిగ చెప్పను. నీతండ్రి అయిన సాత్యవతేయుణ్ణి భక్తితో స్మరిం రప్పించు. అలాగే గాంధారీదేవిని కూడా పిలిపించు. వారిరువు సన్నిధిలో నీకు చెబుతాను. నీలో అసూయాదులు విజృంభిస్తే పూ మాన్పగలవారు వారే”అంటాడు సంజయుడు. సంజయుడు చెప్పినట్లు చేస్తాడు ధృతరాష్ట్రుడు. సాక్షాత్కరించిన వ్యాసుడు సర్వజ్ఞుడు కనుక, నేరుగా సంజయుణ్ణి చూసి “నీకు సర్వమూ తెలుసుగదా, ఇక వివరించి చెప్పు” అంటాడు. సంజయుడు“అటువైపు కృష్ణుడున్నాడు

---

49. ఆం. మ. భా - ఉద్యోగ - ద్వితీయ - 8-14.

ఇటువైపు అతడికి సమయాన్ని చూపు" అని ధృతరాష్ట్రుణ్ణి ప్రశ్నించి, కృష్ణుడియొక్క ప్రభావాన్నీ, లీలావైభవాన్నీ దార్శనికంగా వర్ణిస్తాడు. ఆవర్ణనకు ముగ్ధుడైన ధృతరాష్ట్రుడు "ఈసత్యం నాకు బోధపడలేదుగదా, నీకెలా బోధపడింది?" అని అడుగుతాడు. అప్పుడు సంజయుడు "విద్య, అవిద్య అని రెండు ఉన్నాయి. అవిద్యా దూషితుడై తమోగ్రస్తుడైనవాడు విష్ణుణ్ణి తెలియలేడు. విద్యా సంపన్నుడు మాత్రమే తెలియగలడు" అని చెబుతాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు "విద్య అంటే ఏమిటి? ఎటువంటి విద్యతో నీవు అతణ్ణి చూడగలిగావు? అవిద్య అంటే అది ఎలాంటిది? వివరించి చెప్పు" అంటాడు. అప్పుడు సంజయుడు సాత్త్విక, రాజస, తామస వికారాలకు లోనుగాక ధర్మాన్ని ఆచరిస్తూ భావశుద్ధిని కలిగి ఉంటాను నేను. దీనివల్ల నేఅచ్యుతుణ్ణి తెలియగలిగాను. విద్య అంటే ఇదే. నీకుగాని, మరొకరికిగాని అతణ్ణి తెలియడానికి మార్గం ఇదే. దీనికి భిన్నమైనదే అవిద్య" అని వివరిస్తాడు. వేదవ్యాసుడుకూడా, సంజయుడు కృష్ణుడి ఉన్నరూపు ఎరిగినవాడనీ, అతడు చెప్పినట్లు చేయమనీ చెబుతాడు. అటుపైన ధృతరాష్ట్రుడి కోరికపై సంజయుడు వాసుదేవ నామాన్ని నిర్వచించి వివరిస్తాడు. అతణ్ణిచేరే ఉపాయం కూడా బోధపరుస్తాడు. సంజయుడి వాక్కుకు ఉన్న శక్తి ఎటువంటిదోగానీ, ధృతరాష్ట్రుడి లాంటివాడు పరవశించాడు. 'కృష్ణుణ్ణి చూడగలిగితే ఎంతబావుండును!' అనుకొన్నాడు. కృష్ణుడి పాదాలను ఆశ్రయిస్తానన్నాడు (తాత్కాలికంగానైనా)50. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుడిపాలిటి పరమ గురువుగా దర్శనమిస్తాడు సంజయుడు. వ్యాసుడు తన సన్నిధిలో ఈ సన్నివేశాన్ని నడిపించడం విశేషం.

ఇక కురుక్షేత్రసంగ్రామం ప్రారంభం అవుతోందనగా ధృతరాష్ట్రుణ్ణి సమీపిస్తాడు వేదవ్యాసుడు. "జరగబోయే యుద్ధాన్ని

50. ఆం. మ. భా - ఉద్యోగ పర్వం - తృతీయ - 304-330.

చూస్తావా, దివ్యదృష్టిని ఇస్తాను" అంటాడు. "చూడలేను. యుద్ధ సన్నివేశాలను వినాలని ఉన్నది. వినిపించే ఏర్పాటును అనుగ్రహించండి" అంటాడు ధృతరాష్ట్రుడు. అప్పుడు సంజయుణ్ణి ఆపనికి నియోగిస్తాడు వ్యాసుడు. నియోగిస్తూ ఆపనికి ఆవశ్యకమైన కొన్ని ప్రత్యేకసౌకర్యాలను అతడికి అనుగ్రహిస్తాడు. వ్యాసానుగ్రహం వల్ల అతడికియుద్ధభూమి అంతా కలియదిరిగేటప్పుడు శస్త్రాస్త్రాలవల్ల ఏమీ బాధ ఉండదు. ఇరుతెరగులవారి దివారాత్ర ప్రవర్తనలు స్పష్టంగా తెలుస్తాయి. వారి రహస్యసమాలోచనలు వినబడతాయి. వాళ్ళ మనస్సుల పోకడలు బోధపడతాయి. యుద్ధానికి సంబంధించి వర్తిస్తున్న దివ్యుల ఆలాపాలూ, రూపాలూ, తలపులూ తెలుస్తూఉంటాయి. ఈవిధమైన దివ్యావకాశాన్ని అనుగ్రహించి సమరగాథను వినిపించేటందుకు సంజయుణ్ణి నియోగించాడు వ్యాసుడు.51

యుద్ధపంచకమంతా సంజయుడినోటినుంచి ధృతరాష్ట్రుడు విన్నదే. కృష్ణార్జునులు కలలో కైలాసానికి వెళ్ళివచ్చిన ఘట్టం,అశ్వత్థామ ఆత్మసమర్పణకు మెచ్చి శివుడు సాక్షాత్కరించినఘట్టం సంజయుడు దర్శించి వివరించినవే. సకల వేదవాఙ్మయానికీ మూదల అయినదీ, ధర్మాద్వైతస్థితిని ప్రతిపాదించినదీ అయిన కృష్ణుడి ఉపదేశాన్ని (భగవద్గీతను) ధృతరాష్ట్రుడికి వివరించింది సంజయుడే. నరుడు పొందిన కృష్ణుడి విశ్వరూపసందర్శనం నరుడితోపాటు దర్శించింది సంజయుడు ఒక్కడే. ఈసన్నివేశాల్లో సంజయుడు వేదవ్యాసుడి మరోరూపుగా మనకు సాక్షాత్కరిస్తాడు.

యుద్ధరంగంలో ఒకసారి సాత్యకి సంజయుణ్ణి పట్టి వధించబోతాడు. వెంటనే వ్యాసుడు సాక్షాత్కరించి అతణ్ణి వారిస్తాడు.52

51. ఆం. మ. భా - భీష్మ - 6-8.

52. ఆం. మ. భా - శల్య - 2-8.

వ్యాసుడు సంజయుణ్ణి వెన్నంటి ఉన్నాడనటానికి ఇది ఒక నిదర్శనం. చూడగా కృష్ణార్జునులనడుమ ఎంత ఆత్మీయత ఉందో వ్యాససంజయుల నడుమా అంత సన్నిహితత్వం ఉన్నట్లు స్పష్టమవుతుంది. కృష్ణుడి ప్రణాళికకు అర్జునుడు సహకరించినట్లు వ్యాసుడి ప్రణాళికకు సహకరించినవాడు సంజయుడు.

బిడ్డలందర్నీ యుద్ధంలో కోల్పోయిన ధృతరాష్ట్రుణ్ణి చివరి వరకూ కనిపెట్టుకుని ఉన్నవాడు సంజయుడు. అతడు ఆశ్రమవాసానికి వెళ్ళినా అక్కడకు కూడా పోయి సేవించాడు. చుట్టుకొనివస్తున్న దావాగ్నికి శరీరాన్ని అర్పించబోతున్న ధృతరాష్ట్రుణ్ణి యోగయుక్తుడు కావలసిందిగా ఆదేశిస్తాడు ఇతను.53 ఇతడి ఆదేశాన్ని అందుకొని యోగయుక్తుడై శరీరాన్ని విడిచి ఊర్ధ్వలోకాలకు చేరుకుంటాడు ధృతరాష్ట్రుడు. కన్నులు లేని ధృతరాష్ట్రుణ్ణి కడతేర్చే వరకూ, మూర్ఖుడైన ధృతరాష్ట్రుడు ముక్తుడయ్యేవరకూ కనిపెట్టుకొని ఉన్నవాడు ఇతను.

ఈవిధంగా సూతపుత్రుడైన సంజయుడినుంచి వ్యక్తమైనది పరిపూర్ణమైన బ్రాహ్మణధర్మం. రజస్తమస్సులకతీతమైన శుద్ధ సత్త్వంలో నిలిచి జీవితయాత్రను సాగించినవాడితను. సత్త్వగుణం నుంచి బ్రాహ్మణధర్మం వ్యక్తమయిందన్న విష్ణుపురాణ వాక్యాన్ని మనం ఈసందర్భంలో గుర్తు చేసుకోవాల్సి ఉంది. కేవలం సాధకుడుగా కాక, సిద్ధుడుగా, పరిశుద్ధుడుగా వ్యాసుడి అనుంగు శిష్యుడిగా, అతడి అభివ్యక్తమైన వాహకగా దర్శనమిచ్చే సంజయుడు బ్రాహ్మణధర్మం అవలంబించేవారికే ఆదర్శప్రాయుడు, ఆరాధ్య పురుషుడు.

53. ఆం. మ. భా. ఆశ్రమ - 2-154.

## వర్ణధర్మనిర్వహణలో ధృతరాష్ట్రుడు :

ధృతరాష్ట్రుడు కుటిల స్వభావుడు. స్వార్థపరుడు. లోభి; నటుడు. లోకాన్ని వంచించగల నేర్పరి. అపారమైన మేధాసంపత్తి గలవాడు. అసాధారణమైన ప్రజ్ఞగలవాడు. అమాయికంగా ముఖం పెట్టి తనకు కళ్ళులేవన్నసాకుతో సానుభూతి సంపాదించుకోగల సమర్థుడు. అన్నిటినీమించి కృతఘ్నుడు. అంగవైకల్యంగల ఇతడికి ధర్మశాస్త్రం ప్రకారం రాజ్యాధికారం లేదు. ఆమాట తానే స్వయంగా దుర్యోధనుడితో చెప్పుకున్నాడు.54 కాని అన్న అనే గౌరవంతో పాండురా జతణ్ణి సింహాసనంమీద కూర్చోబెట్టి తాను దిగ్విజయాలు చేసి రాజ్యాన్ని విస్తరింపజేశాడు.

పాండురాజు మరణానంతరం కుంతి పాండవులతో హస్తినకు చేరింది. రాజ్యం పాండవులదనీ, పైగా ధర్మరాజు అన్నదమ్ములందరిలో పెద్దవాడనీ, అతడికి రాజ్యం అప్పజెప్పడమే తన కర్తవ్యమనీ ధృతరాష్ట్రుడికి తెలుసు. తన కొడుకులకు రాజ్యం కట్టబెట్టాలని అతని ప్రగాఢవాంఛ. భీష్మాదులుండగా అది సాధ్యం కాదని వెరచి గతిలేక ధర్మరాజును యువరాజుగా అభిషేకించాడు.

పాండవుల యెడల ప్రజల్లో పెరుగుతున్న ఆరాధనాభావాన్ని చూసి బెంగపెట్టుకున్న దుర్యోధనుడు వారిని హస్తినుంచి తప్పిస్తే తప్ప తనకు ప్రజలహృదయాల్లో అస్తిత్వం ఉండదని నిశ్చయించి పాండవులను వారణావతానికి పంపవలసిందిగా ధృతరాష్ట్రుణ్ణి కోరాడు. తనకూ అలాంటి ఆలోచనే ఉన్నదనీ, భీష్మాదుల్ని చూచి జంకుతున్నాననీ చెప్పి ధృతరాష్ట్రుడు లౌక్యాన్ని ప్రయోగించి పాండవులను తల్లితో వారణావతానికి సాగనంపాడు.

---

54. "....నంగవైకల్యంబునం బరచక్రంబులకుం బ్రతివ్యూహంబులు రచియింప నేరమింజేసి రాజ్యంబునం దగకున్న ..." - ఆం. మ. భా - ఆది-౬-౧౪౮

పాండవులు ద్రౌపదిని పెళ్ళాడి ద్రుపదుడి పురంలో ఆనందంగా ఉన్నారన్న వార్తవిని దుర్యోధనాదులతో వారిని మట్టు పెట్టడమెలాగా అని ఆలోచించి, చేసేదిలేక భీష్ముడి ఆజ్ఞపై పిలిపించాడు. అతడి మాటదాటలేక అర్ధరాజ్యం ఇచ్చాడు. రాచబిడ్డల్లో, ముఖ్యంగా దుర్యోధనాదుల్లో రేగుతున్న ఈర్ష్యాసూయల్ని గమనించిన భీష్ముడు రాజ్యాన్ని చెరిసగంచేస్తే ఆ అర్ధరాజ్యంతోనైనా ధృతరాష్ట్రుడూ, అతడి పుత్రులూ సంతృప్తి పడతారని భావించి ఉంటాడు. కాని అంత తేలిగ్గా సర్దుకొనేవారా ధృతరాష్ట్రుడూ, అతని పుత్రులూ ?

అర్ధరాజ్యాన్నికూడా పాండవులకు దక్కనీయడం ధృతరాష్ట్రుడికీ, అతనికొడుకులకూ ససేమిరా ఇష్టంలేదు. పాండవులను ఎలాగైనా నిలువనీడలేనివాళ్ళుగా చేయాలన్నది ధృతరాష్ట్రుడికోరిక. కాని ధృతరాష్ట్రుడు పరమలౌక్యుడు. తానేదీ కోరిచేస్తున్నట్లు కనబడడు. దుర్యోధనుడిచేత అడిగించుకొని, అతడిమాట కాదనలేదన్నట్లు నటించి తన కోరిక తీర్చుకోవాలని చూస్తాడు. దుర్యోధనుడిమాట విని ధర్మరాజును కోరి జూదానికి పిలిపించినవాడితనే. జూదంలో మాయ జరుగుతున్నట్లు తెలిసినా తెలియనట్లు నటించగలిగినవాడూ, ద్రౌపదికి కనీవినీ ఎరుగని పరాభవాన్ని తన కొడుకులు చేయడానికి సమకట్టినా చీమయినా కుట్టనట్లు కూర్చోగలిగినవాడూ ఇతనే. చివరకు ద్రౌపది పాతివ్రత్యమహిమ తననూ, తనవంశాన్నీ విపత్తులపాలు చేయగలదని తెలిసినప్పుడు లౌక్యంతో ద్రౌపదిని పిలిచి, ఆమె పాతివ్రత్యాన్ని పొగడి పాండవులదాస్యవిముక్తిని ఆమెకు వరంగా ఇచ్చి, ఆమె కోరకుండానే వారిరాజ్యాన్ని వాళ్ళకు అప్పగించి అప్పటికి స్థిమితపడ్డాడు.

ఇంత కథ జరిగిన తరువాతకూడా ధృతరాష్ట్రుడు తన కుటిల బుద్ధికి స్వస్తిచెప్పలేదు. కొడుకు మాటను ఊతగా తీసుకొని మళ్ళీ జూదానికి పిలిపించాడు పాండవుల్ని. ధర్మరాజు పూర్వంలాగే ఓడి

పోయాడు. ఓడిన పాండవులకు అరణ్యవాస అజ్ఞాతవాసాలు విధింప బడ్డాయి. పాండవులు అరణ్యాలకు బయల్దేరుతున్నారు. ధృత రాష్ట్రుడు పాండవులను నిలపవచ్చుగదా! పూర్వంలాగే వాళ్ళ రాజ్యం వాళ్ళకి ఇవ్వవచ్చుగదా! అతడు ఈయలేదు. ఇచ్చేందుకు కాదుగదా జూదానికి మళ్ళీ పిలిపించింది! పాండవులను నిలపమని విదురుడు మొరపెట్టుకుంటూనే ఉన్నాడు. గ్రుడ్డివాడైన ధృత రాష్ట్రుడు ఆకాసేపూ చెవిటివాడుగా కూడా ఉండగలిగాడు.

అజ్ఞాతవాసం అయిపోయినతర్వాత తాను రాజ్యం ఈయ కుండానూ, పాండవులు యుద్ధానికి రాకుండానూ ఉండేందుకు మార్గాన్ని చూడమని సంజయుణ్ణి పాండవుల దగ్గరకు పంపించాడు. ధృతరాష్ట్రుడెంత లౌక్యుడో ధర్మరాజుకూడా అంతలౌక్యుడూను. సామాన్యంగా లోకంలో ధృతరాష్ట్రధర్మరాజుల్ని అమాయకులుగా లెక్కకడుతూ ఉంటారు. నిజానికి భారతం మొత్తంమీద వీరిద్దరే అసాధ్యులు. వీరిద్దరూ ఒకళ్ళను మించినవారు ఒకరు. కాకపోతే ధృతరాష్ట్రుడిది స్వార్థబుద్ధి, ధర్మజుడిది పరమార్థదృష్టి. ధృత రాష్ట్రుడి గమ్యం సొంతకొడుకుల సౌభాగ్యం. ధర్మజుని గమ్యం శ్రీకృష్ణుడి నిర్దేశాన్ని అనుసరించి నడుచుకోవడం. వీరిలోని ఈ స్వభావభేదమే వీరి వ్యక్తిత్వాల్లో చెప్పలేనంత అంతరాన్ని సృష్టించగలిగింది. స్వధర్మానికి స్వార్థం గమ్యమైతే వ్యక్తి ధృత రాష్ట్రుడవుతాడు, పరమార్థం గమ్యమైతే వ్యక్తి ధర్మజుడవుతాడు అన్నది వ్యాసుని ఇతిహాసగత సందేశం.

ధృతరాష్ట్రుడు వినడని తెలిసికూడా ఆ విషయాన్ని తేల్చి చూపడానికి కృష్ణుడు ధృతరాష్ట్రుని కొలువునకు రాయబారానికి వచ్చాడు. చెప్పవలసిందంతా చెప్పాడు. కొడుకులు తనమాటలు వినరన్నసాకుతో తప్పించుకోచూశాడు ధృతరాష్ట్రుడు. చివరకు

కృష్ణుడి విశ్వరూపాన్ని చూసిన తర్వాతకూడా ధృతరాష్ట్రుడు తన స్థితిలో తానుండగలిగాడు. యుద్ధక్షేత్రంలో అర్జునుణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేయగలిగిన కృష్ణుడి విశ్వరూపం కురుసభలో ధృతరాష్ట్రుడి కరడుగట్టిన స్వార్థాన్ని కదిలించలేకపోయింది. అంటే కృష్ణుడి విశ్వరూపానికి ప్రభావంలేదని అర్థంకాదు. ఆ ప్రభావం తన మీద పడకుండా ధృతరాష్ట్రుడు జాగ్రత్తపడగలిగాడని తాత్పర్యం.

ఇంకాకొద్దిసేపట్లో కురుక్షేత్రమహాసంగ్రామం ప్రారంభం కాబోతోందనగా ధృతరాష్ట్రుడికి వ్యాసుడు గోచరించాడు. "ఇప్పటికీ జనక్షయం కాకుండా చూడటం నీ చేతుల్లోనేఉంది. నీవు తలుచుకొంటే ఈయుద్ధం ఆగిపోతుంది. ఈ చివరిక్షణాల్లోనయినా వివేకాన్ని ప్రదర్శించు" అని తెలియచెప్ప ప్రయత్నించాడు. కాని ధృతరాష్ట్రుడు "చేయగలిగిందిలేదు. పనులు పాకాన్నితప్పాయి" అని చప్పరించాడేతప్ప, అప్పటికికూడా స్వార్థాన్ని వదులుకోలేకపోయాడు. తాను పెంచుకున్న స్వార్థానికి ఫలితం ఎలాఉంటుందో కురుక్షేత్రమహాసంగ్రామంలో చవిచూశాడు. తొలినుంచి తుదివరకూ ధృతరాష్ట్రుడి జీవితంలో స్వార్థమే కనబడుతుంది. తన స్వధర్మాన్ని స్వార్థంతో నింపడమేకాక, తనస్వార్థం బయటకు కనబడకుండా తన సొంత కొడుకుల చర్యలనే చాటుగా చేసుకోగలిగిన ధృతరాష్ట్రుడు ఎంతటి వంచనాశిల్పం కలవాడో వర్ణించనలవికాదు. చేసినదంతా తానై ఉండి కూడా తనలో ఏమీ దోషంలేదని లోకమేకాక పెద్దలుకూడా భావించాలని ఇతడి కోరిక. యుద్ధానికిముందు నచ్చచెప్పవచ్చిన వ్యాసుడితో ఇతడన్న పలుకులు చూడండి :

"హితము ధర్మముం దలఁచి యిమ్మెయిఁ జెప్పితి రిట్లు మున్ను నా
సుతుల నయంబున దక్కి చూచితి వారలఁ బంపు సేయ నే

..జతురుఁడఁ గాను బ్రాభవముసాలదు నాదెసఁదప్పులేమి మీ
మతిఁదలపోసి యీపలుకు మానుఁడు పాకముదప్పెఁగార్యముల్"55

ఈవిధంగా తరచిచూస్తే ధృతరాష్ట్రుడిస్వార్థంలో అనూహ్య మైన లోతులు ఎన్నెన్నో ఉన్నాయని తెలుస్తుంది. తనకొడుకులకు రాజ్యందక్కాలని పాండవుల్ని ఇబ్బందులపాలు చేశాడు. తాను అమాయకుడు, మంచివాడు, దోషమెరగనివాడు అనిపించుకోవాలని తప్పంతా తనకొడుకులపైన త్రోసేస్తూవచ్చాడు. తనబిడ్డలకోసం తమ్ముడిబిడ్డల్ని, తాను నిర్దోషిననిపించుకోవడఁకోసం తనబిడ్డల్ని వెలిచేయగల ధృతరాష్ట్రుడిస్వార్థం చివరకు అతనివంశాన్నే బలి తీసుకుంది.

స్వధర్మాచరణ ధర్మంవైపుగాక స్వార్థంవైపు మొగ్గితే దాని ప్రయాణం ఎలాసాగుతుందో, ఆ ప్రయాణపు గమ్యం ఎంతదుర్భరంగా ఉంటుందో తెలియబరుస్తుంది ధృతరాష్ట్రుడి జీవితం.

ధృతరాష్ట్రుడిది ఒక అరుదైన, చిత్రమైన జీవలక్షణం. ఇతనికి దేనిమీదా నమ్మకంలేదు. దేనిప్రభావానికీ ఇతడు జీవితంలో లోను కాలేదు. అది మంచిగానీ, చెడుగానీ, అవతలివారు మహానుభావులూ, అవతారపురుషులూగానీ, దుష్టులూ, దుర్మార్గులూకానీ - ఇతనిమీద ప్రత్యేకమైన ప్రభావాన్ని చూపలేకపోయారు. తనమార్గాన తాను పోయాడు ధృతరాష్ట్రుడు. తనకు గౌరవం ఇచ్చి సింహాసనం ఎక్కించిన పాండురాజు ప్రేమ ఇతడిపై పనిచేయలేదు. తనపై పితృభావంతో పాండవులు చూపిన వినయవిధేయతలు ఇతడిపై పనిచేయలేదు. చెవినిల్లుగట్టుకొనిపోరిన విదురుడి వాక్కులు ఇతని మనస్తత్వాన్ని తాకలేదు. భీష్మద్రోణాదుల నిరంతర సాన్నిధ్యం ఇతణ్ణి చిన్నమెత్తు మార్చలేదు. జన్మఇచ్చిన వ్యాసుడి వెలుగూ, బోధా

55. తం. మ. భా - భీష్మ - 1-13.

ఇతణ్ణి అణు మాత్రం కదిలించలేదు. సనత్సుజాతుడి పరమార్థబోధ ఇతడిపై ఫలించలేదు. కృష్ణుడి విశ్వరూపం ఇతని ప్రయాణాన్ని మలుపు త్రిప్పలేదు. చివరకు ఎవరికొరకు ఈ కథంతా నడిపాడో ఆబిడ్డలందరూ మరణించక తప్పదని తెలిసినప్పుడు కూడా ఇతడు తన బుద్ధిని మరల్చుకోలేదు. అన్నిటికీ అతీతమైన వైరాగ్యస్థితివంటి శూన్యస్థితి ఒకటి ధృతరాష్ట్రుడిలో మనకు కనబడుతుంది. "ఎవరు ఎన్ని చెప్పినా, ఎవరిమాట విన్నా వినకపోయినా జరగవలసింది జరుగుతుంది గదా, దానికొరకు మనమార్గాన్ని మార్చుకోవలసిన అవసరం ఏమిటి!!" అన్నది ధృతరాష్ట్రుడి వేదాంతం. ఈ 'వేదాంతాన్ని' గమనించినవాడు ధర్మరాజు. కాబట్టే అతడు చెప్పినట్లు నడుచుకున్నాడు. భవితవ్యం ఎలాగూ దైవాధీనం గనుక, దాన్ని ధృతరాష్ట్రుడి చేతులతోనే అల్లించినవాడు యుధిష్ఠిరుడు. "ధర్మజుడు మెత్తనిపులి, ధర్మం అధర్మం నీపై పెట్టాడు" అని సంజయుడు చెప్పినా గ్రహించి లెక్కచేయకుండా తన మార్గాన తాను సాగిపోగలిగినవాడు ధృతరాష్ట్రుడు.

## వర్ణ ధర్మ నిర్వహణలో పాండురాజు :

పాండురాజు క్షత్రియధర్మాన్ని ఉదాత్తమైనరీతిలో నిర్వహించడానికి సిద్ధపడినవాడు. శాస్త్రప్రకారం రాజ్యం తనదే అయినప్పటికీ అన్నగారియెడల తనకుగల విశేషగౌరవంతో అతణ్ణి సింహాసనాన్ని అధిష్ఠింపజేసి తాను ఎనలేని దిగ్విజయయాత్రల్ని సలిపాడు. ప్రజల్నీ, తన కుటుంబసభ్యుల్నీ తన వీరోచితమైన ప్రవర్తనతో ఆనందింపజేశాడు.

పాండురాజుకు వేట అంటే ఇష్టం. వేటపై వేడుకతో భార్యలతో కలిసి ఒకసారి అరణ్యానికి చేరుకున్నాడు. అక్కడ అతని వేడుక క్రమంగా వ్యసనంగా మారింది. రాజులకు వేట ధర్మమే. ప్రజారక్షణకు అవసరమైనపుడు రాజు క్రూరమృగాల్ని వధించితీరాలి. అలాగే ఆహార

పదార్థాలుగా కూడా జంతువులను వేటాడి స్వీకరించవచ్చు. కాని ఈ రెండుకారణాలలో దేనికీ చెందకుండా ఎక్కువభాగం వేడుకగా, వ్యసనంగా సాగింది పాండురాజు వేట. ధృతరాష్ట్రుడు ఇష్టాన్నా లన్నిటినీ వారికి ఎప్పటికప్పుడు సమకూరుస్తూనే ఉన్నాడు. అతనికి ఆహారంకోసం జంతువులను చంపితీరవలసిన అవసరంలేదు.

అలాంటి సమయంలో ఒకనాడు ఎంతప్రయత్నించినా మృగాలు దొరకక, రతిక్రీడ సలుపుతున్న ఒక మృగమిథునాన్ని చూసి అధర్మ మని ఎంచకుండా బాణంవేశాడు. వ్యసనానికిలోనైన అతడికి మృగాలు దొరికాయి, తన వినోదం ఫలించిందనిపించిందితప్ప, అవి రతిసౌఖ్యాన్ని అనుభవిస్తున్నాయనీ, ఆసౌఖ్యానికి కూడా తన సౌఖ్యానికి ఉన్నంత విలువ ఉన్నదనీ తట్టలేదు. పైగా అవి కేవలం మృగాలజంటా? కాదు. కిందముడనే ముసీ, అతడి పత్నీ ఆ రూపాల్లో విహరిస్తున్నారు. వ్యసనపరుడైన పాండురాజుకి గుణపాఠం చెప్ప డానికా అన్నట్లుంది వీరికథ.

కిందముడు పాండురాజును నిలదీశాడు. పాండురాజు తనను తాను సమర్థించుకోబోయాడు. అగస్త్యుడు రాజులకు మృగవధ ధర్మ బద్ధం చేశాడని చెబుతూ, తానుచేసింది ధర్మమేనని సూచించాడు.56 కిందముడికి కోపంవచ్చి "మాదంపతులు రతిసౌఖ్యాన్ని అనుభ విస్తుండగా నీవు కొట్టావుకాబట్టి, నీవు నీ సతీసౌఖ్యాన్ని అపేక్షించిన క్షణంలో ఇలాగే మరణిస్తావు"అని శపించాడు అప్పటికిగాని పాండు రాజు తాను చేసిందేమిటో తెలుసుకోలేకపోయాడు. "ఏమిటి ఈ అన్యాయం?"అని కిందముడు నిలదీసినపుడే, చేసిన తప్పును ఒప్పు

56. "తొల్లి యగస్త్య మహామునీంద్రుండు మృగమాంసంబున నిత్యశ్రాద్ధంబు చేయుచుండి రాజులకు మృగవధ దోషంబు లేకుండ నిర్మించె దీని నీకు నింపింపందగునే ?" - ఆం. మ. భా - ఆది-5-57

కొని క్షమాపణ చెప్పుకుంటే బహుశః కిందముడు శపించేవాడు కాదేమో! అలాకాక పాండురాజు తన వ్యసనానికి ధర్మపురంగు పూయడానికి ప్రయత్నించాడు. అగస్త్యుని మాటలను తనకు అనుకూలంగా మలచుకోవాలని చూశాడు. దానితో కిందముడు శపించాడు.

తరువాత పాండురాజు తప్పు తెలుసుకున్నాడు. అహింసా వృత్తితో, తపశ్చరణతో కుంతీమాద్రుల సేవలను అందుకొంటూ ప్రశాంతంగా జీవించసాగాడు. వేటను మరి తలపెట్టలేదు సరిగదా, వానప్రస్థాన్ని స్వీకరించాడు. విధిప్రేరణతో మరల తన కర్తవ్యాన్ని గ్రహించుకొని కుంతీమాద్రులవలన సంతతినిపొంది రాజ్యానికి వారసులుగా, ధర్మానికి రక్షకులుగా సమర్పించాడు. ఆపైన మాద్రితోడి సంగమాన్నికోరి మరణించాడు.

స్వధర్మాన్ని విడిచిపెట్టి పరధర్మాన్ని అవలంబించడం ఎంత భయావహమో, స్వధర్మాన్ని బాధ్యతగా కాక, వేడుకగా వ్యసనంగా మార్చుకోవడంకూడా అంత భయావహమైనదే - అన్న సత్యం పాండురాజు కథలో మనకు బోధపడుతుంది. కాబట్టే యోగిగా జీవించదలచినవాని ఆహార విహారాలు, చేష్టలు, కర్తవ్యనిర్వహణలు మొదలైనవన్నీ యుక్తమైన తీరులో సాగాలని కృష్ణుడు గీతలో చెప్పాడు57. అంటే జీవితంలో సమత్వాన్ని తప్పకూడదన్నమాట. తప్పితే మానవుడు దుఃఖాన్ని అనుభవించకతప్పదు.

రాజ్యంవిషయంగానీ, సుఖసంపదలవిషయంగానీ, వ్యవహారాల విషయంగానీ తనను అంటని ఒక చిత్రమైన నిర్లిప్తత ఇతని

---

57. "యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా" ॥ - భగవద్గీత-6-17

జీవితం మొత్తాన్ని ఆవరించి ఉంది. అందులో ప్రత్యేకంగా ధర్మ దృష్టీలేదు, అధర్మదృష్టీ లేదు.

## వర్ణధర్మనిర్వహణలో కౌరవులు :

కౌరవుల్లో మనకు బాగా తెలిసినవారు దుర్యోధనుడు, దుశ్శాసనుడు, వికర్ణుడు మాత్రమే. ముఖ్యంగా కౌరవులు అనగానే దుర్యోధన దుశ్శాసనులే మనకు గుర్తుకువస్తారు. వీళ్ళిద్దరిలో స్వభావ స్వరూపాలు మనకు పూర్తిగా లభించినవి దుర్యోధనుడివి మాత్రమే. దుశ్శాసనుడు అన్న చేతి ఆయుధంగా మాత్రమే కనబడ తాడు. కౌరవులు క్షత్రియధర్మాన్ని అనుసరించారు. యుద్ధాల్లో వీరోచితంగా పోరాడారు. కాని తమ స్వధర్మాన్ని లోకహితంకోసం కాక తమకోసం వినియోగించుకోవాలని చూశారు. స్వధర్మ నిర్వహణకోసం తామున్నామనికాక, తమకోసం స్వధర్మం ఉన్నట్లు భావించి తమ అహంకారానికి శక్తియుక్తులన్నిటినీ బలిపెట్టుకున్న అయోగ్యులు వీళ్ళు.

కౌరవులకు తల దుర్యోధనుడు. తలనుబట్టే శరీరమని వేరే చెప్పనక్కరలేదు. కర్ణుడు ఈర్ష్యాపరుడైతే దుర్యోధనుడు అహంకారి, అసూయాపరుడు. ఆ అహంకారంతో రాజ్యానికి వారసులైన పాండవు లకు అర్ధరాజ్యం కాదుగదా, అయిదూళ్ళు కూడా ఇవ్వడానికి ఇష్ట పడకపోగా, సూదిమొనమోపే చోటుకూడా యివ్వనని ప్రకటించాడు. రాజ్యాధిపత్యం ఎట్టిపరిస్థితుల్లోను తనను విడిచిపోవడం అతడికి ఇష్టం లేదు. తాను మానధనుడననీ, సార్వభౌముడననీ దుర్యోధనుడి అహంకారపూర్వకమైన విశ్వాసం.

ఈ అహంకారంతో పాండవుల్ని చిన్నచూపు చూచాడు. వాళ్ళపరాక్రమాల్నిగూర్చి భయం వేస్తున్నా తానే గొప్పవాణ్ణని

తన అహంకారంతో పలికించుకొంటూ ఉండేవాడు. అర్జునుణ్ణిగూర్చి ఇతడికి భయం. కర్ణుడు దొరకగానే ఇతడి మనస్సు ఎగిరిగంతేసింది. ఆ రాత్రినుంచీ ఇతడికి హాయిగా నిద్రపట్టింది.

అహంకారంతో ఎంతటి అధర్మానికైనా ఇతడు జంకలేదు. రాజ్యకాంక్షతో, పాండవులపట్ల గల అసూయతో చిన్నప్పటినుంచీ వారిపై పాములా విషంకక్కుతూనే ఉన్నాడు. విషాన్నాలు తినిపించడం దగ్గర్నుంచి లక్కయిల్లు ముట్టించడం, మాయజూదం ఆడించడం, వదినగారి వస్త్రాపహరణానికి నిండుసభలో ప్రయత్నించడం, చివరకు వాళ్ళను అరణ్యాలపాలు చేయడం మొదలైన ఇతని ఘోరకృత్యాలకు అంతులేదు. రాజ్యంలో తనకుతప్ప, పాండవులకు అణుమాత్రమైనా చోటుండకూడదని ఇతడి నిర్ణయం. పాండవులపైగల విరోధంతో కర్ణుణ్ణి అంగరాజ్యానికి అభిషిక్తుణ్ణయినా చేశాడుగానీ, అన్నదమ్ములూ, సరైనవారసులూ అయిన పాండవులకు అయిదూళ్ళు ఇవ్వడానికి కూడా ఇతడికి ప్రాణంబప్పలేదు.

ఈ విధమైన అసూయా అహంకారాలతో, స్వధర్మమైన క్షత్రియ ధర్మాన్ని పూర్తిగా స్వార్థానికి వినియోగించుకోవడానికీ, అహంకారాన్ని తృప్తిపరచుకోవడానికీ ప్రయత్నించి, అది సృష్టిధర్మానికి వ్యతిరేకం కనుక, తొడలు విరిగి నేలకు ఒరిగిపోయాడు. స్వధర్మాన్ని అధర్మంగా వాడుకొని అంతమైపోయారు కౌరవులు. స్వధర్మ నిర్వహణకు కావలసిన సాధన, సంయమనం వీరిలో లోపించాయి. నిజానికి వీరు పుట్టిందే అసూయ నుంచి. తనకన్నాముందు కుంతికి కొడుకు కలిగాడన్న అసూయతో ఉదరతాడనం చేసుకున్న గాంధారి కొడుకులుగదా వీరు! ఆక్షణంలో ఆమె చూపిన అసూయే శతరూపాలతో విజృంభించింది.

ఉన్మాది ఈ లోకంలో ఉంటున్నప్పటికే తనలోకంలోనే తానెలా ఉంటున్నాడో అసూయా అహంకారాలనే ఉన్మాదాలకు

లోనయినవారు తమలోకంలో తాము విహరిస్తూఉంటారు. కాబట్టి ఈ లోకానికి దిగిరారు. కనుక, స్వధర్మనిర్వహణలో తమకుతామే గమ్యమవుతారు. తమకున్న శక్తియుక్తులు తమను పెంచుకోవడం కోసమేననీ, తమలో నివసిస్తున్న భూతాలయిన అహంకార అసూయాదులను తృప్తిపరచడం కోసమేననీ పూర్తిగా విశ్వసించి విజృంభిస్తారు. కట్టెలు కొట్టడం చేతకానివాడు కట్టెమీద వేయబోయిన గొడ్డలిని తనకాలిమీద వేసుకొని నరుక్కున్నట్లు, స్వధర్మమనే సాధనాన్ని వినియోగించుకోవడం తెలియనివారు దానితో తమను తామే హతమార్చుకుంటారు.

మనిషి తన స్వభావాన్ని ఈర్ష్యాసూయ మదమాత్సర్యాది భూతాలుగల చెరసాలనుంచి విడిపించుకొని లోకహితంతో శ్రుతి కలిపి సుఖపడటం ఎలాగో తెలియజెప్పేటందుకే కృష్ణుడు గీతను ఉపదేశించాడు. వ్యాసుడు జాగ్రత్తగా దానిని గ్రంథస్థం చేశాడు. ఇక్కడో చిన్న ధర్మసూక్ష్మముంది. మనిషి తాను బాగుపడాలని తనకు తానుగా సంకల్పించినపుడే గీతగాని, మరొకటిగాని మనిషికి సహకరించగలుగుతుంది. లేనివాడికి ఆ సహకారం అందదు. కారణం-వారు అందుకోవడానికి సిద్ధంగాలేరుగనుక. ఈ సత్యాన్ని నిరూపించడానికే కృష్ణుడు కౌరవుల కొలువుకూటానికి స్వయంగావెళ్ళి ధర్మాధర్మాలను వివరించి విశ్వరూపాన్నికూడా చూపించాడు. బాగుపడాలన్న సంకల్పంలేని ధృతరాష్ట్రుడికీ, అతడి సంతానానికీ కృష్ణుడి సందేశంగానీ, దివ్యదర్శనంగానీ కనువిప్పును కలిగించలేకపోయాయి. అలాంటప్పుడు సృష్టి ఆవ్యక్తుల్ని ఇంక క్షమించదు. దెబ్బకొట్టబడిన ధర్మం తిరిగి దెబ్బకొడుతుందని మనువుచెప్పినట్లు, ఆ వ్యక్తుల అధర్మమే ఆవ్యక్తుల్ని హతమారుస్తుంది. ఆ అధర్మపరుల్ని హతమార్చడానికి నియోగింపబడినవారు నిమిత్తమాత్రులు మాత్రమే. స్వధర్మ నిర్వహణలో దారితప్పినవారు ఎలాంటి

దుఃస్థితిని పొందుతారో కౌరవుల జీవితాల్లో దర్శించిన వ్యాసుడు ఆ దర్శనాన్ని ఇతిహాసరూపంలో మానవాళికి అందించాడు.

తాను చేసేది అధర్మమని తెలిసికూడా దానినే ఆచరించే స్వభావం తనకు ఉండటం గమనించినవాడు దుర్యోధనుడు. అట్టి తన స్వభావానికి గర్వపడ్డవాడుకూడాను. దాని పరిణామం ఎలా ఉంటుందో ఇతడి జన్మ నిరూపించింది.58

## వర్ణధర్మనిర్వహణలో పాండవులు :

వ్యక్తుల పుట్టుక, తల్లిదండ్రులు, సంప్రదాయం, 'హోదాలు', విద్యాభ్యాసం, క్రమశిక్షణ అనే విషయాల ననుసరించి ఆ వ్యక్తులను గూర్చి అర్థంచేసుకోవడం లోకసహజం. ఇలా అర్థంచేసుకోవడంలో ఉన్న విలువలు ఏవీ నిజమైనవి కావని పాండవుల జీవితాలు ఋజువుచేస్తాయి. కౌరవులు రాజధానిలో ధృతరాష్ట్రుడి కొడుకులుగా పుట్టిపెరిగి పరిచయమయ్యారు. పాండవులు పుట్టిన కొన్ని సంవత్సరాలదాకా బంధువులకుగానీ, పెద్దలకుగానీ పరిచితులు కారు. అందులోనూ ఆ తండ్రికొడుకులనడం సందేహాస్పదం. ఇన్నిటినీమించి పనిచేసింది వీరి జీవలక్షణం. దాన్నిబట్టి ఉంటుంది దైవగతి. దానినిబట్టే దైవానుగ్రహం లభిస్తుంది. ఆ ఒక్కదాని మీద ఆధారపడి ప్రజల్లో విలువలు పెరుగుతాయి. ఆ విలువల ముందు మిగిలిన విలువల్ని ప్రజలే కాలక్రమంలో రద్దుచేసుకుంటారు.

దుర్యోధనాదులు రాజకుమారులనేవిషయం కొట్టవచ్చినట్లు కనబడుతున్నా పాండవుల ప్రాబల్యం పెరగడం జరిగింది. రాజ

58. "జానామి ధర్మం నచ మే ప్రవృత్తిః
జానామ్యధర్మం నచ మే నివృత్తిః
కేనాపి దేవేన హృది స్థితేన
యథా ప్రవృత్తోఽస్మి తథాకరోమి ॥" - సంస్కృతభారతం - ఉద్యోగ-

ధానిలో ప్రవేశిస్తున్న బాలురైన పాండవుల్ని చూసే ఆబాల గోపాలం ముగ్ధులయ్యారు.59 అప్పటినుంచీ ప్రజలంతా తమ హృదయ సింహాసనంమీద యువరాజుగా భావిచక్రవర్తిగా ధర్మజుడికి పట్టం కట్టేశారు. పాండవుల ప్రాబల్యాన్ని తప్పించడానికి ధృతరాష్ట్రుడూ, కౌరవులూ చేసిన ప్రయత్నాలన్నీ వారు తమ ప్రాబల్యాన్ని ప్రజల దృష్టిలో కోల్పోవడానికి పనిచేశాయి. లాక్షాగృహదహనం, మాయ జూదాలూ మొదలైనవన్నీ ధృతరాష్ట్ర కౌరవుల స్వభావాలు ప్రజలకు తేటతెల్లం కావడానికీ, పాండవులపట్ల వారికిగల ఆరాధన మరింత స్థిరపడటానికీ పనికివచ్చాయి.

పాండవులు మొట్టమొదటగా ధృతరాష్ట్రాదులకు పరిచయం అయ్యింది ఎవ్వరో అపరిచితులైన ఋషులవలన. వారు ఆ వంశం వారు అనడానికి గుర్తు కుంతీదేవి ఒక్కతే. అయినా ఎవ్వరూ వారి జన్మను గురించి ప్రశ్నించలేకపోయారు. సూదిమోపినంత సందు చిక్కితే ధృతరాష్ట్రుడే త్రోసిపుచ్చేవాడు. జీవలక్షణాల్ని అంటి పెట్టుకొని ఉన్న దైవగుణాల్నీ, అసురగుణాల్నీ గ్రహించి అంతర్యామియైన దైవం ప్రజలరూపాన సముచితంగా ప్రవర్తించడం ఎలా సత్యమో పాండవుల జీవితాలు నిరూపిస్తాయి. దుర్యోధనాదులు వారి జన్మనుగూర్చి గేళిచేయడానికి ప్రయత్నించినా వినిపించుకొన్న వారు లేరు. కృష్ణుడు ఒక వ్యక్తిగా పాండవుల్ని ఆదరించడానికి ముందు ఆవ్యక్తికి వెనుకగా ఉన్న అంతర్యామి తేజస్సు పాండవులను ఆదరించి అభిమానించినట్లు తోస్తుంది. ధర్మం ఉన్నచోట

---

59. "వీరలు దైవశక్తిఁ బ్రభవించిన వారగుటేమి సందియం
బీ రమణీయ కాంతినుపమింపఁగ వేల్పుల కాక యిట్టి యా
కార విశేషసంపదఁ బ్రకాశిత తేజము పేర్మిఁజూడ సా
ధారణమర్త్యులే యని ముదంబునఁబౌరులు దమ్ముఁజూడగన్."

- ఆం. మ. భా. - ఆది - 5 - 151.

దైవానుకూల్యం ఉంటుంది అన్న 'యతో ధర్మ స్తతో జయః' అనే సూక్తి మూఢవిశ్వాసం కాదని వీరి కథాగతి నిరూపించింది.

ధర్మశీలతకూ, సుఖదుఃఖాలకూ సంబంధంలేదనే సత్యాన్ని నిరూపించింది కూడా వీరే. ధర్మాన్ని నమ్మినవాడు ధర్మగతిని అనుసరించి జీవితాన్ని అర్పించి మలుచుకుంటాడుగానీ, అవకాశవాది లాగా సుఖసన్నివేశాలను పట్టుకోవడానికి యత్నించడు. వాడికి సుఖమనే మాటకి తన సంతృప్తి ఒక్కటే అర్థం. ఆసురసంపత్తిగల ధృతరాష్ట్రుడికి సుఖం అంటే తన కుమారులకు రాజ్యం దక్కదేమో నన్న దుఃఖం. దుర్యోధనుడికి సుఖం అంటే ఇతరులు తనకన్నా సంపన్నులవుతారేమోనన్న బాధ. కర్ణుడికి సుఖం అంటే ఈర్ష్య. పాండవులకు సుఖం అంటే తాము తప్పుచేయలేదనే భావం. మిగిలిన నలుగురూ ఈ సుఖపరీక్ష విషయంలో చిన్నచిన్న చికాకులు చెందినా, దృష్టి చెదరకుండా నిలిచి కట్టుకొచ్చినవాడు ధర్మరాజు.

కౌరవులకు తమ జీవితం అంటే తమను గురించి ఇతరులకుగల దృష్టి.పాండవులకు జీవితం అంటే తామూ, తమ బాధ్యతల విలువలూ. వ్యక్తిత్వంలేని వ్యక్తులు కౌరవులు. వ్యక్తిత్వస్థానంలో వాళ్ళకు పట్టుదలలుంటాయి. పాండవులకు వ్యక్తిత్వం అంటే ఆత్మప్రకాశం. అది ధర్మప్రవర్తనగా వ్యక్తం కావాలని దీక్షబూనారు గనుక, దైవ కిరణాలు వారి చేష్టారూపాలుగా వ్యక్తిత్వాన్ని చూపాయి. ఈ ధర్మమార్గాన్ని బోధించేరచన భారతంలో కనిపిస్తుంది. కౌరవులు వందమంది ఉన్నా రచనలో పరిచయమయ్యేది దుర్యోధనుడు ఒక్కడే. పాండవులు అయిదుగురే ఉన్నా ఎవరిచేష్టలతో, రూపు రేఖలతో వారు చదువరులముందు చిరపరిచితులుగా తయారవుతూ ఉంటారు. పాండవులేకాదు - ద్రౌపది, సుభద్ర, అభిమన్యుడు మొదలైనవాళ్ళుకూడాను. ఇక, భానుమతీ, ఆమె పిల్లలూ ఎలా ఉంటారో తిన్నగా తెలియదు. పద్ధెనిమిది పర్వాలూ చదివినవారికి

కూడా. దుశ్శాసనాదులకు దారాపుత్రాదులు ఉన్నారో లేదో కూడా చదువరులకు గుర్తుండదు. ఇది రచయిత పక్షపాతబుద్ధికాదు.లోకంలో కూడా అంతే. ఒక అరవిందయోగికో,రమణ మహర్షికో సంబంధించిన వాళ్ళంతా వారినిబట్టి లోకానికి పరిచయం అవుతారు. ఒక హంతకునికో, సంఘవిద్రోహికో శీలవంతులైన భార్యాబిడ్డలున్నా, వారికి జాలిగొలిపే జీవిత ఘట్టాలున్నా, ప్రజలదృష్టి వాళ్ళమీద పడదు. ఈ లోకధర్మాన్ని వ్యాసుడు తన రచనలో ప్రతిబింబింపజేసినట్లు కనిపిస్తుంది.

పాండురాజు శాపం విషయం తెలిసికూడా పాండవుల జననాన్ని గురించి నలుగురూ ప్రశ్నించకపోవడం, కర్ణజననాన్నిగూర్చి సమాజం కొంత రచ్చచేయడం - వారివారి జీవలక్షణాల్లోని మంచి చెడ్డలనుబట్టేగాని, ఇలాంటి సందర్భాల్లో జరిగిన సన్నివేశాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండదని తెలుస్తుంది. సమాజం అంతర్యామి స్వరూపం కనుక, దానిదృష్టిలో పూజ్యత, అపూజ్యత అనేవి వ్యక్తిగత గుణగణాలనుబట్టేగాని, జన్మనుబట్టికాదని పాండవుల జననం, కర్ణజననం ఋజువుచేస్తాయి. పాండవులకు ఉనికిలేకుండా చేద్దామని ప్రయత్నించినప్పుడల్లా దుర్యోధనాదులు దొరికిపోతూనే వచ్చారు. లతలతో కట్టేసినపుడు, విషాన్నం తినిపించినప్పుడు, లక్కఇల్లు కాల్చినపుడు, మాయజూదం ఆడినప్పుడు వారి ప్రయత్నం ఫలించకపోగా, ఊహించనంత చెడ్డపేరు వచ్చింది. ఘోషయాత్రసమయంలో దుర్యోధనుడు గంధర్వులకు చిక్కినపుడు, సంగతి తెలిసిన ధర్మజుడు దుర్యోధనుణ్ణి విడిపించడానికి భీమార్జునుల్ని పంపిస్తాడు.వాళ్ళు తమకు ఇష్టంలేకపోయినా అన్న ఆజ్ఞను శిరసావహిస్తారు. ఇది కేవలం ధర్మజుడు పరమార్థదృష్టితో తీసుకున్న నిర్ణయంతప్ప, దీనినుంచి అతడు ఆశించిన ప్రయోజనం ఏమీ లేదు. కాని తమను మట్టుపెట్టజూచిన దుర్యోధనుణ్ణే రక్షించిన అజాతశత్రువుగా అతడికి ఎనలేని కీర్తి

వచ్చింది. ఈవిధంగా దుర్యోధనాదులు అనుకున్న ఫలితాలకు బదులుగా అనుకోని దుష్కీర్తిని పొందడం, ధర్మజుడు అనుకుని చేయకపోయినా అతనికి అమితమైన కీర్తి లభిస్తూరావడం 'ధర్మనిస్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యు దైవముండెడిన్' అన్న విశ్వాసానికి వ్యాఖ్యానాలుగా ఉన్నాయి.

భీమాదులు ధర్మజుడిలోని ధర్మమూర్తికి శిరస్సువంచారు. ధర్మజుడు వ్యాస కృష్ణులుగా వ్యక్తమవుతున్న పరతత్త్వానికి తమ్ములతో కలుపుకొని తనను సమర్పించుకొన్నాడు. ఇంద్రియాలు మనస్సుతో కలిసి బుద్ధినీ, ఆపైన, ఆత్మనూ చేరుకున్నట్లు, పాండవులు ద్రౌపదితో కలిసి వ్యాసుణ్ణి, ఆపైన కృష్ణుణ్ణి శరణాగతి చెంది తరించారు.

వ్యాసుణ్ణి కేవలం తాతగానే కాక,తరింపజేసే పరమగురువుగా, కృష్ణుణ్ణి కేవలం బావగానేకాక, త్రోవచూపి నడిపించే మహానుభావుడిగా దర్శించిన పాండవులు వారిరువురి సారథ్యంలో స్వధర్మమైన క్షత్త్రియధర్మాన్ని లోకహితానికి సమర్పణగా చేసి,జీవితాన్ని ధర్మోత్తరంగా నడపసాగారు. తమ అడుగుజాడల్లో కోరి నడుస్తున్న పాండవుల్ని కంటికి రెప్పలా చూసుకొంటూవచ్చారు వ్యాస కృష్ణులు. ఏకారణంచేతనైనా మానవసహజమైన ఆవేశాలకో, విషాదాలకో లోనై, స్వధర్మాన్ని సక్రమంగా నిర్వహించలేని స్థితి ఏర్పడినపుడు వారు కలుగజేసుకొని వెన్నుతట్టి, వలసిన బోధచేసి, నిజస్థితిలో నిలుపుతూ వచ్చారు. ముఖ్యంగా యుద్ధానికిముందు అర్జునుణ్ణి, యుద్ధంతర్వాత ధర్మజుణ్ణి స్వధర్మంలో నిలబెట్టటంలో కృష్ణుడు వహించిన పాత్ర అనితరసాధ్యమైనది. లోకహితంగా స్వధర్మాన్ని నిర్వహించడానికి సిద్ధపడిన వారికి దైవంనుంచి ఎలాంటిరక్షణ ఉంటుందో, పాండవులగాథ మనకు బోధపరుస్తుంది. స్వధర్మాన్ని లోకహితంగా ఆచరించేవ్యక్తి తాత్కాలికమైన ఆవేశాలకో, విషాదాలకో లోనై,

తనకు తెలియకుండానే తాను దారితప్పి పోతున్నపుడు దైవం కలగ జేసుకొని, కనువిప్పు కలిగించి, చేయూతనిచ్చి మళ్ళీ నిజస్థితిలో నిలుపుతాడన్న సత్యాన్ని నిదర్శనపూర్వకంగా నిరూపిస్తుంది పాండవుల గాథ. హృదయాన్ని దైవానికి సమర్పించి స్వధర్మానికి లోకహితాన్ని గమ్యంచేసి ధర్మంతో కలిసి నడిచేవ్యక్తికి అందరూ అనుకొనే సుఖభోగాలు ఒకప్పుడు అందుబాటులో ఉండవచ్చు, మరొకప్పుడు దూరంకావచ్చు. కాని, ఎందరికో లభించని తృప్తి, ప్రశాంతి అతణ్ణి నిరంతరం వరిస్తాయనీ; దైవంయొక్క సాన్నిధ్యంతోపాటు సాహచర్యాన్ని కూడా అవి అనుగ్రహిస్తాయనీ పాండవులగాథ మనకు అందించే పరమోపదేశం.

### వర్ణధర్మనిర్వహణలో శ్రీకృష్ణుడు :

సముద్రపులోతును తెలుసుకోవడానికి ప్రయత్నించడం లాంటిదే శ్రీకృష్ణుడి పాత్రను పరామర్శించడం. ఇతడు సర్వధర్మాలకూ మొదలు, సర్వధర్మాలకూ మూదల అని వ్యాసాది మహర్షుల దర్శనం. చూడగలిగినవారికి చూడగలిగినంతగా దర్శనమిచ్చే పరిపూర్ణ పురుషుడు శ్రీకృష్ణుడు.

కృష్ణావతారమే లోకహితార్థం దిగివచ్చింది కాబట్టి కృష్ణుడి జీవితంలో తనకొరకు ఆచరించిన ధర్మమంటూ కనిపించదు. లోకహితార్థమై ఆవశ్యకతనుబట్టి ఇతడినుంచి నాలుగు వర్ణధర్మాలూ ఆయా సందర్భాల్లో వ్యక్తమయ్యాయి. గోవులను లాలించేటప్పుడు ఇతడు శూద్రుడు. గోవులను పాలించేటప్పుడు ఇతడు వైశ్యుడు. ఆర్తులకు ఆశ్రితులకు అభయమిచ్చి రక్షించేటపుడు ఇతడు క్షత్రియుడు. తన ఉపదేశంతో అజ్ఞాన తిమిరాలను హరిస్తున్నప్పుడు ఇతడు బ్రాహ్మణోత్తముడు. పవిత్రమైన ఈ నాలుగు ధర్మాలకూ

కృష్ణుడు తనశరీరాన్ని వాహికగా నిలిపాడు. తాను దానికి అతీతంగా ఆవరించి ఉన్నాడు. ఆ వాహికనుంచి లోకానికి ఏధర్మం అవసరమైతే ఆధర్మం వ్యక్తమవుతూ ఉంటుంది.

తమస్వధర్మాన్ని లోకహితంగా ఆచరించడానికి సంకల్పించిన వారు సాధువులు. స్వధర్మాన్ని విడిచి పరధర్మాన్ని చేపట్టినవారు కాని, లేదా, స్వధర్మాన్ని స్వార్థంకోరకు వినియోగించుకొనేవారు గాని దుష్కృతులు. సాధువులకు రక్షణ ఇచ్చేందుకు, దుష్కృతులకు శిక్షణ ఇచ్చేటందుకు అన్నికాలాల్లో దిగివస్తూనే ఉంటానని కృష్ణుడు చెప్పాడు. ప్రజలను స్వధర్మంలో సాధువులుగా సమర్థులుగా నిలపడమే ధర్మసంస్థాపన. దానికొరకే పురాణపురుషుడు మరలమరల దిగివచ్చేది. ఆ ధర్మసంస్థాపన ప్రణాళికలో ఇమడని వ్యక్తులు కొందరుంటారు. లోకశ్రేయస్సుకు కంటకంగా ప్రవర్తించే వారికి వారి ప్రవర్తనకు తగిన శిక్షణ ఇవ్వబడుతుంది. వారు మరీ వినిపించుకోనప్పుడు, వారుండటం లోకానికి ప్రమాదకరమైనప్పుడు శిక్షణలో ఒకభాగంగా వారికి శరీరాలు తొలగింపబడతాయి. అన్యాయం అక్రమం చేసే వ్యక్తుల్ని పదవులనుంచి తొలగించడం లాంటిదే ఈదేహాలనుంచి తొలగించడంకూడా. కాబట్టే కృష్ణుడు దేహాలను తొలగించడం పెద్ద విశేషం కాదని అర్జునుడికి బోధించాడు. కాకపోతే దేహాలను కోల్పోయేవారిసంఖ్య అక్షౌహిణులలో ఉండటం విశేషమే. కాబట్టే కృష్ణుడంతటి పరిపూర్ణ అవతారం దిగిరావలసి వచ్చింది.

భారతకాలం ద్వాపరకలియుగాలకు సంధి. కృష్ణనిర్యాణంతో కలియుగం ప్రారంభమైంది. చేయవలసిన ధర్మసంస్థాపనచేసి రాబోయే క్రొత్తయుగానికి సమగ్రమైన ధర్మస్వరూపాన్ని ఉపదేశించడానికే శ్రీకృష్ణుడు దిగివచ్చినట్లు తోస్తుంది. అతడిచ్చిన సందేశమే అంతకు ముందున్న వేదశాస్త్రాలకూ, ఆ తరువాత వెలుస్తున్న వెలవబోతున్న ధర్మదర్శనాలకు మూడల. కాబట్టే ఏ మహానుభావుడు

దిగివచ్చినా భగవద్గీతను ఆశ్రయించి, ఉపాసించి, ఉపదేశించడం జరుగుతోంది.

భారతకాలంనాటికి వర్ణధర్మాలను సృష్టిధర్మాలుగా గుర్తించుకొనేవారి సంఖ్య తగ్గింది. స్వధర్మనిర్వహణకు గమ్యం లోకహితమని తెలిసి వర్తించేవారి సంఖ్యకూడా తగ్గింది. స్వధర్మ నిర్వహణలో ఒడుదుడుకులు ఎదురైనా తట్టుకొని నిలబడటం ఆవశ్యకమనీ, అలా నిలబడినప్పుడు మాత్రమే ధర్మాద్వైతస్థితి సిద్ధించే అవకాశం ఉన్నదనీ గ్రహించగలిగేవారిసంఖ్యకూడా తగ్గింది. స్వధర్మనిర్వహణ అర్థార్జనకోసం, కామతృప్తికోసం అని భావించి స్వధర్మాన్ని తమ అర్థకామాలను తీర్చే దాసిగా మాత్రమే వినియోగించుకొనే దుష్టులసంఖ్య పెరిగింది. అర్థకామాలకు జీవితంలో ప్రథమస్థానం ఇచ్చినవాడికి తోడివాడితో ఘర్షణ రాకతప్పదు. ఆ ఘర్షణ ప్రతియిద్దరిమధ్యా రగలడం ప్రారంభించి ధర్మగ్లానిని సృష్టించింది. ఆగ్లానినుంచి భూమిని రక్షించడంకోసం కృష్ణుడి రాక తప్పనిసరయింది. కృష్ణుడు దిగివచ్చి ధర్మపక్షాన నిలిచి అధర్మ పక్షాన్ని అంతమొందించి శాశ్వతమైన ధర్మాన్ని మరొక్కసారి సామాన్యుడికికూడా బోధపడేతీరులో ఉపదేశించే ఆ ఉపదేశానికి ఉదాహరణగా తన జీవితాన్నే అందించి, తనపాదాన్ని బాణానికి అప్పగించాడు. మళ్ళీవలసినప్పుడల్లా వస్తాననీ, ఇదే సందేశాన్ని ఇస్తాననీ మాట ఇచ్చాడు.

వ్యాసుడు అతడి సందేశాన్ని గ్రంథస్థంచేసి మానవాళికి అందించాడు. ఆ సందేశం అనుభవంలోనికి వచ్చేటందుకు అతడి జీవితంతో ముడిపెట్టుకున్న కౌరవపాండవగాథను మహేతిహాసంగా మలచి అందించాడు. అతడి లీలామయజీవితాన్ని శాశ్వతసృష్టిలీలలో దర్శించి భాగవతంగా గానం చేశాడు. భూమిపైన ఏనాడు ఏనరుడు విషాదంలో పడినా సేదతీర్చి దారిచూపి నడిపేటందుకు గీత దేశ

కాలాలకు అతీతంగా నిలబడి తరతరాల మానవుల్ని తరింపచేస్తోంది. దానివివరణగా భారతం, దాని అనుభూతిగా భాగవతం మానవ జీవితంలో శాశ్వతమైన ఆనందాన్ని పండిస్తున్నాయి. కృష్ణుడు స్వధర్మంలో మానవులను నిలిపి శిక్షణ ఇచ్చేటందుకు నాటినుంచీ వ్యాసవాఙ్మయభవనంనుంచి వ్యక్తమవుతూ మానవాళికి అభయ మిస్తూనే ఉన్నాడు.

# ఆశ్రమ ధర్మాలు -
# ధర్మాద్వైతస్థితి

జీవుల స్వభావమూ, ఆస్వభావంనుండి దిగివచ్చే గుణకర్మలూ జీవుల్ని నాలుగు వర్ణాలుగా విభజిస్తున్నట్లే శరీరంయొక్క పరిణామం జీవులజీవితాన్ని చతురాశ్రమాలుగా విభాగిస్తోంది. వేదాల్లో సృష్టి ధర్మాలుగా వర్ణింపబడ్డ వర్ణాశ్రమధర్మాలకు1 మానవ జీవితంలో ఎంతటిపాత్ర ఉందో, వాటియెడల మానవుడు ఏవిధంగా ప్రతిస్పందించవలసి ఉందో తెలియజెప్పటానికే వెలిశాయి స్మృతులు. సృష్టి పరిణామాన్ని, సృష్టిలోని మానవపరిణామాన్ని తమ జ్ఞాననేత్రంతో దర్శించిన స్మృతికారులు సమాజంలో అన్నిస్థాయిలవారినీ దృష్టిలోపెట్టుకొని ప్రతిజీవి జీవిత ప్రయాణానికీ, మార్గాన్ని నిర్దేశించగలిగేటట్లుగా స్మృతుల్ని బాధ్యతతో తీర్చిదిద్దారు. శ్రుతి స్మృతులు దర్శింపజేసి, నిర్దేశిస్తున్న వర్ణాశ్రమ ధర్మాలను అనుభవంలోనికి తీసుకురావడంతో

1. వేదాల్లో చతురాశ్రమ విభాగం ప్రత్యేకంగా నిర్వచింపబడలేదు. కాని ఆయా ఆశ్రమస్థితులూ, వాటి స్వభావాలూ సూచింపబడ్డాయి. వేదహృదయాన్ని మానవ జీవితంలో అనువర్తింపదలచిన స్మృతికారులు - ముఖ్యంగా మనువు - చతురాశ్రమ విభాగాన్ని నిర్వచించి, తగినవిధుల్ని వేదానికి అనుగుణమైన తీరులో నిర్దేశించాడు. మిగిలిన స్మృతికారులు ఇతణ్ణి అనుసరించి మరింత వివరించారు.

పాటు వాటి అనుష్ఠానంలో మానవులకు కావలసిన సమన్వయాన్ని అందించేటందుకు రూపుకట్టుకున్నవే పురాణేతిహాసాలు. వేదాలను వ్యాసంచేయడంతో ప్రారంభమైన వ్యాసునికృషి అనంతమైన వేద వాఙ్మయానికి మూదల అనదగిన మహాభారతాన్ని అందించడంవరకూ కొనసాగిందని చెప్పుకున్నాం. ఆ మహాభారతం వర్ణధర్మం విషయంలో ఎలాంటి సమ్యగ్దర్శనాన్ని అందిస్తున్నదో తగుమాత్రం తెలుసుకున్నాం. ఇక చతురాశ్రమాల విషయంలో మహాభారతం అందిస్తున్న సమన్వయాన్ని దర్శించడానికి ప్రయత్నిద్దాం.

### భీష్ముని వివరణ :

చతురాశ్రమాలైన బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస్యాశ్రమాలను గూర్చి వివరించమని కోరిన ధర్మజుడికి భీష్మాచార్యుడిలా వివరిస్తున్నాడు -

### 1. బ్రహ్మచర్యాశ్రమం :

గురుదేవుని సేవించడం, ఆగమాలను అధ్యయనం చేయడం, జనులు గుమిగూడి జరుపుకునే జాతరలను, ఉత్సవాలను, వాదోపవాదాలను నిరసించడం, కూడని కుతూహలంతో వాటిలోనికి చొచ్చుకుపోకుండా ఉండటం, భిక్షమెత్తగా వచ్చిన ఆహారాన్ని స్వీకరించడం, షట్కర్మలైన యజన యాజన అధ్యయన అధ్యాపన, దాన, ప్రతిగ్రహాల నిర్వహణలో రాగభరత్వంగానీ, గాఢ ద్వేషంగానీ పొందక, ఎవ్వరితోనూ పగగాక, విద్యపై దృష్టినినిలిపి నిష్ఠతో నిర్మలంగా జీవించడం బ్రహచర్యాశ్రమధర్మం.

### 2. గృహస్థాశ్రమం :

ఏకపత్నీవ్రతం, కరుణా, సత్యవాక్కూ, ఓరిమీ కలిగి ఉండటం, సజ్జనసాంగత్యం కోరి పొందటం, దేవతల్నీ, పితృదేవతల్నీ అతిథుల్నీ మంచిమనస్సుతో సేవించడం, నిత్యాగ్నిహోత్రాన్ని

నెరపడం, మిగిలిన మూడాశ్రమాలవారినీ (విద్యాభ్యాసం చేసే బ్రహ్మచారులీ్న, వానప్రస్థులీ్న, సన్న్యాసం స్వీకరించినవారినీ) శక్తి వంచనలేకుండా సేవించడం గృహస్థాశ్రమధర్మాలుగా బ్రహ్మ కల్పించాడు.

## 3. వానప్రస్థాశ్రమం :

భార్యతోకూడిగానీ, తానొక్కడైనాగానీ వనానికి చేరుకుంటాడు. అభిమానాన్నీ, అహంకారాన్నీ విడిచిపెడతాడు. ఇంద్రియాల్ని మర్దిస్తాడు. జడలుధరిస్తాడు. తాపసశాస్త్రాలను అధ్యయనం చేస్తాడు. అవి అనుభవానికి తెచ్చుకున్నవారితో గోష్ఠుల్లో పాల్గొంటూ ఉంటాడు. బిడ్డలపైగల ప్రత్యేకమైన వాత్సల్యాన్ని విడిచిపెట్టి, సమస్థితిని పొందుతాడు. ఇలా ప్రవర్తించడం వానప్రస్థుడి ధర్మం.

## 4. సన్న్యాసాశ్రమం :

ఇక్కడా, అక్కడా అనిలేక ఎక్కడైనా ఒక్కటిగా ఉంటూ ఉంటాడు. ఆకలి అయినవేళకు ఏది దొరికితే దాన్ని ఆహారంగా స్వీకరిస్తాడు. తానెక్కడ ఉండగా చీకటిపడుతుందో అక్కడ నిద్రపోతాడు. నిత్యాగ్నిహోత్రాన్ని విడిచిపెడతాడు. ఇంద్రియజయాన్ని పొంది భోగాల్లో తనకిది కావాలన్న కోరికలేక నిర్లిప్తుడవుతాడు. తనని ఇతరులు స్తుతించినా మొక్కినా పట్టించుకోడు. ఈవిధంగా యతి నిర్మముడై వర్తిస్తాడు.2

## చతురాశ్రమాల స్వరూపస్వభావాలు :

మానవజీవితంలో తొలిదశలో పెరుగుతున్న వయస్సుతోపాటు వ్యక్తి తన స్వధర్మానికి పదనుపెట్టుకోవడం, తన గుణకర్మలతో సమాజాన్ని అర్చించగల నైపుణ్యాన్ని అభ్యసించడం జరుగుతుంది. యౌవనంలో అడుగుపెట్టగానే సృష్టిధర్మమైన దాంపత్య

2. ఆం. మ. భా - శాంతి - 2-230-233.

ధర్మాన్ని స్వీకరించి, గృహస్థై సంతతిని పొందటం జరుగుతుంది. పిల్లలు పెరిగి పెద్దవాళ్ళయిన తర్వాత వాళ్ళకు పెళ్ళిళ్ళు చేసి బాధ్యతలు అప్పగించి తాను నిర్లిప్తతను అలవరచుకోవడం ప్రారంభమవుతుంది. ఆపైన పండిపోతున్న శరీరాన్ని గమనించి మమకారాన్ని విడిచి, అంతర్ముఖుడై శరీరాన్ని విడిచిపెట్టడం జరుగుతుంది. ప్రధానమైన ఈ నాలుగుస్థితుల్నే మనపెద్దలు నాలుగు ఆశ్రమాలుగా దర్శించారు.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణాలవారు ఈ చతురాశ్రమాలను నిర్వహించవలసి ఉంటుంది.3 శూద్ర స్వభావం కలవాడు తన తండ్రి, పెద్దల సారథ్యంలో తన వృత్తిలో శిక్షణపొంది గృహస్థై సమర్పణబుద్ధికలిగి మిగిలిన మూడువర్ణాలవారినీ సేవించడమే జీవిత పరమావధిగా గ్రహించవలసి ఉంటుంది. మొదటి మూడువర్ణాలవారికీ బ్రహ్మచర్యాశ్రమంలో గురుకులవాసాన్ని తప్పనిసరిగా చెప్పి శూద్రుడికి చెప్పకపోవడంలో గ్రహించవలసిన సూక్ష్మం ఒకటి ఉంది అనిపిస్తుంది. శూద్రధర్మం గలవాడు తాను సేవించే యజమానినే దైవంగా భావిస్తూ ఆయజమాని శ్రేయస్సే తన శ్రేయస్సుగా జీవించడంలో ఆత్మపరంగా నిరంతరమైన పరిశుద్ధిని పొందుతున్నాడు. మిగిలిన మూడువర్ణాలవారినీ గురుకులావాసంలో వేదాధ్యయనాది శిక్షణతో అంతర్యామితో శ్రుతి కుదరడంవల్ల మాత్రమే ఈపరిశుద్ధి లభిస్తున్నది. గురుకులశిక్షణలేని బ్రాహ్మణక్షత్రియవైశ్య ధర్మాలవారు పద్ధతిలేని తమప్రవర్తనతో సామాజికవ్యవస్థను అస్తవ్యస్తం చేయగలరు. బాధ్యతాయుతమైన జీవితాలను సమాజంలో నిర్వహించవలసిన ఈ మూడువర్ణాలవారికీ గురుకులావాసం తప్పనిసరి అని చెప్పబడింది ఈ కారణంవల్లనే అని తోస్తుంది. మూడువర్ణాలవారూ చెప్పినట్లు చేసుకుపోయే శూద్రునికి ధర్మాధర్మాలతో

3. ఆం. మ. భా - శాంతి - 2-214

పనిలేదు. తాను సేవిస్తున్న యజమాని వాక్కే తనకర్తవ్యంగా సాగి పోతాడతను. మిగిలిన మూడు వర్ణాలవారి విషయం అలాంటిది కాదు. బ్రాహ్మణుడు సమాజానికి మార్గాన్ని చూపవలసినవాడు. క్షత్రియుడు సమాజానికి రక్షణ కల్పించవలసినవాడు. వైశ్యుడు వస్తుసంపదల వినిమయాన్ని, కృషి, వాణిజ్యాల్ని ధర్మబద్ధంగా నిర్వహించవలసినవాడు. ఈ ముగ్గురికీ చిన్నతనంలో ధార్మికమైన దృక్పథం అలవడకపోతే, హృదయంలో దైవచింతన పుట్టకపోతే, జీవితం లోకహితో న్ముఖంగా సాగాలన్న దర్శనం లభించదు. ఈ దర్శనం లభించనివాడు ఏవిప్రవర్తన ఏరీతిగా ఉంటుందో మనం ఊహించవచ్చు. సమాజంలో ఒకరికోసం ఒకరు బ్రతకవలసిందిపోయి, ఒకరినొకరు పీడించడానికి సిద్ధపడటం తటస్థిస్తుంది. కనుక ఈ మూడు వర్ణాలవారికీ గురుకులావాసంలో ధార్మికమైన శిక్షణ ఆవశ్యకమని ఋషులు దర్శించి ఉంటారు.

## 1. బ్రహ్మచర్యాశ్రమం :

బ్రాహ్మణుడికి ఎనిమిదవఏట, క్షత్రియుడికి పదకొండవఏట, వైశ్యుడికి పన్నెండవఏట ఉపనయనం చేసి గురుకులాల్లో గురువులకు అప్పచెబుతారు4. గాయత్రిని ఉపదేశించడంతో విద్యాభ్యాసం ప్రారంభం అవుతుంది. గానం చేసే వారిని రక్షించేది గాయత్రిఅని దాని ఉపాసనతో విద్యార్థులకు తమతమ బుద్ధులను ప్రచోదనం చేస్తున్న పరమధర్మంతో శ్రుతికుదురుతుంది. ఆ పరమధర్మప్రేరణతో

---

4. "ఉపనయనం బ్రాహ్మణస్యాష్టమే" గౌతమసూత్రాలు - 1-8
"ఏకాదశ ద్వాదశయోః క్షత్రియ వైశ్యయోః"
- గౌతమసూత్రాలు - 1-13

"గర్భాదిః సంఖ్యా వర్షాణాం" గౌతమసూత్రాలు - 1-10
వయస్సును గర్భమైనప్పటినుండి గణనములోనికి తీసుకొంటారు.

స్వధర్మ శిక్షణ సాగుతుంది. ఉపనయనమంటే దగ్గరకు చేర్చేది అని అర్థం. పరమధర్మం దగ్గరకు బాలుణ్ణి చేర్చేదే ఉపనయనం. మానవుడు ప్రకృతి తనకిచ్చిన సంతతిని పెంచి, పోషించి, ఊహ తెలిసేవయసు రాగానే పరమధర్మస్వరూపకు ఆ బిడ్డల్ని సమర్పించి లోకహితార్థమై స్వధర్మంలో శిక్షణ పొందేటందుకు వారిని గురుకులాల్లో అప్పగించాలని పెద్దలు ఏర్పాటు చేసిన సంప్రదాయం.

గురుకులావాసం ప్రారంభమైనప్పటినుంచీ విద్యార్థి స్వధర్మానికి తగిన పదను పెట్టుకోవడం ప్రారంభించాలి. జీవిత నిర్వహణకు కావలసిన శిక్షణను గురువునుంచి పొందుతూ స్వధర్మానికి తగిన తీరులో తనను తాను తీర్చిదిద్దుకొనే ఈ వయస్సులో విద్యార్థి మనస్సులో ఇతర విషయాలకు చోటుండకూడదు. ఈ వయస్సులో తానభ్యసించిన విద్యతోనే జీవితాంతం తాను సమాజాన్ని అర్చించవలసి ఉంటుంది. ఒక సాధనగా, తపస్సుగా విద్యను అభ్యసించవలసిన వయస్సది. వర్షాకాలంలో వేసిన విత్తనానికీ, మిగిలిన కాలాల్లో వేసిన విత్తనానికీ ఎంత తేడా ఉంటుందో, విద్యార్థిదశలో అభ్యసించిన విద్యకూ, ఆ దశదాటిన తర్వాత చేసే విద్యాభ్యాస ప్రయత్నాలకూ అంతే తేడా ఉంటుంది. కాబట్టే బ్రహ్మచర్యాశ్రమ ధర్మాల్లో గోష్ఠుల్లో పాల్గొనవద్దనీ, జాతర్లూ మొదలైనవి నిరసించమనీ చెప్పడం జరిగింది.

భిక్షమెత్తగా లభించిన ఆహారాన్ని గురువులనుజ్ఞతో స్వీకరించాలనీ, రాగద్వేషాలకు అతీతంగా జీవించడం అలవరచుకోవాలనీ చెప్పడంలో అహంకారాది వికారాలకు అతీతంగా విద్యార్థిని నిలిపి సహాధ్యాయులతో సహజీవనాన్ని అనుభవింపచేసే శిక్షణ ఇమిడి ఉంది.

మొత్తంమీద బ్రహ్మచర్యాశ్రమంలో విద్యార్థి సాధించవలసిన అంశాలు రెండు - మొదటిది సర్వాంతర్యామితో శ్రుతికలప

గలిగిన సత్ప్రవర్తన, రెండవది సమాజాన్ని తాను సేవింపవలసిన స్వధర్మానికి సంబంధించిన సమగ్రశిక్షణ. ఈ రెండంశాల్లో శిక్షణ పొందుతున్న బాలుడు శిక్షణ సంపూర్ణమయ్యేసరికి యువకు డవుతాడు. ఆపైన అతడు గృహస్థాశ్రమాన్ని స్వీకరించి తాను శిక్షణ పొందిన స్వధర్మంతో సమాజాన్ని అర్చించవలసి ఉంటుంది. బ్రహ్మచర్యాశ్రమంలో గాయత్రిని ఉపదేశంపొంది స్వధర్మంలో శిక్షణ పొందటం ఎంత బాధ్యతో, బ్రహ్మచర్యాశ్రమం పూర్తికాగానే గృహస్థుడయి క్రమశిక్షణాయుతమైన కుటుంబజీవితాన్ని రూపొందించుకొని లోకహితంగా స్వధర్మాన్ని ఆచరించడమూ అంతే పవిత్రమైన బాధ్యత.

## 2. గృహస్థాశ్రమం :

గురుకులాల్లో విద్యాభ్యాసం పూర్తయిన యువకులకు స్నాతకోత్సవాన్నిజరిపి, సమాజంలోకి బాధ్యతగల పౌరులుగా పంపబోయే ముందు గురువు తన చరమసందేశాన్ని ఇస్తూ "...సత్యాన్నే పలుకు, ధర్మాన్నే ఆచరించు. స్వాధ్యాయంలో పరాకుపడకు. ఆచార్యునికి గురుదక్షిణ సమర్పించి గృహస్థాశ్రమాన్ని స్వీకరించు. సంతతి అనే తంతువును తెంచకు..."5 అని ధర్మస్వరూపాన్ని తెలియజెప్పి గృహస్థాశ్రమ జీవితంలోకి ప్రవేశించమని ఆశీర్వదిస్తాడు.

దాంపత్యధర్మమనేది నరులు మాత్రమే కనిపెట్టిందీ కాదు; కేవలం నరుల్లో మాత్రమే వర్తించేదీకాదు. సృష్టిలోగల వృక్షజాలంలో, పశుపక్ష్యాదుల్లో సర్వత్రా వర్తించే సృష్టిధర్మం. వృక్షజంతువర్గాల్లో (మానవుడుకూడా జంతువర్గంలోనివాడే) తరాలనుండి

5. "....సత్యం వద, ధర్మం చర, స్వాధ్యాయా న్మా ప్రమదః, ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః,

— తైత్తిరీయం - 11 అనువాకం.

తరాలు దిగివచ్చి వర్ధిల్లేటందుకు వర్తిస్తున్న ధర్మం. మన పెద్దలందరూ ఈ ధర్మాన్ని ఆచరించుకొంటూ వచ్చినందువల్లనే మనం ఈ సృష్టిలోకి రాగలిగాం. అలాగే మన తర్వాతి తరాన్ని దాంపత్యధర్మాన్ని అవలంబించి పొంది ప్రకృతికి సమర్పించవలసిన బాధ్యత మనమీద ఉంది. ఈ బాధ్యతనే పితౄణం అంటారు. కనుకనే వేదం సంతతి అనే దారాన్ని తెంచవద్దని నొక్కి చెబుతోంది. దేవునికి గుడికట్టడం ఎలాంటిదో జీవికి శరీరాన్ని కల్పించి సమర్పించడం కూడా అలాంటిదే. అంత పవిత్రమైనదే. ఆ సజీవ దేహాలయాల నిర్మాణానికే దాంపత్యధర్మం ఉద్దేశింపబడింది.

గృహస్థాశ్రమం చాలా నిండైనది. బాధ్యతాయుతమైనది. మిగిలిన మూడు ఆశ్రమాలవారికీ కల్పవృక్షంలాంటిది. ఇంకా గృహస్థులుకాని బ్రహ్మచారులకూ, గృహస్థధర్మాన్ని వదలిన వానప్రస్థులకూ, శరీరాన్నే వదలబోతున్న సన్యాసులకూ సేవచేయవలసిన బాధ్యత గృహస్థాశ్రమంలోనివారిదే. శరీరానికి ప్రాణం ఎలాంటిదో సామాజిక వ్యవస్థకు గృహస్థాశ్రమం అలాంటిది. ఈ సత్యాన్ని తెలియచెబుతూనే మనువు "ఏరీతిగా సర్వజీవులూ వాయువును ఆశ్రయించి ప్రాణాలను నిలుపుకుంటున్నాయో, ఆరీతిగానే అన్ని ఆశ్రమాలవారూ గృహస్థునిపై ఆధారపడి ఉన్నారు"6, "ఏవిధంగా సమస్త నదీనదాలు సముద్రంలో స్థితిని పొందుతున్నాయో, ఆ విధంగానే అన్ని ఆశ్రమాలవారూ గృహస్థాశ్రమంలోనే ఉనికిని గలిగిఉంటున్నారు"7 అన్నాడు.

కుటుంబం సమాజాన్ని అర్చించే యజ్ఞశాల. అందుకే కుటుంబ పెద్ద యజమాని అవుతున్నాడు. యజమాని అంటే యజ్ఞాన్ని నిర్వ

6. "యథా వాయుం సమాశ్రిత్య సర్వే జీవంతి జంతవః
తథా గృహస్థమాశ్రిత్య వర్తంత ఇతరాశ్రమాః" ॥-మనుస్మృతి - 3-77.

7. "యథా నదీనదాః సర్వే సాగరే యాంతి సంస్థితిమ్ ।
తథైవాశ్రమిణః సర్వే గృహస్థే యాంతి సంస్థితిమ్" ॥-మనుస్మృతి-6-90.

హించేవాడు. ఆయజమాని లోకహితంకోసం చేస్తున్న స్వధర్మాచరణమనే యజ్ఞానికి సహకరించేవారే ఆలుబిడ్డలు, బంధుమిత్రాదులు. ఆ యజ్ఞం నిర్విఘ్నంగా సాగుతున్నంతవరకే సాంఘికవ్యవస్థ సుస్థిరంగా నిలబడుతుంది. మానవుడు తాను చేయదలచిన సేవా, చూపదలచిన ప్రజ్ఞా, చేయడానికీ, చూపడానికీ చక్కని అవకాశమే గృహస్థాశ్రమం.

మానవజీవితంలో పట్టు ఉన్నవయస్సే గృహస్థాశ్రమం. ఆ తరువాత శరీరశక్తి క్రమంగా అదృశ్యం కావడం ప్రారంభిస్తుంది. హారతి కర్పూరంలా మనం చూస్తూ ఉండగానే ఆ శక్తి హరించిపోతుంది. కాబట్టి గృహస్థాశ్రమకాలాన్ని మానవుడు సద్వినియోగపరుచుకోవాలి. ఆ సద్వినియోగపరుచుకోవడంకోసమే బ్రహ్మచర్యాశ్రమంలో అతను పొందిన శిక్షణ అంతానూ.

అన్నికాలాల్లోనూ కొంతమంది తెలియక గృహస్థాశ్రమాన్ని మోక్షధర్మానికి అడ్డంకిగా భ్రమపడేవారుంటూనే ఉంటారు. బ్రహ్మచర్యాశ్రమంలోనే తుదివరకూ ఉండిపోతే స్వచ్ఛమైన మోక్షం వస్తుందనీ, గృహస్థాశ్రమ స్వీకారంవల్ల జీవితం కొంత మైలపడుతుందనీ భావించేవారుంటారు. ఆలుబిడ్డల, బంధుమిత్రుల-తోడి సంబంధాలు బంధాలనీ, ఆ ఊబిలోకి దిగకుండా ఉంటేనే మంచిదనీ ఊహించేవారుంటారు. ఇలా భావించేవారినీ, ఊహించేవారినీ యథార్థస్థితిలోనికి మేలుకొలిపేటందుకే భారతంలో జరత్కారుని కథ ప్రత్యేకంగా వివరించబడింది. ఆకథ ఇలా నడుస్తుంది - జరత్కారుడు మునికుమారుడు. పరమతపోనిధి. కాని అతడు బ్రహ్మచర్యాశ్రమంలోనే ఉండిపోవాలని నిశ్చయించుకొని అరణ్యాల్లో తిరుగుతూ ఉండగా ఒక చిత్రమైన దృశ్యాన్ని చూశాడు. ఒక చెట్టుకొమ్మకు కొందరు మునులు తల్లక్రిందుగా వ్రేలాడుతూ సూర్యకిరణాలనే ఆహారంగా స్వీకరిస్తూ ప్రొద్దువెళ్ళబుచ్చుతున్నారు.

ఆ చెట్టు వేళ్ళను ఒక ఎలుక కొరికివేస్తోంది. ఇంకొక్క వేరుమాత్రమే మిగిలి ఉంది. ఆచెట్టు పడిపోవడానికి సిద్ధంగాఉంది. జరత్కారువు వాళ్ళనుచూసి ఆశ్చర్యపడి సమీపించి నమస్కరించి, "ఓ మహానుభావులారా! ఉగ్రమైనరీతిలో మీరు తలక్రిందుగా వేళ్ళాడుతున్నారు. ఇదికూడా ఒక తపస్సే అయితే, నాకు కూడా ఉపదేశించండి. నేనుకూడా ఆచరిస్తాను" అన్నాడు. అప్పుడా ఋషులు దీనవదనులై "పుణ్యాత్ముడా! ఇదేమి తపం ? మేము దుష్కృతుల మవడంవల్ల, ఆధారంలేక సంతానచ్ఛేదాన్నిపొంది అధోలోకాల్లోనికి పడబోతున్నాం. మందభాగ్యులమైన మావంశంలో జరత్కారుడనే ఒక పాపాత్ముడుపుట్టి భార్యను స్వీకరించడానికీ, సంతతిని పొందడానికీ ఇష్టపడకున్నాడు. మే మతని తాతముత్తాతలం. మా ఆధారాన్ని కాలుడు మూషికమై తరతరానికీ కొరుక్కుంటూరాగా, ఇంకా ఒక్కవేరు మాత్రమే మిగిలిఉంది. జరత్కారువు సంతతిని పొందకపోతే ఈవేరుకూడా తెగిపోయి మేము క్రిందిలోకాల్లోకి పడిపోతాం. అతడు పెళ్ళిచేసుకొని సంతతిని పొందితే ఉర్ధ్వగతుల్ని పొందుతాం. నీవెవరో మాచుట్టంవలె ప్రేమతో మాపలుకుల్ని ఆదరిస్తున్నావు. నీవు ఎరుగుంటే ఆ జరత్కారునికి మేముపడే ఈ అవస్థల్ని తెలియజెప్పు" అన్నారు. ఆ మాటలువిని జరత్కారువు కరిగిపోయాడు. అతని చిత్తం కరుణతో నిండిపోయింది. సంతానార్థమై వివాహాన్ని చేసుకోవడానికి సిద్ధపడి, తన పితృదేవతలతో "మీరు నా పితృదేవతలు. నా కారాధ్యులు. నేను మీకు ఆత్మజుడనైన జరత్కారువు అనేవాడిని. ఇంతకుముందు వివాహం చేసుకోవాలనే ఆలోచన నాకు లేదు. కాని మిమ్మల్ని ఈ స్థితిలో చూసిన తర్వాత మీ హితాన్ని కోరేవాడినై సంతోషంగా భార్యను స్వీకరించేందుకు నిర్ణయించుకున్నాను" అని వారి ఆశీస్సులకై తలవంచాడు. అప్పుడా పితృదేవతలిలా అన్నారు-

"తగిన సుపుత్త్రిలంబడసి ధర్మువు దప్పక తమ్ము నుత్తముల్
పొగడఁగ మన్మహామతుల్ పొందుగతుల్ కడు ఘోరనిష్ఠతోఁ
దగిలి తపంబు సేసియును దక్షిణ లిమ్మగనిచ్చి యజ్ఞముల్
నెగడఁగఁజేసియుం బడయనేర రపుత్త్రికులైన దుర్మతుల్"8

"కాబట్టి నీవు భార్యను స్వీకరించి, సత్సంతానాన్ని పొంది మాకు ఊర్ధ్వగతులను ప్రసాదించవలసింది". వారి ఆశీస్సులను స్వీకరించి జరత్కారువు తన పేరే కల వాసుకి చెల్లెలైన జరత్కారు వనే కన్యను వివాహమాడి, ఆస్తీకుడనే కారణజన్ముణ్ణి కన్నాడు. అతడే జనమేజయుడు సంకల్పించిన సర్పయాగాన్ని తన ప్రభావంతో నిలుపుచేసి, నాగకులాన్ని ఆదుకున్నాడు.9

వివాహం సంసారబంధాన్ని కల్పిస్తుందనీ, పునరావృత్తి పథానికి దిగజారుస్తుందనీ భావించిన జరత్కారువు పితృదేవతలు పడుతున్న అవసను గమనించి సత్యాన్ని దర్శించాడు. వివాహం మానవుడు కల్పించుకొన్నదికాదనీ, ప్రకృతిధర్మమనీ వెనుక తరాల వారికి ఊర్ధ్వగతుల్ని ప్రసాదించి తరువాతి తరాలను నిలబెట్టేదనీ గ్రహించాడు. దాంపత్యధర్మం ఒకపవిత్రమైన బాధ్యతేగానీ, బరువు కాదనీ, దాని నిజస్వరూపాన్ని తెలుసుకొని ప్రవర్తిస్తే పరమార్థ సాధనకు అన్నివిధాలా సహకరిస్తుందనీ దర్శించాడు. వివాహం అన్నది స్వవిషయమనే భ్రమనుంచి సృష్టిధర్మమనే సత్యంలోనికి మేల్కొన్నాడు. సుఖంకొరకు స్వీకరించినపుడు గృహస్థధర్మం బంధం అవుతుందికానీ, సంతతికొరకూ, దేవపితృతిథులనూ ఆశ్రితులనూ సేవించేటందుకూ స్వీకరించినపుడు గృహస్థాశ్రమనిర్వహణలో మోక్ష ద్వారం దానికదిగా తెరచుకుంటుందని తెలుసుకున్నాడు.

---

8. ఆం. మ. భా - ఆది-2-149.

9. ఆం. మ. భా - ఆది-2-138-161.

గృహస్థాశ్రమంయొక్క ప్రాధాన్యాన్ని తెలియజెప్పే సన్నివేశాలు పాండురాజు జీవితంలోకూడా జరిగాయి. కిందముని శాపం పొందినతర్వాత జరిగిన సన్నివేశానికి బాధపడ్డ పాండురాజు కుంతీమాద్రులను హస్తినకు చేరుకోమన్నాడు. తాను యతిగా మారి ఘోరతపస్సును ఆచరిస్తానన్నాడు. కుంతీమాద్రులు అతణ్ణి విడిచి ఉండలేమన్నారు. వాళ్ళకోరికపై పాండురాజు వానప్రస్థాన్ని స్వీకరించి వాళ్ళతో కలిసి ఉంటూ తపస్సు చేయసాగాడు.

ఒకనాడు శతశృంగ పర్వతంపై ఋషులూ, దేవతలూ ఊర్ధ్వగతుల్లో ప్రయాణం చేయడం చూశాడు పాండురాజు. విశేషమేమిటని వారినడిగాడు. వారు "నేడమావాస్య, బ్రహ్మదేవుణ్ణి చూసి వచ్చేటందుకు దేవతలూ, పితృదేవతలూ, ఋషులూ అందరం బ్రహ్మలోకానికి వెడుతున్నాం" అన్నారు. పాండురాజుకు కూడా బ్రహ్మదేవుడి దర్శనం చేసుకోవాలనిపించింది. భార్యలతోకూడి వాళ్ళను అనుసరించాడు. కొంతసేపటికి ఋషులు వెనక్కితిరిగి చూసి, కుంతీమాద్రులను చూపి పాండురాజుతో "వీళ్ళు మృదువైనవాళ్ళు. వీళ్ళతో కూడి నీవు మమ్మల్ని అనుసరించలేవు. ఇవి దేవపథాలు. మీరు నిలిచిపొండి" అన్నారు. వాళ్ళమాటల్లోని అంతరార్థం గ్రహించగలిగాడు పాండురాజు. గ్రహించి వాళ్ళతో "స్వర్గద్వారాన్ని ప్రవేశించడానికి సంతతిపొందినవాళ్ళుగానీ తగినవాళ్ళు కారటగదా! 'అపుత్రస్య గతిర్నాస్తి' అనే వేదవచనంకూడా ఉన్నది. నేను అపుత్రికుణ్ణి. ఏమిచేయగలను?" అని దీనవదనుడై మునులను వేడుకున్నాడు. జరగబోయేది దర్శించగలిగిన ఆఋషులు పాండురాజును ఓదార్చి "నీవు అపుత్రికుడివి కావు. నీకు ధర్మానిల శక్రాశ్వినుల వరాలవల్ల అక్షయమైన లోకాలు లభించగలవు. కాబట్టి సంతానార్థం యత్నం చేయవలసింది" అన్నారు.

అప్పుడు పాండురాజు ఒక్క పితృఋణంతప్ప మిగిలిన దేవ ఋషి ఋణాలు తీరిపోయాయని తెలుసికొని, పితౄణం ఎలా తీరు తుందా అని బాధపడసాగాడు. కిందముని శాపంవల్ల తనకు సంతతి కలిగే అవకాశంలేదని వ్యధచెంది, ఒకనాడు ఏకాంతంలో కుంతితో "సంతతి లేనివారికి దానతపోయజ్ఞాలవల్ల ఊర్ధ్వగతులు ప్రాప్తించవు. సంతతిపొందినవారే అందరిలో పూజ్యులు. కాబట్టి నీవు సంతతిని ధర్మమార్గంలో పొందవలసింది. సంతతిలేకుండా బ్రతికినా, చని పోయినా ఒక్కటే. ఇహపరాలు రెండూ సంతతిలేనివారికి శూన్యం. కావున నాచే నియోగింపబడి సంతతి పొందవలసింది" అని ఆమెను బతిమాలి, ఒప్పించి, ఆమెకుగల వరప్రభావంవల్ల దేవతల అనుగ్రహంతో బిడ్డల్ని పొందాడు.10

మునిదంపతుల్ని కొట్టానన్న పశ్చాత్తాపంతో పాండురాజు యత్యాశ్రమాన్ని స్వీకరిస్తానన్నాడు. కుంతీమాద్రుల కోరిక కాదన లేక వానప్రస్థంలో నిలిచాడు. ఆపైన జరిగిన సన్నివేశాల్లో పుత్త్రులు లేని జీవితానికి అర్థమేలేదని తెలుసుకున్న పాండురాజు గృహస్థాశ్ర మానికి దిగివచ్చి, కుంతీదేవిని వేడి, ఒప్పించి, క్షేత్రజుల్ని పొంది తృప్తి పడ్డాడు.

గృహస్థాశ్రమంయొక్క పవిత్ర స్వరూపాన్ని తెలియజేసే ప్రధానమైన గాథను వ్యాసభగవానుడే భాగవతంలో పొందు పరిచాడు. బ్రహ్మ తననుండి వ్యక్తమైన కర్దమప్రజాపతిని సృష్టి చేయువలసిందిగా ఆజ్ఞాపిస్తాడు. కర్దమప్రజాపతి నారాయణుణ్ణిగూర్చి తపస్సుచేస్తాడు. తపస్సుకు మెచ్చి సాక్షాత్కరించిన నారాయణుడు వరం కోరమంటాడు అప్పుడు కర్దమ ప్రజాపతి సృష్టికార్యనిర్వహణకు తగిన భార్యను ప్రసాదించుమని కోరతాడు. నారాయణుడి సంకల్పం ప్రకారం స్వాయంభువమనుపు కుమార్తె అయిన దేవహూతితో

10. ఆం. మ. భా. ఆది - 5-67-137.

కర్దముడికి వివాహం జరుగుతుంది. ఆపైన నారాయణుడే వారికి పుత్రుడుగా జన్మిస్తాడు. అతడే కపిలుడు.11

ఈవిధంగా గృహస్థాశ్రమంయొక్క ఆవశ్యకత, పవిత్రత వేద వాఙ్మయంనుంచి వ్యాస వాఙ్మయంవరకూ కీర్తింపబడుతూనే ఉన్నాయి. ముఖ్యంగా భారతం చతురాశ్రమాల్లో గృహస్థాశ్రమం యొక్క స్వరూపాన్ని విశదపరచి జిజ్ఞాసువులకు మార్గనిర్దేశం చేస్తోంది. ఈ సత్యాన్ని గ్రహించే నన్నయగారు "శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో..." అన్న ప్రార్థనాశ్లోకంలో త్రిమూర్తులను గృహస్థులుగా నొక్కిచెబుతూ ఆంధ్రవాఙ్మయానికి సింహద్వారం తెరిచారు.

## 3. వానప్రస్థాశ్రమం :

గృహస్థాశ్రమంలో బిడ్డల్ని పెంచి, పెద్దచేసి, తీర్చిదిద్ది వారిని గృహస్థులుగా చేయడంతో వ్యక్తిజీవితం ఒక స్థాయికి వస్తుంది. తన బిడ్డలు తనంతవారై, బాధ్యతలను సక్రమంగా నిర్వహించుకోనేస్థితికి ఎదిగేటప్పటికి, తృప్తితో తరువాతి ఆశ్రమమైన వానప్రస్థంలో అడుగుపెడతాడు మానవుడు. ఇక తాను బిడ్డలదగ్గర ఉండవలసిన ఆవశ్యకత ఉండదు గనుక, భార్యతో కలిసిగానీ, తానొక్కడూగానీ, ప్రశాంతజీవనానికై వనానికో తరలి వెడతాడు. "వ్యక్తి తనజుట్టు నెరయటాన్ని, తన సంతానానికి సంతానాన్ని చూసి అప్పుడు అరణ్యాన్ని ఆశ్రయించాలి" అంటాడు మనువు.12

వానప్రస్థాశ్రమధర్మంలో అడవులకు చేరడం అనేది నియమంగా చెప్పడంలో చాలావిశేషముంది. బిడ్డలు పెరిగి పెద్దవారై ప్రయోజకులైన తర్వాతకూడా తాను గృహంలోనే ఉండిపోతే అక్కరలేని

1. ఆంధ్రమహాభాగవతం - తృతీయస్కంధం-739-840.

12. "గృహస్థస్తు యదా పశ్యే ద్వలీ పలిత మాత్మనః
అపత్యస్యైవ చాపత్యం తదారణ్యం సమాశ్రయేత్" -మనుస్మృతి-6.2.

సన్నివేశాలు రూపుకట్టుకోవడానికి అవకాశం ఉంది. తన సంస్కారంలో లోటుఉంటే బిడ్డలుచేసే ప్రతిపనిలో వేలుపెట్టడం, వాళ్ళు అసహ్యించుకోవడం, తాను పెంచిన తనబిడ్డలే తనను లెక్కచేయడం లేదని తాను బాధపడి నలుగురితో చెప్పుకోవడం - వీటన్నిటివల్లా ఇన్నేళ్ళుగా తానాచరించిన బిడ్డల్ని తీర్చిదిద్దడమనే సత్కర్మనుంచి దుఃఖాన్ని కోరి తెచ్చుకోవడమవుతుంది. ఒకవేళ బిడ్డల సంస్కారంలో లోటుఉంటే, వాళ్ళు తమవయస్సుకు తగిన విషయాలకే ప్రాముఖ్యమిచ్చి తల్లిదండ్రుల దైవచింతనకు అనుకోకుండానే విఘ్నాలు కలిగించడం, వారిని తల్లిదండ్రులుగా కాక, ముసలివారుగా భావించి నిర్లక్ష్యం చేయడం మొదలైన దుఃస్థితుల కాస్కారం ఏర్పడుతుంది. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకొని బాధ్యతలు పూర్తికాగానే బిడ్డలకు అంటిపెట్టుకోవాలనే మమకారం వదలి. బిడ్డలూ, తామూ కూడా సుఖపడాలనే వివేకం కలిగి, వనవాసానికి తరలడం మంచిది అని మన పెద్దలు ఈ సదాచారాన్ని నెలకొల్పారు - అప్పటివరకూ జీవిత భాగస్వామినిగా ఉన్నభార్య ఒక స్నేహితురాలిగా, సన్నిహితురాలిగా అనుసరిస్తే అభ్యంతరం లేదన్నారు.

ఇంద్రియ ప్రవృత్తుల్ని మెల్లగా తనలోనికి లాగుకోవడానికి ప్రయత్నిస్తూ మానాహంకారాల్ని విడిచిపెట్టాలన్నారు. అంటే తాను ఇదివరకు అనుభవించిన అంతస్థూ, 'హోదా', పొందిన సమ్మానాలూ, గౌరవాలూ మొదలైన స్మృతులు మనస్సుపైన పనిచేయకూడదు. అవి పనిచేయడం మొదలుపెడితే వాటినిగూర్చి నెమరువేసుకోవడంతోనో నలుగురితో చెప్పుకోవడంతోనో జీవితకాలం వ్యయమయిపోతుంది. కనుక స్మృతుల్ని సన్న్యసించాలి. ఆపైన జడలు ధరించమన్నారు. అంటే కేశసంస్కారం మొదలైన విషయాలపై దృష్టిని విడవాలని అర్థం. జుట్టును వదలిపెట్టలేనివాడు తరువాతికాలంలో శరీరాన్ని ఏం వదలగలడు? అంతేకాక

కేశసంస్కారాదులకు కావలసిన అంగబలం, అర్థబలం- వీటి అవసరం లేకుండా తొలగించుకోవడం అవశ్యకమని ఇందలి సూచన.

అంతర్ముఖత్వాన్ని కలిగించే తాపస శాస్త్రాలను అధ్యయనం చేస్తూ వాటిని విప్పిచెప్పే పెద్దల గోష్ఠిలో నిత్యమూ పాల్గొన మన్నారు. ఈ సజ్జనసాంగత్యంవల్లనే పైనచెప్పిన మానాహంకారాల్ని విడిచిపెట్టడం మొదలైనవి క్రమంగా విడిచిపెట్టడానికి సాధ్య పడుతుంది. ఈ సజ్జనసాంగత్యమే మెల్లగా మానవుణ్ణి యత్యాశ్రమంలో ప్రవేశపెడుతుంది. ఇల్లువిడిచిపెట్టి సంతోషంగా వనప్రస్థితి చెందే ప్రయత్నంలో తమకు వైరాగ్యసాధన పరిపూర్ణత చెందటం, బిడ్డలకు అంకురార్పణ జరగడం ఇమిడిఉన్నది. ఇది చేయలేని దుర్బలులచేత బలవంతంగా మృత్యువు ఈ పని చేయిస్తుంది. మృత్యువుతో ఒకేసారి కత్తిరింపబడటంకన్న, వైరాగ్యంతో పండు పండి రాలడంవంటి క్రమపరిణామాన్ని వానప్రస్థం నేర్పుతుంది.

ఈ వానప్రస్థధర్మంలోని సూక్ష్మాంశాలను గమనించిన వ్యాసుడు, పాండురాజు మరణానంతరం పాండవులతో కుంతి హస్తినలో ప్రవేశించగానే ఇక మారణహోమానికి కౌరవులు నాంది పల్కుతారని గ్రహించి తల్లియైన సత్యవతిని తపోవనానికి చేరుకో మన్నాడు. కురువంశాన్ని నిలిపి రాజ్యాన్ని రక్షించాలన్న సత్యవతి సంకల్పం ధృతరాష్ట్ర పాండురాజులతో తీరింది. ఇకపైన కౌరవులు ఆ వంశనాశనానికి నిప్పురగల్చబోతున్నారు. ఇంకా సత్యవతి అక్కడే ఉంటే ఆ దారుణాలన్నీ ఆమె తన కళ్ళతో చూడవలసి వస్తుంది. ఆ దారుణాలకు కారణం తాను కాకపోయినా, దుఃఖం ఆవిడకు తప్పదు. ఆవిడ తృప్తితోనే జీవితాన్ని చాలించాలని వ్యాసుడు వానప్రస్థధర్మాన్ని అవలంబించమని ఆమెకు మార్గ నిర్దేశం చేశాడు. ఆమె తన పుత్రునిమాట అనుసరించింది. ఆవిడతో

పాటు అంబిక అంబాలికలు కూడా వనానికి చేరుకున్నారు. కొంత కాలం ఘోరమైన తపస్సు ఆచరించి, వాళ్ళు ముగ్గురూ పుణ్య లోకాలకు చేరుకున్నారు.13

కురుక్షేత్ర మహాసంగ్రామం తర్వాత ధృతరాష్ట్రుడూ, గాంధారీ పాండవుల పోషణలో ఉన్నారు. ధర్మరాజు వాళ్ళిద్దర్నీ నెత్తిన పెట్టుకొని కొలిచినా, భీముడుమాత్రం అన్నకు తెలియకుండా ఈ సెలవంటి మాటలతో పొడుస్తూనే ఉండేవాడు. ధృతరాష్ట్రుడు ఆ మాటలకు తట్టుకోనూలేడు. ధర్మరాజుకు చెప్పుకోనూ లేడు. మొదలే పుత్త్రులందర్నీ కోలుపోయి భరించలేనంత దుఃఖంతో చేసిన తప్పులకు మథనపడుతున్న ధృతరాష్ట్ర దంపతులకు భీముడి పలుకులు శూలాల్లా తగిలేవి. ఇలా బరువుగా పదిహేనేళ్ళు గడిచాయి. క్రమంగా వైరాగ్యభావాన్ని అలవరచుకొన్న ధృతరాష్ట్రుడు "క్షత్త్రియుడైనవాడు యుద్ధంలోనైనా మరణించాలి, లేదా, తపోవనంలోనైనా మరణించాలి. ఇంటిలోమాత్రం మరణించకూడదు" అన్న నిర్ణయానికి వచ్చాడు. వ్యాసుడి అనుజ్ఞను పొంది, పాండవులదగ్గరా, ప్రజలదగ్గరా సెలవు పుచ్చుకొని గాంధారీ కుంతులు అనుసరించగా తపోవనానికి చేరుకున్నాడు.14

ఇలాంటి సన్నివేశాల్ని పరిశీలించి చూసినప్పుడు వానప్రస్థాశ్రమంలోని ప్రశాంతతా, ఆ ఆశ్రమంయొక్క ఆవశ్యకతా బోధపడుతుంది. బ్రహ్మచర్యాశ్రమం గృహస్థాశ్రమంలో నిర్వహించవలసిన స్వధర్మాచరణకు శిక్షణను ఇచ్చినట్లు, వానప్రస్థాశ్రమం యత్యాశ్రమస్థితిని పొందేందుకు కావలసిన శిక్షణ ఇస్తుంది.

---

13. ఆం. మ. భా - 5- 158 - 161.

14. ఆం. మ. భా - 13-177.

ర్మలను ఆచరించాలని గీత ఉపదేశిస్తున్నది.16 నాలుగాశ్రమాలలో వ్యక్తి ఎలాంటి ప్రవర్తనతో ఉండాలో ముక్తులైనవారు ఆ ఆశ్రమాలను అనుష్ఠించినప్పుడే సామాన్యులకు బోధపడుతుంది. అప్పుడు వారుకూడా ముక్తజీవులవలె చతురాశ్రమాలనూ నిర్వహించడానికి ప్రయత్నిస్తారు. శ్రేష్ఠులైనవారి ఆచరణనే సామాన్యులూ అనుసరిస్తారనీ, వారు రూపొందించిన ప్రమాణానికి అనుగుణంగానే లోకం వర్తిస్తుందనీ కృష్ణుడు చెబుతున్నాడు17. ఈవిధంగా ముక్తులైనప్పటికీ చతురాశ్రమాలనూ జగద్ధితంగా నిర్వహించేవారి కోవకు ప్రతినిధి ఈ సమాధానమిస్తున్న జనకుడే. పరిపూర్ణయోగజీవితానికి ఉదాహరణగా శ్రీకృష్ణుడు జనకుడి ప్రవర్తననుగీతలో సూచించడాన్ని మనం ఈ సందర్భంలో స్మరించుకోవాలి.18

ఇక రెండవఅంశం-బహుజన్మల పుణ్యవిశేషంచేత ముక్తుడై పుట్టిన వ్యక్తి గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమాలను అనుష్ఠించకపోయినా దోషంకాదు అన్నది. ఈకోవకు ప్రతినిధి ఈప్రశ్న జనకుణ్ణి వేసిన శుకుడే. పూర్వపుణ్యవిశేషంతో ముక్తులై జన్మించినవారికి దివ్యదేహాలు లభిస్తాయి. సామాన్య మానవుల దేహాలకూ, ముక్తులు ధరించిన దేహాలకూ చాలా అంతరం ఉంటుంది. కాబట్టి ముక్తజీవులు తాము దిగివచ్చిన ప్రణాళికలో చతురాశ్రమ నిర్వహణ ఆవశ్యకమైతే నిర్వహిస్తారు. లేదా బ్రహ్మచర్యాశ్రమంలోనే ఉండిపోతారు.

---

16. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యాద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షు ర్లోక సఙ్గ్రహమ్॥-భగవద్గీత - 3-25.

17. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః
సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥ - భగవద్గీత - 3-21

18. "కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః..." భగవద్గీత - 3-20

లేదా తమప్రణాళికకు ఆవశ్యకమైన ఆశ్రమాలనుమాత్రం నిర్వహించుకొని వెళ్ళిపోతారు.19 ఈవిధంగా తాము దిగివచ్చిన ప్రణాళికను అనుసరించి వారి ఆశ్రమ నిర్వహణ ఉంటుంది. రజస్తమస్సుల ప్రభావాలకు అతీతుణ్ణి చేసి మానవుణ్ణి సత్త్వస్థితిలో నిలపడమే ఆశ్రమాలకు గమ్యం గనుక, తాము ఏ ఆశ్రమంలో ఉన్నా ముక్తజీవులు ఈ సత్త్వస్థితిలో ఉంటారు. వారివి దివ్యదేహాలు కనుక వారి ప్రణాళికకు అనుగుణంగా మాత్రమే ఆ దేహాలు పనిచేస్తాయి. శుకుడు ఆదిశంకరులు మొదలైనవారు ఈకోవకు చెందినవారు. వీరినిచూసి సామాన్యజనులు కూడా బ్రహ్మచర్యాశ్రమంలోనే నిలబడటం గొప్పదనిగానీ, మంచిదనిగానీ భావించి మిగిలిన మూడాశ్రమాలనూ పరిత్యజించడానికి ప్రయత్నిస్తే ఆ సామాన్యుల దేహాలు అందుకు సిద్ధంగా ఉండవు కనుక, సాధనపేరిట అక్కరలేని శ్రమపడవలసి వస్తుంది. ఇది అన్యాయం, అనావశ్యకంకూడా. ఇలాంటివారిని దృష్టిలోపెట్టుకునే తెనాలి రామకృష్ణుడు తన పాండురంగ మాహాత్మ్యంలో "వ్యాససుతాదులందలంచి వాసికి మంగలకత్తి మ్రింగబోకు"డని హెచ్చరించాడు20. గారడీవాడు కత్తిని మ్రింగాడని మనం మ్రింగడానికి ప్రయత్నిస్తే కొంపమునుగుతుంది, సిద్ధపురుషుల్ని చూసి సామాన్యులు ఒక్కసారిగా అలా ఉండటానికి సిద్ధపడితే, అలా ఉండటమే సిద్ధి అనుకుంటే, సిద్ధికిబదులు ఇంద్రియ ప్రవృత్తులకు అంతర్యుద్ధం ప్రారంభమవుతుంది. ముందు సిద్ధులు చెప్పినట్లు చేస్తే, తరువాత క్రమంగా వారిలా ప్రవర్తించడం అప్రయత్నంగా చేతనవుతుంది.

మొత్తంమీద మహాభారతంలోని ఈ శుక జనక సంవాదం ఆశ్రమాల నిజస్వరూపాన్నీ, గమ్యాన్నీ, తెలియజెప్పి ధర్మాద్వైత స్థితిని ప్రతిపాదిస్తోంది. అంటే ఏదృష్టితో చతురాశ్రమ విభాగాన్ని స్వీకరించి ఆచరిస్తే మానవుడికి ధర్మాద్వైతస్థితి అనుభవానికి వస్తుందో తెలియజెప్తోంది.

19. శ్రీకృష్ణుడు వానప్రస్థ యత్యాశ్రమాలను ప్రత్యేకంగా తలపెట్టకుండానే తనువు చాలించాడు.

20. పాండురంగ మాహాత్మ్యం - 5-230.

# అర్థకామాలు - ధర్మాద్వైతస్థితి

## అర్థకామాల స్వరూప స్వభావాలు :

సృష్టిగా దిగిరావడానికి సంకల్పించిన పరమధర్మస్వరూపుడికి సృష్టిలీలను నిర్వహించాలన్న కోరిక మహాకామం కాగా, అతని నుంచి వ్యక్తమవుతున్న పంచభూతాలు, అందలి వివిధద్రవ్యాలు, వాటి కలయికలు, అర్థం (ద్రవ్యం, పదార్థం)గా ఉపయోగపడు తున్నాయి. తననుంచి వ్యక్తమవుతున్న ద్రవ్యసంపదతో సృష్టిధర్మ నిర్వహణం జరుగుతుంటే అతడంతర్యామియై వర్తిస్తున్నాడు. వివిధ రూపాలు ధరిస్తూ వర్తిస్తున్నాడు. ఆరూపులలో ఒక రూపయిన నరుడికి జీవించాలనే ఇచ్ఛ, జీవించడానికి కావలసిన శరీరం, పరమ పురుషుడికిలాగానే మహాకామ, పరమ అర్థాలుగా సిద్ధించాయి (ఇవి మానవకల్పితాలు కావు గనుక).

మానవుని స్వభావంనుంచి గుణకర్మలుగా అతని స్వధర్మం వ్యక్తమవుతుంది. ఆస్వధర్మంతో లోకాన్ని సేవిస్తుండగా అతడికి జీవించడానికి అవసరమైన వస్తుసంపదలు సమకూరడం, సుఖభోగాలు అతనిచే అనుభవించబడడం జరుగుతోంది. అనగా ధర్మాన్నుంచి అర్థ కామాలు సిద్ధిస్తున్నాయన్న మాట ! ఈసత్యాన్ని గ్రహించి, వివేకం

గల మానవుడు, ధర్మాన్నుంచి తనకు లభిస్తున్న అర్థకామాలను ఆ ధర్మనిర్వహణకు పరిపోషకాలుగా మాత్రమే స్వీకరించి, అనుభవిస్తాడు. అప్పుడతనిది ధర్మోత్తరమైన జీవితం అవుతుంది. ధర్మాన్నుంచి ప్రభవించిన అర్థకామాలు తిరిగి ధర్మాచరణకే సహకరిస్తూ, ధర్మంలోనే సంగమిస్తుండగా, అతనిజీవితం సృష్టిక్రీడను నిర్వహిస్తున్న పరమపురుషుని తలపిస్తుంది.

కాని, సామాన్యంగా లోకంలో మనం ఇంకొకలా చూస్తూ ఉంటాం. మనిషికి వస్తుసంపదలమీదనో సుఖభోగాలమీదనో కోరిక కలుగుతుంది. ఆ కోరికను తీర్చుకొనేటందుకు తనకు చేతనైన స్వధర్మాన్ని తప్పనిసరిగా ఆచరించి, ఆ వస్తుసంపదలనూ, భోగభాగ్యాలనూ పొందటానికి ప్రయత్నిస్తూ ఉంటాడు. తాననుకొన్నవి కొన్ని లభించగా, మరికొన్ని కొత్తవి సాధించుకోవలసిన 'జాబితా'లో చేరుతూఉంటాయి. ఈవిధంగా పెరుగుతున్న 'జాబితా'లోని అంశాలను సాధించుకోవడంకోసం మానవుడు తనకు చేతనైనరీతిలో లోకాన్ని సేవిస్తూ, శ్రమిస్తూఉంటాడు. ఈ సందర్భంలో కూడా మానవుడు ఆచరిస్తున్నది స్వధర్మమే. కాని, అర్థంపై గలిగిన కోరిక ఇక్కడ స్వధర్మాచరణకు ప్రేరణను ఇస్తోంది. అనగా అర్థకామాలను తీర్చుకొనేటందుకు మానవుడు స్వధర్మాన్ని ఆశ్రయిస్తున్నాడన్న మాట! అతని దృష్టిలో అర్థకామాలకున్న విలువ స్వధర్మాచరణకు ఉండదు. తన అర్థకామాలను సమకూర్చిపెట్టే బానిసగా మాత్రమే అతడు స్వధర్మాన్ని భావిస్తాడు. దీనితో స్వధర్మాచరణపై శ్రద్ధా, స్వధర్మాచరణలో ధర్మనిష్ఠా సన్నగిల్లుతాయి. తాను అనుకొన్నది సాధించుకోవడం ముఖ్యంగనుక, నీతి తప్పి ప్రవర్తించడానికి కూడా అతడు వెనుకాడడు. క్రమంగా పవిత్రతను కోల్పోయి, అన్నివిధాలా పతనమైపోయే ప్రమాదం ఉంది. ఈస్థితిలోఉన్న సంసార జీవులను చూసే, వేదవ్యాసుడు వేదనతో ఇలా అన్నాడు - "ధర్మంవల్లనే

అర్థకామాలు కలుగుతున్నాయి. అలాంటి ధర్మాన్ని ఆచరించడమే ప్రధానంగా పెట్టుకోండయ్యా అని చేతులెత్తి ఆక్రోశిస్తున్నాను. కాని, నా యీ ఆక్రోశాన్ని ఎవ్వరూ వినిపించుకోరేమి ?"1

ధర్మాచరణవల్ల అర్థకామాలు అప్రయత్నంగా సమకూరుతా యన్న సూక్ష్మం తెలీక, తన అర్థకామాలను తీర్చుకోనేటందుకు ధర్మాచరణాన్ని బానిసగా భావించే స్థితికి మానవుడు దిగజారి పోతున్నాడేమిటి ? ఈ వెఱ్ఱినుంచి ఎప్పటికి వీడు బయట పడతాడు ?- అన్నది వ్యాసుని వేదన. సముద్రం తనలోనికి చేరరమ్మని నదుల్ని బతిమాలుతోందా ? బతిమాలనక్కరలేకుండానే, కనీసం కోరనైనా కోరకుండానే నదులు అప్రయత్నంగా వచ్చి, సముద్రంలో పడుతున్నాయి గదా ! అలాగే, స్వధర్మాచరణలో సిద్ధహస్తుడై నిలిచిన వ్యక్తికి ఆవశ్యకమైన అర్థకామాలన్నీ అప్రయత్నంగా అమరి, సేవిస్తాయని శ్రీకృష్ణుడు గీతలో విశదపరిచాడు.2 ఇలా చెప్పడంలో మరో చక్కటి ఔచిత్యం కూడా ఉంది. నదులనీరు విభిన్నరుచులతో ఉన్నప్పటికీ సముద్రంతో కలిసేటప్పటికి సముద్రపురుచినే పొందుతున్నాయి. అలాగే, అర్థకామాలు కూడా స్వధర్మాచరణకు పరిపోషకాలై, స్వధర్మంతో కలిసిపోయి, స్వధర్మరూపంగా వర్తించాలని కృష్ణుని ఉపదేశం. కాబట్టే, మన సనాతన సంప్రదాయంలో అర్థకామాలకు ప్రత్యేకమైన అస్తిత్వం లేదు. మనిషి తాను చేయదలచిన ప్రయాణానికి తన పాదాల సాయం స్వీకరించినట్లు, స్వధర్మం

1. ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష నచకశ్చి చ్ఛృణోతి మామ్ ।
ధర్మా దర్థశ్చ కామశ్చ సధర్మః కిం న సేవ్యతే ॥

మహాభారతం - స్వర్గారోహణ- 18-5.

2. ఆపూర్యమాణ మచలంప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్।
తద్వత్కామాయం ప్రవిశన్తి సర్వే సశాన్తిమాప్నోతి నకామకామీ ॥

– భగవద్గీత 2–70

అర్థకామాలనే తన పాదాలతో ముందుకు సాగుతుందని మహాసీయుల దివ్యజీవితాలనుంచి మనకు బోధపడుతుంది.

## మానవజీవితంలో అర్థకామాల పాత్ర :

మానవజీవితంలో అర్థకామాల పాత్ర రెండువిధాలుగా ఉంటుంది. మొదటిది, శరీరానికి సంబంధించినది. రెండవది, శరీరంతో తానాచరించే స్వధర్మానికి సంబంధించినది. ధర్మాచరణకు ఏకైక సాధనమైన శరీరాన్ని మానవుడు వివేకంతో వాడుకోవలసి ఉంది. రుచికోసం ఆహారాన్ని స్వీకరించడంగాక, ఆవశ్యకత ఉన్నంతవరకే శరీరానికి రుచియైనఆహారాన్ని అందించాలి.ఆవశ్యకతలహద్దులు దాటి రుచులకు, అభిరుచులకు ప్రాముఖ్యమిచ్చినపుడు శరీరారోగ్యం దెబ్బ తింటుంది. అలాగే స్త్రీపురుష సంబంధమైన కామంయొక్క యథార్థ స్వరూపాన్ని దర్శించి, సంతతికొరకు మాత్రమే కామాన్ని సద్వినియోగపరుచుకొన్నప్పుడు, అది ప్రాజపత్యయజ్ఞమై, సత్సంతతిని అనుగ్రహిస్తుంది. అలాకాక, స్త్రీపురుషసంబంధమైన కామాన్ని కోరికగా రూపొందించుకున్నప్పుడు ఆకోరికను తీర్చుకొనేటందుకు ప్రకృతి ధర్మాల్ని అతిక్రమించి అధఃపతనం చెందినపుడు,శరీరం దెబ్బతినడంతో పాటు అనారోగ్యవంతులూ, అంగవైకల్యాలు కలవారూ, అధర్మపరులూ అయిన సంతతికలిగి, జీవితం చక్రవాతం (తుఫాను)గా మారే ప్రమాదం ఉంది. అన్నపానీయాదుల విషయంలోను, శ్రమవిశ్రాంతుల విషయంలోను, స్త్రీపురుషసంబంధమైన కామానుభవ విషయంలోను మానవుడు క్రమాన్నితప్పి, తోచినట్లు ప్రవర్తిస్తే, ధర్మాచరణకు ఏకైకసాధనమైన శరీరం, తాను మానవుడికి పనికివచ్చే బదులు, రోగగ్రస్తమై, జీవితాన్ని దుర్భరమయేటట్లు చేస్తుంది. శరీరం మొదల తానాచరించిన సకల అపచారాలకూ శరీరంతోనే శిక్షననుభవించాల్సి వస్తుంది. శరీరసాయంతో పదిమందికి సహకరించగల మానవుడు పద్ధతి తప్పినపుడు, పదిమంది సాయంతో జీవితయాత్రను గడుపుకోవలసిన దీనస్థితిలో పడిపోతాడు. శరీరంతో చేయవలసింది

పోయి, శరీరానికి చేయించుకోవడంలోనే జీవితం వ్యర్థంగా గడిచి పోతుంది. ఇదంతా శరీరం యెడల అర్థకామాల విషయంలో పద్ధతి తప్పి ప్రవర్తించినందుకు ఫలం. అలాకాక, అర్థకామాల విషయంలో శరీరతత్త్వాన్ని ఎరిగి ప్రవర్తించినపుడు జీవితం నిత్యోత్సవంగా నడుస్తుంది.

మానవుడు శరీరంతో ఆచరించే స్వధర్మనిర్వహణలో అర్థకామాలను పరిపోషకాలుగా మాత్రమే స్వీకరించగలగాలి. స్వధర్మాచరణలో నిష్ఠకలిగి, తోడిజీవులను అర్చిస్తున్నప్పుడు అర్థకామాలు తనను అప్రయత్నంగా వరించి వచ్చిచేరతాయని గ్రహించగలగాలి. తానుగా కోరకుండా నడిచివచ్చినవానితో యదృచ్ఛాలాభసంతుష్టుడై మెలగగలగాలి. తనకూ, తననాశ్రయించినవారికీ కూడూ గుడ్డా గూడూ అమర్చుకోవడం ఆవశ్యకమే. స్వధర్మాచరణలో నిలిచిన వారికి అవి అప్రయత్నంగా అమరుతాయి. వాటి సాయంతో అతని స్వధర్మాచరణ మరింత పద్ధతిలోసాగాలి. అలాకాక, తాను కోరినంత అర్థసంపదలను, కామభోగాలను అనుభవించడానికి సాధనంగా స్వధర్మాన్ని వినియోగించుకున్నప్పుడు మానవుడి జీవితం అశాంతి, అసంతృప్తులతో నిండిపోతుంది. అంతేకాక, శరీరంయెడల అర్థకామాల విషయంలో పద్ధతి తప్పినపుడు దుఃఖానుభవాలను ప్రసాదిస్తూ శరీరం ఎలా బుద్ధి చెబుతుందో, అలాగే తనచుట్టూ ఉన్న జీవరాసులతో అర్థకామాల విషయంలో పద్ధతితప్పి ప్రవర్తించినపుడు, అడుగడుగునా తగిన గుణపాఠాలను ప్రకృతి నేర్పుతుందేగానీ, విడిచి పెట్టదు. హద్దుమీరి ప్రవర్తించినపుడు తగినశిక్ష అనుభవించకుండా తప్పించుకోవడం ఈ ప్రకృతిలో ఎవ్వరికీ సాధ్యంకాదు. నిప్పు తనను ముట్టుకున్నప్పుడు, తనను ముట్టుకొన్నవాడు సేవకుడైనా యజమానియైనా ఒకేతీరులో ప్రవర్తిస్తుంది. అలాంటిదే ప్రకృతి కూడా.

### భారతగాథ - అర్థ కామాలు

అర్థకామాలు కూడాఅగ్నిలాంటివే. అగ్నితో దేవుడికి దీపారాధన చేయవచ్చు, ఇంటిలో వంట చేసుకోవచ్చు, అశ్రద్ధగాఉన్నా,

వివేకాన్ని కోల్పోయినా,ఆ అగ్నితో ఇంటినే తగులబెట్టుకోవచ్చు. అలా అవివేకంతో ప్రవర్తించి, వంశాన్ని నిర్వంశం చేసుకున్నవాడే ధృతరాష్ట్రుడు. అందుకే అతని కథను అన్నివివరాలతో మానవజాతికి ఉదాహరణగా అందించాడు వేదవ్యాసుడు. ధృతరాష్ట్రుడు, అతని పుత్రులు, పుత్రుల మిత్రులు జీవితానికి అర్థమే పరమార్థం అను కొన్నారు.ఆ అర్థాన్ని తామనుకొన్నట్లు తమదిగా నిలబెట్టుకోవాలన్న తాపత్రయంతో పాండవులచేత విషాన్నాన్ని తినిపించారు. వాళ్ళను లతలతో కట్టేశారు. లక్కయింటిలో పెట్టి నిప్పు అంటించారు. మాయజూదం ఆడి అడవులపాలుచేశారు. ఎన్నిప్రయత్నాలు చేసినా చివరకు తామనుకొన్న అర్థాన్ని (రాజ్యాన్ని) దక్కించుకోకుండానే పరలోకాన్ని చేరారు. జీవితంలో స్వధర్మాన్ని అర్థార్జనకు వినియో గించుకుంటే, ఎలాంటి గుణపాఠాలు ప్రకృతి నేర్పుతుందో గ్రహించి నేర్చుకోవడంకోసం ధృతరాష్ట్రుడు ఒక్కడే భార్యతో మిగిలాడు. అతడే తనకుటిలబుద్ధితో కౌరవులలోని దుష్టత్వాన్ని కావాలని ఉపే క్షించి పెంచాడు గనుక, అతనికే పాఠాలు చెప్పాలి గనుక, అతణ్ణి కౌరవుల తర్వాత కూడా కొంతకాలం బ్రతికిఉండేటట్లు చేసి, పాఠాలు నేర్పింది ప్రకృతి.

ధృతరాష్ట్రుని బృందానిది కామోత్తరమైన జీవితం. కూడని రాజ్యకాంక్ష వాళ్ళజీవితాన్ని పరిపాలించింది. ధర్మానికి విరుద్ధమైన కోర్కెలు నెరవేరుతున్నట్లు కనబడినా, నెరవేరడం సాధ్యంకాదని నిరూపించారు ధృతరాష్ట్రుడూ, అతని పుత్రులూ.లక్కయిల్లు కాల్చి నపుడు, మాయజూదం ఆడినప్పుడు, 'ఇకపైన రాజ్యంమాదే. మాకి ఎదురులేదు' అని రొమ్ము విరుచుకున్నారు కౌరవులు. కనబడకుండ సంతోషపడ్డాడు ధృతరాష్ట్రుడు. కోరిక తీరినట్లు కనిపించినా, అర్థం సిద్ధించినట్లు అనిపించినా, ధర్మానికి విరుద్ధమైన వారి అర్థకామాలు వారిని కట్టగట్టి కురుక్షేత్రమహాసంగ్రామంలో దోషులుగా నిలబెట్టి, చిత్రంగా వధించాయి.

ఇక, పాండవులది ధర్మోత్తరమైన జీవితం. అంటే, వారిజీవితం స్వధర్మాచరణకి అంకితమై నడిచింది. అర్థకామాలు ధర్మానికి విరుద్ధం కానంతవరకే వర్తించి, సహకరించాయి. ధర్మరాజుకు తనతండ్రిదే రాజ్యమని తెలుసు. అంగవైకల్యంగల అంధరాజు రాజ్యానికి ధర్మశాస్త్రం ప్రకారం అర్హుడు కాడనీ తెలుసు. అయినా, అతడు పెదతండ్రికి ఒదిగే ఉన్నాడు. పెదతండ్రి రాజ్యంమొత్తానికే తనను యువరాజుగా చేసినప్పుడు తనరాజ్యం తనకు దక్కిందని పొంగిపోలేదు. కొంతకాలంపోయినతర్వాత కుటిలబుద్ధితో పెదతండ్రి అర్ధరాజ్యాన్నే పంచిపెట్టి, ఇంద్రప్రస్థానికి పంపినపుడు తన రాజ్యంలో తనకు సగమే దక్కిందని క్రుంగిపోనూలేదు. ఆ ఇంద్రప్రస్థంనుంచే స్వధర్మాచరణం ప్రారంభించాడు. గీతలో కృష్ణుడు చెప్పినట్లు 'యదృచ్ఛాలాభసంతుష్టుడై' ముందుకుసాగాడు. భీమార్జునులు విజృంభిచడంతో సార్వభౌముడై, రాజసూయాన్ని నిర్వహించాడు. ధర్మానికి అవిరుద్ధాలయిన అతని అర్థకామాలే అతణ్ణి అర్ధరాజ్యస్థితినుంచి సార్వభౌముని స్థితివరకూ పెంచాయి. పెంచడమే కాక, రాజసూయానికి ఆహూతుడై వచ్చిన కురురాజును మయసభలో గేలిచేసి పంపాయి. 'ఇప్పటికయినా అర్థకామాల పాత్రనూ, పవిత్రతనూ అర్థంచేసుకో'మని ఆహేళన. కాని అతనికి అర్థంకాలేదు.

సార్వభౌముడైన ధర్మజుణ్ణి ధృతరాష్ట్రుడు కొడుకులతో జూదానికి ఆహ్వానించాడు. ధర్మజుడు తనకు తానుగా ఏదీ సంకల్పించడు. మరొకడు సంకల్పిస్తే కాదనడు. అక్కడికీ జూదం మంచిది కాదని దుర్యోధనాదులకు నచ్చచెప్పజూశాడు. దుర్యోధనుడు బలవంతపెట్టాడు. జూదానికి ఆహ్వానింపబడిన క్షత్రియుడు జూదం ఆడననడం క్షత్రియధర్మంకాదు గనుక, ధర్మజుడు అంగీకరించాడు. పిలవబడిన జూదం నుండి విరమించడం అంటే, క్షత్రియునకు యుద్ధంలో వెన్నిచ్చి పారిపోవడంతో సమానం. కనుకనే దుర్యోధనుడు

ధర్మరాజును ఇరుకునపెట్టి జూదానికి సిద్ధపరిచాడు. పరిస్థితులను గమనించినధర్మజుడువిధాతే ధృతరాష్ట్రుడిరూపంలోజూదానికి నియోగిస్తున్నాడు అనుకొని, జూదమాడసాగాడు.3 జూదంలో రాజ్యాన్నీ, అన్నదమ్ములీన్నీ, తననీ కోల్పోయి, నిస్సహాయుడై చూస్తున్న ధర్మజుడికి ద్రౌపదిఉన్నదని గుర్తుచేశాడు శకుని. ఆమెను కూడా ఒడ్డి ఓడాడు ధర్మజుడు. ధర్మరాజు తనకు తానుగా ద్రౌపదిని ఒడ్డి ఓడలేదు. జూదానికి ఒప్పించినట్లే ద్రౌపదిని ఒడ్డడానికి కూడా ఇరుకునపెట్టి ఒప్పించారు దుర్యోధనాదులు. పందెం ఓడిన ధర్మజుడు పందెం మేరకు తమ్ములతో కలిసి, దాసుడై నిలిచాడు. అప్పుడు ప్రారంభమైంది ద్రౌపదీవస్త్రాపహరణఘట్టం. ధర్మం చెప్పమని ద్రౌపది సభను అడిగింది. సభ మూగనోము పట్టింది. "ధర్మరాజు ముందు నన్ను ఓడి తరువాత తాను ఓడిపోయాడా? ముందు తనను ఓడి తరువాత నన్ను ఒడ్డాడా?" అని ప్రశ్నించిందామె. దానికెవ్వరూ మారుపలుకలేదు. భీష్ముడు "ఈ ధర్మాన్ని తేల్చి చెప్పవలసింది ధర్మరాజే" అన్నాడు. ధర్మరాజు మౌనాన్ని వహించాడు.

ధర్మరాజు కోరి జూదానికి దిగినవాడు కాదు. బలవంతం చేయబడి జూదానికి దింపబడ్డాడు. కోరి ద్రౌపదిని ఒడ్డలేదు. బలవంతం చేయబడి ఒడ్డాడు. ఈ జూదం తాను కామాభిలాషతో గానీ, అర్థసిద్ధికోసంగానీ ప్రారంభించింది కాదు. జూదానికి పిలవబడినప్పుడు ఆడటం క్షత్రియధర్మం గనుక స్వధర్మంగా మాత్రమే అతను జూదాన్ని ఆడాడు. స్వధర్మాచరణమే మానవజీవితానికి గమ్యంగనుక ఇప్పుడు ధర్మాధర్మాలను నిరూపించవలసింది కూడా ఆ స్వధర్మాన్ని రూపొం

3. అవిలంఘనీయ మీ దుర్వ్యవసాయంబనుచు సత్యవచనుఁడు ధర్మార్థవిదుం డప్పుడు ధృతరాష్ట్రవిధాతృ నియోగమున కొడంబడి యంతన్.

- ఆం. మ. భా - సభా - 2-154.

దిస్తున్న పరమధర్మమే. ఆ పరమధర్మానికి తన స్వధర్మాన్ని శరణాగతి చేసి, మౌనంగా నిలిచాడు ధర్మజుడు. ఆ పరమధర్మమే కృష్ణుని రూపం ధరించి, ద్రౌపదికి వస్త్రాలను ప్రసాదించింది. ఆమెను నగ్నంగా చేయడం దుర్యోధనాదులకు సాధ్యంకాలేదు. అర్థకామాలను స్వధర్మానికి శరణాగతిచేసి, స్వధర్మాన్ని పరమధర్మానికి శరణాగతి చేయడం ధర్మజుని సాధన. కనుకనే తనకు శరణాగతి చేసిన ధర్మజుణ్ణి పరమధర్మ స్వరూపుడైన కృష్ణుడు వెన్నంటి నడిచాడు.

"అరణ్యవాసం జరిగేటప్పుడు జరిగింది అన్యాయం కనుక, కౌరవులు ఆడింది మాయజూదం గనుక, స్వధర్మాన్ని ఉపయోగించి యుద్ధాన్ని ప్రకటించి, మన రాజ్యం మనం వీరోచితంగా తెచ్చుకొందాం" అన్నారు ద్రౌపదీ భీములు. కాని ధర్మజుడు అందుకు అంగీకరించలేదు. "ఆడింది మాయజూదమే అయినా, ఆడినమాటా, ఓడినమాటా నిజమేగదా! కాబట్టి, అనుకొన్నప్రకారం అరణ్యాజ్ఞాతవాసాల తరువాత స్వధర్మాన్ని ఉపయోగించా"లని ధర్మజుని నిర్ణయం. ఈ నిర్ణయం ధర్మశరీరుడైన వ్యాసుణ్ణి ముగ్ధుణ్ణిచేసింది. వెంటనే ఆయన సాక్షాత్కరించి, 'ప్రతిస్మృతి' అనే విద్యను ధర్మజునకు ఉపదేశించాడు. వ్యాసాజ్ఞతో ఆవిద్యను ధర్మజుడు అర్జునున కుపదేశించడంతో అరణ్యవాసం రూపురేకలు మారిపోయాయి. భూమిమీద జరగవలసిన ధర్మసంస్థాపన కార్యక్రమంలో తమ పాత్రను నిర్వహించేటందుకు పాండవులు స్వధర్మాన్ని దేవతల సాన్నిధ్యంలో సమర్థమూ, పవిత్రమూ చేసుకొనే అవకాశంగా పరిణమించింది అరణ్యవాసం.

అజ్ఞాతవాసం పాండవులకు అర్థసంపత్తిని చేకూర్చిపెట్టింది. స్వధర్మాన్ని పవిత్రీకరించుకొని, నడచివచ్చిన అర్థసంపత్తితో ముందుకు సాగాడు ధర్మజుడు. తమరాజ్యాన్ని తాము కోరడం ధర్మానికి విరుద్ధంకాని కామమే గనుక, కృష్ణుని ముందలగా పెట్టుకొని,

దుర్యోధనుడు యుద్ధం తప్పనిసరి చేసినపుడు ధర్మరాజు ధర్మబలంతో తనను ధర్మంగా వరించిన బలం (తోడిరాజుల సహాయ సంపత్తి)తో యుద్ధానికి సిద్ధపడ్డాడు.

కురుక్షేత్ర మహాసంగ్రామంలో ఒకవైపు స్వధర్మాచరణమే జీవితపరమార్థంగా పెట్టుకున్న ధర్మరాజూ, మరొకవైపు అర్థకామాలను తీర్చుకోవడమే జీవితపరమావధిగా పెట్టుకొని తనలో రగిలిన అర్థకామాలకు స్వధర్మంచేత ఊడిగం చేయించుకొంటున్న దుర్యోధనుడూ తమతమ బలాబలాలతో నిలబడ్డారు. సకలధర్మాలకూ మూలాధార అయిన శ్రీకృష్ణుడు చిత్రమైనరీతిలో పాండవులచేత యుద్ధాన్ని నిర్వహింపజేశాడు. అర్థకామాల ప్రలోభంలోపడి, చేయరాని అపరాధాలు, అపచారాలు చేసి, 'ముద్దాయిలై' నిలబడ్డ దుర్యోధనాదులను, వారితో నడచినవారిని, ధర్మబద్ధంగా చంపవలసిన అవసరంలేదని నిర్ణయించాడు కృష్ణుడు. ఎవరెవరు ఏ యే విధాల్లో చనిపోవడానికి అవకాశం ఉందో, వారివారిని ఆయా విధాల్లో చంపవచ్చని నిర్దేశించి, దగ్గరఉండి చంపించాడు. జీవితంలో ఇతరులతో సంబంధించిన సన్నివేశాల్లో ధర్మాధర్మాలను చూసి ప్రవర్తించడం నేర్చుకోనని దుష్టులను యుద్ధంలో ధర్మబద్ధంగా చంపాలనడం హాస్యాస్పదమన్నాడు కృష్ణుడు. తమదాకా వచ్చినపుడు ధర్మప్రశ్నలను వల్లించేవారు వంచకులని కృష్ణుని నిర్ణయం. ఈ విధంగా ధర్మాద్వైతమూర్తియైన కృష్ణుడు మానవజీవితంలో ధర్మార్థ కామాల పాత్ర ఏమిటో స్పష్టంచేశాడు.

శరీరపోషణలో అర్థకామాల పాత్ర తెలిసి వర్తించకపోతే, శరీరం నానావికారాలకూ లోనై, ఆరోగ్యమనే ధర్మాద్వైత స్థితిని కోల్పోయి, మనిషిని దుఃఖపెడుతుంది. జీవితంలో అర్థకామాలకున్న స్థానం తెలిసి ప్రవర్తించకపోతే, జీవితం దుర్భరమవుతుంది. సుఖసంతోషాలన్నవి ఎండమావులై మనిషిని త్రిప్పలుపెడతాయి. ఈసత్యాన్ని కురుపాండవగాథలో దర్శనం చేయించడానికే వ్యాస

భగవానుడు ఆగాథను ఇతిహాసంగా మలచియిచ్చాడు. "అర్థకామాలను స్వధర్మానికి శరణాగతి చేసి, స్వధర్మాన్ని పరమధర్మానికి శరణాగతి చేసిన ధర్మాద్వైతమూర్తికే జీవితంలో జయం లభిస్తుంది." అని ఉపదేశించడం కొరకై ఈ ఇతిహాసాన్ని మొదటగా 'జయ'మని పిలిచాడు వ్యాసుడు.

## అర్థకామాలు - ప్రభువులపాత్ర :

వ్యక్తి అర్థకామాలను స్వధర్మాచరణకు పరిపోషకాలుగా మాత్రమే అనుభవించాలనీ, అలా అనుభవించినప్పుడు మాత్రమే నిజమైన సుఖాన్ని పొందగలడనీ చెప్పుకున్నాం. అయితే, మానవసమాజంలో అందరూ ఈ ధర్మస్థితిలో ఉండేవారే ఉంటారని చెప్పలేం. పరిణామమనే నిచ్చెనకున్న మెట్లలో ఎవరిమెట్టు మీద వారుంటారు. ఒకే కుటుంబంలో పిల్లలు, కుఱ్ఱవాళ్ళు, యువకులు, మధ్యవయస్కులు, వృద్ధులు - ఈవిధంగా విభిన్న వయోవస్థలలో ఉన్నవారు ఉండటానికి అవకాశం ఉన్నదిగదా! అలాగే సమాజంలో ధర్మమార్గం మెడల నిద్రపోతున్నవారు, స్వప్నజగత్తులో విహరిస్తున్నవారు, అప్పుడేమేలుకొంటున్నవారు, ఇంకా పూర్తిగా కనురెప్పలు విడనివారు, రెండు కళ్ళతో చూడటానికి యత్నిస్తున్నవారు, మూడవదైన జ్ఞాననేత్రం కూడా వికసించినవారు - ఇలా - అనేక స్థితుల్లో ఉన్నవారు ఏకకాలంలో ఉంటూ ఉంటారు. వీరిలో ఒకరికి ధర్మం అనిపించింది. మరొకరికి ధర్మం అనిపించకపోవచ్చు. ఒకరికి అధర్మంగా కనిపించింది. మరొకరికి ఆచరణీయంగా కనిపించవచ్చు. ఒకరికి జాలికలిగించే సన్నివేశం మరొకరికి వినోదాన్నిచ్చే సన్నివేశం కావచ్చు. అర్థకామాలమెడల ఇన్నిదశలలో ఉన్నవారి ప్రవర్తన ఎన్ని విధాలుగా ఉంటుందో మనం ఊహించవచ్చు. ఒకరిఆస్తిని మరొకరికి ఆక్రమించుకోవాలనిపించవచ్చు. ఒకరి వస్తుసంపదను మరొకరు దొంగిలించడానికి ప్రయత్నించవచ్చు. ఒకరి గృహిణి అందచందాలను,

శీలసంస్కారాలను దోచుకోకపోతే మరొకరికి నిద్రపట్టకపోవచ్చు. ఒక వ్యక్తి తన మార్గానికి అడ్డువస్తున్నాడన్నప్పుడు, మరొకడు అతణ్ణి హతమార్చడానికి యత్నించవచ్చు. తనకన్నా హోదాలో, బలంలో తక్కువగాఉన్నవారిచేత సేవచేయించుకొని, సరైన ప్రతిఫలం ముట్ట చెప్పడానికి ఇష్టపడనివారుండవచ్చు. ఈవిధంగా ఊహించలేనన్ని విధాల్లో వివిధస్థితుల్లో ఉన్న మానవులు ప్రవర్తించడానికి ఎప్పుడూ అవకాశం ఉంది. మరి, వీళ్ళందర్నీ ధర్మమార్గంలో నడిపించడం సాధ్యమా? సాధ్యంచేయడానికే క్షత్రియ ధర్మ పరిపాలకులైన ప్రభువులు ఉన్నది.

ధర్మం యెడల మేల్కొన్న మానవుడు భక్తితో ధర్మమార్గాన్ని అనుసరిస్తాడు. ధర్మంయెడల ఇంకా మేల్కొనని మానవుణ్ణి ప్రభువు దండంతో భయపెట్టి, ధర్మమార్గంలో నడిపించాలి. తానాచరించే ప్రతి అధర్మకార్యం తనకు ప్రభువురూపంలో శిక్షవిధిస్తుంది అన్న భయం లేకపోతే, ధర్మం యెడల నిద్రిస్తున్నవాడు ధర్మాన్ని ఆచరించడు. ఆచరించాలని కూడా ఊహించడు.

విభిన్న ప్రవృత్తులతో నిండిన సమాజాన్ని ఆ ప్రవృత్తులకు తగిన పద్ధతులతో ప్రభువు పరిపాలించాలి. రక్షణ అవసరమైనచోట రక్షణనివ్వాలి. శిక్షణ అవసరమైనచోట శిక్షణ నివ్వాలి. పోషణ అవసరమైనచోట పోషణనివ్వాలి. మన్నన అవసరమైనచోట మన్నించాలి. ఆరాధన ఆవశ్యకమైనచోట ఆరాధించాలి. ఈవిధంగా పరిపాలకుడు ఔచిత్యాన్ని ఎరిగి ప్రవర్తించగలగాలి. 'యథా రాజా తథా ప్రజాః' అన్న సత్యాన్ని గ్రహించి, పరిపాలకుడు తననుతాను దిద్దుకున్నప్పుడే సమాజాన్ని సరైన తీరులో నడపగలడు. తన ప్రతిబింబమే తన రాజ్యప్రజల ప్రవర్తనలో కనబడుతుందని పరిపాలకుడు మరవకూడదు. కాబట్టే, భీష్ముడు రాజుకు రాజ్యాలను జయించడం

కన్నా తనను తాను జయించడం ముఖ్యమని చెప్పాడు.4 ఏనుగు పాదపు గుర్తులో అన్నిజంతువుల పాదాలూ ఇమిడిపోతున్నట్లు, రాజ ధర్మంలో సకల ధర్మాలూ ఇమిడి ఉంటాయని భీష్ముడు ధర్మరాజుకు వివరించాడు.5 రాజు సర్వాధికుడనీ, సర్వధర్మాలనూ సమదృష్టితో నడిపించవలసినవాడనీ, భీష్ముని బోధ. విశ్వంగా వ్యాపించిఉన్న విష్ణుని ప్రతినిధిగా, ఆ విష్ణుని అంశగలిగి, విష్ణువువలె రాజు రాజ్య ప్రజల్ని అన్ని విధాలా రక్షించుకోవాలి. ఈ సత్యాన్ని తెలియజెబుతూనే మనపెద్దలు విష్ణ్వంశ లేనివాడు పృథివీపతి కాలేడన్నారు. ఈకారణం చేతనే పురాణపురుషుడు అనేక పర్యాయాలు ప్రభువుగా దిగివచ్చాడు. రామావతారంలో తాను ప్రభువుగా ప్రజలకు మార్గదర్శకుడయ్యాడు. కృష్ణావతారంలో ప్రభువులను ధర్మమార్గాన నడిపించి, ప్రజలను పాలించే పరిపాలకులకే ఆదర్శపురుషుడయ్యాడు. ఈవిధంగా పురాణపురుషుడు రాజధర్మాన్ని వెన్నంటి ఉండి, సాంఘిక వ్యవస్థను ధర్మం తప్పకుండా రక్షించుకుంటూ వస్తున్నాడు.

అర్థకామసముపార్జనలో ప్రజలు ధర్మం తప్పకుండా చూడవలసినవారు పరిపాలకులు _ మరి ఆ పరిపాలకులే అర్థకామాల విషయంలో ప్రలోభపడితే? కంచే చేను మేసినట్లవుతుంది. తల్లే బిడ్డలకు విషం పెట్టినట్లవుతుంది. అలా పరిపాలకులు ధర్మాన్నితప్పి అర్థకామాలను కోరినప్పుడే పరశురాముడు పరిపాలకుల్ని వెతికివెతికిచంపాడు.

---

4. "తనుఁదాన తొలుత గెలువన్
మనుజపతికి వలయుఁబిదప మార్తుర గెలువన్
మనమునఁదలంచునదియును
దను గెలువనిపతికి గెలువఁదరమే పగఱన్."–ఆం. మ. భా–శాంతి–2–276.

5. "ఏనుంగు పజ్జలో నెల్ల సత్త్వంబుల పజ్జలు నడఁగినయట్ల పోలె
రాజితక్షత్త్రధర్మమునకు లోనయి సర్వధర్మంబులుఁ జను........"
– ఆం. మ. భా – శాంతి – 2–289.

మళ్ళీ ద్వాపరయుగం చివరలో ధృతరాష్ట్రుడూ, అతనిపుత్రులూ ప్రభువులై ఉండి, అర్థకామాల యెడల ప్రలోభంతో ఉన్మాదమెత్తిన వారిలా ప్రవర్తించినపుడు వారినీ, వారిననుసరించినవారినీ పూర్తిగా ఒకచోట చేరనిచ్చి, కురుక్షేత్ర మహాసంగ్రామమనే అగ్నిగుండాన్ని రగిల్చాడు కృష్ణుడు. ఆగుండంనుంచి విజృంభించిన అగ్నిజ్వాలల్లో కామార్థాలకు దాసులైనవారంతా బలిపశువులై ప్రవేశించారు. తరువాత ధర్మాత్ముడైన ధర్మరాజుకు రాజ్యబాధ్యతను అప్పగించిన కృష్ణుడు అంతటితో ఊరుకోలేదు. సకల ధర్మవిదుడైన భీష్మాచార్యుని దగ్గరకు ధర్మజుణ్ణి వెంటబెట్టుకుని తీసుకువెళ్ళాడు. కృష్ణుని ఆజ్ఞతో భీష్ముడు పరిపాలకుడికి తెలియవలసిన అంశాలన్నిటినీ విపులంగా వివరించాడు. అప్పటికిగాని ధర్మరాజుకు పూర్తిగా సింహాసనం అప్పజెప్పలేదు. శ్రీకృష్ణుడు ఈవిధంగా అర్థకామాల విషయంలో ప్రభువుల పాత్రను కూడా నిరూపించడంతో మహాభారతానికి మరింత సమగ్రత అబ్బింది.



# దాంపత్యధర్మం - ధర్మాద్వైతస్థితి

లోకవ్యవహారంలో స్త్రీ పురుషసంబంధమైన కోరికే కామం అన్నపదానికి అర్థంగా రూఢిమై ఉంది. నిజానికి కామంఅన్న పదానికి కోరిక అని అర్థం. స్త్రీ పురుష సంబంధమైన ఆకర్షణ కూడా ఒకకోరిక కనుక, అది కూడా కామం అని వ్యవహారంలోకి వచ్చింది. క్రమంగా కామం అంటే అదేనన్న భావం సామాన్యజనంలో స్థిరపడింది. ఈ స్త్రీపురుష సంబంధమైన కోరిక ఏవిధమైన పరిణామదశలను పొంది పవిత్రీకరింపబడి పాతివ్రత్యము, ఏకపత్నీవ్రతము మొదలైన ఆదర్శ పథాలుగా తీర్చిదిద్దబడిందో మహాభారతం చక్కగా వివరిస్తుంది. పాతివ్రత్యధర్మంపై సూక్ష్మదృష్టిని ప్రసరింపజేసి, ధర్మాద్వైతస్థితిని ప్రతిపాదిస్తుంది. మహాభారతం దర్శింపజేస్తున్న దాంపత్యధర్మ పరిణామక్రమాన్ని, దాంపత్యధర్మ స్వరూపాన్ని, పాతివ్రత్యధర్మం లోని ధర్మాద్వైతస్థితిని ఈ అధ్యాయంలో పరిశీలిద్దాం.

## 1. దాంపత్యధర్మ పరిణామం :

ఆర్యధర్మ పరినిష్ఠితమైన వివాహాన్ని చిత్రించడం మాత్రమే భారతప్రయోజనం కాదు. నరలోకంలో వివాహవ్యవస్థ నెలకొన్న

విధాన్ని, దాని ఆరంభావస్థలను మహాభారతం వివరిస్తుంది. మానవుడు ప్రకృతి తనకు ప్రసాదించిన వివేకంతో దాంపత్యసౌఖ్యాన్ని క్రమంగా ఎలా ధర్మబద్ధంగా మలుచుకొన్నదీ భారతం విశదపరుస్తుంది.

పశుపక్ష్యాదులలో కామానుభవసందర్భాన వావివరుస లుండవు. ఒక భార్యకు ఒకభర్త, ఒకభర్తకు ఒకభార్య అన్న నియమం కూడా ఉండదు. ఋతుకాలసమయంలో అవి స్వేచ్ఛగా కామసౌఖ్యాన్ని అనుభవిస్తూఉంటాయి. తొలిదశలో మానవులు కూడా పశుపక్ష్యాదుల పద్ధతిలో స్వేచ్ఛగా ప్రవర్తించేవారు. తమకు నచ్చినస్త్రీలతో ఋతుకాలాల్లో సంగమసుఖాన్ని అనుభవిస్తూ సంతతిని పొందుతూ ఉండేవారు.

ఉతథ్యుడు అనే మునికి మమత అనే భార్య ఉంది. ఆమె గర్భవతియై ఉండగా బృహస్పతి అభ్యాగతుడై వచ్చి, దేవరన్యాయాన ఆమెను పొందగోరాడు. మమత గర్భంలోఉన్న శిశువు ఇది అధర్మం అని ఆక్రోశించాడు. అనగా ఒకనిసంతతి గర్భంలో పెరుగుతూండగా మరియొకడు ఆ స్త్రీనుండి సంతతిని పొందగోరడం ధర్మంకాదని గర్భస్థ శిశువు నిర్ణయించాడన్నమాట! కోపం వచ్చి బృహస్పతి ఆ శిశువును అంధుడవు కమ్మని శపించాడు. ఆ శిశువే పుట్టి, పెరిగి, దీర్ఘతముడు అయ్యాడు.1

ఇలా కాలం గడుస్తూ ఉండగా మరొక సంఘటన జరిగింది. ఉద్దాలకుడనే ముని యొక్క భార్య ఋతుమతియై ఉండగా ఒక వృద్ధ బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి పుత్రుని కొరకు ఆమె పొందును కోరాడు. ఉద్దాలకుని కొడుకైన శ్వేతకేతువు సాధ్వియైన తన తల్లిని వృద్ధబ్రాహ్మణుడు కామించడానికి ఇష్టపడక "ఇది మొదలుగా

1 ఆంధ్రమహాభారతం - ఆదిపర్వం - చతుర్థ - 126 వచనం.

స్త్రీలు పరపురుషులచే కోరబడటానికి వీలులేదు. పరపురుష సంగమం వల్ల సకలపాతకాలూ కలుగుతాయి. వివాహమైన స్త్రీలకు నేను ఇట్టి కట్టడిని ఏర్పాటు చేస్తున్నాను'' అని వైవాహిక జీవితాన్ని ధర్మ బద్ధం చేశాడు. అప్పటినుంచి ఈ ధర్మం మానవజాతికి శిరోధార్యమై అనుష్ఠింపబడుతోంది.2

వైవాహిక జీవితాన్ని పరమపవిత్రంగా నడుపుకొనేవారి సంతతికి ఎలాంటి తేజస్సు లభిస్తుందో మరొక గాథలో నిరూపింప బడింది. భృగునిభార్య పులోమ. గర్భిణియైన పులోమను అగ్ని హోత్రానికై అగ్నులను విహరించుమని చెప్పి భృగుడు స్నానానికి నదికి వెళ్ళాడు. అంతలో పులోముడనే రాక్షసుడు అగ్నిహోత్రాన్ని సమీపించి, పులోమను చూసి, ఉన్మత్తుడై, ఈమె ఎవ్వరు అని అగ్నిహోత్రుణ్ణి అడిగాడు. అబద్ధం ఆడటానికి భయపడ్డ అగ్ని హోత్రుడు ఈమె భృగుపత్ని అని చెప్పాడు. అప్పుడు పులోముడు "ఈమెను ముందుగా నేను ప్రేమించాను. తరువాత భృగుపుతో ఈమెకు వివాహం జరిగింది'' అంటూ ఒక అడవిపందిగా మారి, ఆసాధ్వీమణిని ఎత్తుకుని పరుగెత్తసాగాడు. జరుగుతున్న ఘోరాన్ని గమనించిన గర్భస్థశిశువు రాక్షసుడిపై కోపించి, గర్భంనుండి బయ టకు వెలువడ్డాడు. అలా వెలుపడ్డ చ్యవనుని తేజస్సు వేయిసూర్యు లను మించిపోయింది. ప్రళయకాలంలో విజృంభించే భీకరమైన అగ్ని హోత్రాన్ని తలపించింది. ఆ తేజాన్ని చూడగానే పులోముడు బూడిదకుప్పగా మారిపోయాడు. మహాసాధ్వియైన పులోమ ఆశ్చర్య కరంగా జన్మించిన శిశువునెత్తుకుని ఆశ్రమానికి చేరుకుంది.3 పవిత్ర మైన వైవాహికజీవితానికి ఫలమైన సంతతికి ఎంతటి శక్తి ఉంటుందో, దాంపత్య ధర్మాన్ని పవిత్రంగా నిర్వహించుకొన్న దంపతులకు

2. ఆం. మ. భా - ఆది - పంచమ - 93 వచనం, 94 పద్యం.

3. ఆం. మ. భా - ఆది - ప్రథమ - 129-132

ఎలాంటి రక్షణ ఉంటుందో, వారి శీలం వారిని ఎలా కాపాడుతుందో ఈగాథలో ప్రస్ఫుటం చేయబడింది. ఇట్టి దివ్యత్వాన్ని గమనించే మానవుడు క్రమంగా వైవాహికజీవితాన్ని పవిత్రీకరించుకొంటూ వచ్చాడని భారతం సూచిస్తూఉంది.

మనకు సర్వసామాన్యంగా అనిపిస్తూ, కనిపిస్తూన్న దాంపత్య ధర్మం మన ఊహాకు అందనంత పవిత్రమైంది. మనలో ఎక్కువమంది అనుకుంటున్నట్లు స్త్రీ పురుష సంబంధం కేవలం ఒకసరదాగాని, ఒక వేడుకగాని కాదు. అది ఒక పవిత్రమైన బాధ్యత. ప్రకృతిలో తమ తరువాతి తరాలు నిలబడేటందుకు మానవులు ఆచరించవలసిన మహత్తరయజ్ఞం. ఈ యజ్ఞానికి ఉపకరణాలుగానే మానవుల్లో స్త్రీ పురుషభేదం, స్త్రీ పురుషుల్లో ఒకరియెడల ఒకరికి చిత్రమైన ఆకర్షణా ప్రకృతిచేత కల్పించబడ్డాయి. కనుకనే ద్రష్టలు అధిలోకం, అధిజ్యోతిషం, అధివిద్య అనబడే బ్రహ్మవిద్యార్జన శాఖలతోపాటు అధిప్రజం (వివాహమై సంతతిని పొందటం) కూడా యజ్ఞమందలి భాగంగా దర్శించారు. దీన్నే ప్రాజాపత్య ధర్మం అని పిలిచారు. సంతానాన్ని పొందేటందుకు స్త్రీ పురుషులు ఆచరించే యజ్ఞంగా దాంపత్యధర్మాన్ని శతపథబ్రాహ్మణం దర్శించి, వర్ణించింది.* అందులో ఇలా ఉంది - "యజమానుడు (యజ్ఞంచేస్తున్నవాడు) రేతస్సు రూపంలో (ఆ రూపాన్ని పొంది) అగ్నికుండమైన భార్య యొక్క యోనిని తడుపుతున్నాడు. (సంవత్సరపురుషుడైన ప్రజాపతి వర్షంతో భూమిని తడిపినట్లు.) దేవతలు గార్హపత్యాన్ని అగ్నిగా చయనంచేసి దేహంరూపంలో యజ్ఞశాలను ఆరోహిస్తున్నారు. అదృశ్యరూపంలో వాళ్ళు దీనిని నడుపుతున్నారు."4 వాళ్ళు ఇలా

---

* శతపథ బ్రాహ్మణం - కాణ్వసంహిత - 9వకాండ, 1వ అధ్యాయము, 1వ బ్రాహ్మణం, 11వ ఖండిక, 1-10 మంత్రాలు.

4. దేవా గార్హపత్యం చిత్వా సమారోహన్ అయంవై లోకో గార్హపత్య ఇమమేవ తల్లోకం సంస్కృత్య సమారోహంతే తమ ఏవ అనతి దృశ్యమపశ్యన్.

అంటున్నారు - "చీకటిరూపమైన పాపాన్ని ఈవిధంగా పోగొట్టు దముగాక !"5. "వాళ్ళు చేతనాన్ని పేర్చువారై ఇష్టికలను చూశారు"6 (ఇష్టికలు అనగా ఇష్టముగల కామం రూపంలో నిర్మింపబడ్డ ఇటికలవంటి దేహకణాలు.) "ఆ దేవతలు వాటిని సమీకరణం చేసి, అగ్నికి పొయ్యిరూపమైన యోనియందు రేతస్సురూపంతో తడుపుతున్నారు."7

"ఈగార్హపత్యయజ్ఞమున యోనియే పొయ్యి. వీరు సంవత్సరమునందు పురుషుని ప్రతిష్ఠచేసి సమీకరణం చేస్తున్నారు."8 "దానియందే వారు పాపస్వరూపమైన శ్లేష్మధాతువును నిర్మించి బుడగగా ఏర్పరచి మావిని చేస్తున్నారు."9 "సారం పిండినట్లు యజమానిని ప్రాణిగా గర్భాన ప్రతిష్ఠించడమే యజ్ఞంగా ఆచరిస్తున్నారు."10 "దొంగ ఎలా కనిపించకుండా లీనంగా తీసుకువస్తాడో వారు అలా తీసుకువస్తున్నారు."11 "దీనికి అధిదేవతయైన నిర్ఋతిదేవికి ఎవడు నమస్కారభావం చూపిస్తాడో వాడు పాపంనుంచి విముక్తుడు అవుతాడు."12 "ఈ నైఋతి సూర్యతేజస్సు కలది."13 "ఆమెకు ఎవడు

5. యథేదం తమః పాప్మానం అపహనామః
6. తే చేతయమానాః ఏతా ఇష్టికా అపశ్యన్.
7. యత్రదేవాః సమస్కుర్వన్ తం ఉభాయాం యోనౌం రేతో భూతం అసించంతః.
8. యోనిర్వ్యాముఖా తస్మాన్ ఏతాన్ సంవత్సరే ప్రతిష్ఠాం సమస్కుర్వన్ ఇమమేవలోకం. అయంవై లోకః గార్హపత్యం.
9. తస్మిన్ ఏనం ప్రాజనయన్ తస్య యః పాప్మా యః శ్లేష్మా యదుల్బణం యజ్జరాయుః.
10. అసువ్వంతం యజమద మిచ్ఛేతి.
11. యథా తస్కరః ప్రలాయ ఏతి ఏవం ప్రలాయ విహీతి.
12. 'విద్వాన్ నమిచ్ఛేతి ఏతత్ నమోదేవీ నిర్ఋతే తుభ్యమస్తు' ఇతి నమస్కారేణవా ఏనం అపహతే పాప్మనా.
13. తిగ్మ తేజావై నిర్ఋతిః

ప్రక్కగా ఈవిధమైన హోమాన్ని నిర్వర్తిస్తున్నాడో సృష్టికొరకు వాడు గర్భభూమిని బంధిస్తున్నాడు."14ఇది దేవతలకు సంబంధించిన ప్రాజాపత్యయజ్ఞకర్మ.

వ్యాసభగవానుడు యజ్ఞవేదికనుంచి ద్రౌపది ఉద్భవించిందని చెప్పడానికి ప్రధానభూమిక ఇదే. భౌతికకక్ష్యలో జరిగిన వాస్తవమైన కథను శాశ్వతధర్మరూపమైన పీఠికలో పొదిగి, కల్పనాత్మకంగా సంహితను నిర్మించడమే ఇతిహాస నిర్మాణంలోగల విశిష్టత. ఇక్కడ ద్రౌపది అనే పాత్ర భౌతికసత్యం. యజ్ఞవేదికయందు ఉద్భవించడం యజ్ఞధర్మనిరూపణాత్మకమైన కల్పనం. ఈరెండింటి మేలి కలయికయే ఇతిహాసమనబడే గ్రంథం. ద్రుపదుడు ద్రౌపదిని కామకర్మయందుకాక, యజ్ఞరూపమైన దాంపత్య కామధర్మమునందు ఉద్భవింపజేశాడని అర్థం. జీవియొక్క ప్రవర్తనమే ధర్మానుబద్ధమై, సంస్కారపూర్వకం అయినపుడు వేదకర్మ అవుతుంది. పాంథులు ఎక్కడ దొరికితే అక్కడ వెలయిచ్చి పొందే అధ్వాన్నానికీ, శుచిగా, రుచిగా వండి, వడ్డించే ఇంటి భోజనానికీ గల భేదంవంటిది యిది. పవిత్ర గ్రంథాలు దర్శింపజేస్తున్న ఈవెలుగులో నడుపుకోవడం ప్రారంభించినపుడు జీవితమే లోకహితార్థమైన పవిత్రయజ్ఞంగా రూపు దిద్దుకుంటుంది. కనుకనే కృష్ణుడు యజ్ఞార్థదృష్టితో కర్మలను ఆచరించమని ఉపదేశిస్తున్నాడు.

మానవుల్లో యౌవనావిర్భావనంనుంచీ కలిగే భావ పరంపరలను సుకుమారంగా తమ కావ్యాల్లో వర్ణించిన కవులూ ఉండవచ్చు. అంతటితో ఆగక, తెరచాటు తొలగించి, మోటుగా వర్ణించనిదే తృప్తిపడని రెండవతరగతి కవులూ ఉండవచ్చు. కామకర్మ మరింత బహిర్గతం చేయగలిగామని గర్వించే కాముక సాహిత్య

14. తస్యా ఏతత్ ఆసంజుహోతి యత్తత్ దైవత్యం కర్మకరోతి ఏషాం ఇంధనానాం అవసర్జనాయ ఇతి.

ప్రస్థుల అశ్లీల రచనలూ ఉండవచ్చు. కాని మానవపరిణామం, ఆ పరిణామంలో వైవాహిక వ్యవస్థ రూపుకట్టుకున్న తీరుతెన్నులు, క్రమంగా దాంపత్యధర్మాన్ని మహత్తరయజ్ఞంగా దర్శించి ఏకపత్నీ వ్రతం, పాతివ్రత్యం నెలకొల్పుకొన్న విధం, వాటి నిర్వహణంలో మానవుడికి ఆవశ్యకమైన సమన్వయం మహాభారతంలో ఈయబడి నంత సమగ్రంగా, స్పష్టంగా మరే గ్రంథంలోనూ ఈయబడలేదని నిరాఘాటంగా చెప్పవచ్చు. మానవుడికి నిత్యజీవితంలో ఆవశ్యకమైన, ఇటువంటి సమన్వయ దర్శనాన్ని అందించడంచేతనే ఏ ఆశ్రియాన్నీ కోరకుండా ఇప్పటికీ అయిదువేల సంవత్సరాలనుంచి మానవజాతిచే ఆశ్రయింపబడుతోంది. ఆశ్రయించినవారికి మార్గనిర్దేశమూ చేస్తోంది మహాభారతం.

## 2. వివిధవివాహాలు - వ్యాససమన్వయం :

వివాహాలు ఎనిమిదివిధాలని మనుస్మృతి చెబుతోంది. అవి - 1. బ్రాహ్మం, 2. దైవం, 3. ఆర్షం, 4. ప్రాజాపత్యం, 5. ఆసురం, 6. గాంధర్వం, 7. రాక్షసం, 8. పైశాచం. వీటిలో పైశాచ వివాహాన్ని అధమమైనదిగా చెబుతున్న మనువు ఎనిమిదివిధాల వివాహాల లక్షణాలను ఇలా వివరించాడు.15

1. బ్రాహ్మం: వేదాధ్యయనం చేసి, ఆచారవంతుడైన ఒక బ్రహ్మచారిని తానుగా రప్పించి, అతడికి వస్త్రాదులను బహూకరించి, మర్యాదచేసి అలంకరింపబడ్డ కన్యను సమర్పించడం బ్రాహ్మం.16

---

15. బ్రాహ్మోదైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాసురః
గాంధర్వోరాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః - మను - 3-21

16. ఆచ్ఛాద్యచార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయమ్
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో-ధర్మఃప్రకీర్తితః. - మను - 3-27

2. దైవం : జ్యోతిష్టోమం మొదలైన యజ్ఞాల్లో అధ్వర్యవంచేసే ఋత్విజుడికి అలంకరింపబడ్డ కన్యను సమర్పించడం దైవం.17

3. ఆర్షం : యాగాది సిద్ధికోసంగాని, కన్యకు ఇవ్వడానికిగాని ధేనుద్వయాన్నో, బలీవర్దద్వయాన్నో వరుడిదగ్గరనుంచి తీసుకుని శాస్త్రప్రకారం వరుడికి కన్యనివ్వడం ఆర్షం.18

4. ప్రాజాపత్యం : మీరు ఇద్దరూ కలిసి ధర్మాన్ని ఆచరించండి అని చెప్పి తల్లిదండ్రులు వరుణ్ణి పూజించి పిల్లనీయడం ప్రాజాపత్యం.19

5. ఆసురం : జ్ఞాతులకూ, పిల్లకూ కోరిన ధనాన్నిచ్చి, వారి యిష్టంతో పెళ్ళిచేసుకోవడం ఆసురం.20

6. గాంధర్వం : స్త్రీపురుషులు పరస్పరాకృష్టులయి, కలియడం గాంధర్వం. ఇది కామసంబంధమైనదీ, మైథునకర్మకు ఏర్పడినదీను.21

7. రాక్షసం : కన్యకబంధువులు సమ్మతించనప్పుడు వారిని చంపిగాని, నరికిగాని, చీల్చిగాని, బంధునాశానికై బాధపడుతున్న కన్యను బలవంతంగా తెచ్చుకోవడం రాక్షసం. 22

---

17. యజ్ఞేతు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే
అలంకృత్య సుతాదానం దైవం ధర్మ్యం ప్రచక్షతే.

18. ఏకం గోమిథునం ద్వేవా వరాదాదాయ ధర్మతః
కన్యాప్రదానం విధివ దార్షో ధర్మ స్స ఉచ్యతే.

19. సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్యచ
కన్యాప్రదాన మభ్యర్చ్య ప్రాజాపత్యోవిధిః స్మృతః

20. జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయైచైవ శక్తితః
కన్యాప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మఉచ్యతే.

21. ఇచ్ఛయాఽన్యోన్య సంయోగః కన్యాయాశ్చ వరస్యచ
గాంధర్వస్సతు విజ్ఞేయో మైథున్యః కామసంభవః.

22. హత్వా ఛిత్వా చ భిత్వాచ క్రోశంతీం రుదతీం గృహాత్
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే.

8. పైశాచం : నిద్రిస్తున్న స్త్రీనిగాని, కైపుతో ఉన్నదాన్ని గాని, ఏమరుపాటున ఉన్నదాన్నిగాని, బాలాత్కారంగా ఏకాంతంలో క్రీడించడం పైశాచం. ఎనిమిదవదైన ఈ వివాహం చాలా అధమమైంది.23

ఇవికాక స్వయంవరం అనే వివాహవిధానం ఒకటి పురాణేతిహాసాల్లో ప్రసిద్ధంగా కనబడుతోంది. సీతాస్వయంవరం, ద్రౌపదీ స్వయంవరం, దమయంతీ స్వయంవరం మొదలైనవి ఇందుకు ఉదాహరణాలు. చూడగా ఈవిధానం క్షత్త్రియులకు మాత్రమే పరిమితంగా కనబడుతోంది. పెద్దలందరి సమక్షంలో స్వయంవరానికి విచ్చేసిన రాకుమారుల్లో వధువు తనకు నచ్చిన రాకుమారుణ్ణి ఎంచుకోవడంగాని, పెద్దలచేత నిర్ణయించబడ్డ పరీక్షల్లో నెగ్గిన రాకుమారుణ్ణి వధువు వరించడంగాని జరగడం ఈ స్వయంవరవివాహంలోని సంప్రదాయం.

ఈ నవవిధవివాహాల్లో మహాభారతంలో ప్రధానంగా నాలుగు విధాలైన వివాహాలు ప్రసక్తం చేయబడ్డాయి. అవి బ్రాహ్మం, గాంధర్వం, రాక్షసం, స్వయంవరం. వీటిలో గాంధర్వరాక్షసాలు శాస్త్రసమ్మతాలే అయినప్పటికీ అంతక్షేమదాయకాలు కావని వేదవ్యాసుని ఉదాహరణపూర్వకమైన ఉపదేశం.

శకుంతలాదుష్యంతులు జరుపుకున్నది గాంధర్వ వివాహం. వారిద్దరు ఒకరిని ఒకరు ఇష్టపడి దంపతులు అయ్యారు. క్షత్త్రియులకు గాంధర్వవివాహం శాస్త్రసమ్మతమని దుష్యంతుడు శకుంతలకు నచ్చచెప్పగా ఆమె అందుకు అంగీకరించింది. ఆవిధంగా నచ్చజెప్పి వివాహమాడిన దుష్యంతుడే తర్వాత శకుంతలను

---

23. సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి
స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః - మను : 3-27-34

తీసుకువెళ్ళకపోగా ఆమెకు బిడ్డ కలిగినతరువాత కణ్వునిచే పంపబడి నప్పుడు "నీవెవరివో నాకు తెలియ"దని నిరసించి, అవమానించాడు. శకుంతల ఎన్నివిధాలుగా నచ్చచెప్పినా, ధర్మప్రబోధం చేసినా, చివరకు పరిష్వంగంలో పుత్రస్పర్శను పరీక్షించుకోమన్నా అత డేమాత్రం దారికిరాలేదు. అప్పుడు ఆకాశవాణి కలుగజేసికొని అందరికీ వినపడేటట్లుగా సత్యాన్ని తెలియజెప్పవలసివచ్చింది. ఆకాశవాణి చెప్పిన తరువాత ప్రజాపవాదానికి భయపడి తాను ఇలా అబద్ధమాడానని చెప్పి, సర్దుకొని, దుష్యంతుడు భార్యనూ కొడు కునూ స్వీకరించాడు. ఈసందర్భంలో దివ్యవాణి పలకడమంటే మరొకరి సాక్ష్యం లేకపోవడంవల్ల గాంధర్వవివాహంలో స్త్రీకి రక్షణ లేదని తెలియజేయడమే. ఒకవేళ ఆకాశవాణి కలుగజేసుకోలేదను కుందాం. అప్పుడు దుష్యంతుడు తెలిసికూడా ప్రజాపవాదానికి భయ పడి భార్యను, బిడ్డను గాలికి వదలివేసేవాడన్నమాట! శకుంతల ధర్మనిష్ఠకు ముగ్ధతచెంది, ఆ అబలను రక్షింపగోరి, దివ్యవాణి కలుగ జేసుకున్నది గాబట్టి కదా కథ సుఖాంతమైంది! చక్రవర్తి, ధర్మ రక్షకుడు అయిన దుష్యంతుడు ఋష్యాశ్రమంలోని కన్యతో ఇలా ప్రవర్తించాడంటే ఇంక సామాన్యుల విషయం ఏం చెప్పగలం? ఈ సత్యాన్ని తెలియజేయడానికే మొగమోటమి ఎరుగని వ్యాసుడు లోకహితాన్నికోరి, శకుంతలాదుష్యంతులగాథను జరిగింది జరిగి నట్టుగా మహాభారతంలో వివరించాడు.24

భారతంలోనే తపతీసంవరణుల ప్రేమకథలో ఈ గాంధర్వ వివాహం నిరసించబడింది. సంవరణుడు క్షత్రియుడు. సూర్యుని పుత్రికయైన తపతిని ప్రేమించాడు. క్షత్రియులకు గాంధర్వ వివాహం శాస్త్రసమ్మతంగనుక ఆవిధానాన్ని అనుసరిద్దాం అన్నాడు.

24. ఆంధ్రమహాభారతం - ఆదిపర్వం - చతుర్థాశ్వాసం.

తపతి అందుకు అంగీకరించలేదు. అది పద్ధతికాదనీ, స్త్రీకి స్వేచ్ఛ లేదనీ, తన తండ్రిని అడిగి స్వీకరించమనీ స్పష్టంగా చెప్పింది. ఆపైన సంవరణుని స్థితిని చూసిన వసిష్ఠుడు మధ్యవర్తిత్వం నెరపి, సూర్యుణ్ణి ఒప్పించి, తపతీసంవరణులకు వివాహం జరిపించాడు.25 శకుంతలకు లేని మెలకువ తపతికి ఉంది. కాబట్టే ఆమెజీవితంలో ఎటువంటి సమస్యలకు చోటులేకుండా పోయింది. గాంధర్వం క్షత్రియులకు శాస్త్రసమ్మతమైన వివాహమే అయినా అది అంతగా అనుసరణీయం కాదని భారతం ఉదాహరణ పూర్వకంగా ఉపదేశిస్తోంది. స్త్రీపురుషులు ఒకరియెడల ఒకరు ప్రేమ కలిగి ఉండటం దాంపత్యధర్మ నిర్వహణకి ఎంత అవసరమో, ఆ ప్రేమించుకున్న స్త్రీపురుషులకు పెద్దల రక్షణకూడా అంతే అవసరం. ఈ సత్యాన్ని గుర్తించినపెద్దలు తమసన్నిధిలోనే తమబిడ్డలు కోరినవారిని వివాహమాడేందుకు వీలుగా సమన్వయధోరణిలో స్వయంవర సంప్రదాయాన్ని ఏర్పాటుచేసి ఉంటారు.

గాంధర్వంలాగానే రాక్షస వివాహంకూడా అంతగా అనుసరణీయం కాదని భారతం ఉపదేశిస్తోంది. భీష్ముడు తన తమ్ముడైన విచిత్రవీర్యునికోసం కాశీరాజపుత్రికలను రాక్షస వివాహపద్ధతిలో జయించి తీసుకువచ్చాడు. కాశీరాజు తన కుమార్తెలకోసం ఏర్పాటుచేసిన స్వయంవరం భీష్ముడి రంగప్రవేశంతో రాక్షసంగా రూపొందింది. అడ్డుపడ్డ సాళ్వాదులను జయించి భీష్ముడు అంబ అంబిక అంబాలికలను తమ్మునికై కొనితెచ్చాడు. భీష్ముడు అనుసరించిన రాక్షసవిధానం శాస్త్రసమ్మతమే. కాని కథ అడ్డంతిరిగింది. అంబ తన మనస్సును సాళ్వుడికే అర్పించానని బయటపెట్టింది. భీష్ముడు సగౌరవంగా ఆమెను సాళ్వుడి దగ్గరకు సాగనంపాడు. భీష్ముడితో అంబకోసం పోట్లాడిన సాళ్వుడు ఓడిపోయానన్న

25. ఆంధ్రమహాభారతం - ఆది - సప్తమ

అవమానంతో అంబను నిరాకరించాడు. అంబ భీష్ముడిపై పగబట్టింది. ఆమెకు ఆశ్రయమిచ్చిన పరశురాముడు భీష్ముణ్ణి 'దారిలోకి' తెద్దామని చూశాడు. కాని సాధ్యంకాకపోయింది. ఆజన్మలో పగసాధించడం సాధ్యపడక తరువాతి జన్మలో శిఖండిగా జన్మించి, భీష్ముడి మరణానికి ఉపకరణం అయ్యింది అంబ.26 అర్జునుడు శిఖండిని అడ్డుపెట్టుకోవడంతో అంగనాపూర్వుల ఎదుట యుద్ధంచేయని భీష్ముడు అస్త్రసన్న్యాసం చేశాడు. ఆపైన అర్జునుడు భీష్ముని పడగొట్టాడు. ఈవిధంగా శిఖండి ఎదురైతే తాను అస్త్రసన్న్యాసం చేస్తానని తన వధోపాయాన్ని భీష్ముడే ధర్మజుడికి చెప్పినా భీష్ముడివధకు కారణం కాగలిగానన్న తృప్తిమాత్రం శిఖండికి దక్కింది.

రాక్షస వివాహవిధానంలో వధువుల మనస్సు తెలుసుకోవడానికి అవకాశంలేదు కాబట్టి ఇంతటి ముప్పు వాటిల్లింది. శాస్త్ర సమ్మతమే అయినప్పటికీ ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప రాక్షస వివాహ విధానం అనుసరణీయం కాదని వ్యాసుని కథాగతమైన హెచ్చరిక. రాక్షస విధానం ఎటువంటి పరిస్థితుల్లో అవలంబించవచ్చునో వ్యాసుడే భాగవతంలో చూపించాడు. భాగవతంలోని రుక్మిణీకల్యాణం రాక్షస పద్ధతిలోనే జరిగింది. తన్ను రాక్షస విధానంలో కొనిపోవలసిందిగా రుక్మిణి తానే కృష్ణుడికి విన్నపం పంపింది. ఆమె ఆరాధనను మన్నించి కృష్ణుడు వచ్చాడు. రుక్మిణిని కొనిపోతున్నప్పుడు రుక్మి, శిశుపాలుడు అడ్డగించి, కృష్ణుడిచేతుల్లో ఓడిపోవడంతో రుక్మిణీ కృష్ణుల వివాహం రాక్షసం అయ్యింది.27 ఈ సందర్భంలో వధువు మనస్సెరిగి వరుడు మసలుకోవడంవల్ల, వధువే మనసారా వరుణ్ణి కోరుకోవడంవల్ల విధానం రాక్షసం అయినా కథంతా శుభప్రదంగా నడిచింది. రుక్మిణీ కల్యాణంలాంటి విశిష్టఘట్టాల్లోతప్ప, అంటే, వధువులే మనసారా

26. ఆంధ్రమహాభారతం - ఆది - చతుర్థ: ఉద్యోగ - చతుర్థ

27. ఆంధ్రమహాభాగవతం - దశమ - పూర్వభాగం.

వేడుకున్నప్పుడుతప్పు, రాక్షస విధానం అనుసరణీయం కాదని వ్యాస భగవానుని నిషేధాత్మకమైన నిర్దేశం; వివరణాత్మకమైన ఉపదేశం; సమన్వయాత్మకమైన సందేశం.

స్త్రీవిషయంలో శీలసౌందర్యాలు ప్రాధాన్యం వహించినట్లు పురుషుని విషయంలో వివేకసామర్థ్యాలు ప్రాముఖ్యాన్ని వహిస్తాయి. తన సామర్థ్యాన్నిచూపి, తనకుసాటి మరొకరులేరని నిరూపించి, క్షత్రియుడు వధువును స్వీకరించవచ్చును అని మనుస్మృతి అంగీకరించి, దాన్ని రాక్షస విధానంగా పేర్కొంది. ఈ విధానాన్నికూడా దృష్టిలోపెట్టుకొనే కొన్ని స్వయంవర గాథల్లో వరులకు సామర్థ్య పరీక్షను ఏర్పాటు చేసేవారు. ఆ పరీక్షల్లో నెగ్గినవాణ్ణి వధువు వరించేది. ఈ పరీక్షానిర్వహణం వధువు సమ్మతితోనే జరిగేది కనుక అంతా సవ్యంగా నడిచేది. ఈ విధంగా గాంధర్వ రాక్షసాలను సంస్కరించి మనపెద్దలు స్వయంవరవిధానానికి రూపురేఖలు దిద్దినట్లు తోస్తుంది. ఇది గాంధర్వ రాక్షసాలలోని దోసగులను తొలగించి మెరుగులను నిలువరించే ప్రయత్నం. స్త్రీలలో రెండు తరహాలవారు ఉంటారు. కొందరు భర్త సమర్థుడు కావాలని కోరుకుంటారు. మరి కొందరు భర్త అందచందాలకు ప్రాముఖ్యం యిస్తారు. ఈ రెండు తరహాలవారినీ దృష్టిలోపెట్టుకొని స్వయంవర విధానంలో వరుడు సామర్థ్యాన్ని నిరూపించుకొనే పద్ధతి ఒకటి, వధువు వరుణ్ణి ఎంచుకొనే పద్ధతి ఒకటి ఏర్పాటుచేయబడిఉంటాయి.

## 3. పాతివ్రత్యస్వరూపం – కుంతి – గాంధారి :

పాతివ్రత్యం యొక్క స్వరూపస్వభావాలను మహాభారతం ప్రదర్శించిన తీరు అనన్యసామాన్యమైనదీ, మానవుడికి నిత్యజీవితంలో అక్కరకు వచ్చేదీను. సామాన్యంగా పాతివ్రత్యంపైన లోకంలో కొన్ని రూఢిమైన అభిప్రాయాలు ఉన్నాయి. స్త్రీ ఒకే భర్తను

కలిగిఉండి, అతణ్ణి జీవితాంతం దేవుడిగా ఆరాధించడం పాతివ్రత్య మని లోకసామాన్యమైన అభిప్రాయం. ఈ భావన సముచితమైనదే. ఈదృష్టితో గాంధారిని మనం పతివ్రతగా అంగీకరించి, అభిమానిస్తాం. సహాధర్మచారిణియైన గాంధారి భర్తకోసం లోకాన్ని చూడటం నుంచి కూడా విరమించుకొంది. తనను తండ్రి జాత్యంధుడైన ధృతరాష్ట్రుడికి ఈయబోతున్నాడన్న వార్త వినగానే గాంధారి తండ్రి నిర్ణయం ప్రకారం ఆక్షణమే తనను ధృతరాష్ట్రుడికి సమర్పించుకొంది. భర్త చూడలేని లోకాన్ని తాను కూడా చూడటానికి ఇష్టపడక కన్నులకు వస్త్రాన్ని కట్టేసుకుంది. ఆపైన గాంధారీధృతరాష్ట్రులకు వివాహాం జరిగింది. జీవితాంతం తనకన్నులకు వస్త్రాన్ని కట్టుకునే ఉన్నది గాంధారి. ఈకారణంచేత అందరిహృదయాల్లోను పతివ్రతగా స్థానాన్ని స్థిరపరచుకుంది.

మరి కుంతి? కుంతిని గూర్చి రకరకాల అభిప్రాయాలు జన బాహుళ్యంలో వినిపిస్తూఉంటాయి. కొందరు పెళ్ళికాకముందు పురుషుడివల్ల మోసపోయి గర్భవతియైన స్త్రీలతో కుంతిని పోలుస్తూ ఉంటారు. ఇంకొందరు ఆమె పాండవులను భర్తవల్ల కాక దేవతలవల్ల కన్నదని నీచంగా మాట్లాడుతూ ఉంటారు. మొత్తం మీద కుంతి యొక్క దాంపత్య జీవితాన్ని గూర్చి సామాన్య లోకంలో సదవగాహన తక్కువనే చెప్పాలి.

ముందుగా ఏ అభిప్రాయాన్ని ఏర్పరచుకోకుండా, మహాభారతంలోని కుంతిపాతను తొలినుంచి తుదివరకూ సూక్ష్మదృష్టితో పరిశీలించినపుడు కుంతి ఎక్కువమంది అభిప్రాయపడుతున్న స్థితికి చెందినది కాదనీ, ఆమెను అర్థంచేసుకోవడానికి సహృదయం, సంయమనం, సమ్యగ్దర్శనం, ఆవశ్యకమనీ తెలుస్తుంది. ఈవిధమైన సూక్ష్మదృష్టితో కుంతిగాథను పరిశీలించడానికి ప్రయత్నిద్దాం.

కుంతిచేసిన సేవలకు మెచ్చి ఋషుల్లో శాపాలిచ్చే ఋషిగా పేరుపడ్డ దుర్వాసుడు కుంతికి వరాన్ని ఇచ్చాడు. ఆమె ఆ వరాన్ని పరీక్షించగోరి సూర్యుణ్ణి స్మరించి ధ్యానించింది. సూర్యుడు సాక్షాత్కరించాడు. కుంతి బెంబేలుపడింది. సూర్యుడు తన రాక వృధా పోకూడదనీ, పుత్రుణ్ణి అనుగ్రహిస్తాననీ చెప్పాడు. కుంతి తనకు అలాంటి కోరిక లేదనీ, కేవలం బాల్యచాపల్యంతో ముని ఇచ్చిన వరాన్ని పరీక్షించాలన్న కుతూహలంతో మాత్రమే మంత్రం జపించాననీ, క్షమించి తనను వదలిపెట్టమనీ వేడుకుంది. సూర్యుడు ఆమె కన్యాత్వానికి భంగంరాదని చెప్పి సద్యోగర్భాన పుత్రుణ్ణి ప్రసాదించాడు. ఊహించని సన్నివేశంలో చిక్కుకున్న కుంతి సూర్యుడి మహిమవల్ల రూపుకట్టుకున్న పేటికలో కన్నబిడ్డను పెట్టి, కన్నీరు కారుస్తూ, నదిలో వదిలింది.28

తరువాత కుంతికి పాండురాజుతో వివాహమయ్యింది. కిందముడి శాపంవల్ల సంతానం పొందడానికి అవకాశాన్ని కోల్పోయిన పాండురాజుకు పుత్రసంతతి కావాలని కోరిక కలిగింది. జీవితంలో నిజమైన తృప్తిని పొందటానికిగాని, వంశం నిలబడటానికిగాని, పితౄణం తీర్చుకోవడానికిగాని పుత్రసంతతిని పొందడం ఒక్కటే మార్గమని నిశ్చయించుకున్నాడు పాండురాజు.

కుంతిని తననియోగంవల్ల సద్బ్రాహ్మణులతో పుత్రులను పొంది, తనకు తృప్తిని, ముక్తిని కలిగించవలసిందిగా కోరాడు. కుంతి పాండురాజుకు అంకితమైన మనస్సులో మరొకమూర్తిని నిలుపలేనన్నది. సంతతి పొందడానికి పవిత్రమైనమార్గం మరొకటుందని వ్యుషితాశ్వుడు అనే రాజుకథను భర్తకు వినిపించింది. వ్యుషితాశ్వుడు అనేరాజు తనభార్యయైన భద్రయందు అనవరతకామాసక్తుడై క్షయ వ్యాధితో మరణించాడు. అప్పుడు భద్ర భర్త శవాన్ని కౌగిలించు

28. ఆంధ్రమహాభారతం - ఆది - పంచమాశ్వాసం.

కొని రోదిస్తూ, "నిన్ను విడిచి ఉండలేను. నీతోనే నేనూ వస్తాను. నీవలా కాదంటే నీకు ప్రతిరూపాలైన పుత్రుల్ని నాకు ప్రసాదించు" అని కోరింది. "తప్పకుండా పుత్రులు ఉదయిస్తారు. ఋతుమతివైన ఎనిమిదవనాడుగాని, పధ్నాలుగవనాడుగాని శుచివై శయనించి నన్ను తలుచుకో" అని భర్త శరీరంనుంచి భద్రకు దివ్యవాణి వినిపించింది. ఆమె అలాగే చేసి ఏడుగురుకొడుకుల్ని పొందింది. ఈ కథ చెప్పి కుంతి "మీరుకూడా మాయందు ఇలాగే పుత్రులను అనుగ్రహించవలసింది" అని ప్రాధేయపడింది. వ్యుషితాశ్వుడు సంకల్ప మాత్రంచేత భార్యకు బిడ్డల్ని ప్రసాదించాడుగదా! అలాగే తమ భర్త తమకూ సంతతిని ప్రసాదించాలని కుంతి ప్రార్థన.

అప్పుడు పాండురాజు వివాహవ్యవస్థ ఎలా రూపుకట్టుకున్నదీ వివరించి 'భర్తచేత నియోగింపబడకుండా భార్య ఏమీ చేయరాదు. భర్తచేత నియోగింపబడిన పని చేయకుండా ఉండరాదు'అన్న మనుధర్మాన్ని వివరించి, ఇంకా యిలా అన్నాడు- "పూర్వం కల్మాషపాదుడనే రాజర్షి చేత నియోగింపబడి అతడిభార్యయైన మదయంతి వసిష్ఠుడివల్ల అశ్మకుడనే పుత్రుణ్ణి పొందింది. వెనక్కుతిరిగి చూసుకొంటే మా జన్మం కూడా ఇలాంటిదేకదా! మహామునియైన వేదవ్యాసుడివల్లగదా మావంశం నిలిచింది! ఈ సన్నివేశాలనుబట్టి సత్యాన్ని బోధపరుచుకొని, నా నియోగాన్ని ఆచరించు". ఈవిధంగా కుంతికి నచ్చచెప్పి పాండురాజు పుత్రసంతతిని పొందాలన్నకోరిక తనకు గాఢంకాగా భార్యను ఇలా ప్రార్థిస్తున్నాడు.

"అలయక ధర్మశాస్త్రములయందుఁ బురాణములందుఁ జెప్ప ను
త్పల దళనేత్ర వింటిమ యపత్యము మేలని కావునన్ యశో
నిలయులఁ బుత్త్రులం బడయు నీకొనరించెద సంగతాంగుళీ
దళ విలసన్మదీయ కరతామరసద్వయ యోజితాంజలిన్".29

29. ఆంధ్రమహాభారతం - ఆది - 5-80

దీనవదనుడై, చేతులుజోడించి నమస్కరిస్తున్న భర్తను చూసిన కుంతికి హృదయం ద్రవించింది. భర్తకు పుత్రసంతతిని ప్రసాదించడమే తనకు కర్తవ్యమని ఆమె నిర్ణయించుకొంది. ఆపైన తనకు దుర్వాసుడిచ్చిన వరప్రభావాన్ని పాండురాజుకు వివరించింది. అతడి అభీష్టానుసారం ధర్మానిలశక్రులను ఆరాధించి ధర్మజభీమార్జునులను పొంది అతనికి సమర్పించుకొంది.

మాద్రికికూడా పుత్రసంతతిని పొందాలన్న కోరిక కలిగింది. ఆ కోరికను భర్తకు ఏకాంతంలో విన్నవించుకొంది. దుర్వాసుడు ఉపదేశించిన మంత్రప్రభావంతో మాద్రికికూడా సంతతి కలిగేటట్లు చేయమని కుంతిని కోరాడు పాండురాజు. కుంతి అశ్వినీదేవతలను ప్రార్థించి మాద్రికి వారి అనుగ్రహంతో కవలలైన నకులసహదేవులు కలిగేటట్లు చేసింది.

కుంతికి పుత్రసంతతి కలిగిందన్న వార్త వినగానే ఉదరతాడనం చేసుకొంది గాంధారి. తత్ఫలితంగా ఆమెకు గర్భపాతమైంది. గర్భంనుంచి పడిన ఆ మాంసపేశినుంచి వ్యాసుడి కరుణవల్ల నూర్గురుపుత్రులు, ఒక్కపుత్రిక పుట్టుకువచ్చారు.

తనవలెనే తన సవతికికూడా సంతతి కలగాలని కోరుకుంది కుంతి. దుర్వాసుడు తనకు ఇచ్చిన మంత్రాన్ని మాద్రికోసం వినియోగపరచడంలో ఆమె ఒకవిధమైన గుణుత్వాన్ని నెరపింది. అంతకుమించిన వాత్సల్యాన్నీ వర్షించింది. తోడికోడలికి తనకన్నా ముందుగా సంతతి కలిగిందన్న ఈర్ష్యతో ఉదరతాడనం చేసుకొన్న గాంధారి సామాన్యస్త్రీస్వభావాన్ని ప్రదర్శించగా, సవతికి సంతతి కలిగేటట్లు చేసిన కుంతి తనలోగల దివ్యత్వాన్నీ, సమదృష్టినీ ప్రస్ఫుటపరిచింది.

భారతగాథను సమగ్రంగా, సమన్వయాత్మకంగా పరిశీలించినప్పుడు కుంతియొక్క పవిత్రత, ఉత్తమత్వం మనకు బోధపడతాయి. ఆమెలో కామవాంఛ ఉన్నట్లే కనబడదు. సూర్యుడు దిగివచ్చిన నాడు కూడా ఆమెకు ఎట్టికోరికా కలగలేదు. బాల్యచాపల్యంవల్ల వరాన్ని పరీక్షించాలన్న కుతూహలంతో మాత్రమే మంత్రాన్ని జపించాననీ, మరే కోరికతోనూ కాదనీ సూర్యుడికి వివరించి చెప్పింది కుంతి. తాను కన్యననీ, తనను మన్నించి వదిలివేయమనీ వేడుకొంది. తన రాక వ్యర్థం కారాదనీ, కాదనీ, సద్యోగర్భాన పుత్త్రుడు కలుగుతాడనీ, కన్యాత్వానికి మాత్రం ఎట్టి భంగం కలగదనీ నచ్చచెప్పి, సూర్యుడే పుత్త్రుణ్ణి ప్రసాదించాడు. ఈసన్నివేశంలో కుంతికి కామవాంఛ అణుమాత్రం కూడా లేదు కాబట్టే ఆమె కన్యాత్వానికి భంగం కలగదని సూర్యుడు చెప్పినట్లు తోస్తుంది. ఈ నిర్ణయమే పరాశరుడు కోరి పొందిన సత్యవతికి కూడా వర్తించింది. ఆ సన్నివేశంలో సత్యవతి మనస్సుకు ఎటువంటి కామస్పర్శా లేకపోవడమే ఆమె కన్యాత్వానికి భంగం కలగలేదన్నట్లు చెప్పబడింది. ఈ నిర్ణయమే వంశాంకురాలను నిలబెట్టడానికి అంబికా అంబాలికలను సంగమించిన వ్యాసుడికీ వర్తిస్తుంది. ఆ సందర్భంలో అతడిమనస్సుకు కామస్పర్శ లేదుకాబట్టే వారిని పొందిన తరువాతకూడా వ్యాసుడు ఆజన్మబ్రహ్మచారిగానే కీర్తింపబడ్డాడు.

మామూలులోకంలో కూడా ఇటువంటి తేడాను మనం నిత్యం గమనించి పాటిస్తూనే ఉంటాం. ఒక స్త్రీని పరపురుషుడు ముట్టుకోవడం పాపం, అధర్మం అంటున్న మనమే అదే స్త్రీని వైద్యుడు పరీక్షించడం, ప్రసవించే సమయంలో సేవించడం ధర్మం అంటున్నాం. ఈసందర్భంలో ధర్మం అనేది వైద్యుడు భౌతికంగా ఆచరిస్తున్న కర్మనుబట్టిగాక, మానసికంగా పాటిస్తున్న వైద్యధర్మాన్నిబట్టేగదా!

పరపురుషుడు తాకినపుడు అతని మనస్సుకు కామస్పర్శ ఉంది కాబట్టి అది అధర్మం అవుతోంది. వైద్యుడు తాకినప్పుడు అతని మనస్సులో ఉన్నది మాతృవాత్సల్యాన్ని పోలిన బాధ్యతాయుత మైన సేవాభావం కనుక అది ధర్మం అవుతోంది. సూక్ష్మమైన ఈ ధర్మతత్త్వాన్ని అనుసరించే భారతంలో కుంతీ మొదలైనవారు కన్యాత్వాన్ని కోల్పోలేదని చెప్పడం జరిగింది. అలాగే దేవతలతోడి సంతతిని పొందిన సమయంలోకూడా కుంతి మనస్సుకు కామస్పర్శ ఏమాత్రం లేదు. ఆమె మనస్సులో నిండి ఉన్నది భర్త తనకు అప్పగించిన బాధ్యత మాత్రమే.

ఇంతటి పవిత్రమూర్తి కనుకనే దుర్వాసుడు ఆమెకు వరం అనుగ్రహించడం, మంత్రప్రభావంచేత ఆవాహన చేసినంతమాత్రాన దేవతలు ఆమెదగ్గరకు నడిచిరావడం, ధర్మతేజోమూర్తులైన ధర్మజ భీమార్జునులు ఆమెకు కొడుకులై జన్మించడం జరిగిందని సూక్ష్మ దృష్టిని ప్రసరింపజేసినప్పుడు తెలుస్తుంది. చెట్టుయొక్క సారం ఆచెట్టు యొక్క పండ్లలో వ్యక్తమైనట్లు దంపతుల దాంపత్యంలోని తిరుతెన్నులే వారి సంతానంలో గుణగణాలుగా మనకు వ్యక్తం అవుతాయి. ఈ దృష్టితో గాంధారీ కుంతుల సంతా నాలను మనం పరిశీలించినప్పుడు కుంతి అనుసరించిన దాంపత్య ధర్మం గాంధారి అనుసరించిన దాంపత్యధర్మంకన్నా ఎంత విశిష్టమైనదో మనకు బోధపడుతుంది. అయితే అదే కుంతికి పుట్టిన కర్ణుడు నీచుడెలా అయ్యాడని సందేహం రావచ్చు. కర్ణుడు కుంతి అంగీకారంతో పుట్టినవాడు కాడు. కనుకనే లోకాన్ని గూర్చిన అనంగీకారవిషయికమైన ఈర్ష్య అతడి జీవలక్షణం అయ్యింది. ఇక యుధిష్ఠిర భీమార్జునులు ఆమె అంగీకారాన పుట్టినవారు. ఈ అంగీ కారం కూడా భర్తయెడలగల సమర్పణబుద్ధితో గుబాళించిందేగానీ, కాముకం కాదు. కనుకనే మహానుభావులజన్మకు కారణమైంది.

భర్త చూడని లోకాన్ని తాను కూడా చూడజాలనని కళ్ళకు వస్త్రం కప్పుకున్న గాంధారి పతివ్రతాధర్మాన్నే అనుసరించిందా? భర్త తృప్తికోసం తనను తాను త్యాగం చేసుకున్న కుంతి అంతకు మించిన పతివ్రతాధర్మాన్ని అవలంబించింది. ఈగాథను సూక్ష్మంగా పరిశీలించినపుడు ఒక సత్యం దర్శనమిస్తుంది. భర్తకు కన్నులు లేవని తానుకూడా కన్నులు కప్పుకోవడం మేలా? తన కళ్ళతో భర్తకు కళ్ళు లేని లోటును తీర్చడం మేలా అని ఆలోచించినపుడు గాంధారి అనుసరించిన మార్గంయొక్క తీరుతెన్నులు మనకు బోధపడతాయి తన కళ్ళతో భర్తను నడిపించాలని ఆమెకు ఊహరాలేదు. పోనీ ధృతరాష్ట్రుడికైనా భార్యకళ్ళతో చూడాలన్న సంకల్పం కలగలేదు. ఎంత అంధమైనది వీరి దాంపత్యలోచనం! పాండురాజు అన్నగారిలా ప్రవర్తించలేదు. తనకు సంతతిపొందే యోగం ముని శాపంవల్ల పోయినప్పుడు కుంతిని ప్రార్థించి, ఆమె మూలాన సంతతిని పొంది కుటుంబ జీవితంలో తృప్తిని అనుభవించాడు. కుంతీపాండురాజుల దాంపత్యం వివేకానికి నిలయం.

గాంధారి పాతివ్రత్యం భౌతికకక్ష్యలో ప్రాధాన్యాన్ని వహించగా, కుంతీదేవి పాతివ్రత్యం మానసిక కక్ష్యకు సంబంధించినదై ఉన్నతమూ, ఉత్తమమూ కూడా అవుతోంది. నిజానికి పతివ్రతా ధర్మమనేది మానసికమేగాని కేవలం భౌతికం కాదని భారతం ధర్మాద్వైతస్థితిని ప్రతిపాదిస్తోంది.

కుంతికివలె నిర్బంధస్థితిలో పరపురుషస్పర్శ పొందవలసి వచ్చినప్పటికీ ఆ స్త్రీని అవమానించవద్దనీ, మానసికమైన పవిత్రతకే ప్రాధాన్యమిచ్చి ఆమె కన్యాత్వానికి భంగకలగలేదని గ్రహించాలనీ భారతం ఉపదేశిస్తోంది. ఈ తీరులో కుంతిని దర్శించినవాడు కనుకనే కుంతీదేవికి పాండురాజుతో జరిగిన వివాహాన్ని వర్ణిస్తూ భారతకర్త,

"యదుకుల విమలపయః పయోనిధి సుధా
కరరేఖఁ గమనీయ కాంతినిలయ
ననవరతాన్నదానాభి తర్పిత ముని
విప్రజనాశీః పవిత్రమూర్తి
వినయాభిమాన వివేక సౌజన్యాది
సదమల గుణరత్న జన్మభూమిఁ
బరమ పతివ్రతాభరణ శోభితఁ
దామరసేక్షణఁ దాల్మియందుఁ

బృథివింబోని దానిఁ బృథయను కన్యక
నధిక వీర్యుఁడై స్వయంవరమునఁ
బడసి పరనరేంద్ర పరిభావి యప్పాండు
వరుడు పేర్మితో వివాహమయ్యె"30

అని కుంతీదేవిని నోరారా కీర్తించాడు. కుంతీదేవిది కేవలం పాతివ్రత్యమే కాదు, పరమ పాతివ్రత్యమని వర్ణించడం పాతివ్రత్య సంప్రదాయంపై సూక్ష్మదృష్టిని ప్రసరింపజేసి ధర్మాద్వైతస్థితిని స్థాపించడం కొరకే. పరమపాతివ్రత్యమే ఆమె ఆభరణమట! ఆమె పతివ్రతల్లో ఉత్తమురాలట![31] కర్ణ జననాన్ని ముందుగా చెప్పి, వెనువెంటనే ఆమె నిలా కీర్తించాడు వ్యాసభగవానుడు. తానలా కీర్తించడంలోని ఔచిత్యాన్ని సహృదయంతో దర్శించి, సూక్ష్మమైన ధర్మమార్గాన్ని గమనించమంటున్నాడు.

## ద్రౌపది :

ద్రౌపది పతివ్రత అని మనలో ఎక్కువమంది హృదయం ఒప్పుకుంటూనే ఉంటుంది. కాని మనస్సుకు మాత్రం ద్రౌపది

30. ఆంధ్రమహాభారతం - ఆది - 5-84.

31. మూలంలో ఈసందర్భంలో కుంతి 'పతివ్రతోత్తమ' అని కీర్తించబడింది

పతివ్రత ఎలా అయ్యింది? పతివ్రత అనడానికి అవకాశాలు తక్కువ కదా అని అనిపిస్తూ ఉంటుంది. అలా అనిపించడానికి గల ముఖ్యకారణాల్లో ఒకటి ఆమె పంచభర్తృక కావడం. అయిదుగురి భార్య పతివ్రత అవుతుందా?-ఈ ప్రశ్న మనకాలంలోనేకాదు, ద్రౌపది జీవించినకాలంలోకూడా కొందరికి వచ్చింది. ఆ వచ్చినవారికి తగిన సమాధానమూ లభించింది. ఆ సమాధానమే అన్నికాలాలవారికీ సరి పోతుంది. ఆ సమాధానం ఏమిటో, దాని పూర్వాపరాలేమిటో కొంచెం చూద్దాం-

లాక్షాగృహంనుంచి తప్పించుకుని, ఏకచక్రపురం చేరిన పాండవులు బకాసురవధ పూర్తికాగానే ద్రౌపదీస్వయంవరం మాట విని ద్రుపదుడి రాజ్యానికి బయలుదేరారు. దారిలో వారికి వ్యాస భగవానుడు సాక్షాత్కరించి, ద్రౌపదియొక్క పూర్వవృత్తాంతాన్ని సంక్షిప్తంగా ఇలాచెప్పాడు-"ఒక మునికన్య కర్మవశాన భర్త లభించక పోవడంతో శివుణ్ణిగూర్చి తపస్సుచేసింది. శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. ఆ ర్తితో 'పతి, పతి' అని అయిదుమార్లు అన్న దామె. 'అయితే, మరుజన్మలో నీకు అయిదుగురు పతులు అవు తారు' అని శివుడు వరం ఇచ్చాడు. అలా జరగడమే పరమార్థం అనీ చెప్పాడు. ఆమె ఇప్పుడు కృష్ణగా ద్రుపదుడి యింట పెరుగుతోంది. ద్రుపదుడు ఆమెకు స్వయంవరం ప్రకటించాడు. మీకు శుభమవు తుంది. ద్రుపదునిపురం చేరుకోండి"32 వ్యాసుడి ఆశీస్సులు పొంది పాండవులు ప్రయాణాన్ని కొనసాగించారు.

స్వయంవరంలో బ్రాహ్మణవేషంలోఉన్న అర్జునుడు మత్స్యయంత్రాన్నికొట్టి ద్రౌపదిని దక్కించుకున్నాడు. భీమార్జునులు ద్రౌపదిని తోడ్కొనివచ్చి, తల్లితో "మేం ఒక భిక్ష తెచ్చాం"

32. ఆంధ్రమహాభారతం - ఆది - 7 - 35, 36,

అన్నారు. ఆమె ఎప్పటిలాగానే "నాయనా అయిదుగురూ సమంగా పంచుకోండి" అంది. కొడుకులు తెచ్చిన భిక్ష ద్రౌపది అని తర్వాత తెలుసుకుని కొంచెం అధర్మం చేశానేమోనన్న లజ్జతో పెద్దకొడుకును సమీపించి "నామాట ఎప్పుడూ అబద్ధం కావడమనేది ఎరగను. మీరూ నామాట ఎప్పుడూ జవదాటి ఎరగరు. నా నోటినుంచి ఇలాంటివాక్కు ఆజ్ఞారూపంలో వచ్చిందేమిటి?" అంది బాధపడుతూ. ధర్మరాజు తల్లిని ఓదార్చాడు. "సాధించింది నువ్వుకాబట్టి నీవే ఈమెను స్వీకరించు" అన్నాడు అర్జునుడితో. "పెద్దవాడివి నీవుండగా చిన్నవాడినైన నాకు వివాహం ఏమిటి? నీవే ఈమెను అగ్రమహిషిగా స్వీకరించు" అని అర్జునుడు ధర్మజుడితో అనేలోపున పాండవుల అయిదుగురి దృష్టులు ద్రౌపదిపైన అప్రయత్నంగా పడ్డం, అయిదుగురూ మన్మథబాణపీడితులవ్వడం జరిగింది. అన్నదమ్ముల స్థితిని గ్రహించిన ధర్మజుడికి వెంటనే "ఈమెకు అయిదుగురు పతులవుతారు. ఇది పరమార్థం" అంటూ వ్యాసభగవానుడు చేసిన వివరణ గుర్తుకు వచ్చింది. శివునివరం, గురుని ఆజ్ఞా, తల్లి వాక్కూ, ఒకే పరమార్థాన్ని సూచిస్తున్నాయని గ్రహించిన ధర్మరాజు తమ్ముళ్ళతో "ఈమెను మనం అయిదుగురం స్వీకరించడమే ధర్మం" అన్నాడు. అదేమాట వివాహం చేయడానికి సంకల్పించిన ద్రుపదమహారాజుకూ చెప్పాడు.

ధర్మజుడు ధర్మంతప్ప మరొకటి పలకడని తెలిసినప్పటికీ తనకుమార్తెకు అయిదుగురు భర్తలు అవుతారన్న లోకాచార విరుద్ధమైన వార్త వినేటప్పటికి ద్రుపదుడు కంగారుపడ్డాడు. ధర్మజుడి మాటలు కాదనడానికి తటపటాయించాడు. ఎలా అవుననడమా అని సందిగ్ధావస్థలో పడ్డాడు. ఆ సమయంలో వ్యాసభగవానుడు సాక్షాత్కరించి ద్రుపదుణ్ణి ఏకాంతానికి కొనిపోయి, ద్రౌపదీ పాండవుల పూర్వజన్మల వృత్తాంతాన్ని వివరంగా చెప్పి, పూర్వ జన్మల్లోని వాళ్ళరూపాలను కూడా చూపించాడు. ఆ దివ్యదర్శనంతో

ద్రుపదుడికి సత్యం బోధపడి, వివాహానికి అంగీకరించాడు. ద్రౌపదీ పాండవుల వివాహం అపూర్వ వైభవంతో జరిగింది. ఈ వివాహ గాథ విధివశాన జరిగిన ప్రత్యేక సన్నివేశంగా దర్శించలేనివారు కొందరు తమ సామాన్యబుద్ధితో ద్రౌపదీదాంపత్యంవంటి దాంపత్యం ఆ కాలంలో ఎక్కువగా ఉండేదనీ, ఇప్పటికీ కొన్నిజాతుల్లో ఉన్నదనీ నిరూపించడానికి ప్రయత్నించి, బోడుగుండుకీ బట్టలకీ ముడివేయబోయారు. భారతంలోని కథనుగూర్చి మనం చెప్పబోయే ముందు ఆ కథయొక్క పూర్వాపరాలనుగూర్చి భారతం ఏమి వివరిస్తోందో నిదానించి చూడవలసిన బాధ్యత మనమీద ఉంది. గ్రంథకర్తయైన వేదవ్యాసుడే ఈ వివాహం ఒక ప్రత్యేకమైన పరమార్థాన్ని ఉద్దేశించి రూపుదాల్చిందని వివరించడమేకాక, తాను పెళ్ళిపెద్దగా నిలబడి, ద్రుపదుడిచేత వివాహాన్ని జరిపించాడు. వ్యాసుడు దిగివచ్చి పరమార్థాన్ని దర్శింపచేయకపోతే ద్రుపదుడు సమాధానపడేవాడుకాదు. వ్యాసుడు తమకు మార్గమధ్యంలో దర్శనంఇచ్చి, ద్రౌపదిగాథ విప్పిచెప్పకపోతే, అయిదుగురూ ఆమెను చేసుకోవాలని ధర్మజుడు నిర్ణయించేవాడూ కాదు. పరమధర్మానికి ప్రతినిధిగా ఈ పరమార్థాన్ని భౌతికజగత్తులో ఆచరింపజేసినవాడు వేదవ్యాసుడు. ఈ వివాహ విషయంలో అతడే మనకు మూదల. ద్రౌపది వివాహంవంటి విచిత్రవివాహాలు అంతకుపూర్వం అరుదుగా చరిత్ర మడతల్లో ఉన్నాయని వ్యాసుడూ, ధర్మరాజూ ద్రుపదుడికి చెప్పారు. విమర్శకులు ఎత్తిచూపే లోకరీతి ప్రసక్తి కథలోలేదు. ఇదొక లోకోత్తర విశిష్ట సన్నివేశంగా ప్రత్యేకించి కీర్తింపబడింది. కనుక ద్రౌపదీవివాహంవంటి సంప్రదాయాలు ఏజాతుల్లో ఉన్నా ఆ జాతులకూ, ఆ సంప్రదాయాలకూ ద్రౌపది కథ చెందదు. కనుక ద్రౌపది కథనుబట్టి ఆనాటి సంప్రదాయం అదే అనడం ద్రౌపదికథకు సమాజపరమైన వక్రభాష్యం చెప్పడమే అవుతుంది.

ఈ పరమార్థాన్ని గ్రహించలేక ద్రౌపది పతివ్రతకాదనీ, అనేకభర్తృక పతివ్రత ఎలాఅవుతుంది అనీ చులకనచేసి తగిన పాఠాలు నేర్చుకున్నవారు కూడా భారతగాథలోనే మనకు కనబడతారు. ద్రౌపది పాతివ్రత్యమహిమ ఆవశ్యకమైనపుడల్లా వ్యక్తమై ఆమెను రక్షించుకుంటూనే వచ్చింది.

## వస్త్రాపహరణ సందర్భంలో :

ద్రౌపదిని సభలోకి ఈడ్చుకురావడం ధర్మంకాదన్న వికర్ణుడి పలుకులకు సమాధానం ఇస్తూ కర్ణుడు "ద్రౌపది ధర్మవిజిత. కాకుంటే పాండవులు ఎందుకు మౌనంవహిస్తారు? ఏకవస్త్రయైన ఈమెను సభలోకి తోడ్కొని రాకూడదన్నావు. స్త్రీకి ఒక్కడే పతికావడం ధర్మం. ఈమెకు అనేకమంది భర్తలు. కాబట్టి ఇది బంధకి. ఇలాంటి దాన్ని విగతవస్త్రనుచేసి తెచ్చినా తప్పులేదు"అన్నాడు.63.ఆమాటలు తలకెక్కిన దుర్యోధనుడు ద్రౌపదిని విగతవస్త్రను చేయవలసిందిగా దుశ్శాసనుణ్ణి ఆజ్ఞాపించాడు. వెంటనే ముందూవెనకా చూడకుండా దుశ్శాసనుడు ఉపక్రమించాడు. ఒలిచే వలువ ఒలుస్తూ ఉంటే ఆమె శరీరంపై మరోవలువ ఎప్పటికప్పుడు వెలుస్తూనే ఉంది. దుశ్శాసనుడు లాగి లాగి అలిసిపోయాడు. అతడు లాగిపడవేసిన వలువలు పరిమాణంలో పర్వతాలను తలపించాయి. ద్రౌపది ఒంటిపై మాత్రం ఎప్పటివలె చెక్కుచెదరని తీరులో చీరలు అమరుతూనే ఉన్నాయి. "ఈమె బంధకి, అనేక భర్తృక, ఈమెను విగతవస్త్రగా అయినా చేసి తేవచ్చు" అన్న కర్ణుడివాక్కు పరాస్తమయ్యింది. చివరకు ప్రయత్నించికూడా విగతవస్త్రను చెయ్యలేకపోయారు. కర్ణాదుల కళ్ళకు కనబడినట్లు ద్రౌపది బంధకి కాదనీ, వీరెవ్వరికీ అంతుబట్టని మహాపతివ్రత అని ఈ సన్నివేశం ఋజువుచేసింది.

---

63. "........భార్యకు దైవవిహితుండయిన భర్తయొక్కరుండ యిది యనేక భర్తృక గావున బంధకియనంబడు నిట్టిదాని విగతవస్త్రంజేసి తెచ్చిన ధర్మ విరోధంబులేదు........" – ఆంధ్రమహాభారతం- సభా - 2-2-8

వస్త్రాపహరణం తరువాత కొద్దిసేపట్లోనే కర్ణుడి కళ్ళకు మళ్ళీ పొరకమ్మింది. ద్రౌపదినిచూసి ఎగతాళిగా "తరుణీ! స్త్రీకి అయిదు గురు భర్తలు ఉండటంకన్న ఒకేభర్త ఉండటం ధర్మం. నిన్ను జూదంలో ఓడిపోనివాణ్ణిగా చూసుకొని నీకు తగిన భర్తను ఎంచుకో" అన్నాడు.34 ఆమాటలు చెవిసోకిన దుర్యోధనుడు వెంటనే తనను స్వీకరించి,తన అంకాన్ని అధిష్ఠించమని తొడచూపుతూ సైగచేశాడు. ఆ సన్నివేశానికి ఉగ్రుడైన భీముడు ఆ తొడల్ని రణరంగంలో విర గ్గొడతానని ప్రతిజ్ఞ చేశాడు. ఇంతలో ధృతరాష్ట్రుడి అగ్నిహోత్ర గృహంలో నక్కలు అరిచాయి. అగ్నుల వెలుగులుతగ్గి వెలవెల బోయాయి. కౌరవస్త్రీల హృదయాలు చెప్పలేని శోకంతో తపించి పోయాయి. ధార్తరాష్ట్రుల శయనమందిరాల్లో గుడ్లగూబలు, కాకులు అరవసాగాయి. ఈ మహోత్పాతాలను గమనించిన కృప విదుర ద్రోణ శాంతనవులు ధార్తరాష్ట్రులకు అరిష్టం పుట్టిందని దర్శించారు. గాంధారి ఆ మహోత్పాతాలనుగూర్చి విని విదురుణ్ణి తోడ్కొని ధృతరాష్ట్రుణ్ణిచేరి, ఈ ఘోరపరిస్థితిని తెలియచెప్పింది. ధృతరాష్ట్రుడు జరిగినతప్పు దిద్దుకోకపోతే ఏమైనా కాగలదని గ్రహిం చాడు. వెంటనే దుర్యోధనుణ్ణి పిలిచి,

"పరమ పతివ్రతన్ సభఁ దపస్విని పాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతి మానవ భామినిగా దలంచి దే
ప్పరములు వల్కఁగా దగునె బాల్యమునాదిగ దుష్టభావనం
బెరిగితి నీ నిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్"35

అని మందలించాడు. ద్రౌపదిని రావించి, ఆమె శీలాన్ని కీర్తించి, ఆమె కోరినప్రకారం భర్తలకు దాస్యవిముక్తిని కలిగించడమేకాక,

34. ఆం. మ. భా - సభా - 2-246

35. ఆం. మ. భా - సభా - 2-255

వాళ్ళరాజ్యాన్ని వాళ్ళకు అప్పగించాడు. అప్పటికిగాని ధృతరాష్ట్రుడి గుండె కుదుటబడలేదు. మళ్ళీ దుర్యోధనుడి కోరికపై అనుద్యూతానికి ధర్మరాజు ఆహ్వానింపబడ్డా, ఆ జూదంలో ద్రౌపదిని ప్రత్యేకంగా పరాభవించే సన్నివేశాలు తలపెట్టబడలేదు. అరణ్య అజ్ఞాతవాసాల నిర్ణయం మాత్రమే జరిగింది.

ద్రౌపదీపరాభవంనుంచి పుట్టిన దుష్ఫలితాలనుంచి తప్పించుకోవడానికి ధృతరాష్ట్రుడు యుక్తిగా ప్రయత్నించినా ఆ పరాభవమే కౌరవవంశనిర్మూలనానికి కారణమైంది. పరాభవించటానికి ప్రయత్నించిన దుర్యోధనాదులు వధార్హులయ్యారు. పరాభవించే ప్రయత్నాన్ని అడ్డుకోకుండా ఉపేక్షించడంతో, పెద్దలైనా, భీష్మద్రోణాదులు దోషులై, కురుక్షేత్రంలో కృష్ణుడిముందు నిలబడ్డారు. కురుక్షేత్ర మహాసంగ్రామంలో కర్ణాదులు ధర్మాధర్మాలను చర్చకు తెచ్చినప్పుడు కృష్ణుడు ద్రౌపదీవస్త్రాపహరణ సన్నివేశాన్నే వాళ్ళకు ప్రధానంగా గుర్తుచేశాడు. దానితో వాళ్ళందరూ నిరుత్తరులు అయ్యారు. "స్త్రీలు ఎక్కడ పూజింపబడతారో అక్కడ దేవతలు తమ సాన్నిధ్యాన్ని అనుగ్రహిస్తారనీ, ఎక్కడ స్త్రీలు అవమానింపబడతారో అక్కడ సర్వం నాశనం అయిపోతుందని"36మానవాళికి మనువు చేసిన హెచ్చరిక ద్రౌపదిని అవమానించిన దుర్యోధనాదులకు నూటికి నూరుపాళ్ళూ వర్తించింది.

## సైంధవుడు బలాత్కరించినప్పుడు :

ఇక, ద్రౌపది పాతివ్రత్యానికి గల మహిమను నిరూపించే రెండవసన్నివేశం అరణ్యవాసకాలంలో తటస్థపడింది. ద్రౌపదిని పర్ణశాలలో ఉంచి, పాండవులు తలొకవైపుకూ వేటకు వెళ్ళారు. సైంధ

36. "యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః ।
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఽఫలాః క్రియాః"

మనుస్మృతి - 3-56

వుడు వివాహం చేసుకోవడానికని పెళ్ళికొడుకై, ఆదారిని పోతూ పర్ణశాలదగ్గర ద్రౌపదిని చూసి, కూడనిమోహంలో పడ్డాడు. ఆమెను సమీపించి, మెల్లగా తనకోర్కెను బయటపెట్టాడు. ద్రౌపది అతణ్ణి మందలించింది.మంచిగా చెప్పింది. కానీ వాడు వినలేదు. నిష్ఠూరంగా మాట్లాడింది. పాండవుల శక్తియుక్తుల్ని గుర్తుచేసింది. తన అసహాయతను ఆసరాగా తీసుకోవద్దనీ, తన పాతివ్రత్యం తనను రక్షించగలదనీ చెబుతూ,

"ననుఁ బెఱవనితల చందం
బున నవమానింప నీకుఁ బోలఁదు మత్పా
వన పాతివ్రత్య మహిమ
ననిశము నేకీడు నందనీయదు నన్నున్"37

అని ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించింది.

సైంధవుడు ఆమెను బలాత్కారంగా రథంపై ఎక్కించుకుని కొనిపోసాగాడు. ఆమె ఆక్రోశించింది.

పాండవులు వేట చాలించి, అందరూ ఒకచోట చేరారు. అప్పుడు ధర్మరాజు తమ్ముళ్ళను ఉద్దేశించి, వేదనతో, "సూర్యుడున్న దిశనుంచి పక్షులు అరుస్తున్నాయి. మృగాలు ఘోరమైనగతుల్లో పరుగెడుతున్నాయి. ఎడమవైపుగా నక్క అరుస్తోంది. శత్రువులతో అవమానాన్నీ, కయ్యాన్నీ ఈ శకునాలు సూచిస్తున్నాయి. చిత్తంలో చేయిపెట్టి కలచినట్టవుతోంది. తనువు నిశ్చేష్టితం అవుతోంది. వేగమే రండి.ఆశ్రమంలో ద్రౌపదిని ఒంటరిగా వదలివచ్చాం. క్రూరమతులైన కౌరవులు అవకాశాన్ని అందుకుని ఏమైనా చేయగలరు. కమలాలులేని కమలాకరంలా, చంద్రుడులేని రాత్రిలా, కామ్యకవనమే శూన్యమై తోస్తోంది. ఏమి కీడు జరిగిందోకదా !"

37. ఆం. మ. భా - అరణ్య - 6-188

అన్నాడు. వాళ్ళు వేగంగా ఆశ్రమాన్ని చేరుకున్నారు. తాము అనుకొన్నట్లే ద్రౌపదికి కష్టం వచ్చిందని తెలుసుకొని, సైంధవుణ్ణి వెంబడించి, పట్టి బుద్ధిచెప్పి, ద్రౌపదిని భద్రంగా దక్కించుకున్నారు.

ద్రౌపదికి కష్టంరాగానే, ఆమె పాతివ్రత్యానికి ఆపద ఎదురు కాగానే, ప్రకృతి యావత్తూ సర్వవిధాలా ఆమెకష్టాన్ని ధర్మజుడికి బోధపరచింది. ఆమె పరమపతివ్రత కనుకనే ఆమెకు కష్టం వచ్చే టప్పటికే ధర్మజుని చిత్తంలో చేయిపెట్టి కలచినట్టయ్యింది. అతనికి సర్వమూ శూన్యమైతోచింది. ద్రౌపది సైంధవుడితో ప్రకటించి నట్లు ఆమె పాతివ్రత్యమహిమే పతులను ఆకర్షించి ఆమెను రక్షించింది.

**కీచకుడు వెంటాడిన వేళ :**

ద్రౌపది పాతివ్రత్యానికిగల మహిమను నిరూపించిన మూడో సన్నివేశం అజ్ఞాతవాస సమయంలో, విరాట నగరంలో జరిగింది.

కీచకుడు సైరంధ్రిగా ఉన్న ద్రౌపదినిచూచి మోహంలో పడ్డాడు. ద్రౌపది మరలించినా, సుధేష్ణ నచ్చచెప్పినా అతడు విని పించుకోలేదు. ఏవిధంగానైనా ద్రౌపదిని తన మందిరానికి పంపితీరా లని అక్కతో చెప్పి వెళ్ళాడు. సుధేష్ణ మదిర వంకపెట్టి కీచకుడి యింటికి ద్రౌపదిని వెళ్ళమని బలవంతం చేసింది. ద్రౌపది అంగీక రించక తప్పిందికాదు. ఆమె పాత్రనుపట్టుకొని,కృష్ణుణ్ణి హృదయంలో నిలిపి గడపదాటి పైకిచూసింది. ప్రత్యక్షదైవమైన సూర్యనారా యణుడు దర్శనమిచ్చాడు. ఆదైవానికి నమస్కరించి ఇలా అంది :

"పాండుపుత్రుల కేనుఁ దప్పని మనంబు
గలుగుదాననయేని యో కమలమిత్ర !
కీచకునిదెస నన్నొక కీడు తెరువు
పొరయకుండగ రక్షింపు కరుణతోడ"38.

38. ఆం. మ. భా - విరాట - 2-108.

సూర్యుడు కరుణార్ద్ర మనస్కుడయ్యాడు. ఒక వింత రక్కసుని సృష్టించి, ఆమెను రక్షించమని నియోగించాడు. ఆ రాక్షసుడు అదృశ్యాకారుడై ఆకాశమార్గాన ఆమెను అనుసరించాడు.

ద్రౌపది కీచకుని మందిరం చేరింది. సుధేష్ణకు మదిర కావా లన్నది. మోహావేశంలోఉన్న కీచకుడు తనకోర్కెను తీర్చమంటూ, ఆమెను చెయ్యిపట్టిలాగబోయాడు. అదృశ్యంగా ఉన్న రాక్షసుని శక్తి వెంటనే ఆమెను ఆవహించింది. ఆ బలంతో ఒక్కఉదుటున అతణ్ణి విదిలించి కొట్టింది. అతడు ఆమెను పట్టుకోవాలని వెంటపడ్డాడు. ఆమె పరుగెత్తసాగింది. పరుగెత్తి పరుగెత్తి చివరకు రాజసభలో ప్రవేశించింది. అందరిమధ్యలో ఆమెను పట్టుకొని పెనుగులాడసాగాడు కీచకుడు. అదృశ్యంగా ఉన్న రాక్షసుడు కీచకుణ్ణి నేలపై పడగొట్టాడు. కీచకుడు గతుక్కుమన్నాడు. ద్రౌపదిని వదిలిపెట్టాడు. ఆపైన విరా టుడు సాంత్వన వచనాలాడటంతో కీచకుడు అప్పటికి తప్పుకున్నాడు. నిజానికి కీచకుడు వెళ్ళిపోయింది విరాటుడి సాంత్వనవచనాలకు కాదు, రాక్షసుడు కొట్టిన దెబ్బకు.

ఆపైన కథ ముందుకు నడిచింది. భీముడి చేతుల్లో కీచకుడు హతుడయ్యాడు. ఆమెను అవమానించబోయిన ఉపకీచకులు కూడా భీముడిచేత పడి ప్రాణాలు విడిచారు. ఆమె పాతివ్రత్యానికి భంగం కలిగించేటందుకు ప్రయత్నించిన కీచకుడు తమ్ముళ్ళతో కలిసి పరలోక మార్గం పట్టాడు.

ఈవిధంగా ద్రౌపది పాతివ్రత్యమహిమ వెల్లడయిన సందర్భా లను వ్యాసుడు వివరంగా వర్ణించి, మనముందుంచాడు. "ఆమెకు అయిదుగురు భర్తలు కదా, ఇంకేమి పతివ్రత ?"అని తొందరపడటం కూడదనీ, అది పరమార్థమనీ వ్యాసుడి ఉదాహరణ పూర్వకమైన ఉపదేశం. ద్రౌపదివివాహం ఒకసామాన్యసంఘటనకాదు. శివుడిచే

నిర్ణయింపబడి, వ్యాసుడిచే నిర్వహింపబడి, నారదుడి సమక్షంలో నియమం ఏర్పరచబడ్డ పవిత్ర దాంపత్యం ఆమెది. ఈ దాంపత్యాన్ని కాదన్నవారూ, పరిహసించినవారూ, పరాభవించడానికి ప్రయత్నించినవారూ, ఆమె వ్రతాన్ని విస్మరించి ఆమెపొందు కోరినవారూ ఏవిధంగా శిక్షింపబడ్డారో భారతంలో ఆయా సన్నివేశాల్లో చక్కగా చూపబడింది.

'ధర్మో రక్షతి రక్షితః' అన్నది మనువువాక్కు. రక్షింపబడ్డ ధర్మం రక్షించగలదని దీనిభావం. ద్రౌపది రక్షించుకొన్న పతివ్రతా ధర్మం ఆమెను ఎంతటి జటిల సన్నివేశాలనుంచి రక్షించిందో భారతంలో మనకు బోధపడుతుంది. కేవలం దేహబలం, పదవి, అధికారం చూసుకొని ధర్మం తప్పినవారు దానవులు అవుతున్నారనీ, ధర్మబల దైవబలాలముందు ఆ దానవుల బలదర్పాలు నిలబడ లేవనీ భారతం నిరూపిస్తోంది. ద్రౌపదిపై బడి పరాభవించబోయిన దుశ్శాసనుడూ, సైంధవకీచకులూ సామాన్యులా? కాదు. కాని, ఆమె ధర్మాచరణమే ఆమెకు రక్షమై నిలబడింది. ఆ ధర్మమే అలౌకికమైన సహాయ సంపత్తులను ఆవశ్యకత ఏర్పడినప్పుడెల్లా ఆమెకు అను గ్రహిస్తూ, ఆదుకుంటూ వచ్చింది.

## ద్రౌపది - మానవీయావేశాలు :

"ద్రౌపది పాండవులను దుఃఖావేశంలో నిందించినట్లు, లేదా తూలనాడినట్లు కనబడుతున్న సన్నివేశాలు ఉన్నాయిగదా, భర్తల్ని తూలనాడిన స్త్రీ పతివ్రత ఎలా అవుతుంది?" అనే సందేహం కలగడానికే అవకాశం ఉన్నది. ఆమె దుఃఖావేశంలో తూలనాడిందే తప్ప సాధారణ పరిస్థితుల్లో కాదు. ఆ సన్నివేశాలుకూడా చరిత్రలో కనీవినీ ఎరుగనివేకాని సామాన్యమైనవికావు. ఏవ్యక్తి జీవితంలోనూ సామాన్యంగా ఎన్నడూ ఎదురుకాని కష్టసితుల్లో తాను చిక్కుకున్న ప్పుడు మాత్రమే ద్రౌపది మానవసహజమైన బాధనూ, దుఃఖాన్నీ,

ఆవేశాన్ని పొందటం,భర్తల్ని మర్యాదమీరి మాట్లాడటం జరిగింది. ఆ సన్నివేశాలను సహృదయంతో నిదానించి పరిశీలిస్తే ద్రౌపది యొక్క ఆవేశంతోపాటు ఆమెలోని ఔన్నత్యంకూడా మనకు దర్శనమిస్తుంది. తనకు కలిగిన తాత్కాలికమైన ఆవేశాలనుంచి తనను తానే కూడదీసుకుని సమయోచితంగా, సంస్కారయుతంగా ఆమె ఎలా ప్రవర్తించిందీ మనకు బోధపడుతుంది.

## 1. కౌరవసభలో :

తనను ధర్మరాజు జూదంలో ఓడిపోయాడనీ కనుక దుర్యోధనుడు సభలోనికి కొనిరమ్మని ఆజ్ఞాపించాడనీ ప్రాతికామి చెప్పినప్పుడు అనూహ్యమైన సన్నివేశం ఎదురైందన్న బాధతో ఆమె ఇలా అంది:

"ఏ యుగంబునందు నెట్టి దుష్కితవుండు
భార్యనొడ్డి యోటువడిన భర్త
గలఁడె యిది వినంగఁ గడు నపూర్వంబయ్యె
నిట్లు సేయునొక్కొ యిందుకులుఁడు ?"39

"ఏ యుగంలో ఎంత దుష్టుడైన జూదరియైనా భార్యను పణంగా పెట్టాడా ? ఇలాంటిపనిని ధర్మరాజు చేస్తాడా" అని అంతటి ఆ వేదనలో మునిగిఉన్నప్పుడు కూడా ఆమె సందేహించింది. "తన్నును నిన్ను జూదంలో ఓడా" నన్న ప్రాతికామి పలుకుల్ని గుర్తుచేసుకుని ద్రౌపది ప్రాతికామిని ఒక ప్రశ్న వేసింది.

"మున్ను దనోటువడి మఱి నన్ను నోటు
వడియెనో నన్ను మున్నోటువడి విభుండు
గ్రన్నఁదనోటు వడియెనో యన్న నాకు
నెఱుఁగఁజెప్పుము దీని నీ వెఱుఁగుదేని"

---

39. ఆం. మ. భా. - 2-208

"ఎఱుంగవేని నక్కలవు నడిగివచ్చి మఱి నన్నుం దోడ్కొని పోవనగునేనిఁ దోడ్కొని పొమ్ము"40

అన్నది. ఈమాటలు అంటున్నప్పుడు ద్రౌపది తనలో తాను ఎంతో మథనపడి ఉంటుంది. ఆమథన ఇలా సాగిఉంటుంది: "ధర్మజుడు తనకు తానుగా నన్ను ఒడ్డి ఉండడు. అతడలాంటి వాడు కాడు. శకుని మొదలైనవారు ప్రేరేపించిఉంటారు. తనను తాను ఓడిపోయిన తరువాత నన్ను ఒడ్డి ఓడే అవకాశంలేదు గదా! దుర్యోధనాదులు కుత్సితమైన ఆలోచవలు కడుపులో పెట్టుకొని ఇలాంటి దారుణసన్నివేశాన్ని సృష్టించి ఉంటారు. జరిగినదానికి ధర్మరాజు మౌనం వహించి ఉంటాడు. ఈ సమయంలో నేను కూడా కలుగజేసుకోకపోతే ఆదుష్టులు ఏమైనా చేయగలరు. కనుక జరిగింది ఏమిటో తేల్చాలి. ధర్మాధర్మాలు సభలో తేటతెల్లం కావాలి." ఇలా ఒకనిర్ణయానికి వచ్చి ద్రౌపది పైప్రశ్నను వేసిఉంటుంది. ఒకవేళ ఏమి జరిగిందో నీకు తెలియకపోతే ఆజూదరినే అడిగివచ్చి చెప్పమంది. ఇల్లాలికి ఇటువంటి బాధవచ్చేటట్లు చేశాడన్న ఉద్వేగంతో ఆమె ధర్మజుణ్ణి కొంచెం తూలనాడింది. ఒక రకంగా చూస్తే ఆమె ఉన్నమాటే అన్నది.

ఎట్టకేలకు ద్రౌపది సభలోనికి వెళ్ళకతప్పలేదు. సభలో ప్రవేశించి, నిలిచిన ద్రౌపదిని దుర్యోధనుడి ఆజ్ఞతో దుశ్శాసనుడు వెంబడించి, ఈడ్చుకుంటూ సభామధ్యంలోకి తెచ్చాడు. ఆమె అలాంటి అవమానాన్ని, ఆపదనూ ఎదుర్కొంటూకూడా దుర్యోధనాదుల దుష్టబుద్ధిని గ్రహించి, సభను ఉద్దేశించి,

"అనుపమదైవయోగహతుడయ్యు నవశ్యము ధర్మసంపదం
దనరున కాని ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁద్రొ
క్కునె కురువృద్ధులార ! భృశకోపనుఁడీతఁడు నన్ను నేలఁ దు
ర్జనుఁడిట యీడ్చి తెచ్చె నవిచారపరుండయి దుర్మదంబునన్"41

40. ఆం. మ. భా - 209, 210

41. ఆం. మ. భా - సభా - 2 - 218.

అన్నది. 'ధర్మజుడు దైవయోగంవల్ల కష్టాలకు లోను కావచ్చు. కానీ అతడు ధర్మం మాత్రం తప్పడు. కురువృద్ధులారా ! మీరైనా కలుగజేసుకొని ఈ దుర్బుద్ధులకు బుద్ధిచెప్పండి' అని ఆక్రోశించింది. ధర్మజుని తత్త్వాన్ని ఎంతగా బోధపరుచుకున్నదామె! అతని ప్రవర్తనపై ఆమెకు ఎంతటివిశ్వాసం ! అంతగా పరాభవింప బడుతున్న సమయంలో కూడా 'ధర్మజుడు ధర్మం తప్పడు. ఇది దుష్టులు పన్నిన వ్యూహం మాత్రమే' అని నొక్కిచెప్పింది. అవునని ఆమెవైపు నిలబడేటందుకు కౌరవసభలో వికర్ణుడు ఒక్కడు తప్ప మరెవ్వరూ ముందుకు రాలేకపోయారు.

ద్రౌపది పాతివ్రత్యం ఋజువయ్యింది. దుర్నిమిత్తాల విజృంభణకు భయపడి ధృతరాష్ట్రుడు ద్రౌపదిని రావించి, ఓదార్చి, స్తుతించి, వరం కోరుకోమన్నాడు. అప్పుడామె కోరిన వరం యిది-

"కరుణతోడ నాకు వరము ప్రసాదింప
బుద్ధియేని లోకపూజితుండు
మను నిభుండు ధర్మతనయుండు దాస్యంబు
వలనఁ బాయవలయు వసుమతీశ !"42

తన భర్త లోకపూజితుడు, మనువంతటివాడు. అటువంటి మహనీయుడు దాస్యంనుంచి విముక్తిపొందాలని కోరింది. మరొక వరం కోరమన్నాడు ధృతరాష్ట్రుడు. మిగిలిన నలుగురు భర్తలూ దాస్యంనుంచి విముక్తులు కావాలన్నది. ఇంకొకవరం కోరమన్నాడు అతడు. క్షత్రియసతి రెండువరాలను మించి కోరకూడదన్నది ద్రౌపది. రెండువరాలను మించి కోరితే ఆమె శూద్రస్త్రీ అవుతుంది. అంటే తాను దాసినని ఆమె తనకు తానుగా అంగీకరించినట్లు

42. ఆం. మ. భా - సభా - 2-259

అవుతుంది. ఆవిధంగా ఆమెను ఇరుకున పెడదామని చూశాడు ధృతరాష్ట్రుడు. ఆమె చాలా ధీర. పరిస్థితి గ్రహించింది. మూడో వరాన్ని కోరలేదు. ధృతరాష్ట్రుడికి దారకలేదు. ఆమె సంయమనానికీ, సమయస్ఫూర్తికీ లోలోపల హడలిపోయాడు ధృతరాష్ట్రుడు. తనకు తానుగా వాళ్ళ రాజ్యాన్ని వాళ్ళకు తిరిగి ఇచ్చేశాడు.

ఈ సందర్భంలో ద్రౌపది తన అసాధారణమైన ప్రజ్ఞతో దుర్యోధనాదుల పన్నాగాన్ని పసికట్టగలిగింది. అలాంటి దుష్టులకు అవమానించే అవకాశాన్ని ధర్మజుడు ఇచ్చాడని ఆమె బాధపడింది. ఆ అవకాశం యిచ్చింది అతడు ఆడిన జూదం కనుక అతణ్ణి 'జూదరి' అని ఆవేశంతో అంది. సభలోనికి వచ్చాక ఆమె ధర్మజుణ్ణి పల్లెత్తు మాట అనలేదు. దుర్యోధనాదుల దుష్టసంకల్పాన్ని బహిర్గతం చేయడానికి ప్రయత్నించింది. వస్త్రాపహరణ సన్నివేశంలో తన భర్తలు నిస్సహాయులై, చిత్తరువుల మాదిరిగా నిలిచిపోయినపుడు ఆమె ఆత్మవిశ్వాసంతో కృష్ణుణ్ణి స్మరించి, తనను తాను రక్షించుకొని, పాండవుల పరువుప్రతిష్ఠలను కాపాడటమే కాక, ఇనుమడింప జేసింది. సమయస్ఫూర్తివల్ల ధృతరాష్ట్రుడికి అందకపోవడంతో ఆమె తాను బయటపడటమే కాక పాండవుల్నికూడా బయట పడవేయ గలిగింది. ఈ సన్నివేశాన్ని సమ్యగ్దృష్టితో పరిశీలిస్తే, ద్రౌపదినుంచి ధర్మజునికి లభించింది బాధతోకూడిన మందలింపే తప్ప నిందకాదని తెలుస్తుంది. ఆమె మందలించి ఊరుకోలేదు. నిస్సహాయస్థితిలో నిలిచిన పాండవులను మళ్ళీ యథాస్థితిలో నిలిపేవరకూ ఆమె అనితర సాధ్యమైన ప్రజ్ఞను ప్రదర్శించి, కథను ఒక కొలిక్కి తెచ్చింది.

ప్రాతికామి సభలోనికి తోడ్కొనిపోవడానికి వచ్చినపుడు ద్రౌపది దుష్టుల వ్యూహంలో ధర్మజుడు చిక్కుపడ్డందుకు ఉద్వేగాన్ని అనుభవించింది. సభామధ్యానికి దుశ్శాసనుడు ఈడ్చి తెచ్చినపుడు

ధర్మజుని ఋజుప్రవర్తనను దుష్టులైన దుర్యోధనాదులు అవకాశంగా తీసుకొని అవమానాలపాలు చేస్తున్నారనీ, కలుగచేసుకుని రక్షించమనీ ఆమె భీష్మాదులను వేడింది. ఆపైన దైవం ఒక్కడే తనకు శరణ్యమని గ్రహించి తన ఆవేశాన్ని దైవంయెడల ఆరాధనగా క్షణమాత్రంలో మలచుకొంది. ఆమె ఆరాధనకు మెచ్చిన దైవం ఆమె ఆర్తనాదాన్నివిని తనకు తానుగా కలుగజేసుకొని ద్రౌపదిని పరాభవాల బారినుంచి ఆదుకున్నాడు. ఆతరువాత ధృతరాష్ట్రుని తోడి సంభాషణలో ఆమె చూపిన సమయజ్ఞత ఆమెను, ఆమె భర్తలను యథాస్థితికి కొనివచ్చింది. ఈ సన్నివేశంలో ఆమెనుంచి మానుషదైవప్రజ్ఞలు ఆవశ్యకతనుబట్టి అడుగడుగునా వ్యక్తమవుతూ సభలోని వారందరినీ ఆశ్చర్యచకితుల్ని చేశాయి.

[ఈ ఘట్టంలో ద్రౌపది, క్షత్రియస్త్రీ రెండువరాలకన్నా ఎక్కువ కోరకూడదనీ, కోరితే శూద్రస్త్రీ అవుతుందనీ ధృతరాష్ట్రుడితో అన్నది గదా, మరి, సావిత్రి యముణ్ణి రెండు వరాలకన్నా ఎక్కువ కోరింది. మరి, అప్పుడామె క్షత్రియధర్మాన్ని కోల్పోయినట్టు కాదా అన్న అనుమానం కలుగవచ్చు. ద్రౌపది చెప్పిన నీతి నరలోకానికి సంబంధించింది.నరుల్లో పెద్దలను కోరేటప్పుడు రెండువరాలకన్నా ఎక్కువ కోరడం దాస్యబుద్ధి. యముడు నరుడు కాడు అదీగాక, భర్తప్రాణాలకొరకు కోరడంలో క్షత్రియత్వమూ, శూద్రత్వమూ అనే నియమాన్ని లెక్కచేయడం మనిషి చస్తూ ఉంటే సంధ్యామంత్రం చదవటంలాంటిది. కాబట్టి అక్కడ ఈప్రసక్తిలేదు. భర్తను రక్షించుకోవడానికి యముడికి దాసియైనా సావిత్రికి గౌరవమే. యముడు ఉపనిషత్పురాణ వాఙ్మయాల్లో లోక గురువుల్లో ఒకడు. మరి ద్రౌపది విషయంలో ధృతరాష్ట్రుడు ఇంతటి పూజ్యస్థానం వహించడానికి సిద్ధంగా లేడుగదా! కనుక ద్రౌపది ధృతరాష్ట్రుడి దుష్టత్వానికి తగినట్టు చెప్పింది.]

## 2. విరటుని కొలువులో :

ద్రౌపది భర్తలను తూలనాడిన మరో సన్నివేశం అజ్ఞాతవాస మప్పుడు విరాటుని కొలువులో జరిగింది. కీచకుడిచేత తరుముకు రాబడిన ద్రౌపది, విరాటుని సాంత్వనవచనాలతో కీచకుడు సభను విడిచిపెట్టినా, తాను మాత్రం విడిచిపెట్టలేదు. తనను రక్షించలేక పోయాడని విరాటురాజును నిష్ఠూరంగా పలికి, సభలోనే నిలిచి పోయింది. సభలో ఆమెనుగూర్చి నలుగురూ నాలుగురకాలుగా అనుకోసాగారు. దాన్ని గమనించిన కంకభట్టు (ధర్మరాజు) తన 'ఎప్పటి ఎలుఁగేర్పడ' ద్రౌపదిని మందలించి నివాసానికి చేరుకో మన్నాడు. కానీ ఆమె కదల్లేదు. ఆమె ఇంకా ఏదో మాట్లాడ బోతున్నట్టు గమనించి ధర్మరాజు, ఆమెను గట్టిగా మందలిస్తే తప్ప కదలదని భావించి, 'కులస్త్రీలకు అవమానం కలిగించే తీరులో ఏమిటలా నాట్యకత్తెలా భంగిమలు చూపిస్తున్నావు ? నీవిక్కడ ఈవిధంగా ఉండటం తగునా ?' అన్నాడు. ఆ మాటలకు ద్రౌపది

"నాదు వల్లభుండు నటుఁడింత నిక్కంబు
పెద్దవారియట్ల పిన్నవారుఁ
గానఁ బతుల విధమకాక యేశైలూషిఁ
గాననంగరాదు కంకభట్ట !

"అట్లగుటంజేసి నాకు నాట్యంబును పరిచితంబు. మత్పతి శైలూషుండ కాఁడు. కితవుంఁడునుం గావున జూదరియాలికి గఱువ చందం బెక్కడియది"43 అని అక్కడినుంచి వెళ్ళిపోయింది.

ద్రౌపది ధర్మరాజును నిందించింది గదా, నిందించాలని నిందించిందా ? లేక, ఆవేశంతో అప్రయత్నంగా అనేసిందా ? నిజంగా ఈమెకు ధర్మజునిపైన ఇలాంటి తేలికైన అభిప్రాయం

43. ఆం. మ. భా - విరాట - 2-152, 153.

ఉందా? ఈ సత్యాసత్యాలు తరువాత జరిగిన కథలో తేటతెల్ల మవుతాయి.

ఆ రాత్రి ద్రౌపది తనను తానే కూడదీసుకుని కర్తవ్యాన్ని నిశ్చయించుకొని, రహస్యంగా భీముణ్ణి చేరింది. తనకు అంతటి అపాయస్థితి కలిగినప్పటికీ ధర్మజుడు ఉపేక్షించాడన్నది బాధతో. అప్పుడు భీముడు 'ధర్మజుడు ఆ సమయంలో వివేకం చూపకపోతే మనకారణంగా సమయభంగమై, కథ మళ్ళీ మొదటికి వచ్చేదిసుమా!' అన్నాడు. ద్రౌపది ఆమాట నిజమేనని అంగీకరిస్తూ, తానా స్థితిలో ఎవశత్వం చెందటంవల్ల ధర్మరాజును కూడనిమాటలు అనడం జరిగిందని ఇలా వివరించింది.

"కినుకకుఁ జాల కెంతయును గీడ్పడి నాపదుపాటు లెల్ల వ
మ్మ్మనఁ గలయంగ నిట్టులోక మూర్ఖునిచేఁ దుదిఁబోయి కోలుపో
యెనె యభిమాన మన్వగపు నే ద్రైటి డెందము కొందలంబుఁ బొం
దిన ధృతిమాలి యేఁ బలికితిం దగవెల్ల నెఱింగి యుండియున్.

"ఇట్టిదగాని సమస్త జనస్తవనీయుండగు పాండవాగ్రజు
నక్కంబ నిందించినదానంగాను" 44 అన్నది.

ద్రౌపది ధర్మజుణ్ణి కావాలని నిందించలేదు. నిందించకుండా ఉండలేకపోవడంవల్ల నిందించింది. కీచకునిచే బలాత్కరింపబడబోయి తనను తానే రక్షించుకోవలసిన దుఃస్థితిలో పడి, ఆమె సభలో ప్రవేశించినపుడు సభలో ఒక్కరుకూడా నోరు తెరిచి 'ఇది అధర్మం' అనలేదు. విరాటరాజు కూడా కీచకుడితో సాంత్వనాలు ఆడాడు తప్ప, తప్పుచేసినందుకు అతణ్ణి శిక్షించలేకపోయాడు. ఇటువంటి దుఃస్థితిలో నిలబడిన ద్రౌపదికి ఆనాటి వస్త్రాపహరణ సన్నివేశం, దానికి కారణమైన మాయాజూదం, మళ్ళీ జరిగిన రెండోజూదం,

44. ఆం. మ. భా - విరాట- 2.186, 187.

దానిఫలితమైన అరణ్యాజ్ఞాతవాసాలూ, విరాటుని కొలువులో ఊడిగం, నాడు కీచకుడివల్ల జరిగిన పరాభవం మొదలైన దారుణ సన్నివేశాలన్నీ కళ్ళల్లో ఒక్కసారి గిఱ్ఱున తిరిగాయి. అలా తిరగటంతో ఆమె వివశ అయ్యింది. అంతటి ఆవేదనకు లోనైన తనకు సానుభూతి లభించకపోగా ధర్మజుడినుంచి మందలింపు లభించ డంతో ఆమె మరింత ఆవేశాన్ని పొందింది. ఆ బాధావేశం దాల్చిన అక్రుశాకృతులే ఆమె నోటినుంచి వచ్చిన నిందావాక్యాలు. నిజానికి అటువంటి దీనస్థితిలో ఆమె నలా మందలించవలసివచ్చినందుకు ధర్మజుడి హృదయం ఎంతో క్షోభపడి ఉంటుంది. ఆ క్షోభవల్లనే అతడి నుదుట ముచ్చెమటలు పోశాయి. కాని శివుడు హాలాహలాన్ని మింగినట్టు ధర్మజుడు ఆ క్షోభనంతటినీ దిగమింగుకున్నాడు. ఆ సందర్భంలో ద్రౌపది తనపై ఆవేశపడినందుకు ధర్మరాజు జాలిపడి ఉంటాడుగాని బాధపడి ఉండడు. ఆమెను నిస్సహాయురాలిగా వదలి వేయవలసి వచ్చినందుకు అతడు అంతుబట్టని ఆవేదనను అనుభవించి ఉంటాడు.

ఇంతకూ, ఈసందర్భంలో ద్రౌపది పలికిన పలుకులను పరిశీలించినప్పుడు ఆమె వాక్కుల్లో ఉన్నది ఆవేశంగాని నిందకాదని బోధపడుతుంది. తనభర్త నటుడు, జూదగాడు అని అన్నది. నటుని భార్యను గనుక తాను త్రై తెక్కలాడటం సహజం అన్నది. జూద గాడి భార్యకు గౌరవం ఏమిటి అన్నది. ఈ చివరివాక్యం కొంత సాహసమే అయినా సత్యదూరం కాదు. 'నీవు జూదం ఆడటంవల్ల గదా ఇన్ని పాట్లు వచ్చాయి!' అని ఆస్థితిలో నిలబడ్డ ఆమె సూచించడం మహాపచారమేమీ కాదు. ఇంక, నటుని భార్యకు నాట్యం రావచ్చు నన్నమాట చమత్కార గర్భితమైన హాస్యోక్తి తప్ప నిందోక్తికాదు. ఇలా అనడంలో హేళన ఉందిగాని నింద ఏమాత్రం లేదు. అంతటి దీనావస్థలో కూడా హేళనగా తన బాధను

భర్తకు వ్యక్తంచేయగల గాంభీర్యం ఆమెది. కాని ఈమాత్రం ఆవేశపడినందుకే ఆమె తరువాత చాలా బాధపడింది. 'ధర్మజుడంతటివాణ్ణి ఇలా అన్నానేమిటి' అని చాలా నొచ్చుకుంది. భర్తల యెడల ఆక్షణాల్లో మెదలిన చులకనభావం పాతివ్రత్యమైన ఆమె మనస్సుకు చెప్పలేనంత వేదన కలిగించింది. ఆ చులకనభావం తన మనస్సులో మెదిలింది కొద్దిక్షణాలే అయినప్పటికీ, వెనకటి పవిత్ర స్థితి తన మనస్సుకు కలిగేటందుకై ఆమె తన భర్తల గుణగణాలను భీముని సమక్షంలో నోరారా కీర్తించుకుంది. తానున్న స్థితినుంచి నిజస్థితిలోనికి తననుతాను ఉద్ధరించుకోవడానికి చేసిన ప్రయత్నమే ఇది. ఈసన్నివేశంలో ద్రౌపది తానుపొందిన ఆవేశాన్నుంచి తననుతానే కూడదీసుకుని తనమనస్సును ఎప్పటిస్థితిలో నిలుపుకొని ఆపైన భీముణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణిచేసి, కథను ముందుకు నడిపింది.

## 3. కృష్ణుడి సమక్షంలో :

ద్రౌపది భర్తల్నిగూర్చి పరుషంగా మాట్లాడిన మూడో సన్నివేశం ఉద్యోగపర్వంలో వస్తుంది. ధర్మజుని కోర్కెపై కౌరవ సభకు రాయబారానికి బయల్దేరబోతున్న కృష్ణుడికి పాండవులు తమతమ అభిప్రాయాలను విన్నవిస్తారు. ఒక్క సహదేవుడు తప్ప మిగిలిన నలుగురూ ఏవిధంగానైనాసరే సంధిజరిగేటట్టు చూడమని చల్లబడిపోయి మాట్లాడుతారు. అప్పుడు ద్రౌపదికి చాలాబాధ కలిగింది. 'జరగబోయే బంధునాశానికి వెరచి సంధికావాలంటున్నారు తప్ప, జరిగిన పరాభవాల సంగతి వీళ్ళకు గుర్తులేదే! సమర్థులై ఉండీ, యుద్ధం స్వధర్మం అయ్యుండీ, అర్ధరాజ్యం కాదు, ఐదూళ్ళిచ్చినా చాలని బతిమాలమంటున్నారేమిటి ?' అని మానసికంగా అమితమైన ఉద్వేగాన్ని అనుభవించి, ఇక, భర్తలకు చెప్పి లాభంలేదని భర్తలు వింటుండగా తన ఆవేదనను కృష్ణుడికే విన్నవించుకొంది. కౌరవుల దుష్టస్వభావం మారేదికాదనీ, పాండవుల

మంచితనాన్ని చాలనితనంగా మాత్రమే వారు భావిస్తారనీ, అది పాండవులు గ్రహించడంలేదనీ చెప్పింది. ఇంకా కృష్ణుడితో ఇలా అంది : 'వరమునబుట్టి, పాండవుల పట్టమహిషినయి, నీచేత సుభద్ర కన్నా ఎక్కువగా చూడబడుతున్న నన్ను కౌరవులు ఎంతటి పరాభవాలకు గురిచేశారో నీకు తెలుసుగదా ! ఆసమయంలో నీవు రక్షించకపోతే నేను ఏమైపోయేదాన్ని ?' అని పాండవుల కళ్ళకు కట్టేటట్టుగా గతాన్ని గుర్తుచేసి, దుస్ససేనుడు పట్టి త్రెంచగా మిగిలిన ఈ శిరోజాలను రాయబారసమయంలో గుర్తుంచుకోమని చెప్పింది. ఆమాటలు చెప్పేటప్పుడు గతం కళ్ళముందు మెదలి ఉద్వేగంతో భర్తలనుగూర్చి కృష్ణుడితో ఇలా అంది :

"ఈ వెండ్రుకలువట్టి యీడ్చిన యా చేయి
దొలుతగాఁబోరిలో దుస్ససేను
తనువింతలింతలు దునియలై చెదరి రూ
పఱియున్నఁగని యుడుకాఱుగాక !
యలుపాలఁబొనుపడునట్టి చిచ్చై యిది
పెనుగదపట్టిన భీమసేను
బాహుబలంబును, బాటించి గాండీవ
మనునొక విల్లెప్పుడును వహించు

కట్టివిక్రమంబుఁ గాల్పనే ? యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁబడయమైతి మేనిఁ గృష్ణ !"[45]

ఈసందర్భంలో ద్రౌపది చూపిన పరుషత్వంలో నేర్పరితనం మిళితమై ఉంది. ఆమె ముందుగా గతాన్ని గుర్తుచేసి, ధర్మజుని

45. ఆం. మ. భా - ఉద్యోగ - 3-117.

సానుభూతిని సంపాదించుకొంది. అతని ముఖకవళికలు తనకు అనుకూలంగా మారాయని నిర్ధారించుకొని, ఆపైన భీమార్జునులను స్వధర్మంలో నిలబెట్టడానికి సిద్ధపడింది. వీరులైనవారు తమ సామర్థ్యాన్ని ఎత్తిపొడిస్తే తప్పక దారికిరాగలరని ఆమెకు తెలుసు. భీమార్జునులను చూపిస్తూ తనకూ ధర్మజుడికీ దుర్యోధన దుశ్శాసనుల్ని వధించి చూపనపుడు వారు తమసామర్థ్యానికి చిహ్నాలుగా ధరిస్తున్న గదాగాండీవాలు అనవసరం అన్నది. 'దుష్టుల్ని మర్దించలేని గాండీవి సామర్థ్యం ఎందుకు, కాల్పనా ?' అని అడిగింది. ద్రౌపది ఎత్తిపొడుపు సార్థకమయింది. భీమార్జునుల పౌరుషం మేల్కొని, కర్తవ్యోన్ముఖం కాసాగింది. భర్తలు దారికి వచ్చారని గ్రహించిన ద్రౌపది తన ఆత్మవిశ్వాసాన్ని ఇలా ప్రకటించింది -

"నెట్టన యిట్టి యల్క మదినిల్పితి, రక్కసతాల్మిఁ జెవ్పెడిం
గట్టినయట్లు పెద్దయును గాలము; దీనికి నాఁటెన్నడుం
బుట్టదు, దుష్టనిగ్రహముపూని జగంబులు కాఁచునట్టి తోఁ
బుట్టువు, తీవ్రతేజమునఁబొల్చిన భర్తలుఁగల్గ నచ్యుతా !" 46

దుష్టశిక్షణకోసం దిగివచ్చిన కృష్ణుడూ, తీవ్రతేజంతో విజృంభించగల భర్తలూ ఉండగా చిచ్చు ఒడిలో కట్టుకున్నట్టు ఇన్నాళ్ళుగా దహించివేస్తున్న పరాభవాగ్ని చల్లారదు, చల్లారవలసినపనిలేదు. ఈ అగ్ని కౌరవవంశాన్ని దహించితీరవలసిందే అన్నది ద్రౌపది నిర్ణయం. ఈనిర్ణయం ద్రౌపదిదే కాదు; విధే ఇలా నిర్ణయించాడన్నది ద్రౌపదిని ఓదారుస్తూ కృష్ణుడు చెప్పిన వాక్కుల సారం. ద్రౌపది గతాన్ని గుర్తుచేసి, ఎత్తిపొడుపు మాటలు అని కర్తవ్యం ఇది అని సూచించేటప్పటికే పాండవులు మేల్కొని, యుద్ధస్థితికి దాదాపుగా వచ్చారు. ఇక, కృష్ణుడు ద్రౌపది నిర్ణయమే వి

46. ఆం. మ. భా - ఉద్యోగ - 3-118.

నిర్ణయమని నిర్ధారిస్తూ, కౌరవులకు కాలంతీరిందని వివరంగా వర్ణించడంతో పాండవులు నిజస్థితిలో స్థిరబడ్డారు. ఇక ఆపైన పాండవులెవ్వరూ తమస్వధర్మానికి తగని పలుకులు పలుకలేదు. సంధి కుదరకపోతే యుద్ధానికి సిద్ధమేనని నిర్ద్వంద్వంగా ప్రకటించారు. ఈ సన్నివేశంలో పాండవులను నిజస్థితిలోనికి మేల్కొల్పడంలో ద్రౌపదీకృష్ణులిరువురూ సమానమైన పాత్రను పోషించారు. వీరిద్దరికీ నామసామ్యమేకాక, భావసామ్యం కూడా ఉన్నదని ఈఘట్టంలో బోధపడుతుంది. ద్రౌపది పలికిన పరుషవాక్కులలో అనౌచిత్యం లేదనీ, అవి ఆ సందర్భానికి ఆవశ్యకమనీ తన ఓదార్పు మాటలతో ఆమోదముద్రవేయడమే కాక, ఆమెభావనే తనభావనని కృష్ణుడు ఈ సన్నివేశంలో వ్యక్తపరిచాడు. వీరిరువురికీగల ఈభావ సామ్యం ఈ ఒక్క ఘట్టానికి మాత్రమే పరిమితమైంది కాదనీ, వారి జీవితాంతం వ్యక్తమౌతూనేఉందనీ, భారతగాథను సంయమనంతో దర్శించినపుడు బోధపడుతుంది.

కృష్ణుడికి ధర్మసంస్థాపనానికి పాండవులు ఉపకరణాలైతే, ఆ ఉపకరణాలను ఎప్పటికప్పుడు కృష్ణుని ఆజ్ఞకు సిద్ధంగా ఉండేటట్టు చూసిన ప్రతినిధులు ఇద్దరున్నారు. వారు ఒకరు కుంతి, మరొకరు ద్రౌపది. వీరిద్దరినీ చూడవలసిన పద్ధతిలో చూడగలిగినపుడు ఆ సారథి, సచివుడు, సఖుడు అయిన శ్రీకృష్ణుడే ఇటు తల్లిగా, అటు భార్యగా పాండవులను కనిపెట్టుకొని ఉన్నాడా అనిపిస్తుంది. ఈవిధమైన దర్శనం పొందినవాడు కాబట్టే తన జీవితంలో కార్యనిర్వహణలో ధర్మరాజు శ్రీకృష్ణ వేదవ్యాసులకు ఎంతటిస్థానం ఇచ్చాడో కుంతీద్రౌపదులకూ అంతటిస్థానం ఇచ్చిఉంటాడన్న భావన కలుగుతుంది. ధర్మజుని కార్యనిర్వహణకు ఈముగ్గురే మార్గదర్శకులు. వ్యాసభారతంలో ధర్మరాజు కుంతీద్రౌపదులను ఎప్పుడు సంబోధించినా గౌరవసూచకాలైన వాక్యాలనే వాడాడు. నన్నయ

అనువదించిన భాగంలో కుంతినిగూర్చి ధర్మజుడు ఎప్పుడు సంబోధించినా 'మీరు' అనే అంటాడు. భారతం మొత్తంమీద పాండవుల్లో ఏఒక్కరూ ఏఒక్క సందర్భంలోకూడా ద్రౌపదిమెడల న్యూనభావాన్ని ప్రదర్శించకపోవడం గమనార్హం. ఆమె మెడల వారి కున్నది అనురాగంతో కూడిన పూజ్యభావం.

లోకరీతుల్లో దాంపత్యం రెండువిధాలుగా కనిపిస్తుంది. భార్యాభర్తలు ఒకరిని ఒకరు గౌరవవాక్యాలతో వ్యవహరిస్తూ, హృదయాలకు దూరంగా ఒదిగి కాలక్షేపంచేసేపద్ధతి ఒకటి; భార్యాభర్తలు చనవుతో వ్యవహరిస్తూ, కావలసిన తావుల్లో ఒకరిని ఒకరు గట్టిగా హెచ్చరించుకుంటూ కుటుంబశ్రేయస్సు దెబ్బతినకుండా కాపాడుకునే పద్ధతి రెండవది. మొదటి పద్ధతి అల్పబుద్ధులైన లౌకిక జీవులకు, రెండవ పద్ధతి ఉదారులైన చైతన్యమయజీవులకు సహజంగా అబ్బుతాయి మొదటిది తాజ్ మహల్ శిల్పసంపదలాంటిది. రెండవది దంపతులు పెంచుకున్న పుష్పఫలభరితోద్యానంలాంటిది. మొదటిది నిర్జీవం, రెండవది సజీవం. ద్రౌపది దాంపత్యం ఈ రెండవతెగకు చెందినదిగా స్పష్టమవుతుంది. ఆ దాంపత్యంలో మందలింపులు ఉండటం గుణమేకాని, దోషంకాదు.

### కుంతిదృష్టిలో ద్రౌపది :

పాండవులను ధర్మమార్గంలో నడిపించడంలో వ్యాసకృష్ణులెలా కలిసి పనిచేశారో, పాండవులను కంటికిరెప్పలా కాచుకోవడంలో, స్వధర్మాన్నుంచి చెదరకుండా కాపాడుకోవడంలో, కుంతీ ద్రౌపదులు అలా పనిచేశారు. పాండురాజు పోయినతరువాత కుంతి పాండవులకోసమే ప్రాణాలతో నిలబడింది. పిల్లి పిల్లల్ని ఏడేడు గొందులూ త్రిప్పి రక్షించుకున్నట్టు, కౌరవులు పెట్టిన కష్టాలనుంచీ, గృహదహనాల నుంచీ, పిల్లల్ని కాపాడుకొంటూ వచ్చింది కుంతి

కుంతికి బిడ్డలపై ఉన్నది మమకారం కాదు, ప్రేమ. మమకారం ఉంటే బకాసురుణ్ణి చంపడానికి భీముణ్ణి పంపిఉండేదికాదు. తన బిడ్డల సామర్థ్యం ఎంతటిదో ఆమెకు తెలుసు. ఆ సామర్థ్యాన్ని లోకహితార్థమై సద్వినియోగపరచడమూ తెలుసు. కాబట్టే కర్తవ్య నిర్వహణలో తొలినుంచి తుదివరకూ పాండవులకు గురుస్థానంలో నిలిచిందామె. ధర్మరాజుకు కుంతి వ్యక్తిత్వం ఒక త్రివేణీసంగమం. ఆమెలో అతడు తల్లితోపాటు అటు తండ్రినీ, ఇటు దైవాన్ని కూడా దర్శించాడు. అలాంటి కుంతి, పాండవులకు ద్రౌపదితో వివాహమైన తరువాత తనబిడ్డల్ని ఆ కోడలిచేతిలో పెట్టింది. కోడలిపై అంతటి విశ్వాసం ఉన్నది కనుకనే అరణ్యవాసానికి పాండవులు బయల్దేరే టప్పుడు కుంతి వారిని అనుసరించకుండా ఉండగలిగింది. తనకు మారుగా తనబిడ్డల్ని చూసుకొనే కోడలు ఉన్నదని ఆమెకు ధైర్యం. సహదేవుడు తనకు చిన్నవాడు కనుక జాగ్రత్తగా కనిపెట్టుకొని చూసుకోమని ద్రౌపదికి చెప్పి, అప్పగించింది. మిగతావారి విషయం నోటితో చెప్పలేదు. అంతేతేడా. తనకోడలికి వేరే చెప్ప నక్కరలేదని ఆమెకు తెలుసు.

శ్రీకృష్ణుడు రాయబారానికి వచ్చినప్పుడు కుంతిని దర్శిస్తాడు. అప్పుడతనితో పాండవులకు సందేశం పంపుతూ, వీరోచితంగా ప్రవర్తించమని ఆదేశిస్తూ, ఇలా అంటున్నది :

"భుజబలమున జీవించుట
నిజధర్మము మెత్తఁబడుట నింద్యము; మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము; ద్రుపదా
త్మజఁ గార్యంబడుగు మనము తగనందరతోన్"47

ఏమిచేయాలో ద్రౌపదిని అడగాలట ! ఆమె చెప్పినట్టు చేయాలట ! ఈమాటలు అంటున్నది ఎవరోకాదు, సాక్షాత్తూ ఆమె

47. ఆం. మ. భా - ఉద్యోగ - 3-200.

అత్తగారు ! ఇంతకన్న ఆ అత్తాకోడళ్ళ అన్యోన్యతకు నిదర్శనం ఏముంటుంది ! ఇంతకుమించిన ఆత్మీయతమాత్రం ఇంకెక్కడుంటుంది ! ద్రౌపది ఆవేశపడినా, ఆరాటపడినా, పరుషంగా మాట్లాడినా, తనభర్తల మేలుకొరకే, తనభర్తలపై పరిపూర్ణమైన ప్రేమతోనే అన్న సత్యాన్ని ఆమె అత్తగారే దర్శించింది. ద్రౌపదికి అది చాలు. అత్తగారి మెచ్చుకోలుకన్నా కోడలు కోరేదేముంది ! అటు అత్తగారూ, ఇటు భర్తలూ, పైనుండి శ్రీకృష్ణుడూ ద్రౌపదిని చూసినట్లు చూడగలగడం భారతాన్ని చదివే పాఠకుల బాధ్యత.

## కృష్ణుడి ప్రకారం ద్రౌపది :

కృష్ణుడి ప్రకారం ద్రౌపదినడవడి తోడిగృహిణుల ప్రవర్తనకు ఒరవడిపెట్టగల ప్రభావంగలది. స్త్రీమూర్తి జీవితాన్ని ఎలా నడపాలో, భర్తయెడల ఎలాంటి బాధ్యతతో ప్రవర్తించాలో ఆమెను చూసే నేర్చుకోవాలి. ఈ సత్యాన్ని సత్యభామవిషయంలో అమలుపెట్టాడు శ్రీకృష్ణుడు. పాండవులు ద్రౌపదితో అరణ్యవాసం చేస్తున్నప్పుడు చూడడానికివస్తూ, సత్యభామను తీసుకువస్తాడు. కొద్దిరోజులపాటు పాండవులతో గడుపుతాడు. సత్యభామ, ద్రౌపదీ పాండవుల అన్యోన్యతనుచూసి విస్తుపోతుంది. ఒకనాడు ఏకాంతంలో ద్రౌపదితో సల్లాపం జరుపుతూ, 'నీభర్తలు నీయెడల అంతులేని అనురాగాన్నిచూపిస్తూ, నీకు వశవర్తులై నడుచుకొంటున్నారు. దీనికి కారణం మందులా ? మంత్రాలా ? వ్రతాలా ? లేక, నీవుచూపే సరసమైన శృంగారచేష్టలా ? ఏవిధంగా అయిదుగురు పతులను ఒక్కతీరుగా ఆకట్టుకోగలిగావు ? నేను ఒక్కభర్తనే అదుపులో పెట్టుకోలేక సతమతమయిపోతున్నాను. ఆరహస్యం ఏదో నాకు ఉపదేశించు. నేనుకూడా నాభర్తను వశవర్తిని చేసుకోగలుగుతాను' అని వేడుకొంది. సత్యభామకు కలిగిన నీచమైనభావనలకు ద్రౌపదిమనస్సు చివుక్కుమంది, కొంచెం కోపంకూడా వచ్చింది. ఆకోపాన్ని చికు

నవ్వుతో అణుస్తూ, 'భర్తలు అన్యోన్యతచూపేది నీవూహించిన నీచమైన పద్ధతులవల్ల కాదు. ఆపద్ధతులు అన్నివిధాలా ప్రమాదకరాలు. ఈవిధంగా ఆలోచించే నీవు శ్రీకృష్ణుడికి భార్యగా ఉండటానికి తగవుసుమా!' అని మందలించింది. పాండవులు తనతో అంత అనురాగంగా వర్తించడానికి కారణం తన ప్రవర్తనమేనని చెప్పింది. ఆ ప్రవర్తనే తనకు ఇంతటి సౌభాగ్యాన్ని ఇచ్చింది అన్నది.

ఆ ప్రవర్తన సంక్షిప్తంగా ఇది : తనభర్తల మనస్సులు అన్యస్త్రీలపై లగ్నమైనపుడు ఆమె కోపం తెచ్చుకోదు. పరాకులేకుండా ఏకాగ్రమైన చిత్తంతో భర్తలను అన్నివేళలా తగినతీరులో సేవిస్తుంది. చూపుల్లో, వాక్కుల్లో, కోరికలు కోరడంలో, స్నేహం చేయడంలో ఎప్పుడూ వింతగా ప్రవర్తించదు. స్నానం, భోజనం, శయనం మొదలైనవి భర్తలకన్నా ముందుగా ఎప్పుడూ ఆచరించదు. పతులు వచ్చినపుడు ఆసనపాద్యాది విధులతో తానే సేవిస్తుందిగాని పరిచారికలను నియోగించదు. భర్తలకు స్నాన భోజనాది సదుపాయాలన్నీ తానే స్వయంగా సమకూరుస్తూ ఉంటుంది. ధనధాన్యాలను ఏమాత్రం వృథాపోనివ్వదు. ఇల్లూ, ఇంటిలోని పాత్రలూ శుభ్రంగా ఉంచడంలో ఏమరుపాటుపడదు. బంధువర్గాన్ని సంతోషపెట్టడంలో అశ్రద్ధచేయదు.

పతులు ప్రవాసంలో ఉన్నప్పుడు పూలూ, గంధం, నగలూ మొదలైన అలంకారాలు ధరించదు. వారిపైన లగ్నమైన మనస్సుతో వారిరాకకై ఎదురుచూస్తూఉంటుంది. అత్తగారైన కుంతీదేవి మనస్సెరిగి, గృహకార్యాలు నిర్వర్తిస్తూ ఉంటుంది. పెద్దల్ని, బ్రాహ్మణుల్ని, అతిథుల్ని అత్యుత్తమమైన రీతిలో పూజిస్తూ ఉంటుంది. ఏకార్యాన్ని నిర్వహించేటప్పుడైనా ప్రేమతో ఓర్పుగా మెత్తని మంచిమనస్సుతో ప్రవర్తిస్తూఉంటుంది. తనతో మృదువుగా ఉంటున్నారుగదాఅని పతులయెడల మర్యాదమీరి

ప్రవర్తించదు. పద్ధతితప్పితే వాళ్ళెంతటి క్రౌర్యాన్ని చూపగలరో ఆమెకు తెలుసు.

భూదేవివంటి తన అత్తకు ద్రౌపది స్వయంగా స్నానభోజనాలు సమకూరుస్తుంది. ధర్మరాజుతో సమానం కీర్తిని నిత్యం ఎనిమిదివేల మంది బ్రాహ్మణులూ, పదివేలమంది యతులూ భోజనానికి కూర్చుంటారు. తన పరిచారికల సహాయంతో వాళ్ళందరకూ ఏలోటూ రాకుండా తానే చూసుకొంటుంది. వస్త్రభూషణాదులతో వాళ్ళని సత్కరిస్తుంది.

ధర్మజుని నగరిలో నూరువేలమంది పరిచారకులు ఉన్నారు. అభ్యాగతులకు భోజనాలు సమకూర్చేవారూ అందరూ ఉన్నారు. వాళ్ళందరూ తమతమ బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించేటట్టు ద్రౌపది చూస్తూఉంటుంది. సైన్యానికి సంబంధించిన మదగజాలు ఒకనూరువేలూ, ఉత్తమాశ్వాలు మరోనూరువేలూ ఉన్నాయి. వాటన్నిటికీ సరైన ఆహారం అందించి పోషించేటందుకు తగినవాళ్ళను చూసి తానే నియమిస్తుంది. భాండాగారంలో నిండుగాఉన్న మణికనకాదుల్లోగాని, నిత్యమూజరిగే ఆయవ్యయాల్లోగాని ఆమెకు తెలియనివి ఉండవు. గోపాలజనులు మొదలుగాగల సకలభృత్యజనులజీవితాలను, వారి మంచిచెడ్డలను ఆమె స్వయంగా చూసుకొంటుంది. పాండవులు తమ కుటుంబభారాన్ని అంతటినీ ద్రౌపదికే అప్పగించి, నిశ్చింతగా ఉంటూఉంటారు. ఆమె అన్నివిషయాలనూ అప్రమత్తతతో చూసుకొంటూఉంటుంది. తెల్లవారుజామున ఏకొద్దిసేపో నిద్రించడంతప్ప ఆహారనిద్రలకు ఆమెకు కాలమే మిగలదు.

ఈవిధమైన అనురాగపూరితమైన బాధ్యతాయుత ప్రవర్తనమే తనను పతులహృదయాల్లో అంతటిస్థానాన్ని సంపాదించిపెట్టిందిగాని, మందులూ, మాకులూ కావని తృప్తితో చెప్పింది ద్రౌపది. సిగ్గుతో తలవంచుకొంది సత్యభామ.

## ద్రౌపది చూపుతున్న వెలుగుదారి :

ద్రౌపది పతులకు చేసేసేవ ఏకకాలంలో మూడుస్థితుల్లో (Planes) వ్యక్తమయింది.

1. పతులను వ్యక్తిగతంగా సన్నిహితంగా సేవించి, సంతోషపెట్టి, తాను వారితో కలిసి, సంతృప్తిని అనుభవించడం.

2. కుటుంబపరంగా అత్తగారినీ, బంధువర్గాన్నీ, అతిధి అభ్యాగతులనూ నిండుగా సేవించడం, కుటుంబపరమైన అంశాల్నిగూర్చి భర్తలు పట్టించుకోవలసిన ఆవశ్యకత లేకుండా చూడటం.

3. పతుల స్వధర్మనిర్వహణమైన రాజ్యపరిపాలనలో చేదోడు వాదోడుగా ఉండటం - ప్రజల శ్రేయస్సును పతులు చూస్తూండగా, ధనాగారాన్నీ, ఆయవ్యయాల్నీ, సైన్యసంపత్తినీ, భృత్యజనాన్నీ తాను జాగరూకతతో పర్యవేక్షిస్తూ ఉండటం.

భార్య భర్తకు ఒదిగిఉండటం ముఖ్యమే. కుటుంబనిర్వహణకు అది ఒక్కటే చాలదు. వ్యక్తిగత కుటుంబ స్వధర్మనిర్వహణాది విషయాల్లో భర్తపై తనకుగల అనురాగాన్ని అండదండలుగా రూపొందించి నిలవగలగడం గృహిణికి పరిపూర్ణతను చేకూర్చగలదని స్త్రీమూర్తులకు ద్రౌపది చూపుతున్న వెలుగుదారి.

దాంపత్యానికి ప్రధానమైనది అన్యోన్యానురాగం. ఆ అనురాగం స్త్రీమూర్తిలో ఆరాధనగా పరిణమించి, భక్తిగా పర్యవసించడమే పాతివ్రత్యం. భార్య అంటే భర్తచేత భరింపబడేది అని అర్థం కావచ్చు. కాని భర్తకొరకు బాధ్యతపడగలిగినప్పుడే స్త్రీమూర్తికి పరిపూర్ణత్వం సిద్ధిస్తుంది. అవసరమైనప్పుడు భర్తను మందలించడానికి స్త్రీ మొగమోటమి చెందకూడదు, జీవితభాగస్వామి అయిన తానే మొగమోటపడితే భర్త ఏమయిపోతాడు ? దాంపత్యనిర్వహణలో

లోకరీతిని పాటించడం అవసరమే. అది మంచిది కూడా. పెద్దలు ఏర్పాటుచేసిన సదాచారమేగదా లోకరీతి! కాని, కుటుంబ శ్రేయస్సుకొరకు, భర్తబాగుకొరకు ఒక్కొక్కప్పుడు గృహిణి లోకరీతిని, లోకుల అవగాహనను మించి ప్రవర్తించవలసిరావచ్చు. అప్పుడు గృహిణి ఏమాత్రం వెనుకాడకూడదు. కర్తవ్యాన్ని నిర్వహించడానికి జంకకూడదు. కుటుంబపరిస్థితులను ఉపేక్షించ కూడదు. నలుగురూ ఏమనుకుంటారోనని జంకితే అది స్వార్థమే అవుతుందిగాని పాతివ్రత్యం కాదు. భర్తబాగుకన్నా తనకు లోక రీతిని అనుసరించి లోకాపవాదానికి గురికాకుండా ఉండటమే ముఖ్యం అనుకున్న గృహిణిది స్వార్థంకాక మరేమిటి!

నియమాలు స్త్రీ శీలానికి మెరుగుపెట్టేవి కావాలిగాని స్త్రీని నిర్బంధించేవి కాకూడదు. భార్యకు భర్త యెడల అవిధేయత లేకుండా ఉండటం ఎంత ముఖ్యమో, ఉపేక్షాభావం లేకుండా ఉండటం అంతకన్నా ముఖ్యం. భర్తయెడల అణకువకలిగిఉండటం ఎంతముఖ్యమో భర్తతో ఆత్మీయతను అనుభవించడం అంతకంటె ముఖ్యం.

బిడ్డపై తల్లి హృదయంలో ఉన్న ప్రేమ ఆవశ్యకతనుబట్టి అనేకరూపాలు ధరిస్తూ ఉంటుంది. ఆ ప్రేమే అన్నంపెడుతుంది. జోకొడుతుంది. 'ముస్తాబు' చేస్తుంది. కావలసినవన్నీ సమకూరుస్తుంది. అయినా, కానిపనులు చేస్తే మందలిస్తుంది. చివాట్లు పెడుతుంది. కన్నెఱ్ఱ చేస్తుంది. తగినశిక్ష విధిస్తుంది. అలాగే, అనురాగంతో నిండిన భార్యప్రేమ కూడా ఆవశ్యకతను బట్టి అనేకరూపాలు దాలుస్తూ భర్తను సేవిస్తుంది. ఆ రూపాలలో ఏఒక్కటీ ఆమె స్వభావం మొత్తాన్ని పట్టిచూపలేవు. ఆ రూపాలన్నిటినీ ఒకచోట చేర్చి ఒక్కటిగా చూడగలిగినప్పుడు మాత్రమే ఆ గృహిణియొక్క అంత

రంగం బోధపడటానికి అవకాశం ఉంది అప్పుడుకూడా సహృదయంతో చూసినవారికి మాత్రమే ఆస్వభావం అంతువడుతుంది - అన్న సందేశం ద్రౌపదిగాథ సహృదయంతో పూర్తిగా అవగాహన చేసుకున్నప్పుడు మనకు అందుతుంది.

ధర్మగ్లాని ఏర్పడినప్పుడు అవతారమూర్తి దిగివస్తాడు. అప్పుడు ఆఅవతారమూర్తి ధర్మస్థితినుంచి దిగజారుతున్న జీవులకు ధర్మాన్ని ఉపదేశించి, వారిలో ధర్మసంస్థాపనం చేస్తాడు. అప్పటి ప్రజలు ఆ అవతారమూర్తి వెలుగులో ధర్మస్వరూపాన్ని దర్శించడానికి సిద్ధపడాలిగానీ, ధర్మం అంటే తమకున్న అభిప్రాయాల ప్రకారం ఆ అవతారపురుషుడు నడుచుకోవడంలేదని మనస్సుల్లో గింజుకుపోకూడదు. అలాగే దివ్యత్వంతో ఒక పరిపూర్ణమైన గృహిణి దిగివచ్చినప్పుడు ఆమెను చూసి గృహిణీధర్మాన్ని విశాలభావంతో రూపొందించుకోవాలిగానీ, తామాచరిస్తున్న ధర్మాలను యథాతథంగా ఆదివ్యమూర్తి ఆచరించడంలేదని కోప్పడకూడదు. సముద్రం మనం తీసుకువెళ్ళిన పాత్రలో పట్టకపోవడం సముద్రం తప్పుకాదు. అలాగే మానవులు ఎరిగిన నియమాల్లో, ఏర్పరచుకున్న పద్ధతుల్లో ఇమడలేకపోవడం ద్రౌపదిలాంటి కారణజన్మ ఎత్తినవారికి దోషం కానేరదు.

కృష్ణుడు వేదవాఙ్మయశాఖలను సమన్వయించి, మానవునికి పరిపూర్ణమైన యోగమార్గాన్ని ప్రసాదించినట్లు, అదేపేరుతో కృష్ణగా పిలవబడిన ద్రౌపది అనితరసాధ్యమైన, అపూర్వమైన ఆదర్శప్రాయమైన కుటుంబజీవితాన్ని నిర్వహించి, పరిపూర్ణమైన గృహిణీధర్మస్వరూపాన్ని మానవులకు దర్శింపజేసింది. ఆమె తాను నడచిన మార్గానికి ముగ్గుర్ని మూలలగా పెట్టుకుంది. వారే కుంతి, కృష్ణుడు, ధర్మరాజు. కనుకనే ఆమెమార్గం పరిపూర్ణగృహిణీధర్మానికి మూలలగా వ్యాసభగవానునిచేత స్వీకరించబడింది. అన్నికాలాల

వారికీ, అర్థంచేసుకున్నవారికి చేసుకున్నంతగా అక్కరకు వచ్చే లాగున ద్రౌపది గాథకు అక్షరరూపం ఇచ్చాడు వ్యాసమహర్షి. అప్పటినుంచి ఇప్పటివరకూ అందుకున్నవారికి అందుకున్నంతగా ద్రౌపదిజీవితంలోని వెలుగు అందుతూనే ఉంది.

## ప్రధాన ఉపాఖ్యాన నాయికలు :

మహాభారతంలోని ఉపాఖ్యాన నాయికలైన శకుంతల, దమయంతి, సావిత్రి మొదలైనవారుకూడా దాంపత్యధర్మంలోని లోతుపాతులను చూపినవారే. వారిగాథలను సహృదయంతో అధ్యయనం చేసినప్పుడు ద్రౌపదిజీవితంలో దర్శనమిస్తున్న పరిపూర్ణ గృహిణీధర్మం చదువరిహృదయంలో మరింత స్థిరపడుతుంది. ద్రౌపదిని కేంద్రంగాచేసి,శకుంతలాది ఉపాఖ్యాననాయికలను పరిధిగా అమర్చి, పరిపూర్ణ స్త్రీస్వరూపాన్ని పఠితలకు సాక్షాత్కరింపజేస్తాడు వ్యాసభగవానుడు.

### శకుంతల :

భర్తకు భార్య మాఱుపలుకవచ్చునా? పలుకకూడదని సామాన్యమైనసమాధానం. మరి భర్త ధర్మమార్గాన్ని తప్పినప్పుడు, తన అస్తిత్వానికే ఎసరుపెడుతున్నప్పుడు,భార్యగా స్త్రీ ఏంచేయాలి? దీనికి వ్యాసుడు ఇచ్చిన సమాధానమే శకుంతలోపాఖ్యానం.

తానెవ్వరో తెలిసికూడా తెలియనట్టునటిస్తూ, సభలో తనను అవమానకరంగా మాట్లాడినభర్తను శకుంతల ఉపేక్షించలేదు. ముందు పూర్వకథను గుర్తుచేసి, మంచిగా నచ్చచెప్పడానికి ప్రయత్నించింది. అతడు దారికిరాలేదు. అప్పుడు, ధర్మమార్గాన ప్రజల్ని నడపవలసిన రాజే ధర్మాన్ని తప్పుతున్నప్పుడు, వేదోక్తమైన మార్గంలో ధర్మమార్గాన్ని ఉపదేశించింది శకుంతల.

శకుంతలచేసిన ఈఉపదేశాన్ని అధ్యయనం చేసినవారికి కణ్వునిసన్నిధిలో ఆమె వేదమార్గాన్ని ఎంతగా ఒంటబట్టించుకొందో బోధపడుతుంది. ఆమె నిర్వచించిన గృహిణీస్వరూపం ఎంత దర్శనాత్మకంగా ఉందో చూడండి -

"ధర్మార్థ కామ సాధన కుపకరణంబు
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్ర శిక్ష కాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూఁత
గౌరవంబున కేక కారణం బున్నత
స్థిరగుణమణులకు నాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లుగావు ప్రియము

లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టితీఱకుఁలను ముట్టఁబడిన
వంతలెల్లఁబాయు నింతులఁ బ్రజలను
నొనరఁజూడగనిన జనులకెందు"48

గృహిణీస్వరూపాన్ని దర్శింపజేసినట్టే, సంతతి రూపుకట్టుకొనే విధానాన్ని శకుంతల వేదమయంగా వివరించింది. భర్త భార్యలోనికి రేతోరూపుడై ప్రవేశించి, రూపుకట్టుకుని, భూమిపైకి దిగివస్తాడనీ, కనుక వేదాలు 'అఙ్గాదఙ్గాత్సమ్భవసి' మొదలైన వచనాల్లో తండ్రీ కొడుకులకు అభేదాన్ని చెబుతున్నాయనీ చెబుతూ, ఇంకా ఇలా వివరిస్తోంది :

"విను గార్హపత్యమను న
య్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బన వెలుఁగునట్లు వెలుఁగును
జనకుఁడు దాఁబుత్త్రుఁడై నిజద్యుతితోడన్"49

48. ఆం. మ. భా - ఆది - చతుర్థ - 84
49. ఆం. మ. భా - ఆది - చతుర్థ - 86

యజ్ఞనిర్వహణంలో గార్హపత్యమనే అగ్ని విహారింపబడి (జ్వలింపజేయబడి) ఆహవనీయమనే అగ్నిగా రూపుదాల్చినట్టు, తండ్రియే కొడుకుగా రూపుకట్టుకొంటాడని వివరిస్తూ పుత్త్రుని చూసిన తండ్రికి ఎలాంటి ఆనందం కలుగుతుందో ఇలా చెబుతోంది :

"తాన తననీడ నీళ్ళల
లో నేర్పడఁ జూచునట్లు లోక స్తుత త
త్సూను జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశయప్రీతిమెయిన్".50

ఈవిధంగా సాగిన శకుంతల ఉపదేశం వేదవాఙ్మయంలోని గృహస్థధర్మానికి ఒక దార్శనికమైన మహాభాష్యంగా కనిపిస్తుంది.

పిల్లి కళ్ళుమూసుకొని పాలు త్రాగినట్టు, మనిషికూడా ఎవ్వరూ చూడకుండా తాను తప్పులు చేయగలుగుతున్నానని సంబరపడుతూ ఉంటాడు. కాని పిల్లిలాగానే పట్టుబడతాడు. మనుష్యుని ప్రవర్తన అనుక్షణం ఎవరెవరిచేత ఎలా గమనింపబడుతూ ఉంటుందో దుష్యంతుణ్ణి ఉద్దేశించి ఇలా చెప్పింది శకుంతల :

"విమలయశోనిధీ! పురుషవృత్తమెఱుంగుచునుండుఁ జూవె వే
దములును బంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివి యుండఁగా నరుఁడు దక్కొ_న నేర్చునె తన్ను
ప్రచ్ఛిలిన్"51

ఒక కార్యాలయంలో పనిచేస్తున్న ఉద్యోగికి తాను కుర్చీలో కూర్చుని నిద్రపోతున్నట్టు తనకు తెలియకపోవచ్చు. తనను ఇతరులు గమనిస్తారన్న స్పృహకూడా అంతకుముందే నిద్రలో కరిగిపోయి

50. ఆం. మ. భా - ఆది - చతుర్థ - 87
51. ఆం. మ. భా - ఆది. చతుర్థ - 78.

ఉండవచ్చు. కానీ సహోద్యోగులు, పై అధికారులు అతని గాఢనిద్రను గమనించి, ఘాటుగా మందలించకపోవచ్చు. అలాగే, పంచభూతా లతో, వివిధ దేవతాగణాలతో రూపొందుతూ, వర్ధిల్లుతున్న ఈ సృష్టి అనే కార్యాలయంలో మానవుడిది ఒకపాత్ర. ఉద్యోగికి జీతమిచ్చినట్లు మానవుడికి ఆవశ్యకమైన శరీరం, సామర్థ్యం, తెలివితేటలు, శక్తి యుక్తులు మొదలైన వాటినన్నిటినీ ప్రకృతే ప్రసాదిస్తోంది. తనలోనే, తనవల్లే, జీవిస్తూ తనకొరకే పనిచేసేటట్టు మనిషికి ఏర్పాట్లు చేసి పెట్టింది ప్రకృతి. అలాంటి ప్రకృతిని-తనలోనూ,తనచుట్టూ వర్తిస్తున్న ఆ దివ్యచైతన్యాన్ని-మానవుడు మోసగించగలడా? ఆ దేవతా శక్తు లకు తెలియకుండా ప్రవర్తించగలడా? ప్రవర్తించగలగడం సాధ్యం కాదు. మానవుని ప్రజ్ఞ సూర్యునిఅంశ,మనస్సు చంద్రునిఅంశ. శరీరం లోని వేడిమి అగ్నిఅంశ. ఈ విధంగా సృష్టిలో పనిచేస్తున్న దేవతా శక్తులన్నిటి అంశలతో రూపుకట్టుకున్న వాడు మానవుడు. వారి సాయం లేనిదే ఆలోచించలేడు సరిగదా, అడుగుకూడా కదపలేడు. వారివల్ల రూపొంది, వారితో ప్రవర్తించే మానవుడు వారిని ఎలా మోసం చేయగలడు? చేయలేడు. శకుంతలయొక్క ఈ దర్శనాత్మకమైన విశ్వాసమే దివ్యవాణిని పలికించింది. దుష్యంతుడిచేత తప్పును ఒప్పించింది.

స్త్రీలు వేదం చదవకూడదనీ, వేదంచదివే అర్హత వారికి లేదనీ, స్వరయుక్తమైన వేదమంత్రాలను ఉచ్చరించడానికి వారు తగరనీ, గాయత్రీ మొదలైన మంత్రోపదేశాలకు వారికి అర్హత లేదనీ, రుద్రాభిషేకాలు మొదలైన అర్చనలకు స్త్రీలు పనికిరారనీ ఈ కలియుగంలో ఆచారాలపేరిట మనం వింటూ ఉంటాం. తెలియనివారు ఈ ఆచారాలనే సనాతన సంప్రదాయంగా పొరబడి, సనాతన సంప్రదాయం స్త్రీకి అన్యాయం చేసిందని బాధతో ఉప న్యాసాలు ఇస్తూఉంటారు. ఇవేవీ సనాతన సంప్రదాయాలు కావనీ,

స్త్రీలను దేవతలుగా సంభావించడమే సనాతన సంప్రదాయమనీ, స్త్రీలు వేదవిద్యలో నిష్ణాతలై, చక్రవర్తుల కళ్ళుసైతం తెరిపించారనీ శకుంతలోపాఖ్యానం వంటి గాథల్లో మనకు స్పష్టమవుతుంది.

వేదసూక్తాలను దర్శించినవారిలో స్త్రీమూర్తులున్నారు. భాగవతంలో నారాయణుడే కపిలుడై దిగివచ్చి తనతల్లియైన దేవహూతికి బ్రహ్మవిద్యను ఉపదేశిస్తాడు. రామాయణ భారత భాగవతాది పవిత్రగ్రంథాలను కేవలం పారాయణ గ్రంథాలుగా కాక, మనప్రవర్తనను మలుచుకొనేటందుకు వెలుగుచూపే కరదీపికలుగా గ్రహించగలిగినపుడు మానవాళికి మంచికాలం మళ్ళీ ప్రారంభమవుతుంది.

## ద మ యం తి :

దమయంతిని మనకు పరిచయం చేసింది బృహదశ్వుడు. ధర్మరాజుకు ద్రౌపదిని గూర్చి సరిగా అర్థంచేసుకొనే ధర్మసూత్రాలు ఉపదేశించడంకోసం బృహదశ్వుడు దమయంతిపాత్రను పరిచయం చేశాడనిపిస్తుంది. అంటే, ధర్మజునిద్వారా మనకు పరిచయం చేశాడన్నమాట. ఈ చేసిన పరిచయాన్నిబట్టి అరణ్యపర్వంలో చెప్పబడింది దమయంతికథేగాని, నలోపాఖ్యానం కాదు. వాల్మీకి రామాయణాన్ని రెండువిధాలుగా పూరించాడు.అందులో రామాయణమూ ఉన్నది; 'సీతాయాశ్చరితం మహత్' - అంటే, ఘనతవహించిన సీత చరిత్రా ఉన్నది. నలోపాఖ్యానం అలా కాదు - ఈ కథకు దమయంతే కేంద్రం.

'మాలాగా కష్టాలు పడ్డవాళ్ళు గతచరిత్రలో ఎవ్వరైనా ఉన్నారా?' అని బృహదశ్వుణ్ణి ప్రశ్నించాడు ధర్మరాజు. దానికి సమాధానంగా బృహదశ్వుడు నలదమయంతుల కథ చెప్పడం ప్రారంభించాడు. అన్నిధర్మాలూ తెలిసికూడా వివేకాన్నికోల్పోయి,

జూదం ఆడి, ఇంటిల్లపాదికీ కష్టాలు కొని తెచ్చుకొన్నాడు నలుడు. కష్టాల్లో భార్యను పుట్టింటికి పంపించాలని ప్రయత్నించాడు. ఆమె భర్తసేవను మాత్రమే కోరుకున్న మహానుభావురాలు. అతడితో అరణ్యాల్లో ఉండిపోవడానికే నిశ్చయించుకొంది. కలి ప్రభావప్రేరితుడైన నలుడు కట్టువస్త్రాన్ని కూడా కోల్పోయి, భార్యవస్త్రాన్ని పంచుకుని, కట్టుకున్నాడు. భార్య నిద్రిస్తూ ఉండగా, పంచుకొన్న వస్త్రాన్ని చించుకొని పారిపోయాడు. దానితో ఆమె పుట్టింటికి వెళ్ళి సుఖపడగలదని ఆశించాడు. కలిప్రేరితమైన తన దుర్బుద్ధి సద్బుద్ధి అనుకున్నాడు. ఆమె చేసేదిలేక నలుణ్ణి వెదుకుతూ నానాబాధలూ పడ్డది. ఒంటిపాటున, కిరాతుడు మానభంగం చేయబోతే, తన తేజస్సుతోనే తన్ను రక్షించుకొంది. చివరకు, పుట్టిల్లు చేరింది దమయంతి.నలుడు కోరిన అజ్ఞాతవాసం అయాచితంగా కర్కోటకుడు ప్రసాదించిన వికృతాకారంతోపాటు సిద్ధించింది. ఇక, దమయంతికి గానీ, ఆమెచుట్టాలకుగానీ కనిపించకుండా తలదాచుకుని, జీవిత శేషాన్ని ఋతుపర్ణుడి దగ్గర గడప నిశ్చయించుకొన్నాడు నలుడు.

అప్పుడు దమయంతి పట్టుపట్టి, తండ్రి పురోహితులచేత అన్ని రాజాస్థానాలూ వెదికించింది. నలుడెక్కడైనా ఉంటే బయట పడాలని వారికీ వాక్యాలు ఘోషించమని చెప్పి పంపింది. 'సత్యా నిత్యుడవు, సతినిట్లు వంచించి, వాని వస్త్రార్థంబు దళికెగి నీకుఁ బరిధానముగఁజేసి పాడియేపోవంగ ? భార్య భర్తవ్యనాఁబరఁగు. ధర్మమది మిథ్యయయ్యె నీయందు.'52 ఈపలుకులకు సమాధానం చెప్పినవాడు నలుడు కావచ్చునని నిర్ణయించింది. ఋతుపర్ణుడి ఆస్థానంలో గుఱ్ఱాలను సేవిస్తున్న వికృతాకారుడొకడు సమాధానం చెప్పాడు. 'మగవాడిలో దోషముంటే తెలిసినా సహించేది భార్య. వచ్చే జన్మలో అయినా మళ్ళీ తన భర్తను కలుసుకుంటుంది.' 53

52, ఆం. మ. భా - అరణ్య - 2 - 15?.

53, ఆం. మ. భా - అరణ్య - 2-160

ఈమాటలు విన్నప్పుడు అతడు నలుడై ఉంటాడని దమయంతి ఊహించింది. కాని, ఆ వికృతాకారంలో ఉన్నవాడు నలుడని ఆమె తల్లిదండ్రులు కూడా అంగీకరించరు. ఇక, అతడు బయటపడితేనే తప్ప నీ ఋజువు చేసుకొనే మార్గంలేదు. అతడు బయటపడదలుచుకోలేదు. దానికి పరిహారం ఊహించి, దుష్కరమైన పద్ధతిని అవలంబించ గలిగిన ధీరురాలు దమయంతి. వెంటనే, తాను స్వయంవరంద్వారా రెండో పెళ్ళి చేసుకోబోతోందని ఒక్క ఋతుపర్ణుడి ఆస్థానంలో మాత్రమే చాటించింది. ఆరోజుల్లో రాజులు స్వయంవరానికి ఆహ్వానం వస్తే నిరాకరించేవారుకారు. కాని ఋతుపర్ణుడు రావడానికి కూడా సమయం చాలకుండా, ఆమరునాడే ముహూర్తమని చాటించింది. రథం తోలడంలో నలుడు చూపగల నేర్పరితనం ఇంకెవ్వరికీ లేదని ఆమెకి తెలుసు. 'కనుక ఆ వికృతాకారుడు నలుడే అయితే, ఋతుపర్ణుణ్ణి రథం తోలుకుని తప్పకుండా వస్తాడు. ఋతుపర్ణుడు ఊరుకోడు కదా!' అన్నది ఆమె భావం.

అనుకున్నట్టు రథం సకాలంలో కుండినలో ప్రవేశిస్తోంది. ఆ సమయానికి మిద్దెమీద తన పెంపుడునెమళ్ళమధ్య నిలబడి చూస్తోంది దమయంతి. నలుడు పూర్వం రథం తోలే శబ్దానికి అలవాటుపడి ఆనెమళ్ళు నాట్యంచేసేవి. ఇప్పుడుకూడా అలాగే జరిగింది. కనుక ఆ రథం తోలేవాడు నలుడు కావచ్చు. అటుపైన బండి తోలేవాడు విశ్రమిస్తూ ఉండగా దమయంతి తన పిల్లల్ని చెలికత్తెకు అప్పచెప్పి అతనిదగ్గరకు పంపింది అతడు వాళ్ళని చూసి దుఃఖపడటం చెలికత్తె గమనించింది. ఇంకా ఆ బండివాడు వంట చేయడం గమనించమని చెలికత్తెతో చెప్పింది దమయంతి. వంట ప్రయత్నంలో అతను నీళ్ళూ నిప్పూ అప్రయత్నంగా సృష్టించడం గమనించి, ఆ చెలికత్తె దమయంతికి తెలిపింది. ఆ మహిమలు నలుడికి

మాత్రమే ఉన్నాయని దమయంతి ఎరుగును. అంతేకాదు, నలుడు పూర్వం సరదాకు వంట చేసేవాడు అ పదార్థాలరుచులు ఆమెకు తెలుసు. ప్రస్తుతం అతడు వండుతున్న పదార్థాలు రహస్యంగా చెలి కత్తె చేత తెప్పించుకుని రుచి చూసింది. నలుడని ధృవపరుచుకొంది.

తండ్రికి ఈ విషయం వివరించింది. 'ఘనంబుగ వ్రాడిట వచ్చు వాడో ప్రయేనందుల కేఁగుదాననో రయంబున నాతని నిశ్చయింప గన్' 54 అని తండ్రిని నిక్కచ్చిగా అడిగింది. పిలిపించినపుడు నలుడే అంతఃపురానికి వస్తే పద్ధతి ఘనంగా ఉంటుంది. అది సాధ్యం కాకపోతే తరుణం మించిపోకుండా 'రయంబుగ' ఆమెయే అచ్చట కేగవలెనట ! ఎలాగైనా అతడు నలుడని తాను పరీక్షించి నిశ్చయం చేయాలట. ఏమి ఆత్మవిశ్వాసం ! ఏమా వెనుదీయని సాహసం ! ఏమా నిశ్చయబుద్ధి ! ఏమా ఋజుమార్గ ప్రవర్తన ! ఇది పతిభక్తి కాకపోతే లోకంలో ఇంకేదీ పతిభక్తి అనిపించుకోదు.

నలుడు, చేసినతప్పుకు అతిప్రయత్నంమీద ఆమె ఎదుట నిలబడవలసివచ్చింది. 'విజనమైన విపినంలో అలసిపోయి నిద్ర పోయిన ఆడదాన్ని, పతివ్రతను, తానుతప్ప లోకం ఎరుగనిదాన్ని, అగ్నిసాక్షిగా వివాహమాడినదాన్ని వదలిపెట్టి వెళ్ళడంలో నలుడి లాగా నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించినవాడు లేడు. దేవతలను కాదని తనను చేపట్టాను. నేను చేసిన అపచారం ఏమిటి ? అతడు హృదయం లేనివాడు కావడం ఒక్కటేగదా !' 55 అని ప్రశ్నించింది. నలుడికి సమాధానంలేదు. 'కలిమాయతో నా బుద్ధిపోయింది. అప్పుడలా క్రూరంగా ప్రవర్తించాను' అని ఒప్పుకున్నాడు. ఇంకా ఇలా అన్నాడు-'నేను నీవుతప్ప ఇంకొకస్త్రీని ఎరుగనివాణ్ణి. అలాంటప్పుడు నీవు ఇంకకొర్ని స్వయంవరంలో ఎంచుకొంటానని నిర్ణయించడం

54. ఆం. మ. భా- అరణ్య - 2 - 203

55. ఆం. మ. భా - అరణ్య - 2-207, 208

ధర్మంకాదు.'56 దానికి దమయంతి 'నిన్ను ప్రకాశితుణ్ణి చేసి, దక్కించుకోవడానికే ఇంత ప్రయత్నం' అని నమస్కరించింది.

ఈ కథను చెప్పడంలో బృహదశ్వుడు దమయంతివలెనే ద్రౌపదికూడా అనన్యసామాన్యమైన ప్రభావంకలదనీ, ఆమె ఆత్మవిశ్వాసం, కార్యనిర్వహణ సామర్థ్యం మెచ్చుకోతగినవనీ సూచించాడు. ఆమె నిజస్థితిని దర్శించి, పతులు ప్రవర్తించవలసి ఉంటుందని కథాగతంగా హెచ్చరించాడు.

ద్రౌపదీదమయంతులు కార్యనిర్వహణలో చూపిన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఋషుల మన్ననలనే అందుకున్నాయి. వారు తరతరాల మానవులకు ఉపదేశించవలసినవిగా ఈ స్త్రీమూర్తుల గాథలను స్వీకరించారు.

### సావిత్రి :

కలిప్రేరితుడై, ధర్మభ్రష్టుడైన భర్తను మళ్ళీ ఉద్ధరించి, దమయంతి దక్కించుకుంటే, మృత్యుగ్రస్తుడైన భర్తను అనుసరించి, యమధర్మరాజునే మెప్పించి, దక్కించుకొన్నది సావిత్రి. ఇంకొక సంవత్సరంలో చనిపోతాడని తెలిసికూడా, తాను హృదయం అర్పించిన పురుషుణ్ణి మనస్సులో మార్చుకోనట్టి పతివ్రత సావిత్రి. భర్త చనిపోతే వైధవ్యం సంభవిస్తుంది అన్న సందేహం ఆమెకు లేదు. ఎందుకంటే, భర్తపోయి తానుండడమంటూ ఉండదుగనుక. అందుకనే భర్తతోపాటు నడుచుకుంటూ వెళ్ళిపోయింది. పతిపై ఆమెకు గల ఆరాధనచూసి నివ్వెరపోయాడు యముడు. చిట్టచివరకు ఆమె భర్తను ఆమెకు తిరిగి ఇచ్చివేశాడు.

సావిత్రికథనుంచి మానవలోకానికి బోధపడేది ఏమంటే, హృదయం అర్పించినవాడే భర్త. ప్రేమకూ దాంపత్యానికీ అభేదసిద్ధి

56. ఆం. మ. భా - అరణ్య - 210, 211.

ఉంది. అలాంటి దంపతులిద్దరికీ జీవితానికీ, మృత్యువుకీ తేడా లేదు. ఉండటం అంటే ఇద్దరూ ఉండటం, పోవడం అంటే ఇద్దరూ పోవడం. అప్పుడూ ఇప్పుడూ కూడా ఇద్దరూ ఒకటిగానే ఉంటారు. ఆమెకు అతడు దక్కకపోవడం అంటూ ఎప్పుడూ ఉండదు-అని. దాంపత్యజీవితాన్ని పవిత్రంగా మలుచుకున్నప్పుడు ఎంతటి దివ్యస్థితి ఆ దంపతులకు సిద్ధిస్తుందో వ్యాసుడు ఈగాథలో దర్శింపజేస్తాడు.

## దే వ యా ని :

అనురాగంనుంచి పుట్టిన చనవుతో భర్తకోరకు బాధ్యతపడిన భార్యనుంచి వ్యక్తమయ్యే స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఆ దాంపత్యాన్ని ఎలా శోభిల్ల జేస్తాయో ఇంతవరకూ చెప్పుకున్న గాథల్లో ప్రస్ఫుటంచేసిన పారాశర్యుడు, అహంకారంనుంచి ప్రభవించి, వివేకాన్ని కోల్పోయి, ప్రవర్తించిన స్త్రీయొక్క స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఎలాంటి విషమపరిస్థితుల్ని సృష్టిస్తాయో దేవయానిగాథలో దర్శింపజేస్తాడు. దేవయానికి తాను రాక్షసులగురువైన శుక్రాచార్యుని కూతురినని ఎనలేని అహంకారం. తండ్రిద్వారా తాను దేనినైనా సాధించుకోగలనని మితిమీరిన గర్వం.

ఆమె మొదట తండ్రిదగ్గరకు విద్యనేర్వవచ్చిన కచుణ్ణి ప్రేమించింది. విద్యాభ్యాసం పూర్తిచేసుకున్న కచుడు గురుపుత్రి సోదరితో సమానమని ఆమెకు ధర్మమార్గాన్ని బోధించి, తప్పించుకుని వెళ్ళిపోతాడు. ఆతరువాత, పంతాలకుపోయి, వృషపర్వుడి కూతురైన శర్మిష్ఠను తండ్రిప్రాబల్యాన్ని ఉపయోగించి దాసిగా చేసుకుంటుంది దేవయాని. అటుపైన, తండ్రిచేత ధర్మమని చెప్పించి, యయాతిని ఒప్పించి, వివాహం చేసుకుంటుంది. దేవయానితోపాటు దాసిగాఉన్న శర్మిష్ఠకూడా శుక్రుని ఆజ్ఞతో యయాతి అంతఃపురాన్ని చేరుకుంటుంది. తండ్రిప్రాభవాన్ని వినియోగించుకుని ఆమె ఒక

రాజుకూతుర్ని దాసిగా చేసుకోగలిగింది. మరొక చక్రవర్తిని భర్తగా పొందగలిగింది. రెండుసందర్భాల్లోనూ ఆమెలోని అహంకారమే ఆమెకు పనిచేసిపెట్టింది. చివరకు దాంపత్యజీవితంలోకూడా అనురాగానికి బదులు అహంకారమే ఆమెనుంచి పొంగిపొర్లింది.

శర్మిష్ఠను ఏసుఖానికీ నోచుకోకుండా దూరంగా ఉంచాలని చూసిందామె. కాని, చిత్రంగా యయాతీశర్మిష్ఠలు ఒకటికావడం, వారికి సంతతికూడా కలగడం దేవయానికి తెలియకుండానే జరిగింది. జరిగింది తెలుసుకున్న తర్వాత ఆమె తన అహంకారానికి దెబ్బతగలడంతో ఉన్మాదినిగా మారింది. తండ్రినిచేరి భర్తకు శాపం ఇప్పించింది. తండ్రి యయాతిని ముసలివాడైపోవాలని శపిస్తే, అతని రోగం కుదర్చగలిగానని అనుకున్నదే తప్ప, ముసలివాడైపోయింది తనభర్తేననీ, దానివల్ల నష్టం తనకూననీ ఆమె గ్రహించుకోలేకపోయింది. ఆమెకు పంతంనెగ్గించుకోవడం ముఖ్యం. ఈ ఉన్మాదంలోపడి, తానెక్కినకొమ్మ తానే నరకగలిగిందామె.

యయాతి శుక్రుణ్ణి ప్రార్థించాడు. శాపవిమోచనాన్ని అనుగ్రహించమన్నాడు. 'నీకొడుకుల్లో ఎవరైనా తన యౌవనాన్ని నీకు అర్పించి, నీ ముసలితనాన్ని నీవు కోరినంతకాలం స్వీకరించేవారున్నారేమో చూడు. అటువైన ఆకుమారుడే నీరాజ్యానికి వారసుడవుతాడు' అని అన్నాడు శుక్రుడు. యయాతి కొడుకులందర్నీ వరుసగా అడిగాడు. అందరూ నిరాకరించారు. శర్మిష్ఠకొడుకైన పూరుడు మాత్రం అంగీకరించాడు. ఆ తర్వాత అతడే రాజయ్యాడు. ఈవిధంగా చివరికి తన కొడుకులకు రాజ్యం దక్కకుండా చేసుకోగలిగింది దేవయాని. ఆమె ఇప్పించిన శాపమే ఆమెకు ఈ బహుమానాన్ని అందించింది.

ఈ గాథలో మనకు ఈయబడిన ఉపదేశాలు మూడు :

(1) దాంపత్యజీవితానికి నోన్యతా, అనురాగం ముఖ్యం. అవి లేనప్పుడూ, వాటిస్థానాన్ని అహంకారం ఆక్రమించినప్పుడూ

ఆ దాంపత్యం పంతాలకు పుట్టిల్లయి పదికాలాలపాటు దుఃఖింప జేస్తుంది. స్త్రీకి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఉండటం అవసరమే. కానీ, అవి అన్యోన్యతగల దాంపత్యంలో మాత్రమే రాణిస్తాయి. అన్యోన్యత లేనప్పుడు ఆ స్వేచ్ఛ పిచ్చివానిచేతిలోనిరాయినూదిరి అవుతుంది.

(2) పట్టుదలతో చేసుకున్న పెళ్ళి దాంపత్యధర్మానికి పనికి రాదు. అది ఎటు దారితీస్తుందో ఎవ్వరికీ తెలీదు. ఆ వివాహం దైవ వ్యూహం నెరవేర్చడానికి పనికివస్తుందేమోగానీ, దంపతులు సుఖ పడి తరించడానికి మాత్రం పనికిరాదు.

(3) ధర్మార్థకామాలు అందరికీ ఒక్కలాంటివే. నాటి విష యంలో కొందరికి అవకాశం లేకుండా ఉండేటట్టు ప్రయత్నంచేస్తే, అవి ఆగవు. శర్మిష్ఠ దాసి అయినంతమాత్రాన ఆమెకు పెళ్ళి అక్కరలేదనుకోవడం మూర్ఖత్వం. సూటిగా అవకాశం కలుగనీయక పోతే, ప్రత్యావసరాలు ఇంకోకలా సిద్ధింపజేసుకుంటారు. ఈ సూత్రాన్ని అనుసరించి శర్మిష్ఠ రహస్యంగా వివాహం చేసుకుంది. ఔదార్యంతో ధర్మమార్గాన్ని పొందే అవకాశాన్ని ఈయకపోతే, మానవులు అధర్మమార్గాన్నయినా అర్థకామాలను తీర్చు కుంటారు.

స్త్రీమూర్తి అన్యోన్యతా, అనురాగాలతో తన వివేకాన్ని మేళవించి, దాంపత్యజీవితాన్ని నిర్వహించుకున్నప్పుడు ఒక కుంతి, ఒక ద్రౌపది, ఒక దమయంతి, ఒక సావిత్రి ఏదివ్యస్థితిని అనుభ వించారో, ఎంతటి మహోన్నత స్థానాన్ని పొందగలిగారో, అంతటి దివ్యవైభవాన్ని అనుభవించగలదనీ, భర్తకన్నా తను తాను వేరుగా గుర్తించుకున్నప్పుడూ, అనురాగానికి బదులుగా అహం కారానికి చోటిచ్చి పెంచుకున్నప్పుడూ దేవయానిలా ఎటు పోతు

న్నదో తనకే తెలియని ఉన్మాదస్థితిని పొందుతుందనీ వ్యాసభగవానుడు ఉదాహరణపూర్వకంగా ఉపదేశిస్తున్నాడు. దాంపత్య నిర్వహణలో ఎవరి వ్యక్తిత్వాన్ని వారు నిలబెట్టుకోజూచినప్పుడూ, ఎవరి వ్యక్తిత్వానికి వారు విలువను ఇచ్చుకున్నప్పుడూ, ఆ దాంపత్యం నరకప్రాయమవుతుందనీ, దంపతులు మనసులు కలిసి, వ్యక్తిత్వాలు కరిగి, హృదయాలు ఐక్యం చెందినపుడు ఆ దాంపత్యానికి అమృతత్వం సిద్ధిస్తుందనీ వేదవ్యాసుని ఇతిహాసగతమైన సందేశం.

దంపతులైన స్త్రీపురుషులు తమలో తాము ఎలాంటి అరమరికలూ లేకుండా, ఒకరియెడల ఒకరు ఆరాధనాభావంతో, ఆత్మీయతతో నిండిన అన్యోన్యతతో జీవిస్తున్నప్పుడు వాళ్ళలా జీవిస్తున్నందుకు ఫలంగా వారిని ఒకరికమైన దివ్యతేజస్సు వరిస్తుంది. దాంపత్యధర్మనిర్వహణలో పవిత్రభావాన్ని పెంపొందించుకొంటున్నకొద్దీ ఆ తేజస్సు మరింత విస్తరిస్తుంది. అదే వారిని ఆపదసమయాల్లో రక్షించుకొంటూ వస్తుంది. ద్రౌపదిని కీచకాదులు ఏమీ చేయలేకపోయారన్నా, దమయంతిచూపుకే కిరాతుడు మరణించాడన్నా, సావిత్రి యముణ్ణి చూడగలిగి, అనుసరించగలిగిందన్నా, వారు నిర్వహించిన పవిత్ర దాంపత్యజీవితంనుంచి వారిని వరించిన వర్చస్సే కారణం. పద్ధతి తెలిసి ప్రవర్తించినపుడు, జలపాతంనుంచి విద్యుత్తు వ్యక్తమయ్యేటట్టు చేయగలుగుతున్నాడు గదా మానవుడు ! అలాగే, దంపతులు ఒకరియెడల ఒకరు దివ్యానురాగంతో జీవించసాగినపుడు వారిలో ఆదిదంపతులు మెదులుతారు. ప్రకృతిపురుషులు కర్తవ్యోన్ముఖులై కదులుతారు. అలాంటి దివ్యదాంపత్యంనుంచి వ్యక్తమైన తేజస్సు ఆపదసమయాల్లో ఆ దంపతులను రక్షించడమే కాక, యుగయుగాలవారికీ మార్గాన్ని నిర్దేశించి, నడిపించగలుగుతుంది. కనుకనే వారి దాంపత్య గాథల్ని నేటికీ మనం స్మరణ చేసుకొంటున్నాం. మానవులను దాంపత్యజీవిత నిర్వహణలో

వెలుగుదారిని చూపడానికే వాల్మీకి సీతారాముల్ని అర్పించాడు. వ్యాసుడు కుంతి, ద్రౌపది, శకుంతల, దమయంతి, సావిత్రి మొదలైన వారి పవిత్రదాంపత్యగాథలకు అక్షరలక్షలు సమర్పించాడు. వాల్మీకి ఆదర్శ దాంపత్యాన్ని చిత్రించి, అందించగా, వ్యాసుడు దాంపత్యధర్మాన్ని వివిధకోణాలనుంచి పరిశీలించి, పరిపూర్ణ గృహిణీ స్వరూపాన్ని జాతికి అనుగ్రహించాడు.

## వాల్మీకి వ్యాసుల తరువాత :

ఏకారణంచేతనో వాల్మీకి వ్యాసులు దర్శించిన పాతివ్రత్య స్వరూపం తరువాతవచ్చిన గ్రంథాల్లోనికి అంతపరిపూర్ణంగా దిగి వచ్చినట్టు కనిపించదు. రామాయణ భారతాలు పాతివ్రత్య స్వరూపాన్ని కథాగతంగా బోధపరిచింది ఎక్కువ, విడిగా పతివ్రతా ధర్మాలు ఇవీ అని ఏకరువుపెట్టింది తక్కువ భీష్మధర్మజసంవాదాన్ని మినహాయిస్తే, భారతంమొత్తంమీద ఒక్కసందర్భంలో మాత్రమే పతివ్రతాధర్మాల ప్రసక్తివస్తుంది. అవికూడా ఇద్దరు గృహిణులు సందర్భవశాన ఒకళ్ళతో ఒకళ్ళు చెప్పుకొన్నవే. అదే అరణ్యపర్వం లోని సత్యాద్రౌపదీ సంవాదం. ఈసందర్భంలోకూడా ద్రౌపది నిత్య జీవితంలో తాను ప్రవర్తిస్తున్నతీరును వివరించడంద్వారా సత్య భామకు సతీధర్మాన్ని బోధపరచినట్టు చూపబడింది. తన దినచర్యను వివరించి, ఆతరువాత 'నీభర్తతో నీవు ఇలా ఉండవలిసిందీ'అని తాను నిత్యం పాటించే సదాచారాల్నే తగుమాత్రంగా ఏకరువుపెడుతుంది ద్రౌపది. ఈసంవాదాన్ని చదువుతున్నంతసేపూ, పతివ్రతాధర్మాల కన్నా, ద్రౌపదీసత్యభామల స్వభావాలలోని తారతమ్యమే చదు వరిని ఎక్కువగా ఆకర్షిస్తుంది.

ఇక, భీష్మధర్మజ సంవాదంలో అన్నిధర్మాలతోపాటు పతివ్రతాధర్మాలుకూడా రెండుచోట్ల వివరించబడ్డాయి. సతీధర్మాన్ని

తెలియజెప్పటందుకుగాను కైకేయీ శాండిలీ సంవాదాన్ని57, పార్వతీశివులసంవాదాన్ని58 వినిపించాడు భీష్ముడు. ఈ రెండు సందర్భాల్లోనూ సర్వస్త్రీసామాన్యమైనధర్మాలు ఏకరువుపెట్ట బడ్డాయని చెప్పవచ్చు.

పురాణాదిగ్రంథాల్లో అక్కడక్కడా పతివ్రతాధర్మాలను పట్టికల రూపంలో ఏకరువుపెట్టడం కనబడుతుంది. కానీ, ఆపట్టికల్లో చాలా భాగం రామాయణ భారతాలు ఉపదేశించే నిండైన గృహిణీ స్వరూపాన్ని పట్టుకోలేకపోయాయి. పతివ్రతాధర్మాలు ఏకరువు పెట్ట బడిన సందర్భాల్లో ఎక్కువచోట్ల భార్య భర్తను ఎలా సేవించాలో వివరించబడిందే తప్ప, ఎలా ప్రేమించాలో సూచింపబడలేదు. భర్తకు భార్య ఎంతవరకూ ఒదిగిఉండాలో చూపబడింది తప్ప, భర్తజీవితంలో పాలుపంచుకోవడానికి ఎంతగా ఎదిగిఉండాలో చెప్పబడలేదు. రామాయణ భారతాల్లోని పాతివ్రత్య స్వరూపానికీ, ఈ ఏకరువుపెట్టబడిన పతివ్రతాధర్మాలకీ ఒకమనిషికీ, ఆ మనిషి యొక్క ఛాయాచిత్రానికీ ఉన్నంత తారతమ్యం ఉంది.

"కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
రూపేచ లక్ష్మీః క్షమయా ధరిత్రీ
స్నేహేచ మాతా శయనేషు వేశ్యా
షట్కర్మయుక్తా కులధర్మపత్నీ॥"59

అన్నది భారతీయమైన సమగ్రభావనకాగా, ఈపతివ్రత ధర్మాల పట్టికల్లో 'కార్యేషు దాసీ' అన్న తొలిలక్షణానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చినట్టు కనబడుతోంది.

57. ఆం. మ. భా - అనుశాసనిక - 4-358-362.

58. ఆం. మ. భా - అనుశాసనిక - 5-285-303.

59. పంచతంత్రం.

పతివ్రతా ధర్మాల పట్టికలు గృహిణీధర్మాన్ని సమగ్రంగా ఇముడ్చుకోలేకపోవడానికి రెండు కారణాలు కనబడుతున్నాయి. సర్వస్త్రీసామాన్యమైన ధర్మాలు మాత్రమే ప్రసక్తం చేయబడటం కొన్ని సందర్భాలలో జరగగా, మరికొన్ని సందర్భాలలో ఈ పతివ్రతాధర్మాలు తర్వాతి కాలంలో దూరిన ప్రక్షిప్తాలుగా ప్రస్ఫుటమవుతోంది. ఈప్రక్షిప్తాలవల్లవచ్చిన ముప్పు ఇంతాఅంతా అని చెప్పనలవికానిది.

ఉదాహరణకు, స్కాందపురాణాంతర్గతమైన కాశీఖండంలో దేవతలచేత నియుక్తుడైన బృహస్పతి అగస్త్యాశ్రమానికి వస్తాడు. అగస్త్యునిచేత సత్కరింపబడి, పరమసాధ్వి అయిన లోపాముద్రను అప్రక్కనే చూస్తాడు. ఆమెను చూడగానే అతనికి అరుంధతి, సావిత్రి, అనసూయ మొదలైనవారంతా గుర్తుకువస్తారు. ఆమెకు నమస్కరించి, ఆమె సౌశీల్యాన్ని కీర్తిస్తాడు బృహస్పతి. ఇంతవరకూ కథ బాగానే నడుస్తుంది. ఆపైన, అసందర్భంగా పతివ్రతా ధర్మాలను అగస్త్యుడిని ఎదురుగా పెట్టుకొని గ్రామ్యపదాలతో, గ్రామ్యభావాలతో, బృహస్పతికి తగనిరీతిలో ఉపదేశిస్తాడు.

కులస్త్రీ ఎవరెవరితో స్నేహం చేయకూడదో లోపాముద్రకు బృహస్పతి ఇలా వివరిస్తున్నాడు -

"రజకితోడ నుదక్యతో శ్రమణతోడ
విధవతో, నాథుతో రాయు వెలందితోట
చెడిపెతోడఁ బోరాములు సేయవలదు
ప్రాణసంకటములను పుణ్యాంగనలకు"60

చాకలిస్త్రీతో, నీళ్ళుమోసే మనిషితో, బౌద్ధసన్న్యాసినితో, వితంతువుతో, భర్తతో లెక్కలేకుండా ప్రవర్తించేదానితో, చెడిపోయినస్త్రీతో, సన్నిహితంగా ఉండటం కులస్త్రీకి మంచిదికాదట! కులస్త్రీమాట ఎలా ఉన్నా ఈ అంశాన్ని చొప్పించడంతో చొప్పించిన పండితుడు చదువరులకు దొరికిపోతాడు. శ్రమణి అంటే బౌద్ధ

60. శ్రీనాథుని కాశీఖండము - 2-74.

సన్న్యాసిని - అగస్త్యునికాలంలోగాని, పురాణం వ్రాసిన వ్యాసుని కాలంలోగాని ఈబౌద్ధసన్న్యాసిని ఉండటానికి అవకాశంలేదు. ఈబౌద్ధ సన్న్యాసిని, తనకు తోచిన పతివ్రతాధర్మాలను స్కాందపురాణంలో ఇరికించడానికి ప్రయత్నించిన పండితునికాలంనాటిది. బుద్ధుని తరువాతికాలంనాటి పండితుడెవరో ముందూ వెనకా చూసుకోకుండా తనపాండిత్యాన్ని స్కాందపురాణంలో బృహస్పతి నోట వెళ్ళగ్రక్కాడు. ఇతడి ఉపదేశాలు మరికొన్ని చూడండి -

"చీకటితప్పు చేసిన సరోరుహనేత్ర
గూబయై చరియించుఁ గోటరమున
వింతవానిఁ గటాక్షవీక్షణంబున జూచు
కిసలయోష్ఠి వహించు గిల్లకన్ను
మగఁడు దన్మ్రొత్తిన మార్మొత్తు నలివేణి
వ్యాఘ్రియై చరియించు వనములోనఁ
జిఱుదిండి తనవారి మొఱఁగి యాహారించు
నతివ సూకరజాతియందుఁ బుట్టు

నధిపుఁ గోపించి హుంకార మాచరించు
పడఁతి మూఁగవును సవతి సౌభాగ్యలక్ష్మిఁ
జూడఁజాలక మదిలో నసూయ సేయు
భామ దుర్భగయగు నన్యభవమునందు"61

బృహస్పతి అగస్త్యునితో పనిచూసుకోవడం మాని, తీరికగా సాధ్వియైన లోపాముద్రకు గ్రామ్యమైన అంశాలను నొక్కి నొక్కి వివరించడంలో ఔచిత్యం ఉందా? లోపాముద్రకు ఈఅంశాలను నొక్కి చెప్పడం అవసరమా? పాఠకునికి నొక్కి చెప్పదలచిన ప్రక్షిప్తకర్త బృహస్పతిచేత అధికప్రసంగం చేయించాడు. ఈ అంశాలు పవిత్రమైన అగస్త్యాశ్రమ వాతావరణంలో స్మరింప దగినవేనా? ప్రక్షిప్తంచేసిన పండితునికి పాపం ఇవేవీ పట్టలేదు.

61. శ్రీనాథుని కాశీఖండము - 2-80.

తాను చెప్పదలచినవేవో బుద్ధిమంతుడైన బృహస్పతిమీద త్రోసేశాడు.

ఈవిధమైన ప్రక్షిప్తాలు పురాణాది పవిత్రగ్రంథాల్లో చోటు చేసుకోవడంవల్ల జాతికి చాలా అపకారం జరిగింది. సనాతన సంప్రదాయమంటే ఈ ప్రక్షిప్తాలలో ఏకరువుపెట్టబడ్డ అనావశ్యకమైన అంశాల సముదాయమేనని కొందరు అభిప్రాయపడటానికి వీలేర్పడింది. ఈప్రక్షిప్తాలలోని అంశాలు భారతకర్తయైన వ్యాసుడు చెప్పి ఉండడు అని భావించినవారు కొందరు, పురాణాలనువ్రాసిన వ్యాసుడూ, భారతాదిగ్రంథాలనువ్రాసిన వ్యాసుడూ వేరేమోఅని ఊహించడానికి అవకాశం ఏర్పడింది. మొత్తంమీద సనాతన సంప్రదాయమనే సూర్యుడికి ఈప్రక్షిప్తాలమేఘాలు అడ్డురావడంతో, జాతికి అందవలసిన వెలుగు అందనిస్థితి ఏర్పడింది.ఇటువంటిప్రక్షిప్తాలను దృష్టిలో పెట్టుకునే 'బహుపురాణవర్గములకు వాడైనచోటుల భారతం మూదల' అని తిక్కనగారు నొక్కివక్కాణించి ఉంటారు. వ్యాసుని వెలుగును అందుకోవడానికి భారతమైనా పొగమూరిపోకుండా లభించడం మన పురాకృతపుణ్యావిశేషమేనని అనిపిస్తుంది.

## సతీసహగమన సంప్రదాయం - వ్యాస దృక్పథం :

భారతీయ సంప్రదాయంలో దంపతులనడుమ అన్యోన్యత హెచ్చు. జీవించినంతకాలం ఒకరికొకరు ప్రాణంగా జీవించడమే కాక, దాంపత్యాన్ని జన్మజన్మల అనుబంధంగా భావిస్తూ, అనుభవిస్తూ, చివరకు శరీరాన్ని వదలిపెట్టేటప్పుడు కూడా ఒకరినొకరు అనుసరించకుండా ఉండలేనంత అనుబంధాన్ని పెంచుకుంటూ ఉంటారు. ఈ విషయంలో స్త్రీలది అగ్రతాంబూలం. ఆరాధనమూర్తీభవించగా భారతీయస్త్రీ రూపుకట్టుకున్నదేమో అనిపిస్తుంది. బ్రతికినంతకాలం భర్తను దేవునిగా పూజిస్తూ, భర్తకొరకే తన

బ్రతుకని భావించి, తృప్తిపడటమే కాక, భర్తకన్నా తాను ముందు పుణ్యస్త్రీగా శరీరాన్ని వదిలివేయాలని కోరుకుంటుందామె. అలా జరగనప్పుడు,తనకన్నా ముందే భర్త శరీరాన్ని వదలినప్పుడు,భర్తలేని జీవితాన్ని ఊహించలేక భర్తతోపాటు చితిలో ఉరికి,ఆమె దేహాన్ని విడవటం ప్రారంభించడంతో సతీసహగమన సంప్రదాయం రూపు దాల్చింది. భర్త వదలివెళ్ళిన బాధ్యతలను తాను బ్రతికి నిర్వహించవలసివచ్చినప్పుడు, పసపుకుంకుమలను వదలి, అలం కారాలను, అనుభవాలను త్యజించి, భోగభాగ్యాలపై దృష్టిని విడిచి నిర్లిప్తతతో కేవలం పరలోకంలోని భర్తకు ప్రతినిధిగా భూమిపై జీవనయాత్రను గడపడం ప్రారంభించడంతో వైధవ్యాన్ని స్వీకరించే సంప్రదాయం రూపుదిద్దుకొంది.

సతీసహగమనంగాని. వైధవ్యస్వీకారంగాని మొదట్లో ప్రేమమూర్తులైన స్త్రీలు కోరి స్వీకరించినవే. తరువాత తరువాత అవి సంప్రదాయాలుగా మారిపోయి, అలా చేయకపోతే తప్పు అన్న అభిప్రాయం ప్రజల్లో ఏర్పడుతూ వచ్చింది. కొందరు ఈ సంప్ర దాయాలను స్త్రీలపై వారి యిష్టానిష్టాలను పట్టించుకోకుండా రుద్దసాగారు. నిర్బంధసతీసహగమనం మొదలైనవి అలా ప్రచుర మైనవే.

పరిణామమనే నిచ్చెనపైన అన్నిమెట్లపైనున్నవారూ మాన వుల్లో ఉంటూ ఉంటారు. అందులో ఒకమెట్టుపైనున్నవారికి ధర్మం అనిపించింది మరొకమెట్టుపై నున్నవారికి ధర్మంగా కనిపించక పోవచ్చు. ఈ సత్యాన్ని గమనించకుండా, అందరిపైనా ఒకే సంప్రదాయాన్ని రుద్దడం అధర్మం. కొందరుస్త్రీలు భర్తతోడిదే జీవితం అనుకొని, భర్తతో ప్రాణం విడవడానికి సిద్ధమవుతారు. అలాంటివాళ్ళు మనం ప్రయత్నించి ఆపినా జీవితాన్ని చాలించి

వేస్తారు. ఇంకొందరు భర్త వదలివెళ్ళిన బాధ్యతలను నిర్వహించే టందుకు నిర్లిప్తంగా నిలిచిపోతారు. మరికొందరు దేహాంవిడిచిన భర్త ఆశయసిద్ధికోసం జీవితాన్ని అంకితంచేసి తృప్తినిపొందుతారు. ఈ విధంగా తమతమ సంస్కారాలనుబట్టి నిర్ణయాలను తీసుకుంటూ ఉంటారు. అలాగే పురుషుల విషయంలోకూడా. ఈ విధమైన వైవిధ్యాన్ని జీవుల సంస్కారాల్లో గమనించకుండా, అందరికీ ఒకే సంప్రదాయాన్ని వర్తింపజేయాలని చూడటం అధర్మం అవుతుంది. ఆ సంప్రదాయాన్ని అనుసరించమని బలవంతపెట్టడం అమానుష మవుతుంది.

రామాయణ మహాభారతాలను పరిశీలించినప్పుడు ఈ సంప్ర దాయాల విషయంలో స్త్రీలకు పరిపూర్ణమైన స్వేచ్ఛ ఉందనీ, ఎవరిసంస్కారాన్నిబట్టి వారు తమజీవితాన్ని నిర్ణయించుకొనేందుకు అవకాశం ఉందనీ బోధపడుతుంది. రామాయణంలో దశరథుడు మరణించిన తర్వాత కౌసల్యా, సుమిత్రా, కైకేయీ సతీసహగమనం చేయలేదు. ఆ ప్రసక్తే వారివిషయంలో రాలేదు. దశరథుని తర్వాత నిర్వహించవలసిన బాధ్యతలకొరకు వారు తమదేహాలను నిలుపు కున్నారు. ఒకరు స్వార్థానికి నిలుపుకోవచ్చు, మరొకరు నిస్స్వార్థంగా నిలుపుకోవచ్చు. ఆ నిర్ణయంకూడా వారికే వదలివేయబడింది.

ఇక, భారతానికి వద్దాం- కిందమునిశాపంవల్ల, మాద్రితోడి సంగమాన్ని కోరిన పాండురాజు వెంటనే ప్రాణాలు విడిచాడు. దుఃఖంలో మునిగిన కుంతి తాను భర్తతో సహగమనం చేస్తానన్నది. అప్పుడు మాద్రి కుంతితో 'నీవు తేజోవంతులైన పుత్త్రుల్ని పొంది, అన్నివిధాలా భర్తను తృప్తిపరిచావు. నేను చివరిక్షణంలోకూడా భర్తను సుఖపెట్టలేకపోయాను. నీవనుమతిస్తే భర్తతోపాటు శరీరాన్ని విడిచి పరలోకంలోనైనా ఆయన్ని సుఖపెడతాను. పతి

మరణించడానికి కారణం నా ఏమరుపాటే. అలాంటి నేను బిడ్డల్ని బాధ్యతతో తీర్చిదిద్దలేను. నీవు సమర్థురాలివి. బాధ్యతతో బిడ్డల్ని తీర్చిదిద్దగలవు. కాబట్టి, బిడ్డల్ని పెంచే బాధ్యత నీవు స్వీకరించు' అని వేడి, మాద్రి ప్రాణాలు విడిచింది. అటుపైన కుంతీదేవికూడా భర్తృవియోగానికి తాళలేక సహగమనానికి సిద్ధపడుతుండగా, శతశృంగంలోని మునులు ఆమెను వారించి, ఓదార్చి, బిడ్డల బాధ్యతను స్వీకరించవలసిందిగా ప్రబోధించి, ఆమెను బ్రతికేటట్లు చేశారు. ఆమెనూ పాండవుల్నీ వెంటతీసుకుని హస్తినకు చేర్చి, ధృతరాష్ట్రునికి అప్పగించారు.

ఆశ్రమవాసపర్వంలో, అరణ్యంలో ఆశ్రమజీవితాన్ని నడుపుతున్న ధృతరాష్ట్ర గాంధారీ కుంతులను చూసిపోవడానికి పాండవులు బంధుమిత్ర పరివారంతో వస్తారు. వాళ్ళందరూ ఒకచోట చేరి కాలక్షేపం చేస్తూండగా, వ్యాసభగవానుడు వాళ్ళకు దర్శనమిచ్చి, ఆనందాన్ని కలిగిస్తాడు. కొంతసేపు వారితో సల్లాపాలతో గడిపి, 'మీకుగల కోరిక చెప్పండి, అది ఎలాంటిదైనా తీరుస్తాను' అని అభయమిస్తాడు. అక్కడున్న వాళ్ళందరూ క్రమంగా తమతమ పోయిన బంధువుల్ని చూడాలని కోరుకుంటారు. అప్పుడు వ్యాసుడు వాళ్ళందర్నీ గంగాతీరానికి కొనిపోయి, గంగలో స్నానం చేసి, నిలబడండని ఆదేశిస్తాడు. వాళ్ళంతా అలాగే చేస్తారు. అంతలో ఎన్నడూ ఎవ్వరూ కనీ వినీ ఎరుగని వింత వ్యక్తమవుతుంది. కురుక్షేత్ర మహాసంగ్రామంలో చనిపోయిన బంధువులంతా దివ్యశరీరాలతో దిగివస్తారు. వారూ వీరూ కలిసి, ఆనాడంతా క్రీడలతో, వినోదాలతో గడుపుతారు. చివరకు తెల్లవారబోతుండగా పాండవులతో కలిసి వచ్చిన స్త్రీలనుద్దేశించి, వ్యాసుడు, 'మీలో చనిపోయిన మీ మీ భర్తలతో కలిసి వెళ్ళిపోవాలనే కోరిక కలవారు మీకోరిక ప్రకారం వాళ్ళను అనుసరించవచ్చు' అని అనుగ్రహిస్తాడు. అప్పుడు

అంతవరకూ వైధవ్యాన్ని పొందిఉన్న రాకుమారుల భార్యలు వ్యాసానుగ్రహంతో, గంగలో స్నానంచేసి, మానవశరీరాలను విడిచి, దివ్యశరీరాలతో భర్తలను కలిసి నిష్క్రమిస్తారు. తమతమ భర్తలతో కలిసి పరలోకానికి చేరుకోవాలన్న సతులకోరికను గ్రహించి, వ్యాసుడు వారిపై సానుభూతితో అనుగ్రహించిన అవకాశమిది. ఈ సన్నివేశంలో సతీసహగమనమనేది సతుల ఇచ్ఛకు సంబంధించినదే గాని, నిర్బంధంకాదని వ్యాసుడే నిష్కర్ష చేసి చూపినట్టయ్యింది.

భారతంలోని పై రెండు సన్నివేశాలనుబట్టి మనకు బోధపడుతున్న అంశాలు ఇవి :

(1) పతిని దైవంగా ఆరాధించే సతి పతితోడిదే జీవితమనీ, అతనితోపాటు శరీరాన్ని విడిచిపెట్టాలనీ కోరుకున్నప్పుడు ఆ స్త్రీని తప్పుపట్టరాదు. సిద్ధపడనివారిని సహగమనానికి పురికొల్పరాదు.

(2) భర్త శరీరాన్ని విడిచే సమయానికి సంతతి చిన్నవారైతే, తనకు భర్తతో వెళ్ళిపోవాలనే కోరిక ఎంతబలీయంగా ఉన్నప్పటికీ దానిని అణచుకొని బిడ్డల్ని తీర్చిదిద్దేటందుకై, దేహంతో నిలిచి, బిడ్డలయెడల తండ్రి పాత్రకూడా తానే వహించడం సతికి ధర్మం. భర్త ఎడల తనకుగల ప్రేమపాశాన్ని బిడ్డల్ని పెంచి పెద్దచేయడమనే బాధ్యతానిర్వహణకోసం ఆమె త్యాగం చేసితీరాలి.

ఈ విధంగా రామాయణ భారతాలు వ్యక్తుల సంస్కారాల్ని గౌరవిస్తున్నాయేతప్ప, సంప్రదాయం పేరిట నిర్బంధించడంలేదు. కాలక్రమంలో ఈ సమన్వయ దర్శనాన్ని కోల్పోయిన జాతి సతీ సహగమనాన్ని సంప్రదాయంగా భావించి, నిర్బంధంగా అమలు పరచడం ప్రారంభించింది. సహగమనానికి పాల్పడకుండా నిలిచిన స్త్రీలను విధవలని ఘోరంగా నిందించింది. బుద్ధుని తరువాతి కాలం నాటి పండితుడు బృహస్పతినోట పలికించిన పతివ్రతాధర్మాల్లో **విధవనెలా ఆడిపోసుకున్నాడో చూడండి -**

"ఓర్పుమై నుప్పిండి నుపవాసముండనీ
మగనాలి సరిఁబోల్పఁదగదు విధవ
తిరిగి నానాపుణ్యతీర్థంబు లాడనీ
మగనాలి సరిఁబోల్పఁదగదు విధవ
సమధికంబగు నిష్ఠ జపములు సేసిన
మగనాలి సరిఁబోల్పఁదగదు విధవ
సద్భక్తి దేవతార్చనము సేయంగనీ
మగనాలి సరిఁబోల్పఁదగదు విధవ

నిద్రమేల్కాంచి రేపాడి నియమపరత
నహిమ భానుని వీక్షింపని యటకమున్న
తగదు నరునకుఁ జూడంగఁ దల్లి వదినె
నత్తగారిని దప్పించి యన్యవిధవ" 62.

"జీవముతోడఁబాసి యశుచిత్వముఁ బొందిన మేను గంధతో
యావబృథాభిషేకము సహస్ర ఘటంబుల నాచరించినన్
బావనమౌనె? యట్లు పతిఁబాసి వితంతుతనొందినట్టి రా
జీవ దళాయతాక్షి యశుచిత్వము వాయదు వేయుభంగులన్." 63

సుగంధద్రవ్యాలు కలిపిన నీటిని వేయికుండలతో తెచ్చి స్నానంచేయించినప్పటికీ శవం ఎలా పవిత్రంకాదో, అలాగే వేయివిధాల ప్రయత్నించినా విధవరాలు పవిత్రురాలు కాదుట! ఇంతటితో ఊరుకోక ఇంకా ఇలా అంటున్నాడు :

"ప్రియము గలిగిన నంగీకరింపవలదు
ముండదీవన రేపాది మోముఁజూచి
బైసి మాలిన పరమ నిర్భాగ్యురాలు
విధవదాని యాశీస్సును విషసమంబు." 64

62. కాశీ - 2-83
63. కాశీ - 2-84
64. కాశీ - 2-85

భర్తను కోల్పోయిన స్త్రీమూర్తి యెడల ఇంత చలాని సానుభూతిని చూపగలిగిన ఈ పండితుని అసలు కోరిక స్త్రీ భర్తతో చనిపోయితీరాలని. సతీసహగమనం చేయమని ఉద్బోధిస్తూ స్త్రీని ఉద్దేశించి, పండితుడు ఏమంటున్నాడో చూడండి-

"పిఱికె కండ యొకింతలేక కఱిమి వేడ్కఁ
జిచ్చుఁ జొరఁబోవు నిశచరాజీవనేత్ర
శశ్వమేధంబు ఫలము తథ్యంబు గలుగుఁ
బదపదమ్మున కిదె వేదభాషితంబు."65

"పుట్టలోపలి పాము నభ్యుద్ధరించి
వశ్యమంత్రుండు పాములవాఁడపోలె
భర్త నభ్యుద్ధరించుఁ బావంబు వలన
నగ్ని నుఱికినయట్టి పద్మాయతాక్షి."66

"ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాకభువనంబునం దాత్మనాథుఁగూడి
వెఱపొకింతయు లేక చిచ్చుఱికెనేని."67

ఈవిధంగా సాగుతుంది పండితుని ఉపదేశం. ఈ బోధలన్నీ వ్యాసునివేనని మనం భ్రమపడాలని పండితుని ఉద్దేశం. రత్నాల్లో రాళ్ళు కలిపినా గుర్తుపట్టడం కష్టంకాదు. సమదర్శియైన వ్యాస భగవానుని వాక్కులతో, సానుభూతిలేని పండితుని పలుకులు ఎంత ప్రయత్నించినా కలవలేవు.

65. కాశీ - 2-86
66. కాశీ - 2-87
67. కాశీ - 2-91.

రామాయణభారతాల్లోని ప్రధాన కథలు జగత్ప్రసిద్ధాలు కదా ! వాటిని మార్చడం సాధ్యంకాదు కనుక, వాటిని వదలిపెట్టి, మిగిలిన పురాణాల్లో అక్కడక్కడా తమ ఆవేశాలనే పురాణ ప్రోక్తాలుగా మలచడానికి ప్రయత్నించారు కొందరు పండితులు. తిక్కనగారు అన్నట్టు, మనకు భారతం మాదలగా నిలిచింది కాబట్టి సరిపోయింది. లేకుంటే ఏది సంప్రదాయమో, ఏదికాదో సామాన్య మానవుడికి బోధపడేదికాదు.

## ఆపద్ధర్మంగా దాంపత్యధర్మం :

పరశురాముడివల్ల తమభర్తలను కోల్పోయిన క్షత్రియ సతులు పూజ్యులైన బ్రాహ్మణులవలన తమ వంశాలను నిలబెట్టు కొన్నారు.

వేదశరీరుడైన దీర్ఘతముడు బలియనే చక్రవర్తి కోరికపై అతని భార్యయందు వంశాంకురాన్ని నిలిపాడు.

కురువంశం నిర్వంశం అయిపోతున్నప్పుడు సత్యవతి ఆదేశాన్ని శిరసావహించి, వ్యాసభగవానుడు తాను ఆజన్మబ్రహ్మచారియైనా రాజ్యక్షేమాన్నికోరి, అంబికా అంబాలికలకు పుత్రదానం చేశాడు.

పితౄణం తీర్చుకోవడానికి తనకు పుత్రులను ప్రసాదించమని పాండురాజు వేడుకోగా, కుంతి యమ అనిల శక్రులను ఉపాసించి ధర్మజ భీమార్జునులను పొందింది. పుత్రసంతతినికోరిన మాద్రి కూడా భర్త అనుజ్ఞతో, కుంతి మంత్రప్రభావంవల్ల అశ్వినీ దేవతలను ఉపాసించి నకులసహదేవులను కన్నది.

ఈవిధంగా సంతతికొరకు, ముఖ్యంగా, క్షత్రియవంశాల్లో కొన్ని విశేషమైన పద్ధతులను అనుసరించినట్లు కనబడుతుంది. సంతతి లేకపోవడంవల్ల తమకు వంశం లేకపోవడమే కాక, రాజ్యరక్షణకు

అవసరమైన వారసులు లేకుండాపోతున్న తరుణంలో, అలా జరగడం ఏవిధంగానూ శ్రేయోదాయకం కాదుగనుక, లోకహితాన్ని కోరిన పెద్దలు ఈ ఆపద్ధర్మాలను ప్రవేశపెట్టారు. ఈ ఆపద్ధర్మాలను ఈ క్రిందివిధంగా వింగడించవచ్చు.

(1) సంతతిని ప్రసాదించకుండా భర్త మరణించినపుడు పెద్దల అనుమతితో ఆ సతి తన మరది లేక బావగారివల్ల సంతతిపొంది వంశాన్ని నిలపడం. దీన్నే దేవరన్యాయం అంటారు. దేవరుడు అంటే మరది. (వ్యాసుడు, భీష్ముడు అంబిక అంబాలికలకు బావగార్లేగాని మరదులు కారు.)

(2) భర్త సంతతి ప్రసాదించకుండా కాలంచేసినప్పుడు, బావ, మరదులుకూడా లేనప్పుడు, లేక, వారు సిద్ధపడనప్పుడు పూజ్యులైన బ్రాహ్మణుల్ని పూజించి, వారివలన సంతతి నిలుపుకోవడం. లోకహితమే స్వభావంగా కలిగి, జీవితమే తపస్సుగా నిర్వహించుకుంటున్న బ్రాహ్మణుడు సందర్భానికి తగిన సంస్కారం కలిగిన పుత్రుణ్ణి ప్రసాదించగలగడమే ఈ ఆచారం ఏర్పడటానికి కారణం కావచ్చు.

(3) భర్త తాను సంతతిపొందడానికి అశక్తుడయినపుడు, తానే వేదమయులైన బ్రాహ్మణులనుగాని, దేవతలనుగాని, కోరి, పూజించి వారివలన భార్యయందు సంతతిపొందడం. దీనిని నియోగపద్ధతి అంటారు. అంటే భర్తచే నియోగింపబడి భార్య సంతతిని పొందుతుందని భావం.

ఈ మూడు పద్ధతులూ పురాణేతిహాసాల్లో క్షత్రియవంశాల్లోనే ఎక్కువగా కనబడుతున్నాయని చెప్పుకున్నాం. రాజ్యానికి రాజు లేని స్థితి ఏర్పడకూడదు గనుక, రాజ్యక్షేమాన్నికోరి క్షత్రియ స్త్రీలు తమను తాము సమర్పించుకోవడం, పూజ్యులైన బ్రాహ్మణులు, దేవతలుకూడా వారికి సంతతిని ప్రసాదించడం జరిగేది. ఈసంద

ర్భాల్లో స్త్రీపురుషులిద్దరికీ లోకహితమే ప్రధానం అవుతోంది కనుక, కామస్పర్శ ప్రధానం కావడంలేదు కనుక, ఈసందర్భాలు ధర్మబద్ధమైనవిగా పెద్దలచేత అంగీకరింపబడి, ఆపద్ధర్మాలుగా నెలకొల్పబడ్డాయి.

ఈవిధంగా భారతంలో దాంపత్యధర్మస్వరూపస్వభావాల్ని విభిన్నకోణాలనుంచి దర్శింపచేశాడు వ్యాసభగవానుడు. దాంపత్య ధర్మం యొక్క పరిపూర్ణస్వరూపాన్ని ఇన్ని కోణాలనుంచి దర్శించి, వ్యక్తి తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలని వేదవ్యాసుని సంకల్పం.



# మోక్షధర్మం - ధర్మాద్వైతస్థితి

ఇంతవరకు ధర్మార్థకామాల స్వరూపస్వభావాలను పరిశీలించడం, వివిధ పరిణామస్థితులలో ఉన్న వ్యక్తులు ధర్మార్థకామాల ఎడల ఎలా ప్రవర్తించినప్పుడు ఎలాంటి ఫలితాలను పొందుతున్నారో పరామర్శించడం జరిగింది. ధర్మార్థకామాల యథార్థస్వరూపం ఏమిటో తేల్చి చెప్పుకోవడం కూడా జరిగింది. ఆ యథార్థ స్వరూపాన్ని నిత్యజీవితంలో అనుభవంలోకి తెచ్చుకోవాలంటే సామాన్యమానవుడు సాధకుడై ముక్తస్థితిని పొందవలసి ఉంది. ముక్త స్థితిని పొందినపుడు మాత్రమే ధర్మార్థకామాల యథార్థ స్వరూపం బోధపడుతుంది. ఈ సత్యాన్ని దృష్టిలోపెట్టుకొని మహాభారతం సామాన్యంగా మనిషికి కలిగే చిన్నా పెద్దా సంశయాలన్నిటినీ తీర్చి మానవుడు తననుతాను తీర్చిదిద్దుకునే మార్గాన్ని నిపుణంగా బోధిస్తుంది.

## మృత్యు స్వరూపం :

పరిణామంలో ఒకదశను దాటేవరకు మానవుణ్ణి మృత్యుభీతి వెంటాడుతూ ఉంటుంది. శరీరమే తానుగా తాదాత్మ్యం చెందిన

మానవుడు శరీరం వయస్సును తన వయస్సుగా లెక్కవేసుకుంటాడు. శరీరానికి ఆకలివేస్తే తనకు ఆకలివేస్తోందంటాడు. శరీరానికి ఆరోగ్యం దెబ్బతింటే తన ఆరోగ్యం దెబ్బతిందనుకుంటాడు. శరీరం ముసలిదై పోతూంటే తాను ముసలివాడై పోతున్నానని బెంగ పెట్టుకుంటాడు. శరీరం తనను విడిచిపెట్టడానికి సిద్ధపడుతుంటే తాను చచ్చిపోతున్నాననుకుంటాడు. తాను చచ్చిపోతాడన్న విషయం గుర్తొచ్చినప్పుడల్లా మానసికంగా ఒకసారి చచ్చిపోతూఉంటాడు. తన కళ్ళముందు అనేకులు చనిపోవడం చూస్తూ వీళ్ళంతా ఎక్కడికి వెళ్ళిపోనున్నారు అని సమాధానం దొరకని ప్రశ్నతో మథన పడుతూ ఉంటాడు. తానుకూడా అలా వెళ్ళిపోవలసిందేగదా అని తన మనస్సుకి అనిపించినపుడు గతుక్కుమంటాడు.

ఈ విధమైన భ్రాంతికి లోనైన మానవుడు కొన్నిసత్యాలను మరచిపోతాడు. ఈ దేహంలోకి రాకముందు కూడా తానున్నాడు కదా! తన తండ్రిద్వారా తల్లి గర్భాలయంలోనికి ప్రవేశించిన తరువాతగదా, తననుంచి వ్యక్తమైన శక్తి తల్లి సాయంతో తనకు దేహానిర్మాణాన్ని చేసిపెట్టింది! ఆ దేహం ఒక స్థితిని పొందిన తరువాతగదా తాను భూమిమీదపడింది! నిజానికి శరీరం తనకొక పురంలాంటిదే గదా![1] ఆ శరీరం తన స్వభావాన్నిబట్టి ఉపయోగపడ గలిగినంతకాలం ఉపయోగపడి పండినపండు చెట్టునుండి రాలిపడి పోయినట్టు తననుడి జారిపడిపోతోంది. ఆ దేహంతో తాను సంపా దించుకున్న అనుభవం తనలో ఇముడ్చుకుని మళ్ళీ తనకు పురాన్ని నిర్మించిపెట్టే తగిన తల్లిదండ్రులకోసం వెతుక్కోవడం జరుగుతుందన్న సత్యం, పూర్వాపరాలను నిదానించి గమనించుకోగల ఏవ్యక్తికైనా తెలుస్తుంది. ఈ సత్యాన్నే కృష్ణుడు, చిరిగిన వస్త్రాల్ని విడిచి నూతన

1. ఈ సత్యం భాగవతం చతుర్థస్కంధంలోని పురంజనోపాఖ్యానంలో వివ రించబడింది.

వస్త్రాల్ని ధరించినట్లు జీవి చివికిన శరీరాలను వదలి సరికొత్త శరీరాలను మళ్ళీ పొందుతున్నాడు అని చెప్పాడు.2

ప్రభుత్వ కార్యాలయంలో ప్రజలకొరకు పెద్దఎత్తున పనిచేసే ఉద్యోగికి ప్రభుత్వంవారు వాహనాన్ని ఇస్తారు. ఆ వాహనం సరిగా పనిచేసినంతకాలం వినియోగించుకుంటాడా ఉద్యోగి. వాహనం పాతబడిపోగానే ఆ విషయాన్ని ప్రభుత్వానికి తెలియజేసి వారికి ఆ పాత వాహనాన్ని అప్పచెప్పి, వారందించే కొత్త వాహనాన్ని సంతోషంతో స్వీకరిస్తాడు. అలాగే సృష్టిలో జీవికి అప్పచెప్పబడిన కార్యనిర్వహణకోసం ప్రకృతి మానవుడికి బహూకరించే వాహనమే ఈ శరీరం. ఈ వాహనంయొక్క శక్తియుక్తులు సన్నగిల్లగానే దాన్ని ప్రకృతికి సమర్పిస్తే, ప్రకృతి మళ్ళీ కొత్తవాహనాన్ని ఏర్పాటు చేస్తూ ఉంటుంది. ఈసత్యాన్ని తెలిసిన పెద్దలు ఏర్పాటు చేసుకొన్నదే మహాప్రస్థాన సంప్రదాయం. ఆ శరీరంతో తాము చేయవలసినపని అయిపోయిందని తెలుసుకోగానే, వారు ఉత్తరాభిముఖంగా మహాప్రస్థానాన్ని ప్రారంభించేవారు. ప్రస్థానం అంటే ప్రయాణం. మహాప్రస్థానం అంటే తిరిగిరాని ప్రయాణం. ఆ విధమైన సంకల్పంతో దైవం ఎడల మనస్సును లగ్నంచేసి నడుస్తూ నడుస్తూ ఉండగా వారి శరీరం వారిని విడిచి పడిపోయేది. వారు ఊర్ధ్వలోకాలకు చేరుకునేవారు. మహాభారతంలో చివరకు పాండవులు ఈ మహాప్రస్థాన సంప్రదాయాన్నే అనుసరించారు.

తననుంచి వ్యక్తమవుతున్న పంచభూతాలను తనదేహంగా ధరిస్తున్న పరమపురుషుడే జీవిగా దిగివస్తున్నప్పుడు, ఆ పంచభూతాలతో రకరకాల శరీరాలను నిర్మించుకుంటున్నాడు. కనుకనే ద్రష్టలు ఇన్నితలలతో, ఇన్ని కన్నులతో, ఇన్నిపాదాలతో ఇందరు

2. వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవానిదేహీ॥ గీత- 2-22

మూర్తులుగా వ్యక్తమవుతున్నది ఆ పరమపురుషుడేనని దర్శించారు3. ఈ దివ్యవైభవాన్నే భగవానుని విశ్వరూపంగా అర్జునుడు దర్శించాడు. విశ్వంయొక్క రూపమే విష్ణువుయొక్క రూపమని అతనికి అనుభవమయింది. మృత్యువంటే అతనికున్న అభిప్రాయం అంతటితో కరిగిపోయింది. బాల్యంనుంచి కౌమారానికి, కౌమారంనుంచి యౌవనానికి, యౌవనంనుంచి ముసలితనానికి శరీర మెలా మార్పు చెందుతోందో, అలాగే దేహాన్ని విడిచి దేహాన్ని ధరించడం కూడా4. ఆ దేహాలు ధరిస్తున్న అంతర్యామిని శస్త్రాలు ఛేదించలేవు. అగ్ని దహించలేదు. నీరు తడపలేదు. వాయువు శుష్కింపజేయలేదు5 ఇలాంటి కృష్ణుని బోధలన్నీ అర్జునుడికి అప్పటికి పూర్తిగా అనుభూతమయ్యాయి. నిజమే - అతడినుంచి వ్యక్తమయ్యే శస్త్రం అతడి నెలా ఛేదించగలదు? అతనినుంచి వ్యక్తమయ్యే అగ్ని అతని నెలా దహించగలదు? అలాగే అతడినుంచి వ్యక్తమయ్యే నీరూ, గాలీ మొదలైనవి అతనిపై ప్రభావాన్నెలా చూపగలవు? అగ్ని తనను స్పృశించేవారికి వేడిగా ఉండి దహిస్తుందిగాని తనకు తాను వేడిగా ఉండటమనేది ఉండదుకదా! అలాంటప్పుడు తమ అస్తిత్వానికి కారణమైన అంతర్యామిని అగ్ని మొదలైనవి ఏంచేయగలవు? ఈ దివ్యదర్శనం లభించడంతో అర్జునుడు పులకాంకిత గాత్రుడయ్యాడు. దేహాలను ధరించి వర్తిస్తున్న అంతర్యామి అన్నింటికీ అతీతుడని అనుభవమయిం దతనికి. ఆ నరుడు

---

3. సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్ ॥
— (పురుషసూక్తం.)

4. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥ (భగవద్గీత - 2 - 13.)

5. నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥ (భగవద్గీత - 2-23)

పొందిన దివ్యదర్శనాన్నే నరులందరూ పొందవలసి ఉన్నదని వ్యాసుని కావ్యగత సందేశం.

మృత్యువు అన్న పదానికి మార్పు అని అర్థం. దేహంపొందే మార్పులకన్న దేహం ధరించినవాడు అతీతుడని చెప్పిన భారతం, అలాంటి మార్పు (మృత్యువు) జీవి పొందే అవకాశం ఉన్నదనీ, దాని కతడు అతీతంగా ఉండటం అభ్యాసం చెయ్యాలనీ హెచ్చరిస్తోంది. ఉద్యోగపర్వంలో సనత్సుజాతుణ్ణి మృత్యువుయొక్క స్వరూపాన్ని వివరించమని కోరతాడు ధృతరాష్ట్రుడు. అప్పుడు సనత్సుజాతుడు దైవప్రజ్ఞయెడల జీవి పరాకుపడటమే మృత్యువనీ, ఆ పరాకుపడకుండా ఉండగలగటమే అమృతత్వమనీ వివరిస్తాడు.6 మానవుడు, తాను అంతర్యామినని గుర్తున్నపుడు అమృతత్వాన్ని అనుభవిస్తున్నాడు. ఆ అంతర్యామిత్వాన్నుంచి మరపుగలిగి నామ రూపాలకు మాత్రమే తనను పరిమితం చేసుకున్నపుడు తెలియని అశాంతితో మృత్యువు ననుభవిస్తున్నాడు. ఈ పరిమితత్వంనుంచి అంతర్యామిత్వానుభవంలోనికి మానవుడుచేసే ప్రయత్నమే సాధన. ఆసాధన జరుగుతున్నపుడు తొలిదశలో అంతర్యామిత్వం నుంచి మరపు కలుగుతూ ఉంటుంది. మళ్ళీ అతడు ప్రయత్నించి అంతర్యామిత్వంలో నిలదొక్కుకోవాలని చూస్తూఉంటాడు. ఆ అంతర్యామిత్వం చిక్కినట్టే చిక్కి మళ్ళీ అతడికి తెలియకుండానే పరాకనే పొర కప్పుకుంటూ ఉంటుంది. ఈవిధంగా అంతర్యామిస్థితినుంచి మృత్యువుపొందుతూ, మళ్ళీ ప్రయత్నించి అంతర్యామిస్థితిలో జననమందుతూ కాలం గడుపుతూ ఉంటాడు. ఈ జననమరణాలకు అతీతమైన స్థితికోసం అఱ్ఱులుచాస్తూఉంటాడు. అప్పుడా ఆర్తిని చూచి అతీతస్థితి

6. ప్రమాదంవై మృత్యుమహం బ్రవీమి
తథా ఒప్రమాద మమృతత్వం బ్రవీమి.
(సంస్కృతభారతం - ఉద్యోగ - సనత్సుజాతపర్వం - 41 వ అధ్యాయం)

నను గ్రహిస్తూ ఉంటాడు అంతర్యామి. తిక్కనగారికి కలలో ప్రత్యక్ష మైన హరిహరనాథుణ్ణి తిక్కనగారు కోరింది ఆ అనుగ్రహాన్నే. తిక్కనగారు బ్రహ్మానందస్థితిని కోరగా హరిహరనాథుడు :

"జననమరణాదులైన సంసారదురిత
ములకు నగడపడకుండంగ, దొలంగు తెరువు
గను వెలుంగు నీకిచ్చితి" నన్నాడు.7

సంసారమనగా సంసరణం. సంసరణం అంటే నిరంతరం మార్పు కి జరిగిపోవడం.జీవి అంతర్యామిస్థితినుంచి జరిగిపోతూ మేల్కొంటూ మళ్ళీ జరిగిపోతూ ఉండడాలే జననమరణాది సంసారదురితాలు. ఆ దురితాలకు పట్టుబడకుండా నిలువగల నిపుణమైన మార్గాన్ని దర్శించ గల వెలుగును తిక్కనగారికిచ్చాడు హరిహరనాథుడు.

శ్రుతికూడా "అంతర్యామిత్వ అనుభవంలో ఏమాత్రం రంధ్ర మేర్పడినా ఆచోటును భయం ఆక్రమిస్తోంది" అని చెపుతోంది.8

మొత్తంమీద భారతం ఉపదేశిస్తున్నదేమంటే దేహాదుల యొక్క జననమరణాలు తనవికావనీ, తనకు దేహాలు వచ్చిపోతూ ఉంటాయనీ మానవుడు గ్రహించాలి. అంతర్యామిస్థితినుంచి తనకు పరాకుకలగడమే మృత్యువనీ,ఆ అంతర్యామిస్థితియందు మెలకువ కలగ డమే తనకు జననమనీ గ్రహించి, ఈజననమరణాది సంసారదురితా లకు పట్టుబడకుండా అంతర్యామిత్వంలో కుదురుకోవడమే అమృత స్థితి అనీ మానవుడు దర్శనాన్ని పొంది ఆ అమృతస్థితిని అనుభవించాలి.

### శరీరధారణ నేరమా ?

సామాన్యలోకంలో కొందరు వేదాంతంపేరిట తాము ధరించిన శరీరాలను నిందిస్తూఉంటారు. శరీరం అశాశ్వతమైనదనీ, నీటిబుడగ

7. మహాభారతము- విరాటపర్వావతారిక - ప. 23
8. యదా హ్యేవైష ఏతస్మిన్నుదర మన్తరం కురుతే
అథ తస్య భయం భవతి .(తైత్తిరీయం ఆనందవల్లి-7వ అనువాకం.)

వంటిదనీ, చీముసెత్తురులతో కూడుకున్నదనీ, 'బందిఖానా' వంటిదనీ రకరకాలుగా నిందారోపణలు చేస్తూఉంటారు. ఈ నిందారోపణ చేయటం వేదద్రష్టలకూ సనాతనధర్మానికీ అంగీకారంకానిపని. శరీరం అశాశ్వతమైనదే కావచ్చు. అయితే అంతమాత్రాన దానిని నిందించవలసిన పని ఏమిటి? ఈపండు రేపటికి ఉండదు, కుళ్ళిపోతుం దంటే రేపిలాగూ కుళ్ళిపోయేదేగదా అని ఈనాడే పారేస్తున్నామా! రేపుకుళ్ళిపోతుందన్న విషయం తెలిసి ఈరోజే దాన్ని తినేస్తున్నాం. అలాగే శరీరమశాశ్వతమైనదంటే శరీరాన్ని అలక్ష్యంచేయమని అర్థం కాదు. శరీరం ఎంతకాలముండేదీ మనం చెప్పలేం. కనుక దీపముండగానే ఇల్లుచక్కబెట్టుకున్నట్టు శరీరం మనతో ఉన్నప్పుడే కర్తవ్యనిర్వహణ చేసుకోవాలని అర్థం. ఈదృష్టితోనే మనపెద్దలు దేహం అశాశ్వత మన్నమాట అన్నారుగానీ, దేహాన్ని అలక్ష్యంచేయమని అర్థంకాదు. శరీరంమీద లేనిపోని వ్యామోహం, దాన్ని కందనీయకుండా సుఖ పెట్టాలి అనే తపన తప్పని మనవారినిర్ణయం. అయితే దాన్ని కొరగాని పదార్థంగా మనపెద్దలు భావించలేదన్నది సత్యమైనఊహ అవుతుంది. ధర్మసాధనకు శరీరమే మూలమన్నది మనవారి భావన.9

బుద్బుదం అంటే నీటిబుడగ. నీటిపైన నీటిబుడగ చిత్రంగా ఏర్పడుతుంది. ఆకాసేపూ రకరకాలశక్తులు అన్నివైపులకూ లాగిపట్టి ఆబుడగకు అస్తిత్వాన్ని ప్రసాదిస్తాయి. ఆ శక్తులు ప్రసాదించినంత కాలం ఆబుడగ ఉంటుంది. తరువాత పోతుంది. అలాగే శరీరంకూడా ఒక నీటిబుడగలాంటిది. ఎన్నెన్నో ప్రకృతిశక్తులు వివిధ కక్ష్యల్లో చిత్రమైన ఏకత్వంతో పనిచేయడంవల్ల శరీరం నిలబడుతోంది. వాటి ఏకత్వంలో కాలక్రమాన మార్పువచ్చినపుడు ఈశరీరం తన అస్తి త్వాన్ని కోల్పోతుంది. ఈచిత్రాన్నిగురించి ప్రకృతిశక్తులు దేహ రూపంతో అమరి మనకు ఇస్తున్న దుర్లభమైన అవకాశాన్ని సద్విని

9. శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్.

యోగపరచుకోవాలి. ఈదృష్టితోనే మన పెద్దలు దేహాన్ని బుద్బుదంతో పోల్చారు తప్ప, మనను భయపెట్టాలన్నది వారి ఉద్దేశం కాదు.

ఇక, చీము నెత్తురులతో కూడుకొన్నది, చెరసాలవంటిది మొదలైన ఆరోపణలు శరీరతత్త్వాన్ని తెలిసి ఉపయోగించుకోలేని వారు చేసినవి. పూర్వజన్మలో చేసిన పాపాలవల్ల శరీరంతో పుట్టవలసి వస్తోంది అనేవారిసంగతికూడా ఇంతే. శారీరకమైన జన్మ పాపంవల్ల కలిగింది అనేదానికంటే, 'పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః'10 అనుకునేదానికంటే, పరమేశ్వరుడు మనల్ని దండించడానికి భూమిమీద పారవేశాడు అనుకునేదానికంటే, పరమేశ్వర కార్యంలో నియుక్తులమైనవారమనీ, "విశ్వమఖిలముద్ధర్తుం హరిణా ప్రేషితావయమ్"11 అనేభావంతో, 'అమృతస్యపుత్రాః'12 అన్న విశ్వాసంతో అమృతులమే అని తెలుసుకొని ఈసృష్టియజ్ఞం కొనసాగినఫలం మనమనీ, కొనసాగించవలసింది మనమేననీ గ్రహించడం ఆవశ్యకం. ఈదివ్యదర్శనమే సరియైనదీ, సమగ్రమైనదీ.

మొదట ప్రజాపతిస్వరూపుడైన పరమపురుషుడు తాను అనేక విధాలుగా కావాలి అని కోరుకున్నాడట.13 అతని మహాకామం వల్లనే ఈసృష్టికీ, సృష్టిలోని మనకీ అస్తిత్వమేర్పడిందని శ్రుతి చెబుతోంది. ఈసత్యాన్ని దర్శించినవారు గనుకనే వేదఋషులు దేహాన్ని దేవాలయంగా, ఆదేహంలో బసచేసిన జీవుణ్ణి సనాతనుడైన దేవుడిగా ఎరిగి గానంచేశారు.14

---

10. సంధ్యావందనంలోనూ, నిత్యపూజల్లోనూ చెప్పుకోబడుతున్న మంత్రం ఇది.
11. ఆర్యవ్యవహారంలోనిది
12. ఆర్యవ్యవహారంలోనిది
13. సోఽకామయ బహుస్యాం ప్రజాయేయేతి - (తైత్తిరీయం - ఆనందవల్లి) 6వ అనువాకం
14. దేహోదేవాలయః ప్రోక్తో జీవోదేవస్సనాతనః

—(ఆత్మపూజా)

ప్రకృతి ప్రసాదించిన దేహాన్ని, ఆ దేహంద్వారా ప్రకృతి ప్రసారం చేస్తున్న శక్తియుక్తుల్ని మానవుడు సద్వినియోగపరచుకోవడం నేర్చుకోవాలి. అందునా ఇతరశరీరాలకన్నా మానవ శరీరం బ్రహ్మాండానికి ప్రతిరూపంగా రూపుకట్టుకుంది. కాబట్టే దీన్ని పిండాండమన్నారు. మానవుడు సృష్టిమొత్తానికి విత్తనం వంటివాడన్నమాట. చెట్టు తత్త్వమంతా విత్తనంలో పొదగబడి ఉన్నట్టు, సృష్టితత్త్వమంతా మానవనిర్మాణంలో పొదగబడి ఉంది. కాబట్టే ఆదిశంకరులు "జంతూనాం నరజన్మ దుర్లభం"15 అన్నారు. సృష్టి పరిణామక్రమంలో జీవి మానవశరీరాన్ని పొందగలగటం ఒక మహత్తరమైన అవకాశమన్నమాట.

శరీరం దానంతటది రాలి పడిపోవడమేతప్ప, ఎలాంటి పరిస్థితుల్లోనూ మానవుడు శరీరాన్ని తనునుంచి బలవంతంగా తప్పించకూడదు. అంతేకాదు, ఆవశ్యకత ఏర్పడినపుడు తన కంతవరకూ అభ్యాసంలేని అన్నపానాలనైనా స్వీకరించి శరీరాన్ని నిలపాలిగాని, తనకు అలవాటైనవి దొరకలేదు గదా అని శరీరాన్ని నిర్లక్ష్యంచేసి పోగొట్టుకోకూడదు. ఈ అంశమే భీష్ముడు విశ్వామిత్ర చండాల సంవాదం ద్వారా ధర్మరాజుకు ఉపదేశించాడు.

పూర్వం త్రేతా ద్వాపరయుగాలకు సంధిలో ఘోరమైన కరువువచ్చింది. ఆహారధాన్యాలు పూర్తిగా కరువైపోయాయి. ఆహారందొరక్క జనం పడిపోసాగారు. అలాంటి దారుణసమయంలో విశ్వామిత్రుడు ఆహారంగాని, కందమూలాలుగాని, మాంసంగాని ఎక్కడా లభ్యపడక తూలిపోతూ నడుస్తున్నాడు. వెళ్ళగావెళ్ళగా ఒకచోట పసువుల బొమికలు, పందులడొక్కలు, కుక్కల పుత్తెలు గుట్టలు గుట్టలుగా పోయబడి ఉన్న చండాలురవాడ ఎదురైంది.

15. వివేక చూడామణి - 2

చండాలుని ఇంటిముందు తోలు వలిచి వెళ్ళాడగట్టబడిన కుక్క-మాంసాన్ని చూశాడు. తానా అలిసిపోయాడు. ప్రాణాలేమో పోయేట్టున్నాయి. ప్రాణరక్షణమే పరమధర్మమని ఎట్టకేలకు నిర్ణయించుకుని, ఆ కుక్క-మాంసాన్ని తస్కరించడానికే నిర్ణయించుకున్నాడు. శరీరాన్ని నిలబెట్టడంకోసం ఇలాంటి విషమస్థితిలో దొంగతనం తప్పుకాదని నిశ్చయించుకున్నాడు. అంతలో అర్ధరాత్రి అయింది. విశ్వామిత్రుడు మెల్లగా చేరి కుక్క-మాంసాన్ని తీసుకోబోయాడు. ఆ అలికిడికి చండాలుడు లేచాడు. చండాలుడికీ విశ్వామిత్రుడికీ కొంచెం దీర్ఘంగానే సంవాదం జరిగింది. విశ్వామిత్రుండంతటి వాడు చండాలుడి ముంగిట కట్టబడ్డ కుక్క మాంసానికి ఆశపడటం తగదని చండాలుడి అభిప్రాయం. ప్రాణరక్షణకోసం స్వీకరించడం తప్పుకాదనీ ఆ పైన తపస్సుతో ఆ దోషాన్ని పోగొట్టుకోవచ్చనీ విశ్వామిత్రుడి సమాధానం. ఏ విధంగా నైనా శరీరం పడిపోకుండా చూడటమే పరమధర్మం అని విశ్వామిత్రుడి నిర్ణయం.16 ఎట్టకేలకు చండాలుణ్ణి ఒప్పించి కుక్క నంజుణ్ణి స్వీకరించి దేహాన్ని నిలుపుకుంటాడు విశ్వామిత్రుడు.

ఈ విధంగా శరీరాన్ని నిలబెట్టుకోవలసిన ఆవశ్యకతను గూర్చి భారతం గాయత్రిని దర్శించి ఇచ్చిన విశ్వామిత్రుడి జీవితసన్నివేశం ద్వారానే ఉపదేశిస్తోంది. శరీరం మానవుడికి దైవదత్తమైన చక్కని ఉపకరణం. దాన్ని ఉపయోగించుకుని ఉత్తమస్థితిని పొందడం మానవుడి కర్తవ్యం.

---

16. .... .... .... .... యెట్లై
నను బోవనీక ప్రాణము
దనువున నిల్పుటయ చూవె ధర్మంబరయన్.

(ఆం. మ. భా. - శాంతి - 3 - 292)

## శరీర పోషణకై హింస తగునా ?

సామాన్యలోకంలో శరీరపోషణకు మాంసాహారంకన్నా శాకాహారం మేలైనదన్న అభిప్రాయం ఒకటిఉంది. మాంసాహారం హింస అనీ, శాకాహారం అహింస అనీ భావించేవారుకూడా ఉన్నారు. నిజానికి అంతోఇంతో హింస రెండింటిలోనూ ఉంది. కోళ్ళు మొదలైనవాటిని కోసితిన్నా, కందమూలాదులను పెళ్ళగించి తిన్నా, ఆయా ప్రాణులకు బాధకలగడం, వాటి అస్తిత్వానికి భంగం కలగడం, వాటినుంచి ఉద్భవించబోయే వారసులకు స్వస్తి పలకడం తప్పనిసరి అవుతోంది. ఇలా పరిశీలిస్తూపోతే ఈసృష్టిలోనే ఒకజీవికి మరొకజీవి ఆహారంగా ఏర్పాటు చేయబడినట్టు కనిపిస్తుంది. చీమను చూస్తే కప్పకు మింగబుద్ధి అవుతోంది. ఆ కప్పను పాము పడుతోంది. ఆపామును నెమలి తింటోంది. ఆ నెమలిని వేటగాడు కొడుతున్నాడు. ఈ విధంగా సృష్టిలో ఒకజీవికి మరొకజీవి ఆహారంగా అమరుతోంది. స్థూలదృష్టికి ఒకజీవిని మరొకజీవి హింసించి బ్రతుకుతోంది. 'జీవో జీవస్య జీవనం' ఇది లోకరీతి. సూక్ష్మదృష్టితో చూసినపుడు ఒకే అంతర్యామి ఇన్ని తరహాల దేహాలను ధరిస్తూ ఒకదేహాన్ని మరొక దేహానికి ఆహారంగా సమర్పిస్తున్నాడు. ఇది తప్పనిసరయి సృష్టి యజ్ఞంలో జరుగుతున్న ధర్మమైన జీవహింస.

ఈ సత్యాన్ని తెలియచెబుతూ ధర్మవ్యాధుడు కౌశికుడితో ఇలా అంటున్నాడు: 'రైతు నాగలితో భూమిని దున్నుతున్నప్పుడు ఆ నాగటికర్రు తగిలి ప్రాణులెన్నో చనిపోతున్నాయి. అది హింస అవుతుందా ? కాదా ? మనుషులు అటూ ఇలా తిరుగుతున్నప్పుడు వారి పాదాలక్రిందపడి వారికి తెలియకుండా జీవులనేకం ప్రాణాలు విడుస్తున్నాయి. మరి దాన్ని హింస కాదనవచ్చా ?

'నీరూ, భూమీ, ఆకాశం - సర్వమూ జంతుమయం కాబట్టి ఏకర్మను మొదలుపెట్టినా ఎంతో కొంత హింస జరక్కతప్పదు.

హింస జరక్కుండా దేహయాత్ర నడపటం సాధ్యంకాదు. ఇవేమీ గమనించకుండానే కొందరు తాము అహింసాపరులమని అనుకుంటారు.

పనికట్టుకుని అరణ్యంలో మునులై చరిస్తున్నవారికి కూడా ఫలమూలాదులను పీడించడం తప్పడంలేదు గదా !

హింస చేయనివాడు ఈ లోకంలో లేడు. ఎవరికివారు తమకు సాధ్యమైనంతవరకూ హింసకు దూరంగా ఉండటమే అహింస అవుతుంది.17

శరీరపోషణకు ఆహారస్వీకరణ ఆవశ్యకం కనుక, ఆహారస్వీకరణ కోసం చేసే హింస ధర్మం. ఆహారోత్పత్తికిగాను నెలకొన్న వ్యవసాయాది వృత్తినిర్వహణలో అప్రయత్నంగా జరిగే ప్రాణిహింస ధర్మం. ఈ విధంగా మానవుడి ఉనికికీ, ఆహారవిహారాలకూ ఆవశ్యకమైన హింస ధర్మం అవుతోంది. ఇంతకుమించి అనగా తన శరీర పోషణకు మించి తోడిజీవులకు ఇబ్బంది కలిగించనంతవరకూ అతడిది ధర్మమార్గమే అవుతుంది. తన నిత్యావసరాలకు మించి ఏ వేటపేరిటో, వేడుకపేరిటో తోడిప్రాణుల్ని హింసించడం వ్యసనం, అధర్మం అవుతుంది ప్రకృతిలోని క్రమాన్ని గమనించి ఆ క్రమానికి బద్ధుడై మానవుడు తన దేహయాత్రను నడపటం నేర్చుకోవలసి ఉంది.

ఇక శాకాహారం మేలా, మాంసాహారం మేలా అన్న ప్రశ్న ఒకటి ఉంది. ఇది ఎవరి శరీరతత్త్వాన్ని బట్టి వారు నిర్ణయించుకోవలసింది. ఒకొక్కరి శరీరం శాకాహారాన్ని కోరుతుంది. మరొక తత్త్వంగల శరీరం మాంసాహారాన్ని అపేక్షిస్తుంది. ఎవరి శరీర తత్త్వాలకు తగిన ఆహారం వారు స్వీకరించడం ధర్మం అవుతుంది. ఈ శాకాహార మాంసాహార భేదం ఒక్క మానవుల్లోనేకాదు, మిగిలిన

17. ఆం. మ. భా - అరణ్య - 5-17-60

జంతువుల్లో కూడా ఉంది. జంతువుల్లో ఆవు, గేదె, గుఱ్ఱం, గాడిద, ఏనుగు మొదలైనవి శాకాహారులు. బల్లి, పిల్లి, పులి, సింహం మొదలైనవి మాంసాహారులు. ఆ యా జంతువులు ఈ శాకాహార మాంసాహార విభాగాన్ని కోరి అభ్యాసం చేయడంలేదుగదా! వాటికి కావాలనిపించిన ఆహారాన్ని అవి స్వీకరిస్తున్నాయి. అలాగే మానవుల్లో కూడా ఎవరిప్రవృత్తికి తగిన ఆహారం వారి మనస్సు అపేక్షిస్తుంది. శరీరం తన అస్తిత్వానికి కోరుకున్న ఆహారాన్ని అందించడం మానవుడి కర్తవ్యం. కాబట్టి ఈ విషయంలో ఏఆహారం మంచిదని ఇతరుల్ని సలహా అడిగేబదులు, ఎవరి శరీరప్రవృత్తుల్ని వారు గమనించుకొని నిర్ణయించుకోవడం మంచిది. ఈ అంశాన్ని గమనించి ఆచరణలో పెట్టుకున్నవాడు ధర్మవ్యాధుడు. అతడు జంతువుల్ని చంపేవాడుకాదు. చంపబడిన జంతువుల్ని కొని తెచ్చే వాడు. తాను మాంసాహారాన్ని స్వీకరించేవాడుకాదు. స్వీకరించే వారికి విక్రయించేవాడు. తన ప్రవృత్తినిబట్టి తనకు మాంసాహారం అవసరంలేకపోయింది. కాబట్టి మాంసాహారాన్ని స్వీకరించక పోవడం తనకు ధర్మం. తానా ధర్మాన్ని పాటించాడు. మాంసాహారాన్ని స్వీకరించే ప్రవృత్తికలవారికి మాంసాహారం స్వీకరించడం ధర్మం. ఆ ధర్మం కలవారికే అతడు మాంసాహారాన్ని విక్రయించాడు. మానవుడు తనకు ధర్మమయిందే అందరికీ ధర్మమై తీరాలని అనుకో కూడదు. అలా అనుకోవడం ప్రకృతికి విరుద్ధం. దేశకాలపాత్రాలను బట్టి ఆచరణీయమైన ధర్మం రూపుకట్టుకుంటుందని గ్రహించాలి.

వ్యక్తి తత్త్వంపైన అతడు అపేక్షించే ఆహారం ఆధారపడి ఉంటుందని చెప్పుకున్నాం. ఆ తత్త్వం అతడిలో పనిచేసే త్రిగుణాల కలయికవల్ల వ్యక్తమవుతుంది. ఆ త్రిగుణాల్లో దేనిప్రభావం ఎక్కువగా ఉంటుందో ఆగుణం ఆ వ్యక్తికి స్వభావాన్ని రూపొం దించడంలో ప్రధానపాత్ర వహిస్తుంది. ఈ మూడుగుణాల ప్రభావా

లను అనుసరించి మూడురకాల ఆహారాలకు అపేక్షించేవారు లోకంలో ఉంటూ ఉంటారని కృష్ణుడు గీతలో వివరించాడు.18

సత్త్వగుణం ప్రధానంగా కలవాడికి సాత్త్వికాహారం అంటే ఇష్టంగా ఉంటుంది. ఆయువు, సత్త్వం, బలం, ఆరోగ్యం, సుఖం, ప్రీతి అనేవాటిని పెంచే ఆహారం సాత్త్వికం. రసవంతాలూ, చమురు కలవీ, స్థిరత్వం కలవీ, హృదయానికి ఇంపైనవీ అయిన ఆహారాలు ఇలాంటివి.19 రసవంతాలు (రస్యాలు) అంటే రసం కల కాయలు, పండ్లు, పువ్వులు, ఆకులు. చమురు కలవి (స్నిగ్ధాలు) అంటే నువ్వులు మొదలైన చమురు పదార్థాలు. స్థిరాలు అంటే దేహ ధాతువులకు స్థిరత్వాన్ని ఇచ్చే పప్పులు, దుంపలు మొదలైనవి. హృద్యాలు అంటే తేనె, నేయి మొదలైన గుండెకు బలమిచ్చే పదార్థాలు. సాత్త్వికస్వభావం కలవాడికి ఇవన్నీ ప్రియంగా ఉంటాయి. ఆహారం స్వీకరించడం అంటే ఈ చెప్పబడినవాటిలో లభ్యమైనవాటిని స్వీకరించడమని సాత్త్వికుని భావన.

రజోగుణ ప్రవృత్తి కలవారికి కారం, పులుపూ, ఉప్పూ, వేడి వేడిగా ఉండేవీ, జిహ్వకు తీక్ష్ణమైన రుచిని అందించేవీ, ఎండ పెట్టినవీ, కాల్చినవీ అయిన ఆహారాలు ఇష్టంగా ఉంటాయి. ఇవి దుఃఖాన్ని, శోకాన్ని, రోగాలనూ కలిగిస్తాయి.20 ఎండబెట్టినవి అంటే ఒరుగులు, వడియాలూ మొదలైనవి. కాల్చినవి అంటే, వేపుళ్ళు, కాల్చినకూరలు, మాంసం మొదలైనవి. దుఃఖాన్ని కలిగించేవి అంటే మనస్సుకు దిగులూ, శోకభావం పెంచేవి. ఉప్పూ, పులుపూ, కారాలూ హెచ్చుగా వాడటంవల్ల ఇవి కలుగుతాయి.

---

18. ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః (భగవద్గీత - 17-7)
19. ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
 రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః (భగవద్గీత - 17-8)
20. కట్వామ్ల లవణా త్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః ।
 ఆహారా రాజసస్యేష్టా దుఃఖ శోకామయప్రదాః ॥ (భగవద్గీత - 17-9)

తామసప్రవృత్తి కలవారికి వండిన వెనుక మూడుగంటలు దాటినవీ, రుచి తప్పేవరకూ నిలవఉన్నవీ, దుర్వాసన వేసేవీ, చద్ది పోయిన పదార్థాలు- అంటే, ఒక పూట దాటిన చద్దన్నం మొదలైనవీ, తిని మిగిల్చినవీ లేక ఎంగిలి పదార్థాలూ, మేధకు పనికిరానివీ రుచిస్తాయి.21 మేధకు పనికిరానికి (అమేధ్యం) అంటే తెలివినీ, చురుకుతనాన్నీ హరించగల ఆహారం.

ఇది కృష్ణుడుచేసిన ఆహారవిభజన. దీన్నిబట్టి మనలో ఏగుణం ప్రాధాన్యం వహిస్తుంటే ఆగుణానికి సంబంధించిన ఆహారం మనకు నచ్చుతుంది. మనకు నచ్చే ఆహారాన్నిబట్టి మనలో ప్రాతినిధ్యం వహిస్తున్న గుణాన్ని మనం గమనించుకోవచ్చు. ఈసందర్భంలో గమనించ వలసిన సూక్ష్మం మరొకటిఉంది. ఒకగుణానికి సంబంధించిన ఆహారాభి లాష కలవ్యక్తి కావాలనికోరి మరోగుణానికి సంబంధించిన ఆహారాన్ని స్వీకరించడం ప్రారంభిస్తే, క్రమంగా అతడిలో ప్రాతినిధ్యం వహించే గుణంకూడా మారుతుంది. ఉదాహరణకు, రజోగుణప్రవృత్తి కలవాడు తమోగుణానికి సంబంధించిన చద్దిపోయిన పదార్థాలూ, రుచితప్పిన పదార్థాలూ మొదలైనవి తినడం ప్రారంభిస్తే, క్రమంగా అతడి ప్రవృత్తిలో రజోగుణం వెనక్కితగ్గి, తమోగుణం ప్రాతినిధ్యం వహించడం ప్రారంభిస్తుంది. అలాగే ఏ తమోగుణ ప్రవృత్తి కలవాడో కావాలనికోరి సాత్త్వికమైన ఆహారాన్ని అలవాటు చేసుకోసాగితే, క్రమంగా అతడి ప్రవృత్తి సత్త్వోన్ముఖం అవుతుంది. ఈ సత్యాన్ని గమనించే పెద్దలు 'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః' అని చెప్పారు.

సత్త్వగుణ సంపన్నులైన పెద్దలు ఆధ్యాత్మికసాధనకు శాకాహారం మంచిదని చెప్పడంలో కూడా ఒక ధర్మసూక్ష్మం ఉంది.

---

21. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥ (భగవద్గీత-17.10)

చెట్లకు మూలచ్ఛేదం కలగకుండా అవి ఇచ్చే ఆకులూ, కాయలూ, పళ్ళూ, జంతువులకు మూలచ్ఛేదం కలగకుండా అవి ఇచ్చే పాలూ, ఆ పాలనుంచివచ్చే పెరుగూ, నెయ్యీ స్వీకరించడంవల్ల ప్రాణుల ఉనికికి ముప్పురాకుండా అవి అందించే ఫలాలను మాత్రమే స్వీకరించి తృప్తిపడటం జరుగుతుంది. తోడిజీవులకు తమవల్ల ఎక్కువ బాధ కలగకుండా జీవించగలిగే సాధన ఈ ఆహార స్వీకరణలో ఇమిడి ఉంది.

వానప్రస్థాన్ని స్వీకరించిన పెద్దలు మరో అడుగు ముందుకు వేసి ఆకుల్ని కొయ్యకుండా రాలిన ఆకుల్నీ, కాయల్ని కొయ్యకుండా రాలిన పళ్ళనీ,22 మొలకెత్తడానికి అవకాశంలేకుండా రాతిబండల మీద పడ్డగింజల్నీ ఏరుకుని తిని23, తమవల్ల జీవులకు బాధకలగటం లేదనీ, తాము మరొక జీవికి జన్మనెత్తే అవకాశం లేకుండా చేయడం లేదనీ తృప్తితో ముందుకు సాగేవారు. ఈ సాధన భూతదయ పెరగడానికీ, తద్వారా ఆత్మసాక్షాత్కారానికీ దారితీస్తుంది. వారు ఆశించిన గమ్యానికి అనువుగా ఉండేటందుకు తుదకు ఆహారస్వీకరణను కూడా ఒక సాధనమార్గంగా వారు మలచుకున్నారు.

మనిషిప్రవృత్తి తనకు తగిన ఆహారాన్ని అపేక్షిస్తుంది. మనిషి తనకార్యసాధనమూ, గమ్యాన్నీ దృష్టిలో పెట్టుకొని ప్రవృత్తికి తగిన ఆహారాన్ని అందించడమో; లేదా, ఆవశ్యకమైనపుడు తన గమ్యానికి తగినట్టుగా ప్రవృత్తిని మలచుకోవడమో చేయాలి. శారీరకంగా శ్రమించడం కర్తవ్యంగా కలవారికి ఒకరకమైన ఆహారం కావాలి. దేశసరిహద్దుల్లో రక్షణకై నిలబడినవారికి ఒకరకమైన ఆహారం కావాలి. ఆధ్యాత్మిక సాధనలో ముందుకుసాగి సత్త్వసిద్ధిని పొందగోరేవారికి ఒకరకమైన ఆహారం కావాలి.

---

22. అంతతః ప్రవృత్తాని (ఆపస్తంభ సూత్రాలు - 2-9-22-3.)
23. శిలోంఛేన వర్తయేత్ (ఆపస్తంభ సూత్రాలు-2-9-22-10)

ఈ సత్యాన్ని గ్రహించి మానవుడు తన ప్రవృత్తినీ, కర్తవ్యాన్నీ గమనించుకొని సమన్వయపరచుకొని తనకు తగిన ఆహారాన్ని నిర్ణయించుకొని స్వీకరించాలి.

## ఆలుబిడ్డలూ, అయినవారూ ఆధ్యాత్మికతకు అడ్డమా ?

భార్యాబిడ్డలు ఆధ్యాత్మిక జీవితానికి అడ్డంకి అని భావించే వారు అన్ని కాలాల్లోనూ ఉంటూనే ఉంటారని చరిత్రగతిని చూసి నపుడు బోధపడుతుంది. వివాహం చేసుకున్నవారు యోగసాధనకు పనికిరారని భావించేవారు కూడా ఉన్నారు. వివాహం చేసుకోకుండా ఉన్నప్పుడుగాని, లేదా ఆలుబిడ్డలతో బంధాలు త్రెంచుకున్నప్పుడు గాని తప్ప, యోగసాధనకు పనికిరారని ఉద్దేశపడేవారున్నారు. గృహస్థజీవితానికీ, ఆధ్యాత్మికసాధనకూ పొంతన కుదరదనీ, ఒకదాని కొకటి చుక్కెదురనీ భావించేవారున్నారు. కాని మన సనాతన సంప్రదాయాన్ని పరిశీలించినపుడు పై అభిప్రాయాలన్నీ ఆధారంలేనివనీ, ఆ సంప్రదాయానికి అంగీకారం కానివనీ తెలుస్తుంది.

వేదమార్గాన్ని దర్శించి ఇచ్చిన ఋషుల్లో పవిత్రమైన గృహస్థ జీవితాన్ని గడిపినవారెందరో ఉన్నారు. అంతేకాక భార్యను పవిత్ర మూర్తిగా సంభావించినవారు ఉన్నారు. రాముడు అరణ్యవాసం చేసేకాలంలో అత్రిమహర్షి ఆశ్రమానికి వెడతాడు. అప్పుడు అత్రి మహర్షి వారికి తన భార్య అయిన అనసూయను ఆరాధించతగిన పుణ్య మూర్తిగా తెలియచెప్పి పరిచయం చేస్తాడు. వేదమార్గాన్ని విస్తృత పరచిన ఋషులందరూ చతురాశ్రమ నిర్వహణతో జీవితం పరి పూర్ణత చెందాలని దర్శించి నిర్దేశించినవారే. ఆ ఋషుల్లో ఎక్కువ మంది చతురాశ్రమాలను లోకహితంగా నిర్వహించినవారే. కొందరుమాత్రం తమతమ స్వభావాలనుబట్టి గృహస్థాశ్రమాన్ని స్వీకరించని ఆజన్మబ్రహ్మచారులుగా ఉండేవారు, వారు తమ

ప్రణాళికకు తగిన మార్గాన్ని అనుసరించారుగాని, గృహస్థాశ్రమ స్వీకరణ నేరమని ఎక్కడా చెప్పలేదు. పైగా మిగిలిన మూడాశ్రమాలకూ గృహస్థాశ్రమమే ఆధారమని ఘోషించారు.

ఇక మనచేత నిత్యమూ పూజింపబడే రాముడు, కృష్ణుడు గృహస్థాశ్రమాన్ని స్వీకరించినవారే. అపహరించబడిన తనభార్య కోసం విలపిస్తూ రాముడు ఎన్నోసార్లు మూర్ఛపోయాడుకూడా. తనదుఃఖాన్ని లక్ష్మణుడి సాయంతో కార్యసాధనకు ఉన్ముఖం చేసి, వానరులతో చేతులు కలిపి, వారధికట్టి, రావణుణ్ణి చంపి, భార్యను దక్కించుకున్నాడు. తనను రాక్షసపద్ధతిలో కొనిపోవలసిందిగా వర్తమానం పంపిన రుక్మిణి ఆరాధనను మన్నించి శ్రీకృష్ణుడు రాక్షసపద్ధతిలో ఆమెను కొంతెచ్చుకున్నాడు. సత్యభామ పారిజాత పుష్పంకోసం అలిగితే వృక్షాన్నే కొనివచ్చి ఆమె ముంగిట నాటాడు. ఈవిధంగా రాముడూ, కృష్ణుడూ నిండైన గృహస్థులుగా మనకు దర్శనమిస్తున్నారు.

అయితే పెద్దలు వ్రాసిన గ్రంథాల్లో కూడా అక్కడక్కడా స్త్రీలనుగూర్చి బంధకారణాలుగా చెప్పబడటం జరిగింది కదా అనవచ్చు. కొంచెం నిదానించి పరిశీలిస్తే పెద్దల సందేశంలో స్త్రీతోడి సాంసర్గాన్ని 'అతి' చేసుకోవద్దని ఉందిగాని, స్త్రీని వదలివేయమనిగానీ, తక్కువగా చూడమనిగాని లేదు అని మనకు బోధపడుతుంది. స్త్రీపురుషులు తాము దాంపత్యసౌఖ్యాన్ని అనుభవించడంలో నియమాలను పాటించడం ఆత్మసాధన చేయగోరిన వారికే కాక, ఆరోగ్యాన్ని కోరుకునేవారికి కూడా అవసరం. జంతువుల్లోలాగా తాముకూడా ఋతుకాలంలో మాత్రమే దాంపత్యసౌఖ్యాన్ని అనుభవించాలనీ, ఆ సౌఖ్యానికి కూడా సంతానమే గమ్యంకావాలని సనాతన సంప్రదాయం చెబుతోంది. ఈ సంప్రదాయాన్ని అనుసరించినవారు దాంపత్యధర్మాన్ని ప్రకృతి ప్రణాళికకు అనుగుణమైన

ప్రాజాపత్యయజ్ఞంగా నిర్వహించినవారు అవుతున్నారు. ఈ యజ్ఞ నిర్వహణలో వారిచేత అనుభవింపబడుతున్నది ప్రకృతివిరుద్ధంకాని కామం. అంతేకాదు, సృష్టినిర్వహణకు ఆవశ్యకమైన కామం. కనుకనే ధర్మానికి విరుద్ధంకాని కామం నా స్వరూపం అన్నాడు కృష్ణుడు.24

ఇక స్త్రీపురుష సంసర్గాన్ని ఋతుకాలానికి పరిమితం చేసుకోకుండా తన కుతూహలాన్నిబట్టి విచ్చలవిడిగా అనుభవించడం ఆత్మసాధనకే కాదు, భౌతికజీవనానికి కూడా ప్రమాదం. స్త్రీపురుష సంసర్గం ధర్మస్థితిని విడిచి కోరికస్థితికి దిగజారినప్పుడు, మానవుడికి తృష్ణ పెరుగుతుందేకానీ తృప్తి కలగదు. భారతంలోని విచిత్రవీర్యుడు 'అనవరత కామాసక్తుడై' శరీరాన్ని కోల్పోయాడు తప్ప తృప్తిపడిన జాడలేదు. లోకంలో కోరికలు లేనివారు ఉండవచ్చునుకాని, కోరికలు పూర్తిగా తీరినవారంటూ ఉండరు. కాబట్టే పెద్దలు మానవులకు చూపింది కోరికలు తీరే మార్గంకాదు. కోరికలు తలెత్తని స్థితికి కొనిపోయేమార్గం. కోరికలు కోరనవసరంలేని నిత్యతృప్తిని ప్రసాదించే మార్గం. మనిషిని కోరికల వలలోనుంచి ధర్మమయజగత్తులోనికి నడిపించేమార్గం. వారి దృష్టిలో అన్నిటినీ అనుభవించాలి. కానీ ధర్మమార్గంలో అనుభవించాలి. అతిగా అనుభవించడం ఎంత తప్పో అనుభవిస్తే అతి అవుతుందేమోనని ఏమాత్రం అనుభవించకుండా దూరంగాఉండటంకూడా అంతతప్పే. ఆహారం ఎక్కువ తీసుకొంటే ఆరోగ్యానికి భంగమని చెబితే, ఆహారాన్ని తీసుకోవడం మానెయ్యమని అర్థంకాదు. ఆహారవిహారాలు ఆవశ్యకమే. వాటిని యుక్తమైన తీరులో నిర్వహించుకోవడం నేర్చుకోవాలని కృష్ణుడు గీతలో ఉపదేశించాడు.25

---

24. .... .... .... .... .... ....
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥ (భగవద్గీత - 7-11.)

25. యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ (భగవద్గీత-6-17.)

ఇంతకూ తేలినదేమంటే స్త్రీపురుష సంసర్గాన్ని ప్రకృతి ధర్మానికి అనుగుణంగా అనుభవించడం అభ్యసించాలని. ఈస్థితినుంచి జారిపోయి స్త్రీపురుషసంసర్గం కోరికగా విజృంభించినపుడు పురుషుడికి స్త్రీ ఎంత బంధమవుతుందో స్త్రీకి పురుషుడూ అంతే బంధమవుతాడు. జీవుల్లో స్త్రీపురుషభేదం తరువాతి తరాలు దిగిరావడంకోసం ప్రకృతిచేత కల్పించబడింది మాత్రమే. అన్ని రూపులూ అంతర్యామివేనని వేదమార్గం ఘోషిస్తున్నది. సకల సృష్టిలోనూ 'తాను' తప్ప అన్యంలేనిస్థితిని అనుభవించమని ఉపదేశిస్తున్నాడు కృష్ణుడు.26 ఆ స్థితిలో నిలిచినవారూ, నిలవదలచిన వారూ - అందరూ అంతర్యామిని దర్శిస్తారుగాని, స్త్రీపురుషులను వేరుగా చూడటం, వారిలో ఒకరికన్నా మరొకరు తక్కువని ఊహించడం, ఒకరికొకరు అడ్డమని భావించడం మొదలైన కూడని అభిప్రాయాలకు లోనుకారు.

పరమార్థాన్ని విడిచిపెట్టి, కేవలం పాండిత్యమే పరమావధిగా పెట్టుకొన్నవారివల్ల సమాజంలో ఇలాంటి అక్కరలేనిభావాలు తలెత్తి ప్రాణంపోసుకొంటూ ఉంటాయి. ఋషులవాక్కుల్లో పథనిర్దేశం ఉంటుందితప్ప, నింద ఉండదు. ఆరోగ్యకరమైన నియమాలు ఉంటాయి తప్ప అనవసరమైన నిబంధనలూ, నిర్బంధనలూ ఉండవు. పరమార్థాన్ని వదలిన పండితులనుదాటి ఋషులనూ, అవతారమూర్తులనూ సమీపించినపుడు వారి సమదర్శనం మనకూ సిద్ధిస్తుంది. ఆస్థితిలో నిలిచినపుడు భార్యాభర్తల్లో ఒకరిదేహం మరొకరికి దేవాలయంగా సాక్షాత్కరిస్తుంది. అర్చించుకొనేభాగ్యాన్ని తనకు అనుగ్రహించడానికే భగవంతుడు అంతసన్నిహితంగా వర్తిస్తున్నాడన్న దర్శనం లభిస్తుంది.

---

26. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ (భగవద్గీత-9.22)

దాంపత్యాన్ని ఆరాధనారూపమైన సాధనగా ప్రత్యేకించి మలచిన మార్గాలు కూడా కొన్ని ఉన్నాయి. అదే కాళీతంత్రం, మహానిర్వాణతంత్రం, శ్రీవిద్య మొదలైనవి. ఈసాధన విషయమై మహానిర్వాణ తంత్రం ఏం చెబుతోందో చూడండి: "స్త్రీ పురుషాది సంబంధాల్లో నరునిభావం ఏమరుపాటు చెందితే పతనోన్ముఖం అవుతుంది. జంతువులకు ఈ విషయంలో పశుభావం ఉంటుంది. అంటే పాశబద్ధమైన భావం ఉంటుంది. ఋతుకాలం అనేదాన్ని ప్రకృతి ప్రసాదిస్తేగానీ పశువుకు కామంకలగదు. నరుడు తన నీచభావాన్నుంచి మొదట పశుభావాన్ని సాధనచేసి నేర్చుకోవాలి. అటుపైన కామాన్ని ఒక దేవతగా భావించి దాంపత్యసౌఖ్యం నియత కాలాల్లో అతిస్వేచ్ఛగా అనుభవించాలి. దీనిని సాధించడం వీర భావం లేక వీరగోష్ఠి అంటారు. ఇది చేతనైనవెనుక మోక్ష ధర్మానికి కావలసిన ఏకాగ్రతనూ, నిర్మల ఆనందాన్నీ భార్యతో ఏకాంతక్రీడలో సాధించాలి. అంటే నగ్న ఆలింగన చుంబనాది చేష్టలు ఆరాధనావిశేషాలుగా సాధించి నిష్కామస్థితిని సిద్ధింపజేసుకోవాలి. అప్పుడు అందుకు సహాయపడే స్త్రీమూర్తిని ఆదిశక్తి స్వరూపిణి అంటారు. భార్యను స్వశక్తి అంటారు. ఆమెయందు భార్యాభావం దాటి దివ్యభావం సిద్ధించినపుడు పరాశక్తి అంటారు. దీన్నిసాధించడానికి ఏకపత్నీవ్రతులూ, వివాహానికిముందు అఖండ బ్రహ్మచర్యం సాధించినవారూ, శాంతులూ, దాంతులూ అయిన శుచిస్వరూపులు మాత్రమే పనికివస్తారు."27 కలియుగంలో

---

27 పశువీరదివ్యభావా దేవతా మంత్ర సిద్ధిదాః
కలౌ నపశుభావోఽస్తి దివ్యభావ కుతో భవేత్
.... .... .... .... .... ....
.... .... .... .... .... ....
కలి కల్మష యుక్తానాం సర్వదాఽస్థిర చేతసామ్
నిద్రాలస్య ప్రసక్తానాం భావశుద్ధిః కథంభవేత్
.... .... .... .... .... ....
దివ్యశ్చదేవతాప్రాయః శుద్ధాంతఃకరణః సదా
ద్వంద్వాతీతో వీతరాగః సర్వభూతసమః క్షమీ
(మహానిర్వాణతంత్రం - 1 - 51 - 59)

పశుభావనను అలవరచుకోవడం నరుడికి అతిదుర్లభమని చెబుతున్న మహానిర్వాణతంత్రంలో ఈసాధనకు చెందిన అంశాలు విపులంగా వర్ణింపబడ్డాయి.

అంతర్యామి ఖనిజాల్లో నిద్రావస్థనూ, వృక్షాల్లో స్వప్నావస్థనూ, జంతువుల్లో జాగ్రదవస్థనూ, నరుల్లో పరిపూర్ణమైన మేలుకొలుపునూ అభినయిస్తున్నాడు గనుక నరులరూపంలో అంతర్యామిని అర్చించగలిగినవాడు మోక్షద్వారానికి దగ్గరపడతాడు. ఈవిధమైన సజీవ విగ్రహారాధనకు ఎదిగినపుడు భార్యాబిడ్డలూ, తల్లిదండ్రులూ, అత్తమామలూ, బంధుమిత్రులూ, అతిధి అభ్యాగతులూ, పరిచారకులూ, ఆశ్రితులూ- అందరూ ఆసాధకుడికి అర్చించుకోవడానికి అవకాశం ఇచ్చిన దేవుడి సజీవవిగ్రహాలే అవుతారు. అప్పుడు కుటుంబమే ఒక యజ్ఞశాలగా, ఒక తీర్థస్థలంగా రూపుదిద్దుకుంటుంది. ఈ సత్యాన్నే కౌశికుడికి బోధపరిచాడు ధర్మవ్యాధుడు.

ధర్మవ్యాధుడు బోధించిన ఆచరణీయమైన ధర్మమార్గానికి అబ్బురపడ్డాడు కౌశికుడు. తాను పెద్దపెద్ద సమస్యలుగా భావించిన వాటిని ధర్మవ్యాధుడు సున్నితంగా, సులువుగా సమన్వయపరచి చెప్పేటప్పటికే అతడి ఆశ్చర్యం అవధులు దాటింది. ఈవిధమైన దివ్యజ్ఞానాన్ని పొందటానికి కారణం ఎవ్వరో చూపిస్తాను రమ్మన్నాడు ధర్మవ్యాధుడు. ఆకారణమేదో తెలుసుకోవాలన్న కుతూహలంతో లోపలికి ప్రవేశించాడు కౌశికుడు. ఆలోపల పండువృద్ధులైన ధర్మవ్యాధుడి తల్లిదండ్రులున్నారు. వారిని చూపిస్తూ ధర్మవ్యాధుడు 'వీరికి శుశ్రూష చేయడంవల్లనే నాకు ఈజ్ఞానమంతా లభించింది' అని వివరించాడు. ఆ సందర్భంలోని అతడి పలుకులు చూడండి :

"జననుత ! వీరు నాజననియు జనకుండుఁ
 జూవె; వీరలకు శుశ్రూష సేసి
యిట్టిపరిజ్ఞాన మేను బ్రాపించితి;
 నమరులఁ బూజింతు రర్థి నెల్ల
వారును; నొండు దైవంబుల నెఱుఁగ నీ
 వృద్ధుల నాపాలివేల్పు లనఘ;
కమనీయ ఫలపుష్ప గంధభూషణ వస్త్ర
 ములు మనోహర భక్ష్యభోజ్యములును

వీరి కెపుడు నివేదింతు; వేడ్కఁ బుత్త్ర
దారసహితుండనై నియతముగ సేవ
యాచరింతును; వేదముల్ యజ్ఞములు వ్ర
తంబులును వీర నాకను తలఁపు నిజము".28

బంధుమిత్రులరూపంలో చేరువైన భగవంతుడి మూర్తులను వదలి ఆత్మసాధనకు ప్రత్యేకంగా ప్రయత్నించడం మానవుని అపరిణతస్థితిని తెలియజేస్తుంది. కౌశికుడు ఇలాంటి అపరిణతస్థితికి ప్రతినిధి. అతడు తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు. మోక్షాన్ని సాధించగోరి తల్లిదండ్రుల్ని వదలి అరణ్యాలకు చేరాడు. పాపం ఆ తల్లిదండ్రులు కొడుకకోసం దుఃఖించి, దుఃఖించి, దృష్టినికూడా కోల్పోయి ఆర్తితోపాటు అంధత్వాన్నికూడా పొందారు.

తనచూపుకు కలిగిన శక్తివల్ల పక్షి ప్రాణాలువిడిచి క్రిందపడిపోయిందనుకున్న కౌశికుడు భిక్షకు బయలుదేరి ఒక ఇంటిముందుఆగి, భిక్షను కోరాడు. ఆగృహిణి భిక్షపెట్టడానికి సిద్ధపడేలోపున పనిమీద దూరప్రాంతానికి వెళ్ళిన ఆమెభర్త బడలికతో అలసిసొలసి ప్రవేశించాడు. వెంటనే ఆమె భర్తకు సేదతీర్చి స్నానాదులుచేయించి

28. ఆం. మ. భా - అరణ్య - 5-117.

భోజనంపెట్టింది. తరువాత అతణ్ణి నిద్రపుచ్చింది. అతడినిద్రకు భంగం కలుగకుండా లేచివచ్చి కౌశికుడికి భిక్షపెట్టబోయింది. ఆలస్యం చేసినందుకు ఆమెవైపు ఉగ్రుడై చూశాడు కౌశికుడు. ఆమె కారణాన్ని వివరించి బ్రాహ్మణుడికి అంతకోపం తగదనీ, అతడిచూపుకు పక్షి పడిపోయినసంగతి తానెరుగుదునసీ చెప్పింది. జరిగినసంగతి ఈమెకెలా తెలిసిందని ఆశ్చర్యపడ్డాడు కౌశికుడు. సాధనమార్గం చూపమని ఆమెను వేడాడు. ఆమె మిథిలానగరంలోని ధర్మవ్యాధుణ్ణి చేరి వేడమన్నది.

ధర్మవ్యాధుణ్ణి చేరినప్పటినుంచీ కౌశికుడికి అడుగడుగునా ఆశ్చర్యం కలుగసాగింది. ఆ ధర్మవ్యాధుడి నిరాడంబరతా, వంశాచారనిష్ఠా, ధర్మమార్గాన్ని అతడు తెలియజేప్పేతీరూ కౌశికుణ్ణి ముగ్ధుణ్ణిచేశాయి. ఇంత ప్రస్ఫుటమైనవివేకం అతడికి ఎలా కలిగిందా అనిపించింది అతడికి. ధర్మవ్యాధుడు తనతల్లిదండ్రులసేవే తనకు ఆవెలుగును ప్రసాదించింది అన్నాడు. 'నీవుకూడా నీతల్లిదండ్రుల్ని సేవించి తరించు' అని కౌశికుణ్ణి ఉద్బోధించాడు. "అయినవారినీ, తనపై ఆధారపడిఉన్నవారినీ నిష్కామంగా సేవించడంవల్ల మానవుడు ముక్తినిపొందుతాడు. ఆవేశంలో వారిని విడిచివెళ్ళినందువల్ల కర్తవ్యాన్ని విస్మరించినవాడవుతున్నాడు. అంతర్యామి అప్పగించిన బాధ్యతను తప్పించుకోజూచినవారికీ, అవకాశాన్ని జారవిడుచుకున్నవారికీ మోక్షమార్గం ఎలా చిక్కుతుంది?" అన్న సత్యాన్ని మందలింపుతో బోధపరిచాడు ధర్మవ్యాధుడు. ఆబోధకు కళ్ళుతెరచి తల్లిదండ్రులను చేరుకున్నాడు కౌశికుడు.

ఆలుబిడ్డలుగా, అయినవారుగా ఉంటున్నది దైవమేనని గ్రహించి వారియెడల నిర్వహించవలసిన విధులను పూజ్యభావంతో నిర్వహించగలిగినవాడే ముక్తస్థితిని పొందగలడు. దైవస్థితికి చేరువకాగలడు.

## భారతం హింసను ప్రబోధిస్తున్నదా ?

భారతంలో శ్రీకృష్ణుడు యుద్ధానికి విముఖుడైన అర్జునుణ్ణి ప్రేరేపించి యుద్ధం చేయించాడనీ, కృష్ణుడి ప్రేరణవల్లనే హింస జరిగిందనీ, భారతం హింసామార్గాన్ని ప్రబోధిస్తోందనీ భావించేవారు ఉన్నారు. కొంచెం నిదానించి చూస్తే, భారతం మనిషికి స్వధర్మాచరణలో మోహంచెందకుండా నిలబడగలిగే శిక్షణను ఇస్తున్నదని బోధపడుతుంది. అర్జునుడు క్షత్రియుడు గనుక, యుద్ధంచేయడం క్షత్రియధర్మం గనుక, ధర్మసంస్థాపనకోసం జరిగే యుద్ధంలో మోహితుడై కర్తవ్యవిముఖుడవుతున్న అర్జునుణ్ణి వెన్నుతట్టి, కనువిప్పు కలిగించి నిలబెట్టాడు కృష్ణుడు. తనను శరణాగతిచెందిన అర్జునుణ్ణి స్వధర్మంనుంచి పతనంకాకుండా కాపాడటమే కృష్ణుడు చేసినపని. స్వధర్మాచరణలో మరణించినా నష్టంలేదు. పరధర్మాన్ని ఆశ్రయించడం భయావహమనీ, జరగకూడని పనీ కృష్ణుడి ఉపదేశ సారం. ఈసత్యాన్ని ఒంటబట్టేటట్టు చెయ్యడానికే అతడు మిగిలిన అంశాలన్నీ వివరించడం జరిగింది. దేశం ఎల్లల్లో రక్షణకై నిలబడిన సైనికుడికి ప్రభుత్వం సకల సదుపాయాలూ చేస్తుంది. అతడు ఉపయోగించడానికి కావలసిన మారణాయుధాల్నికూడా అందిస్తుంది. అంతమాత్రాన ప్రభుత్వం హింసను ప్రోత్సహిస్తోందనగలమా? విధి నిర్వహణలో ఉన్నవారికి వారివారి విధులకు తగిన సదుపాయాల్ని ప్రభుత్వం సమదృష్టితో చేస్తున్నట్లే మానవులు తమతమ స్వధర్మ నిర్వహణలో సమర్థులై నిలబడటానికి కావలసిన శిక్షణను సమదృష్టితో ఉపదేశిస్తున్నది మహాభారతం.

స్వధర్మనిర్వహణ వేరు, యోగసాధన వేరు, యోగిసిద్ధి వేరు అనుకోవడం అజ్ఞానమనీ, స్వధర్మనిర్వహణలోనే సాధనా, సిద్ధీ ఇమిడిఉన్నాయనీ మహాభారతం ఉదాహరణపూర్వకంగా ఉపదేశిస్తుంది. అరణ్యపర్వంలోని ధర్మవ్యాధుడు స్వధర్మాచరణలో సిద్ధిని

పొందినవాడే. అలాగే శాంతిపర్వంలో వచ్చిన తులాధారుడుకూడా. తులాధారుడు తన స్వధర్మమైన వాణిజ్యనిర్వహణను దైవారాధనగా మలచుకొన్నవాడు. వాణిజ్యనిర్వహణలో తననుండి సేవను అందుకొంటున్నవారి రూపంలో వాసుదేవుణ్ణి దర్శించి, స్థితప్రజ్ఞుడై తన వాణిజ్యార్చనను క్రీడగా కొనసాగించినవాడు.29

జాజలి అనే ముని ఒకఅరణ్యంలో తపస్సుచేసుకొంటున్నాడు. అతడి జడలచుట్లల్లో పిచ్చుకలు కుటుంబాలతో నివాసం చేయసాగాయి. దాన్నిచూసి జాజలి తనలోపెరిగిన భూతదయకు తానే ముచ్చటపడ్డాడు. వెంటనే తులాధారుడనే మహానుభావుడు నిన్నుమించినవాడున్నాడు, చూడబోమ్మని ఆకాశవాణి పలికింది. ఆపలుకులకు ఆశ్చర్యపడి జాజలి తులాధారుణ్ణి చేరుకున్నాడు. తులాధారుడు జాజలిని పలుకరించి అతడి జడచుట్లల్లో పిచ్చుకలు నివాసం ఏర్పరచుకున్న వైనాన్ని స్మరించి, అతడిభూతదయకు మెచ్చుకున్నాడు. ఈ అంశాలన్నీ తులాధారుడికి ఎలా తెలిశాయా అని నివ్వెరపోయాడు జాజలి. 'మీతపస్సేమిటి ? సాధనమార్గం ఏమిటి ? మీకీ స్థితప్రజ్ఞత ఎలా లభించింది ?' అని తులాధారుణ్ణి అడుగుతాడు. స్వధర్మాచరణామే తన సాధన అనీ, దానిలో తానుచూపే కౌశలమే తన స్థితప్రజ్ఞతకు కారణమనీ వివరిస్తాడు తులాధారుడు.

ఈవిధంగా మహాభారతం మానవుడికి స్వధర్మంయొక్క స్వరూపాన్ని తెలియచెప్పి, ఆ స్వధర్మాన్ని ముక్తస్థితిలో నిలిచి ఆచరించమని ఉపదేశిస్తోంది. అలా ఆచరించడానికి కావలసిన శిక్షణను ఇస్తోంది.

## కృష్ణుడి సందేశం యత్యాశ్రమానికే పరిమితమా ?

భారతహృదయమైన భగవద్గీత యత్యాశ్రమం స్వీకరించినవారికి మాత్రమే పరిపూర్ణంగా ఉపయోగపడగలదని భావించే

29. ఆం. మ. భా - శాంతి - 5 - 224 - 257.

వారున్నారు. ఈభావన సరికాదు. యత్యాశ్రమం పవిత్రమైనది అన్నమాట నిజమే. జీవిత చరమదశలో శరీరాన్ని విడవబోయే ముందు భగవంతుడితో తాదాత్మ్యస్థితిని అనుభవించేటందుకు చక్కని అవకాశం అది. కానీ కృష్ణుడిబోధ మానవుని జీవితంలో ఏదో ఒక దశను ఉద్దేశించి చేయబడింది కాదు. మానవుడికి జీవిత నిర్వహణలో కౌశలాన్ని అభ్యసింపజేసేటందుకు దిగివచ్చింది గీత. శరీరాన్ని ధరించిన మానవుడు శరీరానికి అతుక్కుపోకుండా దాన్ని తన వాహనంగా స్వీకరించి నడుపుకోగల శిక్షణను ఇస్తుంది గీత. సృష్టిలో భాగమైన మానవుడికి సృష్టితత్త్వాన్నీ, దాని పూర్వాపరాల్నీ బోధపరచి ఆ సృష్టిలో మానవుడిపాత్ర ఏమిటో తెలియజెపుతుంది గీత. తెలియజెప్పటమే కాదు, మానవుడు తనపాత్రను సమర్థవంతంగా పోషించుకోవడానికి కావలసిన శిక్షణనంతా సులువుగా, సున్నితంగా, సమగ్రంగా అందిస్తుంది గీత. జీవితంలో నిజమైన ఆనందాన్ని అనుభవించాలని సంకల్పించినవారికి దారిచూపేటందుకై దిగివచ్చింది గీత. వారెలాంటివారైనాసరే, ఏవయస్సులో ఉన్నవారైనాసరే, ఎలాంటి దుఃస్థితులకు లోనైనవారైనాసరే-వారిమనస్సును గీతకు సంపూర్ణంగా శరణాగతిచేస్తేచాలు-గీత వారికి అభయమిస్తుంది సేదతీరుస్తుంది. పతనస్థితినుంచి పరమపదానికి చేయూతనిచ్చి నడిపిస్తుంది. పరమపదంలో వారిని నిలిపి దివ్యజీవితాన్ని అనుభవింపజేస్తుంది. తాను తానుగా బ్రతకాలనీ, తనస్థితిలో తాను నిలవాలనీ కోరే మనిషికోసం శ్రీకృష్ణుడు అందించిన అమృతసందేశమే గీత. వేదసారం ఉపనిషత్తులుగా రూపుకట్టుకుంటే, ఆ ఉపనిషత్తులసారం గీతోపదేశంగా దిగివచ్చింది. ఉపనిషత్తులన్నిటినీ గోవులుగా చేసి అర్జునుడనే వత్సాన్నివదలి గోపాలకుడైన కృష్ణుడు పిండిన దుగ్ధమే భగవద్గీత అని పెద్దలైనవారి దర్శనం.30 శ్రీకృష్ణుడు పిండిన ఆ పాలు పసిపాపలు మొదలుకొని

---

30. సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః ।
పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥
[గీతామహిమ - వైష్ణవీయతంత్రసారం (గీతామకరందం నుంచి)]

పండుముదుసలులవరకూ స్వీకరించినవారికి స్వీకరించినంతగా తృప్తినీ, ముక్తినీ ప్రసాదించగలవు.

కృష్ణుడిబోధకు భాష్యంవంటిది శాంత్యానుశాసనిక పర్వాల్లో ధర్మజుడికి భీష్ముడు చేసిన బోధ. కృష్ణుడిబోధను మానవుడి ఆచరణలోకి తెచ్చేది మహాభారతం, అనుభూతిగా మలచేది భాగవతం.

శ్రీకృష్ణుడిది పరిపూర్ణమైన అవతారం. అలాగే అతడినుంచి దిగివచ్చిన గీతకూడా పరిపూర్ణమైన సందేశం. అనంతమైన వేద వాఙ్మయ సారాన్ని కొన్నివందలశ్లోకాల్లో చిత్రంగా ఇమిడ్చాడు కృష్ణుడు చిన్ననాట యశోదకు తన చిన్ననోట భువనభాండాలు చూపినవాడుగదా మరి! గీతలో అతడు చెప్పని విషయంలేదు. తడమని అంశంలేదు. తెలియజెప్పని సత్యంలేదు. సులువు వేయని సూక్ష్మంలేదు. గీత ఎంత సంక్షిప్తమైనదో అంతసమగ్రమైనది. వేద వాఙ్మయం అనే వటవృక్షం యొక్క విత్తనమిది. ఈ విత్తనాన్ని జీవితక్షేత్రంలో వేసుకున్నవారు ధన్యులు. వ్యాసుడు అనుగ్రహించిన శ్రీకృష్ణుడి వర్ణచిత్రమిది. ఈ వర్ణచిత్రాన్ని వరించి హృదయంలో ధరించినవారు సార్థకజన్ములు.

# నరుడు - నాలుగు దశలు :

గీతలో కృష్ణుడు మానవుణ్ణి నాలుగుదశల్లో చూపిస్తాడు. సంసారంలో చిక్కుకుని సతమతమవుతున్న దశ మొదటిది. ఆ సంసారస్థితినుంచి మెలకువ కలిగే దశ రెండవది. మేలుకొన్న మానవుడు తనస్థితికి తాను చేరేటందుకై యోగసాధన చేసే దశ మూడవది. తనలో తాను నిలిచి అంతర్యామిత్వాన్ని చెంది శరీరాన్ని దివ్యోపకరణంగా మలచుకొని యోగజీవితాన్ని వైభవోపేతంగా నడుపుకొనే దశ నాలుగవది. మానవుడికి మొదటి మూడుదశలూ ఆరోహణ చేయవలసిన సోపానాలు. ఆ ఆరోహణ పూర్తిచేసిన వాడికి అనుభవానికి వచ్చే అమృతస్థితి నాల్గవదైన యోగజీవితం. ఈ యోగజీవితమే మానవుడి గమ్యం. అప్పుడు అనుభవానికి వచ్చేదే ధర్మాద్వైతస్థితి. ఆ ధర్మాద్వైతస్థితిని అనుభవంలోకి తెచ్చే సోపాన త్రయాన్ని గూర్చి, ధర్మాద్వైతస్థితియొక్క వైభవాన్నిగూర్చి తగుమాత్రం పరిశీలిద్దాం.

## 1. సంసారిగా మానవుడు :

నిత్యజీవితంలో మానవుడు పలురకాల వాహనాలను నడుపుతున్నాడు. ప్రకృతి తనకు ఇచ్చిన ప్రతిభతో ప్రకృతిలోని శక్తులనే

సమావేశపరచి సమన్వయించి మానవుడు రూపుదిద్దినవే ఆ వాహనాలు. తనలాంటి మానవులు కనిపెట్టినవే అయినప్పటికీ, పూర్తిగా తన అధీనంలో ఉండేవే అయినప్పటికీ, వాటిని వినియోగించుకొనేటప్పుడు మానవుడు కొన్ని జాగ్రత్తలను పాటించాలి. కొంతనైపుణ్యాన్ని చూపించాలి. లేకపోతే ఆ వాహనాలకూ, వాటిని నడిపే తనకూ కూడా ముప్పువాటిల్లే ప్రమాదం ఉంది. అలాగే ఈ శరీరం కూడా ప్రకృతిచేత మానవుడికి ఈయబడిన వాహనమే.

మిగిలిన వాహనాలకూ శరీరానికీ భేదంఉంది. మిగిలిన వాహనాలు ప్రకృతిశక్తిని సమన్వయించి మానవుడు సృష్టించినవి. శరీరాన్ని ప్రకృతే తన శక్తులతో రూపుదిద్ది మానవుడికి అందిస్తోంది. మిగిలిన వాహనాలను వాటికన్నా తాను వేరుగా ఉండి మానవుడు నడుపుతున్నాడు. కాని శరీరం విషయంలో అలా కాదు- మానవుడు శరీరంతోనే, శరీరంలోనే ఉంటూ శరీరాన్ని నడుపుకోవాల్సి ఉంది. మిగిలిన వాహనాల్లో పనిచేసే భాగాలు అరిగినా విరిగినా కొని వేసుకోవడం సులభం. మానవశరీరంలోని భాగాలు ఏకారణంచేతనైనా దెబ్బతింటే మానవుడు ఆభాగాలను తానుగా సృష్టించలేడు.

మానవుడు తాను ఉపయోగించే వాహనాలను నడిపేటందుకు కావలసిన శిక్షణను ఎలాపొందుతున్నాడో, అలాగే తనఉనికికి ఉపాధి అయిన శరీరాన్ని నడుపుకోవడానికి మరింత శిక్షణ పొందవలసి ఉంటుంది. శరీరాన్నీ, దాని భాగాల్నీ, ఆ శరీరంద్వారా ప్రసారమవుతున్న వివిధ ప్రవృత్తుల్నీ మానవుడు కూలంకషంగా గమనించి బోధపరుచుకోకపోతే శరీరాన్ని ఉపయోగించుకోవలసిన తీరులో ఉపయోగించుకోలేడు. గుర్రాలను నడపడం చేతకానివాడు రథం ఎక్కితే గుర్రాల ఉత్సాహం ప్రకారం ప్రయాణం సాగుతుంది తప్ప, రథంలో ఉన్నవాడి ఊహ ప్రకారం ప్రయాణం సాగదు.

గుఱ్ఱాలు ఎటు లాక్కువెడితే అటు లాక్కువెళ్ళబడటమే వాడికి మిగులుతుంది. ఆలాగే శరీరతత్త్వాన్ని బోధపరుచుకోలేని మానవుడు శరీరంలో ఉన్నప్పుడుకూడా జరిగేది అంతే. ప్రయాణం ప్రవృత్తుల చేతుల్లో ఉంటుందితప్ప అతడిచేతుల్లో ఉండదు.

మానవుడి శరీరంలో అతడికి కావలసిన పని చేసిపెట్టేందుకు అతడి వాక్కూ, చేతులూ, కాళ్ళూ, మలమూత్రాశయవాలూ సిద్ధంగా ఉంటాయి. వీటినే కర్మేంద్రియాలు అంటారు. మానవుడికి కావలసిన జ్ఞానాన్ని స్వీకరించేటందుకు వీలుగా అతని శరీరంలో కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం ఉన్నాయి. కన్నుద్వారా తాను చూడదలచింది చూడగలడు. చెవిద్వారా కోరింది వినగలడు. ముక్కుద్వారా వాసనలు గ్రహించగలడు. నాలుకద్వారా ఆహార పదార్థాలను రుచిచూడగలడు. చర్మంద్వారా స్పర్శను అనుభవించ గలడు. సృష్టికథను నడుపుతున్న పంచభూతాల్లో ఆకాశానికి శబ్దం గుణం. దాన్ని వినేందుకు మనిషికి చెవి ఉంది. వాయువుకు శబ్దంతోపాటు స్పర్శకూడా ఈయగల శక్తి ఉంది. ఆస్పర్శను అనుభవించేటందుకు వీలుగా మానవుడి చర్మనిర్మాణం జరిగింది. అగ్నికి శబ్దస్పర్శలతోపాటు రూపంకూడా ఉంది. మానవుడికి ఆ రూపాన్నిచూసి ఆనందించేటందుకు కన్నుఉంది. నీటికి శబ్ద స్పర్శ రూపాలతోపాటు రుచికూడా ఉంది. ఆ రుచిని అనుభవించేటందుకు మానవుడికి నాలుక ఉంది, భూమికి శబ్ద స్పర్శ రూప రసాలతోపాటు గంధాన్ని ఇచ్చే శక్తి కూడా ఉంది. మానవుడికి ఆ గంధాన్ని ఆఘ్రాణించగల నాసిక ఉంది. ఈ విధంగా పంచభూతాలనుంచి వ్యక్తమవుతున్న గుణాలను అనుభవించేటందుకు వీలైన ఉపకరణా లను అమర్చి ఆ పంచభూతాలతోనే శరీరమనే పురాన్ని మానవుడికి నిర్మించిపెట్టింది ప్రకృతి. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం వెలుపలినుంచి మానవుడికి కావలసిన జ్ఞానాన్ని స్వీకరించిపెట్టేవి

కాబట్టి జ్ఞానేంద్రియాలు అన్నారు. ఈ పంచేంద్రియాలకు గమ్యాలైన శబ్ద స్పర్శ రూప రసగంధాలను పంచతన్మాత్రలు అన్నారు.

మానవశరీరంలో మిగిలినభాగాలకన్నా ఇంద్రియాలు చైతన్యవంతమైనవి. ఇంద్రియాలకన్నా ఇంద్రియాలద్వారా ఇంద్రియార్థాలను అనుభవించే మనస్సు చైతన్యవంతమైనది. మనస్సుకన్నా మనస్సుకు మంచిచెడ్డలు వివరించి చెప్పగల బుద్ధి దానిపైన ఉన్నది. బుద్ధికన్నా పైనున్నవాడు 'అతడు!'1 అతడినుంచే బుద్ధి మొదలైనవన్నీ వ్యక్తమై, అతడికొరకే పనిచేస్తూ ఉంటాయి.

మానవుడి జీవితనిర్వహణలో మనస్సుకు ఉన్నది చాలా చిత్రమైన స్థానం. మనస్సు ఇంద్రియాలవైపు మొగ్గినపుడు మనిషి బద్ధస్థితిని అనుభవిస్తాడు. మనస్సు బుద్ధిచేత ఆకర్షించబడినపుడు మనిషి ముక్తస్థితిని అనుభవిస్తాడు. కాబట్టే పెద్దలు మనస్సే బంధమోక్షాలకు కారణమని చెబుతారు.2

మనస్సు ఇంద్రియాలవైపు మొగ్గినపుడు ఏం జరుగుతుంది ? ఇంద్రియాలద్వారా జ్ఞానాన్ని స్వీకరించడం కాకుండా అనుభవించటం మొదలుపెడుతుంది. ఆ అనుభవించడం అలవాటై ఇంద్రియ విషయాలనుగూర్చి - అనగా, తనకు నచ్చిన శబ్ద స్పర్శ రూప రస గంధాలను గూర్చి - స్మరించడం మొదలుపెడుతుంది. స్మరించడం వల్ల ఇంద్రియార్థాలతో మనస్సుకు సంగం ఏర్పడుతుంది. అంటే,

---

1. ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః ॥ (భగవద్గీత - 3-42)

2. మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।
బంధాయ విషయా సంగి ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥

(మైత్ర్యుపనిషత్ - 6.30)

తనకు నచ్చిన ఇంద్రియార్థాలకు మనస్సు అతుక్కుంటుంది. ఈ అతుక్కోవడమే సంగం. సంగంవల్ల కామం కలుగుతుంది. కామం అంటే కోరిక. తాను ఏ ఇంద్రియార్థాలకు అతుక్కుందో వాటిని మనస్సు అభిలషిస్తుందన్నమాట! తనకు నచ్చిన రూపం తనదే కావాలనిపించడం, తనకు నచ్చిన స్పర్శ అనుభవించనిదే ఉండలేకపోవడం, తనకు నచ్చిన గానం మొదలైనవి వినాలని మోజుపడటం మొదలైనవన్నీ కామాలే. ఈ కామంనుంచి క్రోధం పుడుతుంది. తనకు నచ్చిన రూపం తనకు లభించకపోవడం, తానుకోరిన స్పర్శ తనకు దూరం అవడం మొదలైన స్థితుల్లో మానవుడు అనుభవించేదే క్రోధం. క్రోధం కలిగినపుడు మానవుడు మోహం చెందుతాడు. నిజస్థితిని గ్రహించలేకపోవడమే మోహం. మోహంవల్ల అతడి తెలివికి పొరకమ్ముతుంది. ఆ పొరవల్ల అతడికి అంతకుపూర్వం తెలిసిన జ్ఞానం అతణ్ణి ఏమీ చేయలేకపోతుంది. అదే స్మృతిభ్రంశం చెందడమంటే. స్మృతిభ్రంశం చెందడంవల్ల మంచిచెడుల్ని విడమరచి చెప్పగల బుద్ధి నశిస్తుంది. బుద్ధినాశంవల్ల మానవుడు పూర్తిగా పతనమై సర్వనాశనం చెందుతాడు.[1] ఈ స్థితినే సంసారస్థితి లేక బద్ధస్థితి అంటారు. సంసరణమంటే జరిగిపోవడం అని చెప్పుకున్నాం. మనస్సు ఇంద్రియార్థాలవైపు జరిగిపోవడంవల్ల రూపుకట్టుకొంటుంది ఈ అవాంఛనీయస్థితి.

మానవుడు ఈ బద్ధస్థితిని పొందడంలో అతడిలో పనిచేసే త్రిగుణాలపాత్ర చాలా ఉంటుంది. త్రిగుణాలైన సత్త్వ రజస్తమస్సులు వేరువేరు పాళ్ళల్లో కలుస్తూ ఉండడం వల్లనే మానవుల్లో

---

1. ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే ।
సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి॥
(భగవద్గీత - 2-62, 63.)

రకరకాల ప్రవృత్తులు ఏర్పడుతున్నాయి. మానవుడి స్వభావాన్ని రూపొందించేది అతడిలోని ఈ త్రిగుణాల కలయికే. వ్యక్తిలో రజోగుణం ప్రాధాన్యం వహిస్తున్నప్పుడు అన్నికర్మలనుంచీ ఒక విధమైన తీవ్రతా, తొందరపాటూ వ్యక్తమవుతాయి. తమోగుణం ప్రాధాన్యం వహిస్తున్నప్పుడు ఒకరకమైన బుద్ధిమాంద్యం, మూర్ఖత్వం, అలసత్వం మొదలైన లక్షణాలు గోచరిస్తాయి. సత్త్వ గుణంలో నిలవగలిగినప్పుడు మాత్రమే మనిషి తాను తానుగా జీవించగలడు.4 ఇలా జీవించడానికి మానవుడు సాధన చేయవలసి ఉంది. సాధనలేని సామాన్య మానవులందరూ, తమలోని త్రిగుణాల నివృత్తి తమ స్వభావాన్ని రూపుదిద్దుతూ ఉండగా, ఆ స్వభావానికి అనుగుణంగా ప్రవర్తిస్తూ ఉంటారు. అలా ప్రవర్తించేటప్పుడు కలిగే రకరకాల మానసిక వికారాలే బంధాలు. బంధం అంటే మానవుడి ప్రజ్ఞను పరిమితం చేసేది. దేహంతో పనిచేస్తున్న మనిషికి దేహమే తాను అనిపించడం, దేహం తనది అనిపించడం, దేహం తాను సుఖపడటంకోసమే అనిపించడం, దేహాన్ని సుఖపెట్టడమే పర మావధిగా కనిపించడం మొదలైన వికారాలన్నీ బంధాలే. అలాగే తాను సృష్టికన్నా వేరు అనిపించడం, సృష్టి తనకన్నా ఇతరంగా కనిపించడం, సృష్టి ఉన్నది తనకొరకే అనిపించడం, సృష్టిని జయించాలి అనిపించడం, సృష్టిలో ఇతరజీవులకన్నా తాను ఎక్కువ అనిపించడం మొదలైన వికారాలన్నీ బంధాలే. ఇంకా శరీరంనుంచి వ్యక్తమవు తున్న శక్తియుక్తులు తన సొంతం అనిపించడం, వాటిని తన సొంతానికే వినియోగించుకోవాలనిపించడం, ఆ శక్తియుక్తుల్ని వ్యాపారసరళిలో వినిమయం చేసి తనస్థితిని అన్నివిధాలా పెంచు కోవాలి అనిపించడం, అలా పెంచుకోవడం కొరకే ఆ శక్తియుక్తులు ఉన్నాయనుకోవడం మొదలైన వికారాలన్నీ బంధాలే.

---

4. భగవద్గీతలోని గుణత్రయవిభాగయోగంలో (14వ అధ్యాయంలో) కృష్ణుడు ఈ అంశాన్ని విపులంగా బోధపరిచాడు.

ఈ అంశాన్నే నిరాలంబోపనిషత్తు ఇలా వివరిస్తోంది : "అనాది అయిన అవిద్యావాసనవల్ల కలిగే 'నేను వేరు' అన్న సంకల్పం* బంధం. చేస్తున్నది నేను అన్న సంకల్పం బంధం. తల్లిదండ్రులూ, సహోదరులూ, ఆలుబిడ్డలూ, ఆస్తిపాస్తులూ మొదలైనవి తనవి అనే సంకల్పం బంధం. వర్ణాశ్రమ ధర్మ కర్మలు తనకు చెందినవి అన్న సంకల్పం బంధం. యజ్ఞవ్రత తపోదాన విధి విధాన జ్ఞానంమొదగల సంకల్పం బంధం. చివరికి మోక్షం కావాలన్న సంకల్పంకూడా బంధమే. సంకల్పంనుంచి సంభవించేదే బంధం".5

సంకల్పంవల్ల బంధం కలుగుతోంది. ఆ సంకల్పం ఆ యా విషయాల్లో మనస్సు లగ్నం కావడంవల్ల కలుగుతోంది. కలిగిన సంకల్పం మానవుణ్ణి ఎక్కడికి తీసుకువెడుతుందీ అనేది అతడిలోని త్రిగుణాల నిష్పత్తిపై ఆధారపడిఉంటుంది. ఉదాహరణకు, రాజ్యాధికారంలేని ధృతరాష్ట్రుణ్ణి సింహాసనం ఎక్కించాడు పాండురాజు. సింహాసనం ఎక్కిన ధృతరాష్ట్రుడికి కర్తవ్యనిర్వహణ క్రమంగా కామస్థితికి దిగజారింది. అతడిమనస్సు రాజ్యవిషయాలతో సంగాన్ని పొందింది. అతడికి రాజ్యం తనకూ, తన పుత్రులకూ దక్కితే బావుండును అన్న కోరిక కలిగింది. ఆ కోరిక తీరడానికి పాండవులు అడ్డుగా కనిపించడంతో వాళ్ళపై క్రోధం పెరిగింది. ఆ క్రోధంతో ఒకవిధమైన మోహం కలిగింది. తన తమ్ముడి బిడ్డలు తనకు శత్రువులుగా కనిపించడం, వారిని జయించడం ఎలా అని మనస్సులో దిగులుపట్టుకోవడం మొదలైన లక్షణాలు మోహం కాక మరేమిటి?

---

* ఇచ్చట సంకల్పమనగా ఊహ, ఎరిక, స్పృహ అని అర్థం.

5. బన్ధ ఇతిచ. అనాద్యవిద్యావాసనయా జాతోఽహ మిత్యాది సఙ్కల్పో బన్ధః. కర్తృత్వాద్యహఙ్కార సఙ్కల్పో బన్ధః. పితృమాతృ సహోదర దారాఽపత్య గృహారామ క్షేత్రాది మమతా సంసారావరా సఙ్కల్పో బన్ధః. వర్ణాశ్రమ ధర్మ

ఆ మోహంవల్ల అతడి తెలివికి పొరకమ్మింది. ఇటు పాండవులతో అతడికి గల రక్తసంబంధంగానీ, అటు మహర్షులవల్లా, అవతార మూర్తులవల్లా అతడు కోరి విన్న జ్ఞానసంపదగానీ దుష్కృత్యాన్నుంచి అతణ్ణి మరల్చలేకపోయాయి. ఆపైన అతడి బుద్ధి నశించింది. తానెలా ప్రవర్తిస్తే తనకొడుకులకు క్షేమమో నిర్ణయించి, ఆ నిర్ణయం ప్రకారం అతడు తన కొడుకుల్ని ఆజ్ఞాపించలేకపోయాడు. అతడిలో సదసద్వివేకం శూన్యమైంది. ఏది క్షేమమో విదురాదులు వివరించినా, శ్రీకృష్ణుడు బోధించినా అతడి తలకు ఎక్కలేదు. వారి బోధల్ని స్వీకరించేటందుకు అతడు సిద్ధం కాలేకపోయాడు. తానున్న సంసరణ స్థితిలో సిద్ధంకాదలచుకోలేదుకూడా. దానితో కురుక్షేత్ర మహాసంగ్రామంలో అతడి కొడుకులందరూ నేలకి ఒరిగారు. ఆపైన అతడు పాండవుల పంచన తలదాచుకోవలసి వచ్చింది. ఇంద్రియాల ప్రక్కకు లాగిన మనస్సు మానవుణ్ణి ఎంతవరకూ తీసుకువెళ్ళగలదో ధృతరాష్ట్రుడి గాథలో దర్శింపచేస్తున్నాడు వ్యాసుడు.

అలాగే రజోగుణ ప్రవృత్తి ఉన్నవారిలో మనస్సుయొక్క సంసరణస్థితి ఎలాంటి రూపును దాలుస్తుందో దుర్యోధనుణ్ణి చూస్తే తెలుస్తుంది. దుర్యోధనుడి మనస్సు రాజ్యభోగాలకు అతుక్కుంది. అతడిలో ఉన్న రజోగుణ ప్రభావంతో ఆరాజ్యం తనదే కావాలన్న ఆశా, తనకే దక్కాలన్న పంతం, తనదారికి మరెవ్వరూ అడ్డు రాలేరన్న అహంకారం, తనమాట నిలబెట్టుకోవాలన్న అభిమానం అతడి మానసిక ప్రపంచంలో విజృంభించాయి. ఆ ఆవేశంలో అతడు పెద్దా చిన్నా భేదం లేకుండా ప్రవర్తించాడు. ధర్మాధర్మాలను

కర్మ సఙ్కల్పో బన్ధః. అజ్ఞాభయ సంశయాత్మ గుణ సఙ్కల్పో బన్ధః. యజ్ఞవ్రత తపోదానవిధి విధాన జ్ఞాన సఙ్కల్పో బన్ధః. కేవల మోక్షాపేక్ష సఙ్కల్పో బన్ధః. సఙ్కల్ప మాత్ర సమ్భవో బన్ధః.

అసలు పట్టించుకోలేదు. తన పంతం నెగ్గాలన్నది ఒక్కటే దుర్యోధనుడి ఆశయం. దానితో జీవితాంతం ఒకరకమైన ఆవేశాత్మకమూ, అహంకారపూరితమూ అయిన మనస్తత్వంతో బ్రతికి, తోచినట్లు ప్రవర్తించి, పెద్దలూ, అవతారపురుషులూ కలిసి చెప్పినప్పటికీ వినిపించుకోక కురుక్షేత్రమహాసంగ్రామంలో తొడలు విరిగి పడిపోయాడు. అతడి రజోగుణప్రవృత్తి అతడినుంచి ఇంతకథను నడిపించింది. కర్ణుడి కథకూడా ఇలాంటిదే. ఈవిధంగా భారతాన్ని పరిశీలిస్తూపోతే మానవుల్లోని రకరకాల ప్రవృత్తులూ, ఆయా ప్రవృత్తులను అనుసరించి మనస్సు ఇంద్రియాలలోనికి చెదరి వారు పొందే సంసారబంధాలూ స్పష్టంగా బోధపడతాయి.

చిత్రం ఏమిటంటే మానవుడు సామాన్యస్థితిలో తనస్వభావం తనది అనుకొంటాడు తప్ప తనలో వ్యక్తమవుతున్న త్రిగుణాలది అని గ్రహించలేడు. తన స్వభావాన్ని సమర్థించుకోవాలని చూస్తాడు తప్ప సరిదిద్దుకోవడానికి ప్రయత్నించడు. స్వభావానికి అనుగుణంగా తాను నడుస్తాడుతప్ప, తనకు అనుగుణంగా స్వభావాన్ని మలచుకోవాలని తెలుసుకోలేడు. ఆ స్వభావం ఎటువైపుకు లాక్కువెడితే తాను అటువైపుకు వెడుతూఉంటాడు. అప్పటి అతడి జీవితం చక్రవాతం (తుఫాన్) లో చిక్కుకున్న నావలాగా మారుతుంది. నావ ఎటువైపుసాగాలో చక్రవాతం చేతుల్లో ఉంటుందిగానీ నావలోఉన్నవారి చేతిలో ఉండదుగదా ! అలాగే తనప్రవృత్తులు సృష్టించే చక్రవాతంలో తాను చిక్కుకుపోతాడు మానవుడు. ఈ స్థితిని దర్శించిన పెద్దలే సంసారం మహాసాగరం అన్నారు. ఈస్థితిలో చిక్కిన మానవుడు సంసారి.

## 2. మేలుకొలుపు :

ప్రవృత్తుల చక్రవాతంలో చిక్కుకున్న మానవుడు ప్రవృత్తులకు అనుగుణంగా నడుస్తాడుతప్ప ప్రకృతిధర్మాలను అనుసరించి

జీవించలేడు. ప్రకృతిధర్మాలను ఎప్పుడు అతిక్రమిస్తున్నాడో అప్పుడు మానవుడికి దుఃఖం తప్పదు.'ధర్మం తనను దెబ్బకొట్టినవాణ్ణి దెబ్బకొడుతుంది, తనను రక్షించినవాణ్ణి రక్షిస్తుంది' అన్నది మనువు వాక్కు.6 ప్రవృత్తుల ప్రకారం కొట్టుకుపోతున్న మానవుడికి ప్రకృతిధర్మాలు గుర్తుఉండకపోవచ్చు. గుర్తున్నా వాటిని పాటించ నవసరంలేదు అనిపించవచ్చు. వాటిని అనుసరించడం తాను అనుభవింపదలచిన భోగభాగ్యాలకు ఇబ్బంది అనిపించవచ్చు. వాటిని విస్మరిస్తేతప్ప తనకు సుఖంలేదు అనిపించవచ్చు. ఇలా ప్రకృతి ధర్మాల విషయంలో దారితప్పినవారిలో కొందరు దుర్బలులుగా మారిపోతారు. ఇంకొందరు దుష్టత్వాన్ని పెంపొందించుకొంటారు. దుర్బలులు వ్యసనాలూ మొదలైనవాటికి లోనై తమను తాము నాశనం చేసుకుంటారు. దుష్టులు ఇతరులను బాధించడమే జీవిత ధ్యేయంగా పెట్టుకొని లోకకంటకులుగా రూపొందుతారు.

ఈ విధంగా చెడి చెడ్డగా ప్రవర్తిస్తున్నవారికి ప్రకృతి రూపంలోనూ, ప్రభుత్వరూపంలోనూ శిక్షలు ఎదురవుతూ ఉంటాయి. ఆ శిక్షలద్వారా వారికి శిక్షణను ఇచ్చి మేల్కొల్పి నిజస్థితిలోకి తేవాలని చూస్తుంది ప్రకృతి.

ఒక వ్యక్తి ప్రవృత్తిచేత ప్రేరేపింపబడి మద్యపానానికి అలవాటుపడ్డాడనుకోండి. ఆ మద్యపానం అతడి ఇంటినీ ఒంటినీగూడా గుల్ల చేసేస్తుంది. సంఘంలో అతడికున్న పేరుప్రతిష్ఠలు పోవడమే కాక, అవహేళనపాలు అవుతాడుకూడా. ఆలుబిడ్డలు దిక్కుతోచని స్థితిలో పడిపోతారు. అతణ్ణి వారించడం ఎంతప్రయత్నించినా ఎవరికీ సాధ్యం కాదు. ఇంతలో అతని ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింటుంది. ఏ క్షయవ్యాధో అతణ్ణి వశపరుచుకుంటుంది. తానిక

---

6. ధర్మమేవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః (మనుస్మృతి - 8-15)

ఎక్కువకాలం బ్రతకడానికి అవకాశం లేదని తెలుస్తుంది. వ్యసనాన్ని వదలడమూ తనకు చేతకాకుండా ఉంటుంది. అప్పుడతడు తన కథను నెమరువేసుకొని, తాను సృష్టించుకొన్న సమస్యలన్నింటినీ గ్రహించుకొని, వీటినుంచి బయటపడటం ఎలాగా అని ఆర్తిని చెందుతాడు. వీటినుంచి బయటపడవేయమని తన ఇష్టదైవాన్ని కోరుకుంటాడు, మద్యపాన వ్యసనం బారినుంచి తనను రక్షించమని ఆర్తితో వేడుకొంటాడు. ఆ ఆర్తుని ఆర్తిని దేవుడు వింటాడు.

ఆర్తితో వేడుకొని తాను నమ్మిన దైవం ఎడల గల విశ్వాసంతో జీవించడానికి ప్రయత్నిస్తున్న వ్యక్తికి తననుగూర్చి, తన నిజస్థితినిగూర్చి, దైవాన్నిగూర్చి, దైవానికీ తనకూ ఉన్న సంబంధాన్నిగూర్చి ఆలోచనలు రావడం మొదలవుతాయి. ఈస్థితిలో అతడు జిజ్ఞాసువు అనబడతాడు.

తననిజస్థితి ఎడల అప్పుడప్పుడే కన్నుతెరుస్తున్న మానవుడు తాను అనుకొన్న ప్రయోజనాలు సిద్ధించాలనీ, కార్యాలు నెరవేరాలనీ, తాను నమ్మిన దైవానికి మళ్ళీమళ్ళీ మ్రొక్కుతూ ఉంటాడు. తాను కోరినట్టు జరిగితే తనదైవం తనను అనుగ్రహించాడని మురిసిపోతూ ఉంటాడు. ఈస్థితిలో అతడు అర్థార్థి అవుతున్నాడు.

ఆపైన క్రమంగా అతడికి తాను దేవుడిలో భాగమేననీ, దేవునియొక్క అంశే తాననీ, దేవుడిగా జీవించవలసిన తాను త్రిగుణాల త్రిప్పటకు లోనై తిప్పలుపడ్డాననీ గ్రహిస్తాడు. మళ్ళీ తాను దైవస్థితికి చేరువై దైవంగా బ్రతకాలని కోరుకుంటాడు. ఆమార్గాన నడిపించమని తన దైవాన్ని వేడుకుంటాడు. అప్పుడు ఆ దైవం అనుగ్రహించిన మార్గాన నడచి తాను తానుగా, తానే దైవంగా, దైవత్వంలో నిలిచి నిలద్రొక్కుకుంటాడు. అలా స్థిరపడినపుడే అతడు జ్ఞాని.

ఈ విధంగా ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అనే నాలుగు స్థితుల్లో భక్తులు తనను చేరుకుంటున్నారనీ, అందులో జ్ఞాని తనతో యోగాన్ని పొంది తనకు ప్రీతిపాత్రుడు అవుతున్నాడనీ కృష్ణుడు గీతలో వివరించాడు.7

పై మార్గంలో మేలుకొలుపు పొందటానికి సిద్ధంకానివారూ, దానికి సుదూరంలో ఉన్నవారూకొందరుంటారు. వారు దుర్బలులైతే కలిగే ప్రమాదంకన్నా దుష్టులైనప్పుడు జరిగే ప్రమాదం ఎక్కువ. అలాంటివారు లోకకంటకంగా ప్రవర్తిస్తున్నప్పుడు వాళ్ళకు మంచిగా నచ్చచెబితే ఎక్కదు. అలాంటివారి బారినుంచి మిగిలినవారిని రక్షించేటందుకే పరిపాలకుల చేతికి దండం ఈయబడింది. పరిపాలకుడు లోకకంటకులకు తగినశిక్ష విధిస్తూ ఉండాలి. అంతేకాదు, వాళ్ళు శరీరంలో ఉండటమే లోకానికి ప్రమాదం అయితే శరీరాన్నుంచి వాళ్ళను తొలగించడానికికూడా సిద్ధం కావాలి. దుర్యోధనాదులకు కురుక్షేత్ర సంగ్రామంలో ప్రకృతి విధించిన దండన ఇలాంటిదే. ఈవిధంగా శరీరాన్నుంచి తొలగించబడటంకూడా జీవికి ఒకవిధమైన శిక్షణే. ఎన్నిసార్లు హెచ్చరించినా వక్రమార్గాలు వదలిపెట్టని ఉద్యోగిని ఆ ఉద్యోగంనుంచి తాత్కాలికంగా తప్పించడంకూడా ఒక శిక్షణేకదా ! మళ్ళీ ఈసారి ఉద్యోగంలో చేరినప్పుడు కొంతైనా బుద్ధిగా ఉంటాడు. అలాగే తాను చేస్తున్న దుష్టత్వానికి తనకు ఉపాధి అయిన ఈ శరీరాన్ని కోల్పోయినవాడు తరువాతి జన్మలో కొంతైనా జాగ్రత్తపడటానికి వీలుంది. అప్పుడుకూడా జాగ్రత్త పడకపోతే మళ్ళీ పూర్వంలాగానే శరీరాన్నుంచి తొలగింపబడతాడు.

---

7. చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ ॥
తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏక భక్తిర్విశిష్యతే ।
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమప్రియః ॥ (భగవద్గీత-7-16,17)

ఈవిధంగా ఏదో ఒక మార్గంలో మానవుడు తన నిజస్థితి ఎడల కన్ను తెరిచేటంతవరకూ ప్రకృతి అతడికి శిక్షణను ఇస్తూనే ఉంటుంది. ఆ శిక్షణ తాను సొంతంగా నిర్ణయించదు. ఆయా వ్యక్తులు చేసిన కర్మలకు ఫలాలరూపంలో ఆయాశిక్షలు రూపుదాల్చి శిక్షణను ఇస్తూ ఉంటాయి.

## 3. యోగసాధన :

సామాన్య మానవుడు మేలుకొలుపునుపొంది తాను సంసార స్థితిలో ఉన్నానని గ్రహించి ఆ సంసారస్థితినుంచి తనను తాను ఉద్ధరించుకోవాలని కోరినపుడు అనుసరించవలసిన మార్గం ఏమిటి ? ఆస్థితిలోఉన్న మానవుడికి పెద్దల ప్రవచనాలు విన్నప్పుడూ, మహాను భావుల జీవితచరిత్రలు చదువుకొన్నప్పుడూ తానుకూడా వారిలాగ జీవించాలని అనిపిస్తుంది. అలా జీవించడానికి ప్రయత్నం చేస్తూ ఉంటాడు కూడా. కాని పూర్వసంస్కారాల బలం ఎక్కువ అవడం వల్ల మనస్సు అతడు అనుకొన్న స్థితినుంచి పూర్వస్థితికి జరిగిపోతూ ఉంటుంది. అప్పుడు అతడు ఏం చేయాలి ? ఏంచేస్తే మనస్సు తన మాట వింటుంది ? చంచలమైన మనస్సును నిగ్రహించడం సాధ్య మైన పనికాదని కృష్ణుడు గీతలో చెప్పాడు. ఆమనస్సును అభ్యాస వైరాగ్యాలతో దారికి తెచ్చుకోవాలని కూడా సూచించాడు. 8

సామాన్యస్థితిలో శరీరమే తాను అనుకొన్న మానవుడు నిజ స్థితి ఎడల కన్ను తెరిచిన తరువాత శరీరం తాను కాదనీ, శరీరం తనదనీ, తన శరీరాన్నీ ప్రవృత్తుల్నీ సరైనపద్ధతిలో ఉపయోగించు కోవాలనీ సంకల్పిస్తాడు. పెద్దల అడుగుజాడల్లో నడవడానికి ఉద్యు క్తుడు అవుతాడు కాని అతడి మనస్సుపై, ప్రవృత్తులపై పూర్వ

8. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణచ గృహ్యతే॥ (భగవద్గీత - 6-35)

సంస్కారాల ప్రభావం ఎక్కువగా ఉండటంవల్ల దాన్ని ఆపలేక తనకునచ్చిన కొత్తజీవితంకన్నా తనప్రవర్తన వేరుగా ఉంటోందనీ, తనకు ఘర్షణ కలిగిస్తోందనీ బాధపడతాడు. తాను అనుకొన్నట్టు తాను ప్రవర్తించలేకపోతున్నానని అతడి బాధ. అలాంటి సందర్భంలో అనన్యచింతను అలవరచుకోవడం ఒక్కటే మార్గమని కృష్ణుడు చెప్పాడు. తనలోనూ,తన చుట్టూ వ్యక్తమవుతున్నది ఒకే అంతర్యామి అని భావించి, ఆ అంతర్యామిని సర్వకాల సర్వావస్థలయందూ స్మరిస్తూఉండటం ప్రారంభించినపుడు, పూర్వసంస్కారాల కల్మషాలు కరిగిపోయి ఆ అంతర్యామితో శ్రుతికుదురుతుందని సూచిస్తూ తనను నిరంతరం దర్శిస్తున్నవాని యోగక్షేమాన్ని తానే చూసుకొంటానని కృష్ణుడు చెప్పాడు[9]. ఆ అంతర్యామిని అనుక్షణం స్మరించి అనుభవించే అభ్యాసాన్ని మానవుడు చేసుకొంటున్నకొద్దీ అతడు తనలోనికే తాను చేరడం ప్రారంభమవుతుంది. తాను ఆచరించే కర్మల ఫలితాలను ఆ అంతర్యామికే సమర్పించడం అభ్యాసం చేయడంతో వైరాగ్యం అలవడటం ప్రారంభిస్తుంది. ఈ అభ్యాసవైరాగ్యాలు మానవుడికి సులువుగా అబ్బి యోగస్థితి లభించడానికి అతడు ఆరోహించవలసిన సోపానాలు రెండు ఉన్నాయి.

మొదటిది తనకు నచ్చిన, తన మనస్సు మెచ్చిన మహాను భావుల్ని ఆదర్శంగా పెట్టుకోవడం - పాండవులు కృష్ణ వేదవ్యాసుల్ని ఆదర్శంగా పెట్టుకున్నట్టు. అలాపెట్టుకోవడంవల్ల మానవుడికి నిజస్థితి సులువుగా చిక్కుతుంది. కారణం ఏమంటే ఇంద్రియవిషయాలకు అంటుకోకుండా మనస్సును, ఇంద్రియాలను బుద్ధి సారథ్యంలో పని చేయనిస్తున్న మహానుభావుల జీవితాలను పరిశీలించినపుడు వారు

---

9. అనన్యాశ్చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥
(భగవద్గీత - 9-22)

ఏ సన్నివేశాల్లో ఎలా ప్రవర్తిస్తున్నారో మనకు బోధపడుతుంది. అలాంటి సన్నివేశాలు మనజీవితంలో ఎదురైనప్పుడు వారిలా ప్రవర్తించడానికి ప్రయత్నం జరుగుతుంది. ఈ అంశాన్నే తైత్తిరీయం ఇలా నొక్కి చెబుతోంది-'కర్తవ్యనిర్వహణలో విచికిత్స కలిగినపుడు నీ వెరిగిన వారిలో బ్రహ్మజ్ఞానం కలిగినవారు ఎవరుఉన్నారో గమనించు. వారిలో విమర్శజ్ఞానం(Analysis) మాత్రమే కలవారు కాక, సమ్మర్శజ్ఞానం (Synthesis or correlation) కలవారిని ఎంచుకో. వారిలో స్వధర్మాచరణం, ఇతరులతో సంబంధించిన వ్యవహారాలు మొక్కపోకుండా (తమకూ ఇతరులకూ బాధ కలగకుండా) జీవిస్తున్నవారిని పరిశీలించు. ఆయాసన్నివేశాల్లో వారు ఎలా ప్రవర్తిస్తున్నారో గమనించు. నీవుకూడా ఆ యా సన్నివేశాల్లో అలాగే ప్రవర్తించు.'10

కీటకంచుట్టూ భ్రమరం తిరగ్గా తిరగ్గా కీటకం కూడా భ్రమరంగా మారినట్టు, అయస్కాంతానికి చేరువలో ఉన్న ఇనపముక్కలోని అయస్కాంతధర్మం మేల్కొని క్రమంగా ఇనపముక్క కూడా అయస్కాంతంగా అయినట్టు మహానుభావుల ఎడల భక్తిప్రపత్తులు కలిగి ప్రవర్తించినవారుకూడా వారు చూపిన సమర్పణబుద్ధినిబట్టి నిజస్థితికి చేరుకొని నిలబడగలుగుతారు.

మహానుభావుల్ని ఆదర్శంగా గైకొని ఆరాధించడంలో మరొక సూక్ష్మాంశం ఉంది. మనస్సు ఇంద్రియాలలోనికి జారిపోయినప్పుడు రకరకాల వికారాలకులోనై జీవులు ఒకరికన్నా ఒకరు భిన్నంగా గోచరిస్తూ ఉంటారు. ఆ మనస్సు ఇంద్రియాలను తాను

10. అథ యదితే కర్మ విచికిత్సా వా వృత్త విచికిత్సా వా స్యాత్ యేతత్ర బ్రాహ్మణాః సంమర్శినః యుక్తా ఆయుక్తా అలూక్షా ధర్మకామాః స్యుః యథా తేఽత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః

(తైత్తరీయం -11 వ అనువాకం)

స్వీకరించి బుద్ధితో యోగాన్ని చెందినపుడు ఆ బుద్ధికి పైన ఉన్నవాడు అందరిలోనూ ఒక్కడేగనుక అతడు ఎన్నిదేహాలతో వర్తిస్తున్నా అతడివే ఇన్నిదేహాలూ అన్న దర్శనం లభిస్తుంది. కాబట్టి మహానుభావుల్లో సాధకుడికి దర్శనం ఇచ్చేది 'ఆ ఒక్కడే'. వేదాలూ, ఉపనిషత్తులూ, పురాణేతిహాసాది పవిత్రగ్రంథాలూ, ధర్మశాస్త్రాలూ, సదాచారాలూ దిగివస్తున్నది ఆ ఒక్కడినుంచేనన్న సత్యదర్శనం అతడికి లభిస్తుంది.

ఇంద్రియవికారాలకు లోనుకాని తన నిజస్వరూపం ఎలాంటిదో, ఆస్థితిలో తాను నిలిచినప్పుడు తనవైభవం ఎలాఉంటుందో సాధకుడికి తాను విశ్వసించి నమస్కరిస్తున్న మహానుభావుల జీవితాల్లో దర్శనం ఇస్తూఉంటుంది. అంటే సాధకుడు తన నిజస్వరూపాన్ని గురువులో దర్శిస్తున్నాడన్నమాట! అద్దంలో ప్రతిబింబాన్ని చూసుకొని రూపురేకల్ని దిద్దుకున్నట్టు, తాను నమ్మిన మహానుభావుడిలో నిజస్వరూపాన్ని దర్శిస్తూ సాధకుడు తన జీవితాన్ని తాను దిద్దుకోవడం ప్రారంభిస్తాడు.

మనకన్నా కొన్ని పదుల సంవత్సరాలు ముందు పుట్టినవారు మనకు భౌతికమైన జన్మను ఇచ్చినట్టే, మనకన్నా ముందు నిజస్థితిలో స్థిరపడ్డవారు మనకు ఆ నిజస్థితిలో స్థిరపడగల ద్వితీయజన్మను ప్రసాదిస్తారు. ఈజన్మను తోడివారికి ప్రసాదించడానికే ఆత్మస్వరూపులైన మహాత్ములు భూమికి కోరి దిగివస్తూఉంటారు. వ్యాసాదిమహర్షులు అట్టివారే. ఈపనికోసం తానే స్వయంగా దిగివస్తాననీ, దుష్టులకు శిక్షణా, శిష్టులకు రక్షణా ఇచ్చి యుగయుగాల్లో ధర్మాన్ని సంస్థాపన చేస్తూ ఉంటాననీ కృష్ణుడే గీతలో చెప్పాడు.11

11 పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ (భగవద్గీత - 4-8)

కాబట్టి సాధకుడు తనస్వభావానికి తగిన, తన మనస్సును ఆకర్షించిన మహానుభావుల్ని విశ్వసించి నమస్కరించడమే కాక, తన సర్వస్వాన్నీ సమర్పణచేసి వారి అడుగుజాడల్లో నడవగలగాలి. భారతంలో పాండవులు, కుంతి, ద్రౌపది మొదలైనవారు కృష్ణుడి పాదాలకడ తమ సర్వస్వాన్ని సమర్పణచేసి, అతడి అడుగుజాడల్లో నడచి, అతడి ధర్మసంస్థాపనకు ఉపకరణాలై ధన్యత చెందారు.

మహానుభావుల అడుగుజాడల్లో నడవగలిగేటందుకు మానవుడు అనుష్ఠించవలసిన సాధనమార్గం ఒకటిఉంది. అదే రెండవ సోపానం. సాధకుడు తన ఆహారవిహారాదులను యుక్తమైన మార్గంలో నడుపుకొంటూ అనుదినం తాను శుచిగాఉండి, శుచియైన ప్రదేశంలో, సుఖమైనతీరులో మరీ ఎత్తుగానీ, మరీ పల్లంగానీ కాని ఆసనంపైన కూర్చోవాలి. ఆ ఆసనం చేలమయినా, చర్మమయినా, దర్భాసనమైనా కావచ్చు.12 తాను కూర్చున్న ప్రదేశం శుచిగా ఉన్నట్లే, తనమనస్సుకూడా శుచియైన భావాలతో కూడి ఉండేట్లుగా చూసుకోవాలి. తాను కూర్చున్న తీరు సుఖంగా ఉన్నట్లే, తన మనస్సుకూడా దివ్యమైన భావాలతో సుఖానుభూతి పొందేటట్లు చూసుకోవాలి. మనస్సుకు అలాంటి దివ్యసుఖస్థితి లభించడంకొరకే తాను శుచిఅయిన ప్రదేశంలో శుచిగా సుఖమైన ఆసనంపై కూర్చున్నది అని గ్రహించాలి.

మనస్సుకు 'అక్కడ' నేనున్నానని హృదయాన్ని చూపి హృదయంలోగల తన నిజస్వరూపాన్ని మనస్సుతో స్మరించాలి.13 శిరస్సు, మెడ, వెన్ను సూటిగా, ఊర్ధ్వంగా ఉండేటట్లు కూర్చోవాలి.14 అలా కూర్చోవడంలో శరీరభాగాల్లో ఎక్కడా

1. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్॥ (భగవద్గీత - 6-11)

.3. తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేన్ద్రియ క్రియః।
ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగ మాత్మవిశుద్ధయే॥ (భగవద్గీత - 6-12)

14. సమం కాయ శిరో గ్రీవం ధారయన్న చలం స్థిరః (భగవద్గీత - 6-13.)

లిగింపు లేకుండా సుఖంగా ఉండేటట్టు చూసుకోవాలి. ఆపైన మన స్సుతో ఉచ్ఛ్వాసనిశ్వాసలను గమనించాలి. ఉచ్ఛ్వాసనిశ్వాసలతో ప్రాణ అపానాలు మనస్సుతో ఆఉచ్ఛ్వాసనిశ్వాసలను గమనించడం వల్ల (అనగా హోమం చేయుడంవల్ల) అవి సమస్థితిని పొందు తాయి.15 మనస్సు ఆ ఉచ్ఛ్వాసనిశ్వాసల్లో కరిగిపోవడం ప్రారం భిస్తుంది. ఆక్షణాల్లో సాధకుడు నాసికాగ్రాన్ని స్మరించాలి.16 నాసి కాగ్రంలో తన ఇష్టదైవంయొక్క రూపాన్ని ఆహ్లాదకరమైన తీరులో దర్శించి దివ్యానుభూతిని పొందుతూ ఉండగా ఉచ్ఛ్వాసనిశ్వాసల నడుమ ఉన్న ప్రణవంలో* మనస్సు కరుగుతుంది.17 మనస్సు ప్రణ వంలో కరగడంతో హృదయంలో స్థిరపడిన సాధకుడికి క్రమంగా

---

15. అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపాన గతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥ (భగవద్గీత-4-29)

16. " ... .... .... ....
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్" (భగవద్గీత(6 13)
నాసికాగ్రం అంటే ముక్కుకొన అని కొందరూ. నాసికకు పైన కనుబొమల మధ్యగల చోటు అని కొందరూ భావిస్తున్నారు, కనుబొమలమధ్యచోటు అని ఎక్కువమంది పెద్దల నిర్దేశం. ఈఅర్థాన్నే ఈసందర్భంలో మనం చెప్పుకో వలసి ఉంటుంది.

* ఉచ్ఛ్వాసంలో 'సో'అన్న ధ్వనీ నిశ్వాసంలో 'హమ్'అన్న ధ్వనీ ఇమిడి ఉన్నాయి. రెండూ కలిసి 'సోఽహమ్' అవుతాయి. సాధకుడు ఉచ్ఛ్వాస నిశ్వాసలను గమనించేటప్పుడు 'సో'లోగల సకారం,హమ్‌లోగల హకారం కరగిపోయి ఓంకారం మిగులుతుంది. అదే ప్రణవం, అదే బ్రహ్మ. 'ఓం ఇత్యేకాక్షరంబ్రహ్మ'అని కృష్ణుడు చెప్పాడు దానిలో కరిగిన మనస్సు ఆ అక్షరం విడిదిచేసిన హృదయాన్నిచేరి స్థిరపడుతుంది.

17. భాగవతంలో కపిలుడు దేవహూతికి నాసికాగ్రాన్ని అవలోకిస్తున్నప్పుడు ఇష్టదైవాన్ని ఎలా అంచెలంచెలమీద స్మరించి దర్శించి అనుభూతిని పొందాలో విపులంగా వివరించాడు.
(చూ. ఆం. మ. భాగ - తృ. స్కం - 912-931)

అంతర్యామిత్వస్థితి సిద్ధిస్తుంది.18 ఆ అంతర్యామిత్వస్థితిలో నిలిచిన సాధకుడికి నిజమైన ప్రశాంతత లభిస్తుంది. తానుతప్ప వేరులేదని తెలిసిన తనకు ఇక భయముండదు. తాను బ్రహ్మయందు నిరంతరం చరించడంతో బ్రహ్మచర్యవ్రతంలో స్థిరపడతాడు 19

నిత్యమూ నిర్ణీతసమయంలో సాధకుడు ఈ ఆత్మసాధన అభ్యాసంచేయాలి. ఆ అభ్యాసం ఒకవంక చేస్తూనే నిత్యజీవితంలో తన దినచర్యలో దైవసాన్నిధ్యాన్ని అనుభవించడం నేర్వాలి. విశ్వప్రేమను, భూతదయను పెంపొందించుకొంటూ ఇతరులు తన ఎడల ఏవిధంగా ప్రవర్తిస్తే తనకు బాధ కలుగుతుందో గమనించుకొని తాను ఇతరుల ఎడల అలా ప్రవర్తించకుండా ఉండగలగడం అభ్యాసం చెయ్యాలి.20 సుఖదుఃఖాలకు సంబంధించి తోడివారూ తనవంటివారేనని గ్రహించుకొని తననే ఆ సన్నివేశంలో ఊహించుకొంటూ, సహృదయంతో సమదర్శనంతో ప్రవర్తించడం ప్రారంభించాలి 21 కర్తవ్య నిర్వహణలో తనమటుకు తనకు ధర్మాధర్మాలు తేలని పరిస్థితి ఏర్పడినప్పుడు పెద్దల ప్రవర్తనలను, ధర్మశాస్త్రాలను

18. ఈ యోగసాధనక్రమాన్నే పతంజలి అష్టాంగయోగమార్గంగా నిర్దేశించి వివరించాడు. యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధులు ఆ అష్టాంగాలు. కృష్ణుడు గీతలో ఇచ్చిన యోగ మార్గాన్నే పతంజలి ప్రత్యేకంగా సూత్రీకరించి ఇచ్చాడనిపిస్తుంది.

19. ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారి వ్రతే స్థితః (భగవద్గీత - 6-14)

20. ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము దన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ పథములకెల్లన్ (ఆం. మ.భా. శాంతి 5.220)

21. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖంవా యదివా దుఃఖం స యోగీ పరమో మతః (భగవద్గీత - 6-32)

ప్రమాణంగా స్వీకరిస్తూ ముందుకుసాగుతూ ఉండాలి 22 విశ్వరూపంలో వ్యక్తమవుతున్నది తాను ఆరాధిస్తున్న దైవమేనని గ్రహించి అనన్యచింతతో విధినిర్వహణను ఆ దేవుడిపూజగా భావించడం మొదలుపెట్టాలి. ఈభావనను మహానుభావుల చేయూత లభించడంతో తాను చేసే సాధనా తన దినచర్యా పరస్పరపరిపోషకాలుగా నడుస్తూ క్రమంగా అద్వైతస్థితిని పొందుతాయి. ఈ అద్వైతస్థితి సిద్ధించే వరకూ జరిగేది యోగసాధన. సిద్ధించిన తర్వాత వ్యక్తమయ్యేది యోగజీవితం.

## 4. యోగజీవితం :

యోగసాధనలోని సోపానాలను ఆరోహించి వికసించిన హృదయపద్మంలో స్థిరుడై నిలిచిన మానవుడు అంతర్యామితత్వాన్ని అనుభవిస్తాడు అని చెప్పుకొన్నాం. ఆస్థితిలో నిలిచినవాడికి సకల జీవుల శరీరాలనే యంత్రాలను హృదయస్థానంలో నిలిచి నడుపుతున్న ఒకేఒక దివ్యమూర్తి సాక్షాత్కరిస్తాడు 23 అతడితోనే ఈ విశ్వమంతా నిండి ఉన్నదని, అతడినుంచే ఈ విశ్వమంతా వ్యక్తమై, అతడిలోనే ఉంటూ, అతడివల్లనే వర్తిస్తున్నదనీ, ఈవిశ్వానికి ఆదిమధ్యాంతాలు అతడేననీ, అతడే తాను అనీ, తానే అతడనీ ఆ విప్పారిన హృదయకమలంలో సుఖాసీనుడైన వ్యక్తి గమనిస్తాడు. ఆ దివ్యస్థితిలో అతడినుంచి వ్యక్తమయ్యేవి ముఖ్యంగా రెండు అంశాలు. అవి (1) సమదర్శనం (2) కర్మాచరణలో కౌశలం.

### సమదర్శనం :

యోగసాధనకాలంలో అతడిచేత అభ్యాసం చేయబడిన సమదర్శనం ఇప్పుడు అతడికి పరిపూర్ణంగా సిద్ధిస్తుంది. దానితో

---

22. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥ (భగవద్గీత - 16-24.)

22. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥ (భగవద్గీత-17-61)

అతడికి శీతోష్ణాలయెడలా, సుఖదుఃఖాలయెడలా, మానావమానాల యెడలా సమదృష్టి నిలుస్తుంది24వాటియెడల తాను ప్రవర్తించవలసిన తీరులో ప్రవర్తించడం ఉంటుందిగానీ వాటి ప్రభావానికి తాను లోనుకావడం ఉండదు. కర్తవ్యనిర్వహణ ఉంటుందిగానీ కలత చెందడం ఉండదు. అలాగే అతడిదృష్టికి మట్టిబెడ్డా, రాతిముక్కా, బంగారపుకణికా ఒకటిగానే గోచరిస్తాయి.25 ఆమూడిటిలోనూ ఉన్నది ఒకే అంతర్యామి అన్నది అతడికి అనుభూతం అవుతుంది. అతడి ప్రవర్తనలో తగినరీతిలో వస్తువులను వినియోగించుకోవడం ఉంటుందితప్ప, ప్రత్యేకించి కొన్ని వస్తువులపై విలువలు పెంచుకోవడం అంటూ ఉండదు.

మిత్రులుగా, శత్రువులుగా, ఉదాసీనులుగా, మధ్యస్థులుగా, బంధువులుగా, మంచివారుగా, చెడ్డవారుగా గోచరించేవారందరిలో అతడిదృష్టికి ఒకేఅంతర్యామి సాక్షాత్కరిస్తాడు.26 వారియెడల వారికి తగినరీతిలో ప్రవర్తించడం ఉంటుందిగానీ వారినిగూర్చిన అభిప్రాయాలుగానీ, న్యూనతాధిక్యభావాలుగానీ, అతడిమనస్సులో కలగవు. ధర్మరాజు అజాతశత్రువు అనడంలోనిసూక్ష్మం ఇలాంటిదే. అజాతశత్రుడు అంటే తనమనస్సులో శత్రువులు పుట్టనివాడు అని అర్థం. అతడు ఎవరినీ శత్రువులుగా చూడలేదు. కాని అతణ్ణి శత్రువుగా చూసినవారు అతడిపై కాలుదువ్వారు. అలా కాలు దువ్విన దుర్యోధనుణ్ణికూడా గంధర్వులబారినుంచి రక్షించమని

24. జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః।
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః॥ (భగవద్గీత-6-7)

25. జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః॥ (భగవద్గీత-6-8)

26. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబన్ధుషు।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥ (భగవద్గీత-6-9

తమ్ముళ్ళను ఆజ్ఞాపించిన సమదర్శి ధర్మజుడు. ఆ స్థితిలో మరొకరు అయితే కాగలకార్యం గంధర్వులే తీర్చారని సంతోషపడేవారు. చిట్టచివరిస్థితివరకూ తన సమదృష్టితో తనను శత్రువుగా భావించిన వారికి అవకాశం ఇస్తూనేవచ్చాడు ధర్మరాజు. తప్పనిసరైన పరిస్థితుల్ని శత్రువులే సృష్టించి యుద్ధానికి దిగినపుడు కృష్ణుడి అనుజ్ఞతో తనధర్మాన్ని తాను నిర్వర్తించాడు. సమదర్శి తనకు ఎదురైన సన్నివేశాలయెడల ఒక న్యాయమూర్తిలా ప్రవర్తిస్తాడు. న్యాయమూర్తి చెడును శిక్షిస్తున్నాడు. మంచికి రక్షణ కల్పిస్తున్నాడు. కాని అతడిమనస్సుకు ఆ సన్నివేశాలేవీ అంటుకోవు. ఈ విధమైన సమదృష్టితో యోగినుంచి విధినిర్వహణ జరుగుతూ ఉంటుంది.

అతడి కర్తవ్యనిర్వహణకు ప్రేరణ అతడి స్వధర్మమూ, ఆ స్వధర్మాన్ని రూపొందిస్తున్న ప్రకృతీ, ఆ ప్రకృతికి అధ్యక్షత వహిస్తున్న పరమేశ్వరుడూను.27 పరమేశ్వరుడినుంచి ప్రకృతిద్వారా తన స్వధర్మం రూపుకట్టుకొంటూఉండగా ఆ స్వధర్మానుగుణమైన క్రియాకలాపాలను నిర్వహిస్తాడు యోగి. అతడి ప్రవర్తన అతడి ప్రవృత్తిపై ఆధారపడిఉండదు. త్రిగుణాలతోకూడిన అతడి ప్రవృత్తి అతడిలో కరిగిపోయి అతడి కర్తవ్యానికి అనుగుణమైన రూపాన్ని ధరిస్తూ ఉంటుంది. అతడికి కోపంరాదు. కానీ ఆవశ్యకమైనపుడు, (మిథ్యా) కోపాన్ని చూపగలడు. అతడికి ద్వేషంఉండదు. కానీ అవసరాన్నిబట్టి (మిథ్యా) ద్వేషాన్ని ప్రదర్శించగలడు. ఈవిధంగా యోగిలోని త్రిగుణాలు అతడికి సేవకులై, అతడి ఆజ్ఞకు లోబడి పనిచేస్తూ ఉంటాయి. యోగి కానినాడు మానవుడు త్రిగుణాల చేతిలో కీలుబొమ్మ. యోగస్థితిని పొందినప్పటినుంచీ మానవుడికి అతడిలోని త్రిగుణాలు అతడి సేవకులు. యోగస్థితిలోని ఈవిధమైన వైభవాన్ని పరిపూర్ణంగా ప్రదర్శించినవాడు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు.

---

27. మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే॥ (భగవద్గీత - 9-10)

యోగస్థితిలో నిలిచినవాడికి సర్వభూతాంతరాత్ముడైన అంతర్యామితో చెలిమిచేయడం చేతనవుతుంది. అతడికి విద్యావినయ సంపన్నుడిలోనూ, బ్రాహ్మణుడిలోనూ, గోవులోనూ, ఏనుగులోనూ, కుక్కలోనూ, కుక్కను చంపి తినేవాడిలోనూ ఆ అంతర్యామే ప్రసన్నమవడంతో సర్వభూతాల యెడలా సమదర్శనస్థితి సిద్ధిస్తుంది28. దానితో అతను సర్వభూతాల హితాన్ని అపేక్షిస్తూ, ఆభూతాలతో కలిసిమెలిసి జీవిస్తాడు. ఋషుల ఆశ్రమాల ప్రాంగణాల్లో సకలజీవ కోటీ శత్రుత్వం విడిచి ఒకదానిని ఒకటి నొప్పించకుండా ఒకటిగా కలిసి వర్తిస్తూ ఉండటం పవిత్రగ్రంథాల వర్ణనల్లోనూ, మహాను భావుల సన్నిధుల్లోనూ మనకు దర్శనం ఇస్తుంది. సమదర్శనం పొందిన వ్యక్తియొక్క సన్నిధిలోని జీవకోటికి కూడా సమదర్శనం సిద్ధిస్తుందని ఈ సన్నివేశాలు తెలియబరుస్తున్నాయి. ఈస్థితిని పొందిన మానవుడు తోడివారితో సహజంగా ప్రవర్తిస్తాడు తప్ప వింతగా ప్రవర్తించడు. తనవలన తోడివారికీ, తోడివారివల్ల తనకూ ఏమాత్రం ఇబ్బంది కలగని స్థితిలో తననుతాను సరిదిద్దుకొని వర్తిస్తాడు. తన ప్రవర్తనవల్ల తోడివారికి ఉద్వేగం కలగకుండా, తోడివారి ప్రవర్తనవల్ల తాను ఉద్వేగాన్ని పొందకుండా, హర్ష రోషభయాలనే ఉద్వేగాలకు అతీతమైన యోగస్థితిలో అంతర్యామికి ప్రియుడై వర్తిస్తూ ఉంటాడు.29

ఈ విధమైన సమదర్శనంతో జీవించసగినవారికి సృష్టి తత్త్వాల ఎడల కూడా సమాదర్శనం సిద్ధిస్తుంది. ఈసృష్టిలో రెండు

---

28. విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః॥ (భగవద్గీత - 5-18)

29. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో య స్సచమే ప్రియః ॥
(భగవద్గీత - 12-15)

మార్గాలు ఉన్నాయి. ఒకటి-సూక్ష్మస్థితినుంచి స్థూలస్థితికి దిగివచ్చే మార్గం. రెండవది-స్థూలస్థితినుంచి సూక్ష్మస్థితికి కొనిపోయే మార్గం. స్థూలస్థితినుంచి సూక్ష్మస్థితికి కొనిపోయేవి అగ్ని, వెలుగు, పగలు, శుక్లపక్షం, ఆరుమాసాల ఉత్తరాయణం. అగ్ని పదార్థాలను దహించి ప్రజ్ఞను స్థూలస్థితినుంచి సూక్ష్మస్థితిలోకి కొనిపోతుంది. అలాంటివే వెలుగూ, పగలూ కూడా. నెలలోని శుక్లపక్షం, సంవత్సరంలోని ఉత్తరాయణం కూడా ప్రజ్ఞను స్థూలస్థితినుంచి సూక్ష్మస్థితిలోనికి కొనిపోయేవే. భూమిపైన నీరు ఉత్తరాయణంలో ఆవిరై ఊర్ధ్వముఖం పట్టడం మనం చూస్తున్నాంగదా! కాబట్టి ఈకాలంలో ధ్యానం చేసినవాడు ఊర్ధ్వగతిలో ప్రయాణం చేసి బ్రహ్మస్థితి పొందుతాడు. ఈమార్గాన్ని శుక్లగతి అంటారు.

ఇక రెండవది సూక్ష్మస్థితినుంచి ప్రజ్ఞను స్థూలస్థితికి కొనివచ్చేమార్గం. పొగ, రాత్రి, చీకటి, కృష్ణపక్షం, దక్షిణాయనం ఈ అవరోహణమార్గాన్ని సూచిస్తాయి. ఈమార్గాన దేహం విడిచిన వాడూ, ధ్యానం చేసిన వాడూ ఈ చక్రంలో తిరుగుతూ ఉంటాడు. దీన్ని కృష్ణగతి అంటారు.

ఈ మార్గాల్లో మొదటిది ఊర్ధ్వ మార్గం, రెండవది అధోమార్గం. ఊర్ధ్వమార్గం జీవిని ఊర్ధ్వస్థితికి కొనిపోతూఉండగా, అధోమార్గం తిరిగి వెనుకటి పదార్థస్థితికి కొనివస్తుంది. శుక్లగతివల్ల ఊర్ధ్వగతి పొందిన మానవుడు కృష్ణగతివల్ల అధఃస్థితికి దిగివస్తున్నాడు. ఈ రెండు మార్గాలూ శాశ్వతాలైనవి. ఈ మార్గాలు లేనిదే సృష్టిక్రమం నడవదు. కాని సామాన్య సాధకుడు శుక్లమార్గంలో ఊర్ధ్వగతిని పొందినప్పటికీ కృష్ణమార్గంలో మళ్ళీ క్రిందికి దిగివస్తూ

ఉంటాడు. ఈవిధంగా బద్ధస్థితినుంచి ముక్తీ, ముక్తినుంచి మరల బద్ధస్థితీ అతణ్ణి వెన్నాడుతూనే ఉంటాయి.30

యోగస్థితిలో నిలిచిన వ్యక్తి ఈ శుక్లకృష్ణగతుల ఎడల మోహపడడు. మోహపడడు అంటే ఆగతుల్లో వర్తించడు అని అర్థంకాదు. ఆ గతులకు అతీతంగా అంతర్యామిత్వంలో ఉంటూ ఆ గతులను వినియోగించుకొంటాడని అర్థం. అంతర్యామినుంచి వ్యక్తమైనవే గదా ఆ గతులు ! సూక్ష్మనుంచి స్థూలానికీ, స్థూలం నుంచి సూక్ష్మానికీ సృష్టికథను నడపడానికి వ్యక్తమైన ఆ గతులు అంతర్యామి ఆజ్ఞకు బద్ధమై నడుస్తున్నాయిగానీ, అంతర్యామిని బంధించలేవుగదా ! కాబట్టి అంతర్యామిస్థితిలో ఉన్న యోగికూడా వాటియెడల మోహపడక వాటిని తననుంచి వ్యక్తమైన గతులుగా గ్రహించి ఆవశ్యకతనుబట్టి రెండిటినీ వినియోగించుకుంటూ ఉంటాడు.31 కాబట్టే యోగస్థితి అన్నిటికన్నా ఉత్తమమైంది అవుతోంది.32

యోగికి తన శరీరం ఒకక్షేత్రమనీ, తాను ఆ క్షేత్రాన్ని దున్ని పండించుకొనే క్షేత్రజ్ఞుణ్ణనీ దర్శనం లభిస్తుంది. అలాగే

30. అగ్నిర్జ్యోతి రహ శ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥
ధూమోరాత్రి స్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥
శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽవర్తతే పునః॥
(భగవద్గీత - 8 - 24-26)

31. నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥ (భగవద్గీత - 8-27)

32. .... .... ....
.... .... యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥
(భగవద్గీత 8-28)

తనకు తన శరీరం క్షేత్రమైనట్టే సర్వజీవుల శరీరాలూ పరమ పురుషుడికి క్షేత్రమనీ, ఆ పరమపురుషుడు ఆ క్షేత్రాల అనుపానులు తెలిసి వాటిని ఫలవంతం చేసే క్షేత్రజ్ఞుడని బోధపడుతుంది.33 ఈ సృష్టివైభవం అంతా ఆ క్షేత్ర క్షేత్రజ్ఞులకు సంబంధించినదే అని తెలుస్తుంది. ఋషులు అనేక విధాల్లో కీర్తించింది వీరినే. వేదాలు అనేక విధాలుగా చెబుతున్నది వీరిని గూర్చే.బ్రహ్మసూత్ర పదాల్లో నిశ్చయించబడింది ఈ నిజస్వరూపమే అన్న దర్శనం లభిస్తుంది.34

మానవుడు తాను పండించుకొనే క్షేత్రంలో అనేక రసాయనిక పదార్థాల సమ్మిశ్రం ఉన్నట్టే పరమపురుషుడి క్షేత్రంలోకూడా అనేక తత్త్వాల సమ్మిశ్రం ఉన్నదని గ్రహిస్తాడు. ఆ తత్త్వాల అమరిక ఇలా ఉంటుంది -

| | |
|---|---|
| మహాభూతాలు (పంచభూతాలు) | 5 |
| అహంకారం | 1 |
| బుద్ధి | 1 |
| అవ్యక్తం | 1 |
| ఏకాదశేంద్రియాలు (5+5+1) | 11 |
| ఇంద్రియార్థాలు | 5 |
| | 24 |

33. 'ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యోవేత్తి తంప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత॥
.... .... .... (భగవద్గీత - 13-2, 3)

34. ఋషిభిర్బహుధాగీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥
(భగవద్గీత 13 - 5)

ఈ ఇరవైనాలుగు అంశాలూ క్షేత్రంలో వ్యక్తమై వర్తించేవి.35 వీటినే సాంఖ్యులు తత్త్వాలు అంటారు. పై వాటిలో అవ్యక్తం అని చెప్పబడిందాన్ని సాంఖ్యులు మూలప్రకృతి అని పిలుస్తారు.

ఈతత్త్వాల సమ్మేళనంలో ఏడుశక్తులు పుడతాయి. అవి ఇవి :

| | |
|---|---|
| ఇచ్ఛాద్వేషాలు | 2 |
| సుఖదుఃఖాలు | 2 |
| సంఘాతం | 1 |
| చేతన | 1 |
| ధృతి | 1 |
| | 7 |

ఈ ఏడుశక్తుల్నీ వికారాలు అంటారు36. మట్టినుంచి కుండ చేయబడ్డట్టు ఈ ఏడుశక్తులూ పై ఇరవైనాలుగు తత్త్వాల కలయిక వల్ల పుడుతున్నాయి. ఈ ఇరవైనాలుగు తత్త్వాలూ, ఏడుశక్తులూ దేవుడిక్షేత్రమైన సృష్టిలోనూ, జీవుడిక్షేత్రమైన శరీరంలోనూ (ఈ శరీరంకూడా సృష్టిక్షేత్రంలోని ఒకభాగమే కనుక) వ్యక్తం అవుతూఉంటాయి. యోగస్థితిలో ఉన్నవాడు ఈ ఇరవైనాలుగు తత్త్వాల స్వరూపస్వభావాలను బోధపరచుకొని తాను అంతర్యామిస్థితిలో ఉన్నాడుగనుక సృష్టిక్షేత్రానికి క్షేత్రజ్ఞుడైన అంత

35. మహాభూతాన్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ ।
ఇన్ద్రియాణి దశైకంచ పఞ్చచేన్ద్రియ గోచరాః॥ (భగవద్గీత-13 6)

36. ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥ (భగవద్గీత - 13-7)

ర్యామి క్షేత్రంయెడల ఎలా నిస్సంగుడై వర్తిస్తున్నాడో తానుకూడా తన క్షేత్రంయెడల అలాగే నిస్సంగత్వంతో వర్తిస్తూఉంటాడు.37 సామాన్యుడు క్షేత్రప్రభావానికిలోనై బందీకృతుడు అవుతూఉండగా యోగి తనక్షేత్రాన్ని తన ప్రభావంతో అంతర్యామికివలె నడుపు కొంటూ ఉంటాడు.

త్రిగుణాల కలయికవల్ల ఈసృష్టి ఏర్పడుతోంది. పరమ పురుషుడే త్రిమూర్తులుగా దిగివచ్చి, త్రిగుణాలను వ్యక్తపరచి సృష్టి కథను నడుపుతున్నాడు. రజోగుణంవల్ల సృష్టి జరుగుతూఉండగా తమోగుణంవల్ల సృష్టి లయం అవుతూఉంటుంది. మధ్య సత్వ గుణం వల్ల సృష్టి నిలబడుతూ ఉంటుంది. రజోగుణానికి బ్రహ్మ, తమోగుణానికి శంకరుడూ, సత్వగుణానికి విష్ణువూ నిర్వాహకులు. ఈ త్రిగుణాలయొక్క పలురకాల కలయికవల్లనే సృష్టిలో లెక్క లేనన్ని చిత్రవిచిత్ర ప్రవృత్తులు పుడుతున్నాయి. మానవుడిలో కూడా అతడి ప్రవృత్తులుగా పనిచేస్తున్నవి ఈ త్రిగుణాల కలయికలే. ఈ సత్యాన్ని గమనించిన యోగి అంతర్యామివలె తాను కూడా త్రిగుణాలకు అతీతంగా వర్తిస్తూ ఆవశ్యకతనుబట్టి ఆయా గుణాలను వ్యక్తపరుస్తూ ఉంటాడు.38

యోగియైనవాడు అంతర్యామి అయిన పరమపురుషుడు ఏకకాలంలో మూడుస్థితుల్లో పనిచేస్తున్నట్టు దర్శిస్తాడు. సృష్టించ బడిన లోకంలో జీవుల రూపంలో నశించే స్వభావం కలవాడు క్షరుడు. ఆ జీవులహృదయాల్లో నాశానికి అతీతంగా నిలబడినవాడు

---

37. క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞాన చక్షుషా ।
భూతప్రకృతి మోక్షంచ యే విదుర్యాన్తి తే పరమ్॥ (భగవద్గీత-13-35)

38. మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయకల్పతే ॥
(భగవద్గీత - 14-26)

అక్షరుడు.39 ఈ రెండుస్థితులూ తననుంచి వ్యక్తం అవుతూఉండగా అంతర్యామిగా నిలిచినవాడు పురుషోత్తముడు. ఈపురుషోత్తముడే క్షర అక్షర పురుషులుగా వ్యక్తం అవుతున్నాడని40 దర్శించిన యోగి తాను పురుషోత్తముడి స్థితిలో నిలిచి క్షర అక్షర పురుషుల రూపంలో వ్యక్తం అవుతున్నది ఆ పురుషోత్తముడి క్రీడ అని దర్శించి ఆ క్రీడలోని తన పాత్రను పురుషోత్తముడివలెనే లీలగా అభినయిస్తాడు.41

## కర్మాచరణలో కౌశలం :

యోగి తనలో స్వభావంగా వ్యక్తమవుతున్న ప్రకృతినీ, ఆ స్వభావంనుంచి దిగివస్తున్న గుణకర్మల్ని దర్శిస్తాడు. స్వభావంచేత ప్రేరేపించబడుతున్న కర్మల్ని ఆపగలగడం సాధ్యంకాదనీ,42 ఆపడం ధర్మం కాదనీ, ఆపవలసిన ఆవశ్యకత లేదనీ గ్రహిస్తాడు. జ్ఞానేంద్రియాలను బుద్ధితో యోగంచేసి, నియమించి, కర్మేంద్రియాలతో కర్మలను ఆచరింపచేస్తూ43, తాను ప్రశాంతంగా ఉంటాడు. అతడు ఆచరించే కర్మలు అతణ్ణి ఉద్దేశించి కాక, లోక హితాన్ని ఉద్దేశించి ఉంటాయి. అతడినుంచి రూపుకట్టుకున్నవి కాక, అతడి స్వభావంనుంచి దిగివస్తున్నవి అయిఉంటాయి. స్వభావం

---

39. ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చాక్షర ఏవచ ।
క్షరస్సర్వాని భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ (భగవద్గీత - 15-16)

40. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యోలోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ (భగవద్గీత - 15-17)

41. యోమామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
ససర్వవిద్భజతిమాం సర్వభావేన భారత॥ (భగవద్గీత - 15-19)

42. నహి కశ్చిత్క్షణ మపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతేహ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ (భగవద్గీత - 3-5)

43. భగవద్గీత - -7

ర్మలకు ప్రేరణను ఇస్తున్నది. ఇంద్రియాలు వాటిని ఆచరిస్తు న్నాయి. కాబట్టి కర్మాచరణపై తనకు అధికారం ఉంది. అంటే చరించగల అవకాశం ఉంది. ఫలితాలు స్వభావంగానీ, గుణకర్మలు గానీ నిర్ణయించగలిగినవి కావు. కాబట్టి వాటిపై తనకు అధికారం లేదు. అంటే వాటిని గూర్చిన స్పృహ తనకు అనావశ్యకం అని యోగి దర్శిస్తాడు.44

'అన్నంవల్ల జీవులు వర్ధిల్లుతున్నాయి. పర్జన్యుడివల్ల ఆ అన్నం రూపుకట్టుకుంటోంది. పర్జన్యుడు యజ్ఞంనుంచి రూపుకట్టు కుంటున్నాడు. ఆ యజ్ఞం కర్మనుంచి రూపుకట్టుకుంటోంది.45 కర్మ బ్రహ్మనుంచి ఉద్భవిస్తోంది. ఈవిధంగా బ్రహ్మ యజ్ఞంలో పొదగ బడి సృష్టియజ్ఞాన్ని నిర్వహిస్తున్నాడు.'46 ఈ దర్శనాన్ని పొందిన యోగి సృష్టిచక్రాన్ని గమనించి ఆ చక్రంలోని తన పాత్రను దర్శించి ఆపాత్రకు అనుగుణంగా తనను తాను నిలుపుకుంటాడు. అతడిదృష్టి తనవైపు కాక సృష్టియజ్ఞంవైపు ఉంటుంది. కాబట్టే అతనిది యజ్ఞార్థదృష్టి.

'మొదటగా తాను అనేకంగా కావాలని కోరిన ప్రజాపతి ఈ సృష్టిగా దిగివచ్చాడు47 గదా! అతడు ఏ ప్రయోజనాన్ని కోరి దిగి వచ్చాడు? దిగిరావడంలో అతడికి ఒక తృప్తీ, ఆనందం ఉన్నాయి. అలాగే నానుంచి దిగివస్తున్న స్వధర్మం నాచేత ఆచరించబడటంలోనే నాకు నిజమైన ఆనందంఉంది. ఇంక ఫలితాల ప్రసక్తి ఎందుకు? అవి జగద్వ్యూహానికి సంబంధించినవి. వాటి రూపాన్ని అవి పొందుతాయి.

44. కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన (భగవద్గీత - 2-47)
45. భగవద్గీత - 2-14.
46. భగవద్గీత - 3-15.
47. సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్ట కామధుక్॥ (భగవద్గీత - 3-10)

ప్రజాపతి సృష్టినుంచి ఏమికోరుకుంటున్నాడు, నేను నా కర్మాచరణకు ఫలితాన్ని ప్రత్యేకించి కోరడానికి ? ఫలితాలు ఉండవని కాదు - అవి ఉంటాయి. కానీ, నా దృష్టి ఉండవలసింది నానుంచి జరుగుతున్న స్వధర్మనిర్వహణపైన మాత్రమే. అదికూడా ప్రజాపతివంటి స్థితిలో' అని దర్శించిన యోగి సృష్టికర్తను ఆదర్శంగా స్వీకరిస్తాడు.

'అంతర్యామి అయిన పరమపురుషుడు తాను చేసితీరాలని లేకపోయినా, చేయకుంటే అడిగేవారు లేకపోయినా, చేసి తాను పొందగోరేదీ ఏమీ లేకున్నా, తాను పొందనిదంటూ ఏదీ లేకున్నా 48 ఈ సృష్టిక్రీడను చిత్రంగా నిర్వహించడంలేదా! జనకాది రాజర్షులూ, వ్యాసాది మహర్షులూ ఆ పరమపురుషుడివలె స్వధర్మాన్ని లోకహితంగా ఆచరించడంలో చాతుర్యాన్ని చూపినవారేగదా!' 49 అని దర్శించి వారి అడుగుజాడల్లో స్వధర్మాచరణాన్ని కొనసాగిస్తాడు.

'పరమపురుషుడినుంచి ప్రకృతి వ్యక్తంఅవుతోంది. ఆ ప్రకృతే సకల చరాచరజగత్తునూ ప్రసరించి పోషిస్తోంది. ప్రకృతి సృష్టిక్రీడను నడుపుతూఉండగా పరమపురుషుడు తాను అధ్యక్షత వహిస్తున్నాడు.50 అలాగే నాశరీరం, ప్రవృత్తులూ - ఇదంతా నా ప్రకృతి. ఆ ప్రకృతినుంచి స్వధర్మం వ్యక్తమై సృష్టియజ్ఞానికి ఉన్ముఖంగా సాగుతోంది. ఇక నేను పరమపురుషుడివలె అధ్యక్షస్థానాన్ని స్వీకరించడమే కర్తవ్యం !' అని దర్శిస్తాడు యోగి.

---

48. నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన ।
నానవాప్త మవాప్తవ్యం వర్తఏవచ కర్మణి ।। (భగవద్గీత - 3-22)

49. కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి సపశ్యన్ కర్తుమర్హసి ।। (భగవద్గీత - 3-20)

50. మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే స చరాచరమ్ ।
హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే ।। (భగవద్గీత - 9-10)

'తామరాకుపై ఉన్న నీటిబొట్టు దానికి అంటుకోనట్టుగా సృష్టిలో సర్వాంతర్యామిగా ఉన్న పరమపురుషుడు ఆసృష్టికి అంటుకోకుండా కౌశలాన్ని ప్రదర్శిస్తున్నాడు. అలాగే నేనుకూడా నా ప్రకృతికీ,నానుంచి వ్యక్తం అవుతున్న కర్తవ్యనిర్వహణకూ అంటుకోకుండా కౌశలాన్నిచూపాలి.51 అప్పుడుమాత్రమే నానుంచి జరగవలసిన స్వధర్మనిర్వహణకు నేను న్యాయంచేకూర్చగలను' అని దర్శించిన యోగి అంతర్యామి ప్రవర్తనను అనుకరిస్తాడు.

ఈవిధంగా తాను నేర్చిన కర్మకౌశలానికి సమదర్శనం తోడు అవడంతో యోగి పరిపూర్ణతను పొందుతాడు. తననుంచి వ్యక్తం అవుతున్న వర్ణధర్మం శరీరంయొక్క ఆశ్రమధర్మాలతో చేతులు కలిపి స్వధర్మంగా రూపొంది అర్థకామాలను పరిపోషకాలుగా స్వీకరిస్తూ సృష్టియజ్ఞంలో సంగమిస్తూఉండగా యోగి తాను పరమపురుషుడితో అద్వైతస్థితిని అనుభవిస్తూఉంటాడు. ధర్మాద్వైతమూర్తిఅయి దేహాన్ని దివ్యోపకరణంగా స్వీకరించి లోకహితనిష్ఠతో స్వధర్మాన్ని వైభవోపేతంగా నిర్వహిస్తాడు.



51. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతియః ।
లిప్యతే నస పాపేన పద్మపత్ర మివాంభసా॥ (భగవద్గీత - 5 - 10)

# రక్షణ - శిక్షణ

## 1

లోకంలో తమస్వధర్మాన్ని లోకహితంగా ఆచరించి ధర్మాద్వైతస్థితిని అనుభవించగోరేవారు ఉంటారు. వారి సాధనకు అంతకుపూర్వమే ధర్మాద్వైతస్థితిలో స్థిరపడిన మహానుభావుల నుంచీ, ధర్మాద్వైతస్థితిని సంస్థాపన చేయడానికై యుగయుగాల్లో అవతరించే పురాణపురుషుడినుంచీ రక్షణ లభిస్తుంది. భారతంలో పాండవాదులు ఇలాంటి రక్షణ పొందినవారు. ధర్మజాదులకు వ్యాసకృష్ణులను ఆదర్శంగాగొని ధర్మాద్వైతస్థితిలో వర్తించాలని స్థిరమైన సంకల్పం ఉంది. వారి ఇరువుర్నీ ఆదర్శంగా పెట్టుకొని తమ జీవితాలను తీర్చి దిద్దుకోవడానికి సిద్ధపడ్డవారు పాండవులు. కర్తవ్య నిర్వహణలో ప్రతి సన్నివేశంలోనూ వారు అటు వ్యాసుణ్ణో, ఇటు కృష్ణుణ్ణో మూదలగా చేసుకొని నడిచినవారే.

కొన్ని ప్రత్యేక సన్నివేశాల్లో ధర్మజాదులు మోహం చెంది తమకు తాముగా వ్యాసకృష్ణుల్ని అనుసరించలేకపోవడం తటస్థించింది. అప్పుడు ఆ వ్యాస కృష్ణులే కలగజేసుకొని వారిమోహాన్ని తొలగించి తిరిగి వారిని ధర్మాద్వైతస్థితిలో నిలబెడుతూ వచ్చారు. కురుక్షేత్ర

మహాసంగ్రామ ప్రారంభంలో అర్జునుడు ధర్మాధర్మాలనుకాక బంధుమిత్రాదులను చూడటంతో ధర్మాద్వైతస్థితినుంచి పతన మయ్యాడు. మోహాసమ్మూఢచేతస్కుడై తన బాధనంతా కృష్ణుడితో వెళ్ళబోసుకొని 'కర్తవ్యం ఏమిటి?' అన్నాడు. కృష్ణుడు మృదువుగా మందలించి స్వధర్మాన్ని గుర్తుచేసి, స్వధర్మ నిర్వహణలో చూపవలసిన సమదర్శనయుత కర్మకౌశలాన్ని విడమరచి చెప్పి విశ్వరూపదర్శనాన్ని అనుగ్రహించడంతో అర్జునుడి మోహాన్ని పూర్తిగా తొలగించి అతణ్ణి యోగస్థితిలో నిలిపాడు. ధర్మాద్వైతస్థితితో ముందుకు సాగమన్నాడు.

యుద్ధం తర్వాత ధర్మజుడు దుఃఖాక్రాంతుడు అయ్యాడు. జరిగిన సంహారకాండకు తాను కారణం అని భావించడంతో అతడిని ఎనలేని విషాదం ఆవరించింది. రాజ్యం వద్దు అన్నాడు. ఆ రాజ్యాన్ని తమ్ముళ్ళని ఏలమన్నాడు. తాను అరణ్యాలకుచేరి ఆకులూ అలాలూ తింటూ ఆధ్యాత్మికసాధన చేసుకొంటానన్నాడు. అప్పుడు కృష్ణుడూ, వ్యాసుడూ, ఎందరో మహర్షులూ అతడికి రాజ్యపాలనమే కర్తవ్యం అని ఉపదేశించారు. భోగంగా కాక బాధ్యతగా రాజ్య పాలనాన్ని నిర్వహించడమే కర్తవ్యం అని వారందరూ నిర్దేశించారు. ఎన్నోరకాలుగా అతడికి నచ్చచెప్పారు. ఎందరు ఎన్నివిధాలుగా చెబుతున్నప్పటికీ దారికినిపడలేకపోతున్న ధర్మజుడితో వ్యాస భగవానుడు తాను కర్తనన్న స్వభావం మనస్సులో గాఢంగా కలగడమే ఈ విషాదానికి కారణం అని దర్శించి ఇలా అంటున్నాడు :

"విడువు మున్మాలికంబు వినుము నీచెప్పిన
యందఱు భూమలకాసపడియు
బెంపున దేజంబుఁబేరును గోరియు
నీసున సమరంబు సేసి చచ్చి

రాపని కల్బిషంబగునె నీకట్లును
గాక వారల నెట్టి కర్మగతులు
మృతులఁ గావించెనో మతి నెఱుంగుదె వాని
నెఱుఁగుఁ గాలుఁడు చావనేరికెద్ద

తఱి యతం డప్డు దెగటార్చు దాని
నీవు సేసినాఁడవుగా మదిఁ జింతసానిపి
యుడుకు టాకవెట్టి దీనిపై నొల్ల గృహము
విడుతుఁగాకనుటిది పెద్దవెట్టి యధిప".1

ఈవిధమైన మందలింపులతో కొంత కలత తేరాడు ధర్మజుడు. కాని పూర్తిగా దారినిపడ్డట్టులేదు. అప్పుడు వ్యాసుడు 'ఇతడు భీష్ముణ్ణి చూడాలి. భీష్ముడిచేత ప్రబోధింపబడాలి' అంటాడు. ఆ మాటలకు కృష్ణుడు 'ముందు ఇతడు చక్రవర్తి కావాలి. చక్రవర్తి అయి బాధ్యత చేపట్టిన తర్వాత భీష్ముణ్ణి చూడటం ఉచితం'2 అంటాడు. ఆపైన భీష్ముడిబోధతో పూర్తిగా కలత తేరి ధర్మాద్వైతస్థితిలో స్థిరపడతాడు ధర్మజుడు. ఈసందర్భంలో వ్యాసకృష్ణులు, ధర్మజుడు పూర్తిగా ధర్మాద్వైతస్థితిలో స్థిరపడేవరకూ కలగజేసుకొని కనిపెట్టుకొని ఉండటం గమనించదగిన విషయం.

కృష్ణుడు అవతారాన్ని చాలించడం, ద్వారక సముద్రంలో మునగడం, కృష్ణుని అంతఃపురస్త్రీలను సైతం తాను పూర్తిగా రక్షించలేకపోవడం, తన అస్త్రశస్త్రాలు పనిచేయకపోవడం గమనించిన అర్జునుడు వ్యాసుణ్ణి చేరతాడు. దుఃఖంతో 'ఈ దారుణం ఏమిటి?' అని అడుగుతాడు. దారుణం కాదనీ, కాలస్వభావం అనీ వివరించిచెప్పి 'ఇప్పుడుకూడా కృష్ణుడి మార్గాన్ని అనుసరించడమే మీకు కర్తవ్యం' అంటాడు వ్యాసుడు.3 వ్యాసానుమతిని అర్జునుడి

1. ఆం. మ. భా - శాంతి - 1 282
2. ఆం. మ. భా - శాంతి - 1 - 335 - 341.
3. ఆం. మ. భా - మౌసల - 222.

నుంచి పొందిన ధర్మరాజుడు పరీక్షిత్తుకు పట్టంకట్టి మహాప్రస్థానానికి సిద్ధమవుతాడు. తమ్ముళ్ళూ, ద్రౌపదీ అతణ్ణి అనుసరిస్తారు.

ఈవిధంగా తొలినుంచి తుదివరకూ వ్యాసకృష్ణులు పాండవులను ధర్మాద్వైతస్థితినుంచి వైదొలగకుండా కాపాడుకుంటూ వచ్చారు. సాధకుడు ధర్మాద్వైతస్థితిలో నిలబడాలని హృదయపూర్వకంగా సంకల్పించినపుడు ధర్మాద్వైతమూర్తులనుంచి ఎలాంటి రక్షణ లభిస్తుందో పాండవులగాథలో మనకు బోధపడుతుంది.

జీవులకు ఈవిధమైన రక్షణను కల్పించడానికే అవతారమూర్తులూ, మహానుభావులూ కోరి భూమిపైకే దిగివస్తూ ఉంటారు. తమనాటివారేకాక, తరతరాలవారూ తరించేటందుకు వీలుగా సదాచారాలను నెలకొల్పుతూఉంటారు. మానవుడికి మార్గాన్ని నిర్దేశించే ధర్మశాస్త్రాలనూ, చేయూతనుఇచ్చే పురాణేతిహాసాది పవిత్రగ్రంథాలనూ అనుగ్రహిస్తూ ఉంటారు. ఈవిధమైన చేయూతను అందుకొని సామాన్యస్థితిలోఉన్న మానవుడుకూడా సాధకుడై ధర్మాద్వైతస్థితిని అనుభవించడానికి సాధ్యంఅవుతుంది.

# 2

మహాభారతంలో సమదర్శనాన్నిపొంది ధర్మాద్వైతస్థితిలో చెదరకుండా నిలబడగలిగింది సాధ్వి అయిన కుంతి. కురుక్షేత్ర మహాసంగ్రామంతర్వాత ధర్మరాజుకు పట్టాభిషేకం జరగడంతో కుంతి రాజమాత అయ్యింది. ఇన్నాళ్ళుగా, ఇన్నేళ్ళుగా తాను అనుకొంటున్నస్థితిలో కొడుకులను చూడగలిగింది ఆమె. అప్పటివరకూ ఆమె జీవితంలో అన్నీ ఒడుదుడుకులను కలిగించే సన్నివేశాలే. ఆ సన్నివేశాలను అతిక్రమించి నేడు రాజమాతస్థితికి చేరింది ఆమె. అలాంటి సమయంలో ధృతరాష్ట్రుడు వ్యాసానుమతితో గాంధారితో

కలిసి ఆశ్రమవాసానికి బయలుదేరాడు. ధృతరాష్ట్రుడి నిర్ణయానికి ధర్మరాజు ఎంతో నొచ్చుకున్నాడు. అది వ్యాసాజ్ఞ కావడంతో బాధనుంచి తేరుకొని సాగనంపాడు. ముందుకుసాగుతున్న గాంధారీ ధృతరాష్ట్రులను అనుసరించింది కుంతి. తానుకూడా వారితో ఆశ్రమ వాసానికి తరలివెడతానన్నది. గాంధారీధృతరాష్ట్రులను సేవిస్తూ శేషజీవితం ప్రశాంతంగా గడుపుతాను అన్నది.4 ఆమె నిర్ణయానికి విలవిలలాడిపోయాడు ధర్మరాజు. తమతల్లి తమనువిడిచి వెళ్ళి పోతుందని అతడు ఎన్నడూ ఊహించలేదు. తాను మహారాజైనా తల్లికి కొడుకేగదా! గోవునుబాసిన గోవత్సంలా ధర్మజుడు బోరున ఏడ్చాడు. కాని కుంతి తననిర్ణయాన్ని మార్చుకోలేదు. ఆమెదృష్టిలో కొడుకులయెడల తన కర్తవ్యం పూర్తిఅయ్యింది. పాండురాజు పిన్న వయస్సులోఉన్న పాండవుల్ని కుంతికివదలి అర్థాంతరంగా కాలం చేశాడు. ఆనాటినుంచీ ఆమె వారిని కంటికిరెప్పలా కాపాడుకొంది. కష్టసుఖాలు కొడుకులతోకలసి తానుకూడా అనుభవించడమేకాక, అటు కృష్ణుణ్ణే, ఇటు వ్యాసుణ్ణే శరణాగతిచెంది వారివెలుగులో వారి ప్రతినిధిగా బిడ్డల్ని తీర్చిదిద్దింది. ఎంతటి క్లిష్టసమయంలోకూడా ఆమె బాధపడిందేమోగాని, మోహపడలేదు. తనకొడుకులు స్వధర్మానికి కట్టుబడి ఉండేటట్టుగా చూసుకొంటూ వచ్చిందామె. కొడుకులవిషయంలో తనంతబాధ్యతతో ప్రవర్తించే కోడలు (ద్రౌపది) లభించడంతో ఆమెకు మరింతశక్తికలిగినట్టు అయ్యింది. మొత్తంమీద బిడ్డల్ని కృష్ణుడి అడుగుజాడల్లో నిలిపి, నడిపి ధర్మ మార్గంలో వారిరాజ్యం వారికి సిద్ధించేటట్టు చూసింది ఆమె. రాజ్యం వారికి సిద్ధించింది. పాండురాజు తనకు అప్పగించినబాధ్యత పూర్తిగా నెరవేరింది. ఇప్పుడిక తనకర్తవ్యం వృద్ధులైె చూపుకనోచుకోని అక్క బావలకు అండగానిలిచి వారిని అర్చించుకోవడమేనని నిశ్చయించింది. కుంతి. సంవత్సరాలతరబడి తననూ తనబిడ్డలనూ రాచిరంపానపెట్టిన

4. ఆం. మ. భా - ఆశ్రమ - 1-147

తన బావగారిని సేవించడంకోసం తన రాజమాత 'హోదా'ను తృణ ప్రాయంగా విడిచి కట్టుబట్టలతో బయలుదేరింది ఆమె. ఇంతకన్నా సమదర్శనానికి ఉదాహరణ మరి ఎక్కడ దొరుకుతుంది ?

కుంతి పొందిన ఈ సమదర్శనసిద్ధికి చిన్నప్పటినుంచీ ఆమె జీవితంలో జరుగుతూవచ్చిన సన్నివేశాలు ఆమెకు ఇచ్చిన మహోత్తరమైన శిక్షణే కారణమని తోస్తుంది. చిన్ననాడు దుర్వాసుడు మంత్రం ఉపదేశించడంతో ఆమె స్వభావంలోనూ, వయస్సులోనూ ఉన్న చాపల్యం తొలగిపోయింది. కర్ణుడు పుట్టడంలో కూడా ఆమె మనస్సుకు కామం అంటలేదు. కర్ణుణ్ణి నదిలో విడిచి పెట్టడం తప్పనిసరి అయినప్పుడు కడుపుకోతరూపంలో ఉన్న పుత్రైషణ కొంత వదలిపోయింది. అంటే జీవిత ప్రథమాధ్యాయమే బలవద్వైరాగ్యసాధనతో ప్రారంభం అయ్యింది.

కిందముడి శాపంతో దాంపత్యం మనస్సుకు సంసారబంధం కాకుండా పోయింది. వయస్సుకు కావలసిన ప్రతిఫలాపేక్ష లేకుండా భర్తను ఆరాధించి ప్రేమతో సేవించే మార్గంలో దాంపత్యం నడిచింది.

భర్తకోరికపై సంతానాన్ని పొందడంలో కామస్పృహలేని సంతానప్రాప్తి అనుభూతం అయ్యింది.

భర్త చనిపోయినప్పుడు సంతతిని సాకటానికి బ్రతికిఉండటం తప్పనిసరి అవడంతో, కష్టాలనుండి తప్పించుకొనే కోరిక ఎడల కూడా వైరాగ్యం వహించి కర్తవ్యనిర్వహణ నిర్లిప్తంగా చేయవలసిన అభ్యాసం జరిగింది.

కొడుకులూ, కోడళ్ళూ పదమూడు సంవత్సరాలు ఎడబాటు పొందటంతో పుత్రప్రేమ మిగిలి వ్యామోహం తొలగింది. వాళ్ళ

తనకు సంసారంగా మనస్సును బంధించకుండా కృష్ణుడికే సమర్పణ చేయగలిగినస్థితి సిద్ధించింది.

కొడుకులకు గర్భశత్రువు అయిన బావగారితో అరణ్యానికి బయలుదేరడంతో ధనేషణా, పుత్రేషణా పూర్తిగా తొలగిపోయి సర్వజీవ క్షమాబుద్ధి సిద్ధించింది.

ఆశ్రమానికి చేరిన కుంతి వారిని సేవిస్తూ ఉండగా చూడ వచ్చిన వ్యాసుడు ధృతరాష్ట్ర గాంధారులను 'కుంతి సపర్యలు చక్కగా చేస్తోందా ?' అని పరామర్శించాడు.5 'ఆమెను చూసి నేర్చుకోవలసింది ఎంత ఉందో ఇప్పటికైనా గ్రహించావా! అలాంటి దివ్యమూర్తిని సుమా నీవు ఇప్పటివరకూ కనీవినీ ఎరుగని కష్టాలపాలు చేసింది' అన్న పరమార్థబోధ వ్యాసుడి పరామర్శలో దాగి ఉంది.

కుంతి సాన్నిధ్యంవల్ల ధృతరాష్ట్రుడి మనస్సు ఇంతకాలానికి ప్రశాంతిని రుచిచూడటం ప్రారంభించింది. కొడుకులు ఉన్నంత వరకూ, కొడుకులకు రాజ్యం లభించాలన్న కోరికతో, లభించదేమో నన్న భయంతో అతడి మనస్సు అంతులేని క్షోభను అనుభవించింది. కొడుకులందరూ ఒక్కడుకూడా మిగలకుండా కురుక్షేత్రంలో ఊపిరి విడవడంతో ఊహకు అందని ఆ సన్నివేశం జరిగినందుకు ధృతరాష్ట్రుడి మనస్సు దుఃఖంతో తుకతుకలాడింది. ఆపైన అతడు తాను ఎవరిని దూరంగా ఉంచాలని చూశాడో ఆ పాండవుల పంచన పట్టెడు మెతుకులకోసం చేరవలసివచ్చింది. అలా చేరవలసివచ్చినందులకు అతడి మనస్సు మరింత మథనపడింది. దానికితోడు భీముడి సూటిపోటిమాటలు అతడి మనస్సులో ఈటెల్లా గుచ్చుకోసాగాయి. ఆ మాటలకు అంతులేని ఆవేదన అనుభవించాడు. ఆపైన వ్యాసుడిబోధను అందుకొని ఆశ్రమ

5. ఆం. మ. భా ఆశ్రమ - 2-72

వానానికి బయలు దేరాడు. ఆశ్రమ వానానికి బయలు దేరడంతోనే ధృతరాష్ట్రుడిలో వ్యాసానుగ్రహంవల్ల వైరాగ్యానికి విత్తనం పడింది. ఆవిత్తనాన్ని మొలిపించి పెంచడానికి కుంతి వారివెంట బయలు దేరినట్టు అయ్యింది.

పరమసాధ్వి అయిన కుంతీదేవి పరిచర్యలో క్రమంగా ధృతరాష్ట్రుడు పశుస్థితిని విడిచి శిశుస్థితిని పొందాడని చెప్పాలి. ఆమె చల్లని సాన్నిధ్యంలో గాంధారీధృతరాష్ట్రుల మనస్సులు చల్లబడ్డాయి. అయస్కాంతసాన్నిధ్యంలో ఇనపముక్కలోని అయస్కాంత ధర్మం కళ్ళు తెరచినట్టు కుంతి సాన్నిధ్యంలో ధృతరాష్ట్రుడి జ్ఞాననేత్రం తెరుచుకోవడం ప్రారంభించింది.

ఇలా కొంతకాలం జరిగింది. సంజయుడు వారిని చూసిపోదామని వచ్చాడు. కుంతీ గాంధారీధృతరాష్ట్రులూ అంతర్ముఖులై తపం ఆచరించసాగారు. ఆహారస్వీకరణ విరమించారు. సంజయుడు తానూ ఉపవాసాది వ్రతాలు ఆచరిస్తూ ఆ ముగ్గుర్నీ రక్షించసాగాడు.

ఒకనాడు దీక్షనుంచి లేచి వారు ఆశ్రమంవైపుకు బయలు దేరారు. ఇంతలో అరణ్యాన్ని దహిస్తున్న దావానలం భీకరమైన తీరులో వారివైపుకు వచ్చేస్తోంది. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ ఉపవాసాదివ్రతాలవల్ల అడుగుతీసి అడుగు వేయలేకుండా ఉన్నారు. ఆ అగ్నిబారినుంచి తప్పించుకొనే శక్తి వారికి లేదు. ఆసంగతి గ్రహించిన ధృతరాష్ట్రుడు సంజయుడితో అగ్నిబారినుంచి రక్షింపబడటం తనకూ, గాంధారికీ, కుంతికీ సాధ్యంకాదని చెప్పి, 'నీవు అగ్నిబారినుంచి తప్పించుకోవలసింది' అని సంజయుణ్ణి కోరతాడు. అప్పుడు సంజయుడు 'దావాగ్నికి మిమ్మల్ని ఎరగా చేసి నేనొక్కణ్ణే ఎలాపోగలను?' అంటాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు 'మేము ఇల్లు

విడిచి వచ్చేసినవాళ్ళం. నీవు చూసిపోదామని వచ్చినవాడివి. కాబట్టి తిరిగివెళ్ళకపోతే నీకు పాపం వస్తుంది. నిన్ను నీవు రక్షించుకో' అని చెబుతాడు.6 సంజయుడు గుర్తు చేయగా తూర్పు వైపుకు తిరిగి కూర్చొని యోగయుక్తుడై కుంతీగాంధారులతో కలిసి దేహాన్ని విడుస్తాడు. సంజయుడు ప్రక్కన ఉన్న పర్వతాన్ని చేరి తనను తాను రక్షించుకొంటాడు.

తనకోసం, తన స్వార్థంకోసం తన తమ్ముడి బిడ్డలనే మట్టు పెట్టజూసిన ధృతరాష్ట్రుడు చరమదశలో సంజయుడు బ్రతికి బాగుం డాలనీ, అతడికి అది ధర్మం అనీ, తాను అగ్నికి ఆహుతి అయిపో వాలనీ, తనకు ఇది ధర్మం అనీ దర్శించి నిర్ణయించాడు. యోగస్థితిని పొంది శరీరాన్ని విడిచాడు. ఆశ్రమవాసంలో ఆ పవిత్రప్రశాంత వాతావరణంలో కుంతీదేవి ధృతరాష్ట్రదంపతులకు మాతృమూర్తిగా చేరి చేసిన సేవ ఫలించింది. ధృతరాష్ట్రుణ్ణి పరమపదానికి చేర్చింది.

ధర్మాద్వైతస్థితిలో నిలిచినవ్యక్తి ఇంకా ఆస్థితికి చేరుకోని సామాన్య సంసారజీవుల ఎడల ఏవిధంగా ప్రవర్తించాలో కుంతీదేవి గాథలో దర్శింపచేస్తాడు వ్యాసుడు. చంటిబిడ్డల్ని తల్లి సాకినట్టు సంసారజీవుల్ని ముక్తజీవి సాకాలని కుంతిప్రవర్తన ద్వారా వ్యాసుడు ఇస్తున్న సందేశం. తల్లిదండ్రులు ఏమీ తెలియని పసికందుల్ని పెంచి పోషించి తమంతవారిని చేసినట్టు ముక్తజీవులు సంసారజీవుల్ని సేవించి చేయూతను ఇచ్చి తమంతవారిగా తీర్చిదిద్దాలని మహా భారతం మానవుడికి అందిస్తున్న మహోపదేశం.

సృష్టిలో ఎవ్వరూ ఎక్కువకాదనీ, ఎవ్వరూ తక్కువకాదనీ, పూలగుత్తిలో విచ్చుకొన్నపూలూ, విచ్చుకొంటున్నపూలూ, విడని మొగ్గలూ, ఆస్థితికికూడా రాని పసిరిమొగ్గలూ ఉన్నట్టే లోకంలో

6. ఆం. మ. భా - ఆశ్రమ - 2-153.

కూడా ధర్మాద్వైతస్థితిలో నిలిచినవారూ, నిలవడానికి యత్నిస్తున్న వారూ, ఆస్థితిఎడల ఇంకా కన్నుతెరవనివారూ, దానికి అంతులేని దూరంలో సంసారస్థితిలో పడిఉన్నవారూ ఉంటూ ఉంటారు. పూల గుత్తిలోని మొగ్గలూ పసిరిమొగ్గలూ కాలక్రమంలో పెద్దపూలుగా విచ్చుకొన్నట్టే ఒకనాడు పతనావస్థలో ఉన్న జీవి కాలక్రమంలో తప్పక ముక్తజీవి అవుతాడు. అయ్యేటందుకు అవసరమైన శిక్షణ సన్నివేశాల రూపంలో ప్రకృతి తప్పక ఇస్తుంది. దీనికి ఉదాహరణమే ధృతరాష్ట్రుని వృత్తాంతం. అతడికన్నా స్వార్థజీవి ఎవడు? అంతటి స్వార్థజీవి ఎవడు? అంతటి స్వార్థజీవికూడా ప్రకృతినేర్పిన పాఠాలను నేర్చుకొని, ఇచ్చిన చేయూతను అందుకొని, ముక్తస్థితిని పొందాడు. కాబట్టి ఈలోకంలో ఎన్నడూ ఒకరు మరొకర్ని తక్కువగా చూడ వలసిన పనిలేదు. అలా చూడడం నేరం. దైవదృష్టిలో అందరూ సమానులే. ఈ సందేశాన్ని స్వర్గానికి చేరిన ధర్మరాజు పొందాడు.

సశరీరంగా స్వర్గానికి ఆహ్వానింపబడ్డ ధర్మరాజు ఆ స్వర్గ లోకంలో దేవేంద్రభోగాలను అనుభవిస్తున్న దుర్యోధనాదుల్ని చూస్తాడు. ఆదృశ్యం కళ్ళబడగానే అతడిలో అంతరాంతరాల్లో ఎక్కడో లోలోపల దాగిఉన్న వైరభావం వెల్లుబికింది. దుష్టుడైన దుర్యోధనుడు స్వర్గభోగాలు అనుభవిస్తున్నందుకు అతడికి భరించ లేనంత వేదన కలిగింది. ఆపైన తనతమ్ముల్ని చూడగోరిన ధర్మజుణ్ణి యమలోకానికి కొనిపోతారు దేవమునులు.

యమలోకంలో నరకయాతనలను అనుభవిస్తూ రోదిస్తున్న తమ్ముళ్ళ కంఠస్వరాలను, ద్రౌపదిగొంతును గుర్తిస్తాడు ధర్మజుడు. అతడికి మతిపోయినట్టు అయ్యింది. 'పుట్టిందిమొదలు దుష్టుడై విజృం భించిన దుర్యోధనుడికి స్వర్గంఏమిటి? ఈగకాలంత అయినా పాపం ఆచరించని తనతమ్ముళ్ళకు ఈ నరకం ఏమిటి? పైలోకాల్లోకూడా ఈ పక్షపాతం ఏమిటి?' అని అతడిమనస్సు కుతకుతఉడికిపోయింది.7

---

7. ఆం. మ. భా - స్వర్గారోహణ - 1 - 5

అప్పుడు ఇంద్రుడు అతణ్ణి సమీపించి సమాధానపరుస్తాడు. ఇదంతా కేవలం తానుకల్పించిన వెడమాయలు అని చెబుతాడు. రాజులకు నరకదర్శనం తప్పదుకాబట్టి ఈకల్పన జరిగింది అంటాడు. పాండవులు అందరూ స్వర్గసౌఖ్యాలను అనుభవిస్తున్నారని చెబుతాడు. ఇంతలో యమధర్మరాజు నడచివచ్చి, ధర్మజుణ్ణి సంభావించి ఇలా అంటాడు - 'నిన్ను ద్వైతవనంలో యక్షుడనై పరీక్షించాను. మహాప్రస్థానకాలంలో కుక్కనై వెన్నంటి పరీక్షించాను. ఇప్పుడు ఇక్కడ పరీక్షించాను. నీమనస్సు చలించనిది. శమదమసత్యాలు నీలో మిక్కుటాలు. పరిశోధితుడవు అయ్యావు. కలతనువిడిచి సుఖివి కావలసింది' అని అంటాడు.8 అప్పుడు ఇంద్రయమధర్మరాజులు ఇరువురూ మానుషవికారాలు తొలగడంకోసం ధర్మజుణ్ణి ఆకాశగంగలో మునగమంటారు. మునిగిలేచిన ధర్మజుడు ప్రశాంతస్థితిని పొందుతాడు.

ఈ సందర్భంలో యమధర్మరాజు చేసిన ప్రసంగం చాలా విలువైనది. అతడు యక్షుడై పరీక్షించినపుడు, శునకమై వెన్నాడినపుడు ధర్మజుడు ధర్మాద్వైతస్థితినుంచి చెదరకపోవడంతో విజయాన్ని పొందాడు. స్వర్గానికి వచ్చినతరువాత యమధర్మరాజు మరోసారి పరీక్షించాడు. దుర్యోధనాదుల్ని స్వర్గంలో, పాండవుల్ని నరకంలో చూపాడు. ఈపరీక్షకు తట్టుకోలేకపోయాడు ధర్మజుడు. ఆ సంగతి గ్రహించిన యమధర్మరాజు ధర్మజుణ్ణి చిత్రంగామందలించాడు. తాను పూర్వం చేసిన పరీక్షలగురించీ, అప్పుడు ధర్మజుడు పొందిన విజయాలనుగురించీ గుర్తుచేశాడు. 'అస్థిరబుద్ధి ఇక్కడ నిలబడలేదు కదా!' అన్నసూచన ఆ గుర్తుచేయడంలో ఉన్నది. ధర్మజుడి శమదమాది సంపన్నతను కొనియాడుతూనే ఆకాశగంగలో స్నానం చేస్తే కలతతీరుతుందని చెబుతాడు. అంటే 'నీలో చెదిరిన సమదర్శనం

---

8. ఆం. మ. భా - స్వర్గారోహణ - 1 - 48, 49.

మళ్ళీ నీకు చేకూరుతుంది' అని భావం. ఆకాశగంగలో స్నానం చేయడంతో ధర్మరాజు మానసిక వికారాలు తొలగిపోయి ప్రశాంత చిత్తుడు అవుతాడు.

ధర్మజుడుకూడా చిన్నప్పటినుంచీ జీవితసన్నివేశాలనుంచి శిక్షణపొందినవాడే. సన్నివేశాల నిర్వహణమే ఆత్మసాధనగా పెట్టుకొన్న అజాతశత్రువు ఇతడు. తమను చంపటానికి కౌరవులు చేసిన ప్రయత్నాలయెడల ఇతనికి ఉదాసీనబుద్ధేగానీ ద్వేషం పుట్టినట్టు ఎక్కడా కనిపించదు.

ఘోషయాత్రలో కుంతికొడుకు అనిపించుకోదగిన సర్వజీవ క్షమాబుద్ధి ఇతడినుంచి వ్యక్తం అయ్యింది.

యక్షప్రశ్నల సందర్భంలో మాద్రికొడుకల్లో ఒకరు జీవించాలని కోరుకోవడంలో బాంధవ్యబంధాలు సోదరప్రేమ విషయంలో కూడా ఇతడిమీద పనిచేయకపోవడం ఋజువయ్యింది.

అలాగే ద్రౌపదీవస్త్రాపహరణ సందర్భంలో భార్యయెడల ఋజువయ్యింది. ధృతరాష్ట్రుడిరూపంలో 'విధాతృనియోగం' పని చేస్తున్నట్టు గ్రహించడంవల్ల ధృతరాష్ట్రుడి దుర్వ్యవసాయం వ్యక్తిగతం కాదనీ కాలగతమనీ అవిలంఘనీయమనీ ఇతడికి బోధపడింది.

మహాప్రస్థానంలో తమ్ములూ, భార్యా క్రమంగా శరీరాలు వదులుతూవచ్చినపుడు అతడు పురోగమించాడని చెప్పడం ఒక సంకేతం. ఈపురోగమనం కాలినడక కాదు; జీవితపునడక అని మనం గ్రహించవలసిఉంది. ఈ సందర్భంలో బ్రతికిఉన్నంతవరకూ ప్రేమ చూపడం, చనిపోయినతర్వాత దుఃఖపడకపోవడం ఇతడిలో నిరూపించబడింది.

ఆపైన స్వర్గానికిచేరిన ధర్మజుడిలో అతడిలో అతనికి తెలియకుండానే లోలోపల ఎక్కడో దాగిఉన్న వైరభావం పైకి ఉబికింది.

ఇంద్ర యమల సారథ్యంలో ఆకాశగంగలో స్నానంచేయడంతో ఆ మానసిక వికారం తొలిగిపోయింది.

కుంతికి భూమిపైన అప్రయత్నంగా సిద్ధించింది సమదర్శనం. ధర్మజుడు స్వర్గారోహణం చేసి పరీక్షకుగురయి నిలువలేక తుదకు దైవానుగ్రహంతో సమదర్శనాన్ని పొందాడు.

సామాన్యంగా జీవితసన్నివేశాల నిర్వహణ వేరూ, ఆధ్యాత్మిక సాధన వేరూ అన్న భావం అనేకుల్లో ఉంటూ ఉంటుంది. భారత గాథ మనకు తెలియచెబుతున్నది ఏమంటే, జీవితంలో ఎదురయ్యే సన్నివేశాలు అన్నీ మానవుడికి శిక్షణ ఈయడానికి రూపుకట్టుకుంటున్నవేననీ, మానవుడు ఆ సన్నివేశాల నిర్వహణతోనే పెరగవలసి ఉందనీ. జీవితసన్నివేశాలు మానవుడికి ఎలాంటి శిక్షణను ఇస్తాయో, ఆ శిక్షణను పొందిన మానవుడు క్రమంగా ఎలా ఎదుగుతూ వస్తాడో, చివరకు ధర్మాద్వైతస్థితి అబ్బేంతవరకూ ఆ శిక్షణ ఎలా కొనసాగుతుందో తెలియచెప్పేటందుకే వ్యాసభగవానుడు కురువంశ గాథను ఇతిహాసంగా మలచి అందించాడు.

# ధర్మాద్వైతమూర్తులు

## వేదవ్యాసుడు

దైవీగుణసంపత్తితో జన్మించి ధర్మప్రియులై స్వధర్మాన్ని లోకహితానికి సమర్పణగా జీవించసాగినవారి జీవనసరళి ఏవిధంగా ఉంటుందో పాండవుల జీవితసన్నివేశాల్లో మనకు బోధపడుతుంది. అలాగే జీవన్ముక్తుడై జన్మించిన సిద్ధపురుషుడినుంచి పరమధర్మమే స్వధర్మంగా ఎలా వ్యక్తంఅవుతూఉంటుందో వ్యాసభగవానుడి జీవిత గాథలో మనకు దర్శనం ఇస్తుంది. స్వధర్మానికే లోకహితాన్ని గమ్యంచేసి జీవితాన్ని పరమధర్మంవైపుకు చేసే ఆరోహణగా స్వీకరించినవారు పాండవులు. లోకహితార్థమై విష్ణ్వంశతో రూపుకట్టుకొని అవతరించినవాడు వేదవ్యాసుడు. పాండవులప్రయాణం ఎక్కడకు సాగుతోందో అక్కడనుంచి దిగివచ్చినవాడు ఈయన.

కాబట్టే వారిప్రయాణానికి తొలినుంచి తుదివరకూ కృష్ణునితోపాటు మార్గదర్శిగా నిలిచాడు.

### తల్లిదండ్రులతో కొడుకుగా :

యోగి అయినవాడు ఎటువంటి పరిస్థితుల్లోనూ ఘర్షణకు తావులేకుండా కర్తవ్యాన్ని బాధ్యతాయుతమైన లీలగా ఎలా నిర్వ

హిస్తాడో వ్యాసుడిజీవితంలో మనం దర్శించవచ్చు. పరాశరసత్యవతులకు సద్యోగర్భాన జన్మించినవాడు వేదవ్యాసుడు. తండ్రి లోకహితార్థమై తనకు జన్మనుఇచ్చాడని ఆయనకు తెలుసు. ఆతండ్రి సంకల్పాన్ని అనుసరించి లోకహితార్థమై తపస్సుచేయడానికై కృష్ణద్వీపానికి తరలివెడుతూ తల్లికి నమస్కరించి 'మీరు ఎప్పుడు పని కలిగి స్మరిస్తే అప్పుడు మీదగ్గర ఉంటాను' అని వినమ్రుడై చెప్పి ఆమె అనుజ్ఞను తీసుకొంటాడు.1

కురువంశం నిర్వంశం అయిపోతున్న తరుణంలో భీష్ముడు తన ప్రతిజ్ఞను విడువలేను అన్నప్పుడు వ్యాసుణ్ణి స్మరిస్తుంది సత్యవతి. వ్యాసుడు వెంటనే రూపుకట్టుకొని ఆమెకు నమస్కరిస్తాడు. సత్యవతి ఇన్నాళ్ళకు తనకొడుకును చూడగలిగానన్న ఆనందంతో తన చనుబాలను ఆనందబాష్పాలుగామార్చి అతణ్ణి కౌగిలించి, అభిషేకిస్తుంది2. ఆతరువాత సందర్భాన్ని వివరిస్తుంది. కురువంశాన్ని నిలపమంటుంది. తప్పక కర్తవ్యాన్ని నిర్వహిస్తానని చెబుతూ 'ఈ అంబికా అంబాలికలు ఒక్కసంవత్సరంపాటు నేనుచెప్పినట్టు వ్రతాన్ని ఆచరిస్తే తప్పకుండా సత్పుత్రుల్ని పొందుతారు' అని వినయంగా చెబుతాడు. సత్యవతి అంతఆలస్యం తగదనీ, రాజ్యం అరాచకమైపోతుందనీ అభిప్రాయపడుతుంది. వ్యాసుడు ఆమె సంకల్పాన్ని అనుసరించి అంబికా అంబాలికలకు సంతతిని అనుగ్రహిస్తాడు. వారు తమ ప్రవర్తనలకుతగ్గ పుత్రుల్ని పొందుతారని చెబుతాడు. వారికి కలిగిన

---

"తల్లి ముందట నిలిచి కరకమలంబులు మొగిచి మ్రొక్కి 'మీకుం బనిగలయప్పుడ నన్నుం దలంచునది. యాక్షణంబ వత్తు'నని ..."(ఆం. మ. భా - ఆది - 3-46)

2. "సత్యవతియును బెద్దకాలంబునకు వచ్చిన యాప్రథమ పుత్త్రు నతిహర్షంబునం గౌగిలించికొని యవిరళ పయోధర పయోధారల నానందబాష్పధారలం జేసి యభిషేకించుచున్న నమ్మునివరుండును దల్లి బాష్పాంజలులు దుడిచి ...."

(ఆం. మ. భా - ఆది - 4 - 240

ధృతరాష్ట్రుడు జాత్యంధుడు, పాండురాజ పాండురోగి అవుతారు. వారిగురించి చూసి బాధతో సత్యవతి వ్యాసుణ్ణి మళ్ళీ స్మరిస్తుంది. అంబికను మరల సంతతిని ప్రసాదించమంటుంది. అంబిక తనదాసిని పంపుతుంది. మాండవ్యమునిచే శపించబడిన యముడు ఆమెగర్భాన విదురుడై పుడతాడు. ఈసన్నివేశాల్లో వ్యాసుడు ఘర్షణకు తావులేకుండా యోగి అయినవాడు కర్తవ్యనిర్వహణ నిస్సంగుడై ఎలా నడుపుతాడో చూపించాడు.

లోకహితార్థమై ఒకవంక తపస్సూ, మరొకవంక శిష్యులకు శిక్షణా, వేరొకవంక వేదవిభాగాది వ్యాసంగమూ, ఇంకొకవంక ఆ శితరక్షణా నిర్వహిస్తూనే తనకు జన్మను ఇచ్చిన తల్లిని ఆవశ్యకత ఏర్పడినపుడెల్లా దర్శిస్తూ, తగినరీతిని సేవిస్తూవచ్చాడు వ్యాసుడు. పాండవులు హస్తినలో ప్రవేశించడంతో కథ ఇక మలుపు తిరగబోతోందనీ, ధృతరాష్ట్రసుతులు మారణహోమానికి నాంది పలుకనున్నారనీ గమనించిన వ్యాసుడు తల్లిని వానప్రస్థానికి తరలిస్తాడు. ఆమె అక్కడ ప్రశాంతంగా దేహాన్ని విడుస్తుంది. ఈవిధంగా కొడుకుగా తల్లిపట్ల తనకు గల బాధ్యతను ప్రేమతో నిస్సంగుడై పరిపూర్ణంగా నిర్వహించాడు వ్యాసుడు. తండ్రి సంకల్పాన్ని అనుసరించి పురాణేతిహాసాది వాఙ్మయాన్ని సృష్టించడంద్వారా వేదాన్ని ఉపబృంహణం చేసి తండ్రి అడుగుజాడల్లో తుదిముట్ట నడిచినవాడు అయ్యాడు. తల్లిదండ్రులకు సంబంధించిన సన్నివేశాల్లో వ్యాసుడి ప్రవర్తనను చూసినపుడు వైరాగ్యం అంటే బాధ్యతలను వదలిపెట్టడంకాదు, వ్యామోహపడకుండా బాధ్యతలను పరిపూర్ణంగా నిర్వహించడం అన్న సందేశం మనకు అందుతుంది.

**విచక్షణాశీలిగా :**

కుంతికి తనకన్నా ముందు కొడుకు పుట్టాడని గాంధారి ఉదర తాడనం చేసుకొని, గర్భపాతమై పడిన మాంసపేశిని చూసి ఆమె

యావస్థలో పడినపుడు వ్యాసుడు సాక్షాత్కరించి ఆమె పడిన ఈర్ష్యను మందలిస్తాడు. సంతతి కావాలన్న ఆమెకోరికను మన్నించి దుర్యోధనాదులు ఆ మాంసపేశినుంచి జన్మించేటట్లు చేస్తాడు. ఈర్ష్య పడకూడనిది కాబట్టి మందలించాడు. సంతతి కావాలనే కోరిక సహజం కాబట్టి మన్నించాడు.

## సంసారం ఎరిగినవాడుగా :

వ్యాసుడు తాను బద్ధజీవి కాకపోవచ్చు. కానీ బద్ధజీవుల మనస్సులు ఎలాపనిచేస్తాయో అతడికి బాగా తెలుసు. ధృతరాష్ట్రుడు కొడుకులపై వ్యామోహపడుతున్నప్పుడు ఆ మోహాన్ని కూడనిది అని నిందించక బద్ధజీవికి అది సహజం అని గుర్తించి ధృతరాష్ట్రుడికి దర్శనం ఇచ్చి ఇలా అన్నాడు - 'పుత్రస్నేహం ఎంతటిదో నాకు తెలియనిదికాదు. నీమనస్సును నేను అర్థంచేసుకున్నాను. పూర్వం కామధేనువు భూమిమీద బాధపడుతున్న తనబిడ్డల్నిగూర్చి ఇంద్రుడితో మొరపెట్టుకొంది. అప్పుడు ఇంద్రుడు 'నీబిడ్డల్లో కొన్ని మాత్రమేగదా బాధపడుతోంది! మిగిలినవి బాగానే ఉన్నాయి గదా!' అన్నాడు. ఆమాటలకు కళ్ళలో నీరునింపుకొంది సురభి. బిడ్డలయెడల ఆమెకు గల స్నేహాన్ని గమనించిన ఇంద్రుడు వెంటనే వర్షాలు కురిపించి తృణసమృద్ధి చేశాడు.3 అలాగే నీ బిడ్డలపై నీకు గల మమకారం దోషం అని నేను అనడంలేదు. అది సహజమే. దాన్ని పాండవులవరకూ కూడా పెంచుకో. నేను నిన్నూ పాండురాజునూ విదురుణ్ణీ ఒకేభావంతో చూసినట్లు నీవు కౌరవుల్నీ పాండవుల్నీ ఒకే దృష్టితో చూడాలి.'4 ఈ సన్నివేశంలో సామాన్య

3. ఆం. మ. భా - 1 - 81-83.

4. " ... నీకుం బుత్రస్నేహంబు సామాన్యంబు గాదైనను దీనులై వనంబున నవయుచున్న యప్పాండవులకు దయాళుండ వగుము.

స్థితికి దిగివచ్చి సంభాషించిన వ్యాసుడు యోగి అయినవాడు తోటి జీవులతో ఎలా ప్రవర్తించాలో వారి మమకార ద్వేషాలను ఎలా అర్థంచేసుకోవాలో చూపిస్తున్నాడు. తోటివారితో వారిస్థితిగతులను గూర్చి ప్రస్తావన చేస్తున్నప్పుడు తనస్థితినిబట్టికాక ఎదుటివారిస్థితిని బట్టి విషయాన్ని అర్థంచేసుకొని తనచెంత ఉన్న వెలుగును ఆ విషయ వివేచనానికి జోడించి మృదువుగా అందించాలని వ్యాసుడు ఈ సన్నివేశం ద్వారా అందిస్తున్న ఉపదేశం. యోగి సారం ఎరిగినవాడుగానే కాక, సంసారం ఎరిగినవాడుగాకూడా ఉండగలగాలి, ఉచితమైన తీరులో ప్రవర్తించాలి.

## రక్షకుడుగా :

లాక్షాగృహంనుంచి బయటపడి హిడింబాసురవధ పూర్తి చేసుకొని ఆపైన కర్తవ్యం ఏమిటో నిర్ణయంకాక నిలిచిన కుంతీ పాండవులకు వ్యాసుడు సాక్షాత్కరించి కౌరవులు తమ దుష్ట ప్రవృత్తికి తగినశిక్ష అనుభవించగలరనిచెప్పి పాండవుల్ని ఏకచక్రపురానికి చేరుకోమంటాడు. అక్కడ కాలంగడుపుతుంటే మళ్ళీ కనబడతానంటాడు.

బకాసురవధ పూర్తిచేసుకొని ద్రుపదుడిపురానికి బయల్దేరిన పాండవులకు మార్గమధ్యంలో దర్శనంఇచ్చి ద్రౌపది పూర్వజన్మ వృత్తాంతాన్ని సంక్షిప్తంగాచెప్పి, 'వెళ్ళిరండి, శుభం అవుతుంది' అంటాడు.'ద్రౌపదిని మేం అయిదుగురం చేసుకుంటా'మన్న ధర్మజుడి నిర్ణయానికి ద్రుపదుడు అదిరిపడి తటపటాయించినపుడు వ్యాసుడు మళ్ళీ సాక్షాత్కరించి ద్రుపదుణ్ణి సమాధానపరుస్తాడు. కల్యాణాన్ని

---

నీవుఁ బాండుండు విదురుండు నెమ్మి నాకు
నొక్కరూపైనయట్లు నీకుదితయశులు
నీసుతులు నూర్వురును బాండునృపతనూజు
లేవురును నొక్కరూప కానెఱుఁగవలయు"

(ఆం. మ. భా-అరణ్య - 1 - 86,87.)

జరిపిస్తాడు. ఆపైన పాండవులు ధృతరాష్ట్రుడిచే పిలవబడి హస్తినకు చేరుకొంటారు. ద్రౌపదీకల్యాణం తర్వాత బలరామకృష్ణులు పాండవులకు పరిచయం అవుతారు.

శ్రీకృష్ణుడు పాండవులకు పరిచయం అయ్యేటంతవరకూ కంటికి రెప్పలా వారిని కాపాడుకొంటూవచ్చిన వ్యాసుడు ఆపైన కృష్ణుడితో కలిసి వారికి తన అండదండల్ని అందించాడు. పాండవులు లాక్షాగృహంనుంచి బయటపడినప్పటినుంచీ మహాప్రస్థానానికి బయలుదేరేటంతవరకూ వారికి వ్యాసుడివెలుగు పథనిర్దేశం చేస్తూనేఉంది. యోగి తనను ఆశ్రయించినవారియెడల పరమధర్మానికి ప్రతినిధిగా పరమపురుషుడికి వాహికగా వ్యక్తం అవుతూ వారిని ఎలా బాధ్యతతో నడిపించాలో ఈ సన్నివేశాల్లో వ్యాసుడు చూపిస్తున్నాడు. కేవలం బోధచేసేవాడుగా కాక, బాధ్యతపడగలిగిననాడు మాత్రమే యోగికి పరిపూర్ణత సిద్ధించగలదని ఈ సన్నివేశాలనుంచి మనకు అందే సందేశం.

## కర్తవ్యశీలిగా :

సమత్వాన్ని వహించమనీ, తమ్ముడిబిడ్డలనుకూడా తన బిడ్డలతోపాటు చూసుకోమనీ పెక్కుసార్లు ధృతరాష్ట్రుడికి నచ్చచెప్ప చూశాడు వ్యాసుడు. అతడు వినిపించుకోలేకపోయాడు. చివరిసారిగా కురుక్షేత్రమహాసంగ్రామం ఇక ప్రారంభంఅవుతోంది అనగా చెప్పి చూశాడు. 'పనులు పొరంతవ్వాయి. చేయగలిగిందిలేదు, నన్ను మన్నించండి' అని ఎప్పటిలాగానే 'జవాబు' చెప్పాడు ధృతరాష్ట్రుడు. అప్పుడు వ్యాసుడు 'ఇప్పుడు నీకోరిక ఏమిటి ?' అని అడుగుతాడు. యుద్ధవిశేషాల్ని చెవులారా వింటానంటాడు ధృతరాష్ట్రుడు. వినిపించడానికి ఆవశ్యకం అయిన సర్వశక్తులూ అనుగ్రహించి ఆపనికి సంజయుణ్ణి వినియోగిస్తాడు వ్యాసుడు. ఈసన్నివేశంలో సామాన్య

నైతే ధృతరాష్ట్రుణ్ణి అసహ్యించుకోవడమో, తనమాట వినలేదని నొచ్చుకోవడమో, 'అయ్యో! నాశనం అయిపోతున్నాడే' అని బాధపడటమో చేసిఉండేవాడు. అలాకాక వ్యాసుడు ధృతరాష్ట్రుడి బాధ్యతను ధృతరాష్ట్రుడికి గుర్తుచేశాడు. అతడు వినిపించుకోలేదు. ఇక తనబాధ్యత ఏమిటి? అతనికి ఏంకావాలో చూడటం. అది నెరవేర్చి ఎప్పటివలె అదృశ్యం అయ్యాడు.

**శిక్షకుడుగా :**

యుద్ధం ముగియగానే కుమిలిపోతున్న ధృతరాష్ట్రుణ్ణి వచ్చి ఓదారుస్తాడు వ్యాసుడు. ధర్మరాజాదుల సహృదయాన్ని వివరించి వారితో కలిసి మనమంటాడు.

ఆపైన ఆశ్రమవాసానికి తరలి వెళ్ళబోతున్న ధృతరాష్ట్రుణ్ణి తన ఆశీస్సులతో సాగనంపుతాడు. ఆశ్రమవాసంలోఉండగా మరొక సారి వారికి సాక్షాత్కరిస్తాడు. పాండవులుకూడా అప్పటికే అక్కడ చేరి ఉంటారు. వారందరి కోరికప్రకారం చనిపోయిన బంధువుల నందర్నీ సాక్షాత్కరింపజేస్తాడు వ్యాసుడు. ధృతరాష్ట్రుడు తనబిడ్డల్ని చూడగలిగానన్న తృప్తిని పొందుతాడు. అతడికిగల చివరికోరికను తానే గమనించి తీర్చేటందుకే వ్యాసుడు ఈసన్నివేశంలో సాక్షాత్క రించింది.

మొత్తంమీద ధృతరాష్ట్రుడు బద్ధజీవితంనుంచి ముక్తినిపొందే వరకూ వెన్నంటిఉన్నాడు వ్యాసుడు. అతడి కోరికలు సహజమూ, ధర్మబద్ధమూ అయినప్పుడు వాటిని తీరుస్తూవచ్చాడు. ధర్మబద్ధం కాని ప్రవర్తన అతడిలో కనబడుతూ ఉన్నప్పుడు మందలిస్తూ హెచ్చ రిస్తూ వచ్చాడు. తనమందలింపు వినిపించుకోలేదని ఎన్నడూ అతను నొచ్చుకోలేదు. వినిపించుకోనప్పుడు ధర్మబద్ధంకాని ప్రవర్తనకు సిద్ధించే ఫలమే తగిన శిక్షణ ఈయగలదని అతడికి తెలుసు. ఆ ఫలాన్ని

అతను అనుభవిస్తున్నప్పుడుకూడా, అంటే, ధృతరాష్ట్రుడు బిడ్డలు అందర్నీ కోలుపోయినప్పుడుకూడా, తగినశిక్ష అనుభవించాడులే అని ధృతరాష్ట్రుణ్ణి వదిలిపెట్టలేదు వ్యాసుడు. అతడుపడే బాధ శిక్షగా కాక శిక్షణగా మలచి క్రమంగా ధృతరాష్ట్రుణ్ణి వైరాగ్యసంపన్నుడు అయ్యేటట్టుగా చూశాడు. ఈసనివేశాల్లో వ్యాసుడినుంచి వ్యక్తం అయిన సమదృష్టీ, క్రమబుద్ధీ, పరమప్రేమా నిరంతరం స్మరించ తగ్గవి.

సామాన్యమానవుడు ఒకవ్యక్తిని పొగడాలంటే మరొక వ్యక్తిని తెగడితీరాలని అనుకొంటాడు. ఒకపక్షానికి సహాకరించా లంటే తద్వ్యతిరేకపక్షాన్ని ద్వేషించాలి అనుకొంటాడు. అలాకాక వ్యాసుడు శిష్టులైన ధర్మజాదులకు రక్షణనీ, దుష్టులైన ధృతరాష్ట్రాదు లకు శిక్షణనీ ఏకకాలంలో ఒకేవిధమైన ప్రేమతో అందిస్తూ వచ్చాడు.

## సమదర్శిగా :

దైవాన్ని కావాలని కోరి కొడుకుగా శుకుణ్ణి పొందాడు వ్యాసుడు. ఆపుత్రుడిపైన లీలగా కొంత మమకారాన్నికూడా రుచి చూశాడు. కొడుకు తనకు మోక్షమార్గం ఉపదేశించమన్నప్పుడు జనకుడిదగ్గరకు పంపడానికి మొగమోటపడలేదు వ్యాసుడు. జనకుడి దగ్గర కావలసిన సమన్వయాన్ని శుకుడు పొందగలడని దర్శించి జనకుడి పరిపూర్ణత్వాన్ని నోరారా శ్లాఘించి, వినయంగా వెళ్ళి రమ్మని తనబిడ్డను సాగనంపాడు వ్యాసుడు.

తన గురుపుత్రుడు తనచెంతకు నడిచివచ్చాడని మురిసిపోయిన జనకుడు అతడి దర్శనమే తనకు చాలును అనుకొంటాడు. అతడిలో దివ్యత్వాన్ని దర్శిస్తూనే అతడు అడిగిన విషయాలన్నీ ఉపదేశిస్తాడు.[5]

5. ఆం. మ. భా-శాంతి - 6 - 246-291.

ఈ సన్నివేశాల్లో వ్యాసుడూ, శుకుడూ, జనకుడూ ప్రవర్తించిన తీరులో, యోగస్థితిలో ఉన్నవారి సమదర్శనం ఎలా ఉంటుందో బోధపడుతుంది.

## పరమపురుషునికి సహచరునిగా :

కృష్ణుణ్ణి మానవమాత్రుడిగా కాక, పరిపూర్ణ అవతార పురుషుడిగా దర్శించిన కొద్దిమందిలో వ్యాసుడు మొదటివాడు. కృష్ణుడికి ధర్మసంస్థాపన కార్యక్రమంలో కుడిభుజంగా పనిచేయడమే కాక, అతడిజీవితంలో యోగజీవితంయొక్క సమగ్రస్వరూపాన్ని, అతడి బోధలో సకలవేదవాఙ్మయం యొక్క సమన్వయాన్ని దర్శించడమే కాక హృదయంతో స్వీకరించి వాక్కుద్వారా వెలువరించి శిష్యులతో గ్రంథస్థం చేయించి భావితరాలవారికి సమర్పించిన బాధ్యతాయుత మూర్తి భగవానుడైన వ్యాసుడు.

## ఇతిహాస ద్రష్టగా :

మానవజీవితాల్లో నిరంతరం జరుగుతున్నది సాధనే అనీ, సన్నివేశాల రూపంలో ప్రకృతి ఎవరికి తగిన రక్షణా, శిక్షణా వారికి సిద్ధించేటట్టు చూస్తూఉంటుందనీ తెలియచెప్పటందుకే వ్యాసుడు మహాభారతాన్ని రచించాడు. ఒకరకంగా మహాభారతం అతడి ఇంటిగాథ. అతడి స్వీయచరిత్ర. ధృతరాష్ట్ర పాండురాజాదులు అతడి బిడ్డలు. కౌరవులూ, పాండవులూ అతడి మనుమలు. వారి గాథకు అక్షరరూపమేగదా మహాభారతం! తనగాథకు తాను అంటుకోకుండా ఆగాథలో తనకు గల పాత్రను బాధ్యతతో పరిపూర్ణంగా నిర్వహిస్తూ ఆగాథలో ప్రతిబింబిస్తున్న సృష్టిధర్మాల లీలలను దర్శిస్తూ వాటి సమగ్రస్వరూపాన్ని గ్రంథస్థం చేశాడు ఆయన. మానవుల్లో ఎవరికివారు తమజీవితగాథను ఒక ఇతిహాసంగా దర్శించి వర్తించగలగాలని తన ఆచరణద్వారా సూచిస్తున్నాడు వ్యాసుడు.

# శ్రీ కృష్ణుడు

కృష్ణుడి పాత్రను పరిశీలించడం అంటే సముద్రంయొక్క లోతును తెలుసుకోవడానికి సిద్ధపడటమే. అంటే ఈ పాత్ర పరిశీలనం మహాభారతంలో ఒక దర్శనం. దాని లోతూ, విస్తీర్ణమూ తెలుసుకొనే వాణ్ణిబట్టి తప్ప, పాత్రనుబట్టికాదు. ఒకవిధంగా చెప్పాలంటే పాత్ర ధారణ లేని వ్యక్తిగా ఇతడు భారత రంగస్థలంమీద కనిపిస్తాడు. అంతేకాదు - ఏపాత్రకు తగిన ప్రతిబింబం ఆ పాత్రతో వ్యవహరిస్తున్నట్టు కనిపిస్తుంది. ప్రపంచ వాఙ్మయంలో ఇలాంటి పాత్ర సృష్టి లేదనడం అభిమానపూరితం అయినా అసత్యంమాత్రం కాదు. సాహసం అంతకంటెకాదు. సృష్టిలో వ్యాసుడి ఎదుట అతడు మెలగబట్టీ, మరిన్నీ, వ్యాసుడూ దాదాపు అంతవాడు కాబట్టీ భారతంలో ఈ పాత్రను ఇలా అందించగలిగాడు అనిపిస్తుంది. వ్యాసుడుకూడా అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తే అందించగలిగి ఉండేవాడు కాదు. సముద్రప్రయాణంలో మానవుడు నెగ్గగలిగాడూ అంటే సముద్రం అంతవాడు అని అర్థంకాదు. సముద్రపు లోతు చూసినవాడనీ అర్థంకాదు. వ్యాసుడైనా అతడు అందించిన ఈపాత్రముందు అంతేనని ఒక్కొక్క ఘట్టంలో అనిపిస్తుంది. తన సంగతీ అంతేనని భీష్ముడు అంపశయ్యమీద వాచ్యంగా ఒప్పుకొన్నాడు.

కృష్ణుడు అవ్యక్తధర్మానికి వ్యక్తరూపం అనడానికి ఒక్కటే నిదర్శనం. అతడికి ఎవ్వరితోనూ ఘర్షణలేదు. అతడితో ఘర్షణ పడినవాళ్ళు కూడా తమదుష్టత్వం కారణంగా ఘర్షణపడదలచుకొన్నవాళ్ళేకానీ, కారణం ఉండి పడినవాళ్ళు కాదు. కంస జరాసంధాదుల మొదలు ధృతరాష్ట్ర దుర్యోధనాదులవరకూ వారు కృష్ణుడితో ఎందుకు ఘర్షణపడ్డారూ అని ఎవరైనా అడిగితే చెప్పడానికి కారణం దొరకదు. అందులోనూ ధృతరాష్ట్రుడు ఎంత దుష్ట

డైనా కృష్ణుడి హితవాక్కు అనుసరించకపోవడం జరిగిందిగానీ ఘర్షణపడలేకపోయాడు. దుర్యోధనుడుకూడా రాయబారాది ఘట్టాల్లో ముఖాముఖి సంభాషణల్లో పాండవులను నిందించాడేగానీ కృష్ణుణ్ణి నిందించడం చేతకాలేదు. అతడిమాట వింటే అతడు పాండవులకు ఎంతహితుడో తమకూ అంతహితుడేనని వారికి తెలుసు. ఈ సత్యాన్ని భరించగల హృదయవైశాల్యం లేకపోవడంవల్ల వారికి అది అవమానంగా పరిణమించింది.

కృష్ణుడి జీవితం మొత్తంమీద సన్నివేశం అంటూ ఒకటి కూడా లేకపోవడం ఆశ్చర్యం. ఇతరులకు అతడు నిమిత్తంగా సన్నివేశాలు ఉన్నాయిగానీ అతడికి సంబంధించిన సన్నివేశాలు అంటూ లేవు. చివరకు యాదవనాశంగానీ, తన కాలికి తగిలిన బాణం గానీ అతడి మనస్సును తాకిన సన్నివేశాలు కాలేకపోయాయి అనేది అతడి అవతారతత్త్వంలోని అద్భుతవిషయం. జరిగిన సన్నివేశాలు అన్నీ సుఖదుఃఖాలకి సంబంధించినవి అయినా అతడి మనస్సుకు అవి జరక్కపోవడం మానవాతీతం అయిన లీల.

తాను మానవాతీతుడైనా ధర్మజాదులూ, వ్యాసాది మహర్షులూ తారసపడినప్పుడు వారికి నమస్కరించి సంభావించడంలో ఇతడు మానవుడిగా లోకరీతుల్ని వినయపూర్వకంగా గౌరవించాడు. తాను దైవం అయ్యుండికూడా రాయబారాది ఘట్టాల్లో మానవ ప్రయత్నం చేశాడు. తనను ఆశ్రయించినవారికోసం- అంటే, తనలో పరమధర్మాన్ని దర్శించినవారికోసం - రాయబారాన్ని నడిపే దూతగా, రథాన్ని నడిపే సారథిగా కూడా మారాడు. ఏ వేళకు ఏతీరు అవసరమో ఆ తీరును తనలో చూపాడు. ఇతడి లీలామయ జీవితాన్ని తాను భారతంలో ఇముడ్చడానికి అవకాశం లేకపోయిం

దని గ్రహించిన వ్యాసుడు భాగవతంలో నోరారా కీర్తించాడు. భారతసందేశం అయిన ధర్మాద్వైతస్థితిని అనుభవంలోకి తెచ్చే దివ్యగ్రంథంగా భాగవతాన్ని మలిచాడు. ధర్మాద్వైతస్థితికి శిక్షణ ఇచ్చే గ్రంథం భారతం కాగా, ఆ ధర్మాద్వైతస్థితిని రుచిచూపించే గ్రంథంగా భాగవతం వ్యాసుడి చేతుల్లో రూపొందింది. రెండు గ్రంథాల్లోనూ అంతర్యామిగా లీలామానుషవిగ్రహుడైన శ్రీకృష్ణుడు చేత మురళితో ముక్తికి త్రోవ చూపుతూ ఉంటాడు. ధర్మాద్వైతస్థితిని అనుగ్రహిస్తూ ఉంటాడు.



# వ్యాసుని వెలుగును అర్చించిన కవిత్రయం

సృష్టి యావత్తూ త్రిమూర్తుల నిర్వహణలో నడుస్తున్నట్టు సృష్టితత్త్వాన్ని తనలో సమగ్రంగా ఇముడ్చుకొన్న మహాభారత రచన కూడా అటు సంస్కృతంలోనూ, ఇటు తెలుగులోనూ, ఋషిత్రయ కవిత్రయాల నుంచి దిగివచ్చింది. వ్యాసుడు అనుగ్రహించిన 'జయం' అనే కల్పవృక్షాన్ని పాదుచేసి, నీరుపోసి పెంచారు వైశంపాయన సూతులు. వారి వివరణలో ఆ కల్పవృక్షం మరిన్ని శాఖలతో విస్తరించింది. విస్తరిస్తున్న ఆ కల్పవృక్షంలో వ్యాసుని అంతర్యామిత్వమే వైశంపాయన సూతులకు దర్శనం ఇచ్చింది. కనుకనే నాటి నుంచి నేటివరకూ అది వ్యాసభారతంగానే గుర్తింపబడి, గురుత్వాన్ని వహిస్తోంది.

మన అదృష్టవశాన వ్యాసునిహృదయంతో శ్రుతి కుదుర్చుకున్న నన్నయ తిక్కన ఎఱ్ఱనల నుంచి భారతం తెలుగులోకి అవతరించింది. తెలుగులోనికి అవతరించిన భారతం, భారతం అనువాదంగా కాక, భారతం అను వేదంగా వ్యక్తమై వర్ణించనలవికాని విశిష్టతను సంతరించుకొన్నది. యుగయుగాలుగా వేలాదిఋషుల ముఖపద్మాల

నుంచి వ్యక్తమవుతూ వచ్చిన వేదవాఙ్మయం అనే మకరందం, వ్యాసుని చేతుల మీదుగా మహాభారతరూపాన్ని పొంది, సామాన్య మానవుల సరసకు చేరి వారికి నిత్యజీవితంలో అడుగడుగునా చేయూతనీయసాగింది. వేదఋషుల దర్శనాలకు మానవగాథల నిదర్శనాలను సమకూర్చి వ్యాసుడు చేసిన అపూర్వసృష్టి మహాభారతం. ఆ అపూర్వసృష్టికి తనను తాను సమర్పణ చేసుకొన్నారు నన్నయగారు. తనను వాహికగా స్వీకరించి, తెలుగులోనికి అవతరించమని కోరుకున్నారు. భారతభారతీసముద్రాన్ని ఆ వ్యాసునిపై భారంవేసి ఈదడం ప్రారంభించారు. నన్నయగారి మహోన్నతమైన సంకల్పాన్ని వ్యాసునివెలుగులో దర్శించిన తిక్కన ఎఱ్ఱనలు ఆ ఈతను పూర్తిచేశారు.

నన్నయగారు వ్యాసభగవానుణ్ణి సూర్యభగవానుడిగా దర్శించారు. వ్యాసుడు సూర్యుడై మహాభారతమందలి గాథలనే సూర్యకిరణాలను ప్రసరింపజేసి, సంసారమనే కటికచీకటిని హరించి, జీవుల హృదయపద్మాలను వికసింపజేస్తున్నట్టు ఆయన దర్శించారు.[1]

మహాభారతం ఆవిర్భవించినప్పటినుంచీ అన్నితరహాల వారిచేతా ఆశ్రయింపబడుతోందనీ, దాని వైభవం అంతటిదనీ, దానిలో ఎవరుకోరింది వారికి దొరుకుతోందనీ నన్నయగారు ఇలా కీర్తిస్తున్నారు -

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు

1. "భారతభారతీ శుభగభస్తిచయంబులఁజేసి ఘోర సం
సార వికార సంతమసజాల విజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జబోధన రతుండగు దివ్యపరాశరాత్మజాం
భోరుహ మిత్రు గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్"

(ఆం. మ. భా - ఆది - 1-22)

లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియు
పరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు."2

ఈ పవిత్రగ్రంథం ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రం. అంత మాత్రమే కాదు, మానవుణ్ణి ధర్మమార్గాన నడిపించి, ఆత్మదర్శ నాన్ని అనుగ్రహించి, నిత్యజీవిత నిర్వహణలో ఆచరణలోకి తీసుకు రాగలిగింది భారతం. కనుకనే అధ్యాత్మవిదులకు ఇది వేదాంత మైంది. ఈ గ్రంధంలో సృష్టిధర్మాలకు ఎంత ప్రాముఖ్యముందో సృష్టి ధర్మాలననుసరించి ఏర్పడిన లోకరీతులకూ (నీతులకు) అంతటిస్థానం ఉంది. కనుకనే ఇది నీతివిచక్షణులకు నీతిశాస్త్రమయింది. ఏవిషయ మైనా నలుగురి చెవులకు ఎక్కాలంటే చెప్పేది కాంతాసమ్మితంగా ఉండాలి. అది భారతంలో పుష్కలంగా ఉంది. అందుచేత కవివృష భుల కిది మహాకావ్యమైంది. కాళిదాసాది మహాకవులు దీనియందలి సంకేతాలను గ్రహించి, దీనివెలుగులో తమరచనలు జరపడంతో లాక్షణికులకు ఇది లక్ష్యసంగ్రహమైంది. ఒకప్పుడు జరిగిన కథలో సృష్టిలో ఎప్పుడూ జరిగే కథను చూపగలగడంతో ఐతిహాసికుల కిది ఇతిహాసమైంది. (ఇతిహాసమనే పదానికి ఇతి + హ + ఆస = ఈవిధంగా ఉండెను కదా' అని అర్థం. నిదర్శనపూర్వకంగా ధర్మాన్ని ఉపదేశించేది ఇతిహాసం) పురాణలక్షణాలైన సర్గ, ప్రతిసర్గ, వంశం, మన్వంతరం, వంశానుచరితాలు ఇమిడిపోవడంతో ఈభారతం

2. ఆం. మ. భా - ఆది - 1-31.

పౌరాణికులకు బహుపురాణ సముచ్చయమైంది. (ఐతరేయాది బ్రాహ్మణాల్లో పురాణాలనబడేవి పెక్కులున్నాయి. వాటిలో ప్రధానమైనవాటిని స్వీకరించి, వాటి పరమార్థాన్ని వ్యాసుడు భారతంలో పొందుపరిచాడు.) ఈవిధంగా మహాభారతం అన్నితరహాల వారినీ ఆకర్షించి తరింపజేస్తోందన్నారు నన్నయగారు. అలా అన్ని తరహాలవారినీ ఆకర్షించి, ఆచరణీయమార్గాన్ని బోధపరచేటందుకే ఆయన భారతాన్ని తెలుగు చేసేటందుకు పూనుకొన్నారు. స్థూల దృష్టికి రాజరాజనరేంద్రుడి ప్రేరణతో భారతానువాదం ప్రారంభమైనట్టు తోస్తుంది. కానీ ఈప్రేరణ దైవాన్నుంచి లభిస్తున్నదే అని నన్నయగారు దర్శించి, భారతానువాదానికి దీక్షవహించారు. కనుకనే ఆయన జగద్ధితంగా ఈరచన సాగుతోందన్నారు. జగద్ధితంగా ప్రారంభమైన రచన గనుకనే అది రాజరాజు, నన్నయగారు దేహాలు విడిచినా ఆగకుండా ముందుకు సాగింది. తిక్కన ఎఱ్ఱనలకు ప్రేరణనిచ్చి సంపూర్ణ స్వరూపాన్ని సంతరించుకొంది. సూక్ష్మదృష్టితో చూసినపుడు వ్యాసునివెలుగు రాజరాజునూ, నన్నయ తిక్కన ఎఱ్ఱనలనూ ఉపకరణాలుగా స్వీకరించి తెలుగులోనికి అవతరించిందన్న దర్శనం లభిస్తుంది. ఆవెలుగుయొక్క వైభవాన్ని నన్నయగారు కొంత కీర్తించగా తిక్కనగారు మరికొంత కీర్తించారు. భారత హృదయం ధర్మాద్వైతస్థితి అనీ, ఆహృదయంచుట్టూ జరిగిన శరీర నిర్మాణమే మహాభారతేతిహాసమనీ తిక్కనగారు దర్శించి ప్రస్ఫుటం చేశారు.

స్వప్నంలో సాక్షాత్కరించిన హరిహరనాథుడు ముక్తస్థితిని అనుగ్రహించడంతో ధర్మాద్వైతస్థితిలో నిలిచి మహాభారతానువాదాన్ని నిర్వహించారాయన. 'సాత్యవతేయ సంస్మృతి శ్రీవిభవాస్పదంబైన చిత్తముతోడ మహాకవిత్వ దీక్షావిధినొంది' విరాటపర్వమాదిగాగల పదిహేనుపర్వాలనూ తెలుగు చేశారాయన.

వ్యాసుని లోకహితనిష్ఠా, భవ్యకవితావేశమూ, ఆ రెంటినీ గ్రహించి అతడు సంతరించిన ధర్మాద్వైతస్థితీ తిక్కనగారిని ఎంతగానో ఆకట్టుకున్నాయి. వేదవాఙ్మయం అంతా భారతంలో సమన్వయింపబడి, నిత్యజీవితనిర్వహణంలో అక్కరకు వచ్చేలాగున అందించబడిందనీ, ఆ కారణంచేత 'వేదములకు, అఖిలస్మృతి వాదములకు, బహుపురాణ వర్గంబులకున్ వాదైనచోటుల' భారతం తాను మూదల అవుతోందనీ తిక్కనగారు దర్శనాత్మకమైన ప్రశంస చేశారు.

పింగళివారన్నట్టు రెండు మహాసముద్రాలను కలిపే జలసంధిలా అరణ్యపర్వశేషాన్ని అనువదించాడు ఎఱ్ఱన.[3] నన్నయగారి వలె మొదలుపెట్టి తిక్కనగారివలె పూర్తిచేయడంలో ఎఱ్ఱన నన్నయ తిక్కనలతో అద్వైతస్థితిని అనుభవించాడు. లోకహితాన్ని కోరి నన్నయ తిక్కనలను కలిపిన ఎఱ్ఱన వారితో కలిసి కవిత్రయంలో ఒకడై, అనితరసాధ్యమైన గౌరవాన్ని పొందాడు. ఎఱ్ఱన చూపిన సమర్పణబుద్ధితో తెనుగుభారతం సంపూర్ణమైంది. ఈవిధంగా వ్యాసభారతం ముగ్గురుకవులను ఎంచుకొని సంపూర్ణస్వరూపంతో తెలుగువారికి సాక్షాత్కరించింది.



3. ఆంధ్ర సాహిత్యచరిత్ర-పింగళి లక్ష్మీకాంతంగారు-227వ పుట (అకాడమీప్రతి)

# ధర్మాద్వైత స్థితి -

## వ్యాసుని దర్శనం - తిక్కన సందర్శనం

అనంతమైన వేదవాఙ్మయం మానవుణ్ణి ధర్మాద్వైత మూర్తిగా తీర్చిదిద్దేటందుకే అవతరించిందని దర్శించినవాడు వ్యాసభగవానుడు. కలగలుపుగా ఉన్న వేదవాఙ్మయాన్ని వ్యాసం చేయడంతో ప్రారంభమైన అతడి దివ్యకృషి నిత్యజీవిత నిర్వహణలో సామాన్య మానవుడిచేత వేదసారాన్ని అనుభవింపచేసేటంతవరకూ కొనసాగింది. మహర్షులైన మానవులకు దర్శనమిచ్చిన శ్రుతులతో శ్రుతి కలపగలస్థితికి సామాన్యమానవుల్ని సంస్కరించి శిక్షణ ఇచ్చేటందుకే తన వాగ్ఝరిని ప్రవహింపచేశాడు పారాశర్యుడు. సగరపుత్రుల్ని తరింపచేసేటందుకై విష్ణుని పాదాలనుంచి పుట్టినగంగ శివుని జటాజూటంమీదుగా భూమికి దిగివచ్చినట్టు అపౌరుషేయమైన వేదం ఋషుల జ్ఞాననేత్రానికి దర్శనంఇచ్చి శ్రుతులుగా రూపొంది ఆపైన వ్యాసుని వాగ్ఝరిగా అవతరించి సంసారజీవులను తరంపచేసేటందుకై వివిధరూపాలను ధరించి ప్రవహించింది. ఆ తీర్థవారిలో సమర్పణ బుద్ధితో స్నాతుడైన తిక్కనకు ధర్మాద్వైతమూర్తిగా వ్యాసభగవానుడు సాక్షాత్కరించాడు. అప్పుడాయనకు వ్యాసరచిత మహాభారతం లిఖితమైన ఆమ్నాయంగా దర్శనం ఇచ్చింది.

వేదఋషులు దర్శించింది సృష్టిని నిర్వహిస్తున్న వేదాన్ని. మహాభారతంలో వేదవ్యాసుడు దర్శింపచేసింది సృష్టిలోని మానవ జీవితగాథల్లో వ్యక్తమవుతున్న వేదాన్ని. భారతం మానవజీవిత సన్నివేశాలుగా లిఖితమవుతున్న వేదాన్ని పట్టిచూపిస్తుంది. అంతు పట్టని ఆకాశం జీవులకు అస్తిత్వాన్ని ఇచ్చి ఆశ్రయమిస్తున్న భూమిగా దిగివచ్చినట్టు సృష్టికి అతీతమైన వేదం సృష్టిగా, సృష్టి లోని మానవగాథలుగా రూపుకట్టుకుంటోందన్న దివ్యదర్శనాన్ని అనుగ్రహించడానికే కృష్ణద్వైపాయనుడు లేఖ్యంబైన ఆమ్నాయాన్ని రచించింది.

పరమపురుషుడు ప్రజాపతి అయి నిలిచి తాను అనేకులుగా కావాలని కోరుకున్నాడనీ, అతడి మహాకామంవల్లనే ఈ సృష్టి రూపుకట్టుకుంటోందనీ1, ఆ పరమపురుషుణ్ణే పశువుగా బంధించి దేవతలు యజ్ఞం చేసి ఈసృష్టిగా అతణ్ణే పట్టుకువస్తున్నారనీ 2 వేదం చెబుతోంది. ఆపైన జరిగే గాథల్లో ఆ పరమపురుషుడు ఎలా వర్తిస్తాడో వేదవాఙ్మయంలో మనం చూడలేం. ఆవర్తనను చూడా లంటే వ్యాసవాఙ్మయానికి మనం తరలిరావాలి.

తననుంచి వ్యక్తం అవుతున్న త్రిగుణాలకు తానే (కోరి) వశుడై మోహాన్ని చెంది లెక్కలేనన్ని రూపాలతో అంతుపట్టనన్ని భంగిమలతో ఆ పరమపురుషుడు చరాచరజగత్తుగా వ్యక్తమై నిర్వహించే క్రీడ వ్యాసవాఙ్మయంలో చూసితీరవలసిందే. క్రమంగా జీవుడుగా రూపుకట్టుకొని, ఆపైన మానవత్వాన్ని పొంది మానవుడుగా పలురకాలుగా ప్రవర్తించి అశాంతినీ, అసంతృప్తినీ పొంది, ఆర్తిని చెంది, తనకు దిక్కు ఎవరని వెతుక్కుంటూ, తాను

1. 'సోఽకామయత, బహుస్యాం ప్రజాయేయేతి' - తైత్తిరీయం

2. '.... దేవాయద్యజ్ఞం తన్వానాః అబధ్నన్ పురుషం'పశుమ్- పురుషసూక్తమ్

ఎవ్వరినని ప్రశ్నించుకుంటూ, క్రమంగా తన నిజస్వరూపం తనకు లీలగా గుర్తుకురాగా, తనను తానే (భిన్నరూపాలతో) మేల్కొలుపుకుంటూ తిరిగి తన పరమపురుషుడిస్థితిలో నిలిచి, తానాడిన సృష్టిక్రీడ బాగున్నది అనుకొంటూ, మరల మరల ఆ క్రీడకు ఉద్యుక్తుడయ్యే పరమపురుషుడి లీలావైభవాలను దర్శింపచేసేటందుకే అవతరించింది పరాశరాత్మజుని పవిత్రవాఙ్మయం.

ఆ పరమపురుషుడు దేహప్రవృత్తులకు బద్ధుడై సంసారజీవిగా నిలబడినప్పుడు ధర్మార్థకామమోక్షాలయెడల ఏవిధంగా ప్రవర్తిస్తాడో వివిధదశల్లో (విభిన్నవ్యక్తులుగా) వాటియెడల అతడి అవగాహన ఎలా ఉంటుందో సమగ్రంగా పట్టిచూపి, ఆపైన సంసారస్థితినుంచి విడుదల అవుతున్నకొద్దీ పురుషార్థాలయెడల అతడి ప్రవర్తన ఎలా మారుతూవచ్చేదీ, చివరకు గమ్యాన్ని చేరి ధర్మాద్వైతస్థితిని అతడు ఎలా అనుభవించేదీ వివరించి చూపడానికే వెలిసింది వ్యాసుడి భారతం.

అలాంటి భారతాన్ని తెలుగులో వినిర్మించాలని దీక్ష వహించాడు తిక్కన. ఆ దీక్షకు మెచ్చి పరమపురుషుడే హరిహరనాథుడై దిగివచ్చి ఆయనకు ముక్తస్థితిని అనుగ్రహించి, ధర్మాద్వైతస్థితిలో భారతరచన జరిగేలాగున కరుణ చూపాడు. ఈ విధంగా వ్యాసుని దర్శనాన్ని తిక్కనగారు సందర్శించి లేఖ్యంబైన ఆమ్నాయాన్ని తెలుగున అవతరింపచేయడంలో ప్రధానపాత్రను పోషించారు.

# తిక్కన - భగవద్గీతానువాదం

భారతానికి హృదయం భగవద్గీత. ధర్మాద్వైతస్థితి దాని యందు ప్రతిపాదింపబడి, భారతం అంతటా అంతర్వాహినియై ప్రవహిస్తోంది. అలాంటి భగవద్గీత తిక్కనగారి అనువాదంలో సంక్షేపింపబడింది. 'ధర్మాద్వైతస్థితిని తెలుగువారికి అందించగోరిన తిక్కనగారు గీతను సంక్షేపించినారేమి?' అన్న ప్రశ్న పాఠకుడి మనస్సులో తప్పక కలుగుతుంది.

కురుక్షేత్ర మహాసంగ్రామం నడుమ గీతోపదేశం జరిగిందనీ, యుద్ధరంగంలో అంతసుదీర్ఘమైన సంభాషణ జరగడం సముచితంగా లేదనీ, అందువల్లనే తిక్కనగారు భగవద్గీతను సంక్షేపించి ఔచిత్యాన్ని పాటించారనీ కొందరు భావించారు. వారిభావన తగినరీతిలో ఉన్నదని పింగళి లక్ష్మీకాంతంగారు కూడా అంగీకరించారు.1 నిదానించి చూస్తే మనకు సత్యం బోధపడుతుంది. యుద్ధక్షేత్రంలో మోహరించిన ఇరుసైన్యాలనడుమ గీతోపదేశం చేయాలని శ్రీకృష్ణుడు ముచ్చటపడలేదు. అర్జునుడు ఇరుపక్షాలవారిలో కాయినవారిని చూసి, మోహపడి, విషాదంచెంది, ధర్మసమ్మూఢచేతస్కుడై, నిలిచి, కర్తవ్యాన్ని తెలియచెప్పమని కోరినపుడు

1. ఆంధ్రసాహిత్య చరిత్ర - పుట 215

కర్తవ్యాన్ని బోధపరచవలసిన ఆవశ్యకత కృష్ణుడికి ఏర్పడింది. అప్పుడు వారిరువురి నడుమా జరిగిన సంభాషణే భగవద్గీతగా తరువాత పేరుపొందింది. అప్పటికి ఇంకా యుద్ధం ప్రారంభంకాలేదు. అంతకు ముందే ధర్మరాజు భీష్మాదులకు నమస్కరించి ఆశీస్సులు పొంది వచ్చాడు. ఇంతలో అర్జునుడు కర్తవ్యోన్ముఖుడు కావలసిందిపోయి గాండీవాన్ని జారవిడిచి, కూలబడ్డాడు. కర్తవ్యాన్ని బోధించమన్న అర్జునుణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేసేటందుకు తప్పనిసరయి కృష్ణుడు గీతోపదేశం చేశాడు. ఆ ఉపదేశం జరుగుతున్నప్పుడు మధ్య మధ్యలో అర్జునుడికి కలిగే శంకలనూ, సందేహాలనూ ఓర్పుతో నేర్పుగా తీర్చాడు. ఉపదేశంమాత్రమే సరిపోదని గ్రహించి విశ్వరూపాన్ని దర్శింపజేశాడు. ఆ విశ్వరూపదర్శనంతో క్రమంగా అర్జునుడు కృష్ణుడి ఉపదేశాన్ని బోధపరచుకొని, కర్తవ్యోన్ముఖుడయ్యాడు. విశ్వరూపదర్శనానికి ముందు అర్జునుడి స్థితి వేరు. అప్పుడతడు సందేహాలు తీర్చుకొనే స్థితిలో ఉన్నాడు. తరువాతి స్థితి వేరు. అప్పుడతడు కర్తవ్యానికి ఉన్ముఖుడు కావడం ప్రారంభించాడు. క్రమంగా ఈ పరిణామాన్ని అర్జునుడిలో తీసుకు వచ్చి, అతడిచేత గాండీవాన్ని పట్టించేటందుకే కృష్ణుడు ఇంతకథ నడిపాడు కృష్ణుడు పూనుకోకపోతే అర్జునుడు నవ్వులపాలయ్యేవాడు. శత్రువులు అతడికి వైరాగ్యం ఒంటబట్టిందని భావించరుగదా! చేతకానితనంక్రింద గేలిచేసేవారు. ఆ హేళనకు తట్టుకోలేక అర్జునుడు కోపంవచ్చి యుద్ధంచేసి ఉండేవాడు. ఎలాగూ యుద్ధం చేయడం తప్పేదికాదు. కోపంవచ్చి, పరిహాసాలకు తట్టుకోలేక యుద్ధానికి దిగడంకన్నా ధర్మసంస్థాపనకోసం జరిగేయుద్ధంలో ముక్తస్థితిలో నిలిచి, తననుంచి ధర్మనిర్వహణ జరుగుతూఉండగా తాను ధర్మాద్వైతస్థితిలో నిలబడటమే కర్తవ్యమని ఆశ్రిత రక్షకుడైన కృష్ణుడు అర్జునుడికి బోధపరిచాడు. కనుక కురుక్షేత్ర

సంగ్రామ ప్రారంభంలో కృష్ణార్జునులనడుమ జరిగిన సంభాషణ స్వతంతంగా లేదనడం అర్థవంతమైన నిర్ణయం కాజాలదు.

మనం చూస్తున్న భగవద్గీతలోని అన్నిశ్లోకాలూ శ్రీకృష్ణుడు వేకావు. అందులో అర్జునుడు పలికినవి, సంజయుడు పలికినవి, రాజు పలికినవి చెప్పుకోదగిన స్థానాన్నే సంపాదించుకొన్నాయి. కాక కృష్ణార్జునులు శ్లోకాల్లో మాట్లాడుకొన్నారని మనం ఁడరాదు. వారినడుమ జరిగిన సంభాషణకు శ్లోకరూపం యిచ్చినది ఁడు. మరొకసూక్ష్మం కూడా ఉంది. కృష్ణుడు అర్జునుడికి తగిన షణలతో తత్త్వాన్ని బోధపరిచాడు. అతడు బోధపరిచిన న్ని పాఠకులకు బోధపడేటట్లుగా చూడవలసిన బాధ్యత కూడా ఁడిపై ఉంది. నరుని అవతారమైన అర్జునుడంతటి పరిజ్ఞానం ఁడికే కృష్ణుడి తత్త్వాన్ని బోధపరచుకొనేందుకు విశ్వరూప రం ఆవశ్యకమైంది. మరి పాఠకులకు కృష్ణుడి తత్త్వాన్ని బోధ డానికి యత్నించడంలో శ్లోకాలసంఖ్య పెరగక తప్పదు. ఁడం అవసరంకూడాను.

పరమార్థదృష్టితో చూసినప్పుడు కూడా యుద్ధక్షేత్రంలోనే బోధ జరుగుతుందని బోధపడుతుంది. మానవుడు తనలోని ధర్మా ర్మలకు ఘర్షణ జరుగుతున్నప్పుడు అధర్మమని తెలిసినప్పటికీ ధర్మాన్ని శిక్షించడానికి ఉద్యుక్తుడు కాలేక మోహితుడై ంతునిమెడల ఆర్తిచెందుతాడు. ఆ ఆర్తనాదాన్నివిని అతడిలో స్వరూపుడుగా ఉన్న దైవమే ఏదోఒకరూపంలో చేరువై, కి కర్తవ్యబోధ చేస్తాడు. ఆపైన మానవశరీరమనే రథంపై ాయణుడి సారథ్యంలో నరుడి ధర్మసంస్థాపన ప్రారంభమవు ి. కనుక గీతాబోధ ఎప్పుడు ఎక్కడ జరిగినా యుద్ధక్షేత్రంలోనే ఁతుంది.

ఇంతకూ భగవద్గీతను తిక్కన్నగారు ఎందుకు సంక్షేపించా రన్నదే ప్రశ్న. తిక్కనగారి అనువాదవిధానం చిత్రమైంది. వ్యాసుని సందేశం తెలుగువారికి పూర్తిగా అందాలి, తెలుగుభారతం మాత్రం కావ్యరూపాన్ని పొందాలి అన్నది తిక్కనగారి ఆశయం. ధర్మసందేశం పూర్తిగా అందాలంటే ధర్మబోధ జరిగిన సన్నివేశా లను అన్నింటినీ యథాతథంగా అనువదించవలసినపనిలేదు. ఇతిహాసంలో జరిగింది జరిగినట్లుగా వ్రాయబడుతుంది. కనుక ధర్మబోధ పునరావృత్తి చెందడం సహజం. అంటే ఒకేవిషయం మరల మరల చెప్పబడవచ్చు. అలాంటిచోట్ల అనువాదకర్త పునరా వృత్తి లేకుండా స్వతంత్రించి, అనువదించడం సమంజసమే అవు తుంది. ఈ సందర్భాల్లో కూడా తిక్కనగారు అనుసరించిన మార్గం నిపుణమైంది.

భారతంలో ఇతర సందర్భాల్లో సనత్సుజాతీయసారం ఇమిడి ఉంది. సనత్సుజాతుడు వివరించిన మృత్యుస్వరూపం భగవద్గీతలో కృష్ణుడిచేత స్పష్టంచేయబడింది. సనత్సుజాతుడు ఎంతగా చెప్పినప్పటికీ గుడ్డిరాజులో లేశమైనా మార్పురాలేదు కదా! అందువల్లే తిక్కనగారు సనత్సుజాతీయాన్ని ముట్టుకోలేదు. సన త్సుజాతుడు వచ్చి తత్త్వబోధచేసి వెళ్ళాడని మాత్రం వ్రాసి ఊరు కున్నారు. సనత్సుజాతీయసారమైన మృత్యుస్వరూపాన్ని గీతాను వాద సందర్భంలో కృష్ణుడినోట వలసినంతమేరకు పలికించారు.

ఈతీరులోనే అర్జునుడు ఎంతవరకూ గీతాబోధ ఆకళించు కొన్నాడు అని తిక్కనగారు తూచి చూశారు. మృత్యుస్వరూ పాన్ని తెలుసుకోవడం, ఆత్మయొక్క శాశ్వతతత్త్వాన్ని బోధపరచు కోవడం, కర్మాచరణరీతిని ఆకళింపుచేసుకోవడం, కృష్ణుడి నిజ స్వరూపాన్ని దర్శించి, తాను నిమిత్తమాత్రుణ్ణని తెలిసి, కృష్ణుడికి శరణాగతుడై గాండీవం ధరించి నిలబడటం - గీతాబోధసమయంలో

అర్జునుడు పొందిన పరిణామం ఇది. కనుక దాదాపు ఆరవై పద్యాల్లో ఈ స్థితులకు సంబంధించినంతవరకూ తిక్కనగారు గీతానువాదం చేశారు. కృష్ణుడి ఉపదేశసారాన్ని ఆయన అనువాదంలో ఇమిడిపోయేటట్లు చూసుకొన్నారు. మిగిలిన తత్త్వ విషయాలు అర్జునుడు ఎంతకుతూహలంతో అడిగి తెలుసుకున్నా, వాటిని అతడు శీఘ్రకాలంలో మరచిపోయాడు. కనుకనే అశ్వమేధ పర్వంలో కృష్ణుడితో అర్జునుడు ఇలా అంటున్నాడు :

"అనికిఁదొడంగునప్పుడు మదాత్మ గలంగినఁ గొన్ని తత్త్వ బో
ధన మహనీయవాక్యము లుదాత్తకృపం దగ నీవు చెప్పితే
మనమున వాని యర్థములు మాధవ ! నిల్వగజాలనైతి న
వ్వినుతవచస్సుధారసము వీనుల నింకొకమారు నింపవే."2

అర్జునుడికోరిక విని కృష్ణుడు నవ్వుతూ కౌగిలించుకొని, 'తత్త్వహీనుడవు, శ్రద్ధారహితుడవు అయ్యావు సుమా !' అని హెచ్చరిస్తూ ఇలా సమాధానం చెప్పాడు :

"బ్రహ్మపద వేదనమునకుఁ బరమహేతు
భూతములు నాఁటి వాక్యముల్ బుద్ధిఁ దన్మ
హార్థములు నిల్పవైతి శక్యంబె యింక
నవ్వచనములు చెప్పంగ నలఘుశౌర్య"3

ఆనాటి వచనాలు చెప్పడం అసాధ్యమని చెపుతూ కొద్ది ఉపాఖ్యానాలతో అర్జునుడికి కావలసిన తత్త్వాన్ని మళ్ళా ఉపదేశించాడు కృష్ణుడు. ఈ సన్నివేశాన్ని దృష్టిలోపెట్టుకొని అర్జునుడు ఒంట పట్టించుకోని తత్త్వవిషయాల్ని తిక్కనగారు అనువాదంలో మెల్లిగా ప్రక్కకు తప్పించారు. అనుగీతల్లో ముఖ్యవిషయాల్ని ఎల్లాగూ చెప్పారు.

2. ఆం. మ. భా - అశ్వమేధ - 1 - 153.
3. ఆం. మ. భా - అశ్వమేధ 1-155.

అయితే, తెలుగువారికి గీతోపదేశం పరిపూర్ణంగా అందటం ఎలా? బాధపడవలసిన పనిలేదు. శాంతి త్రయం భగవద్గీతకు చక్కని వ్యాఖ్యానం. ధర్మరాజు కృష్ణుడికి శరణాగతుడై దుష్టశిక్షణం పూర్తిచేసి పట్టాభిషిక్తుడయ్యాడు. ఇతడు యోగ్యుడు. ధర్మ స్వరూపాన్ని ఎరిగినవాడు. నిరంతరం ధర్మస్వరూపాన్ని తెలుసుకొనే టందుకు నిష్ఠతో ప్రయత్నించే స్వభావం కలవాడు. కనుకనే కృష్ణుడు భీష్మ ధర్మజులకు సంవాదాన్ని ఏర్పాటుచేశాడు. సర్వ ధర్మాలనూ ఎరిగిన భీష్మాచార్యుడినుంచి సార్వకాలికం, సార్వజనీనం అయిన ధర్మస్వరూపం వెలువడింది. భీష్ముడు కృష్ణసందేశాన్ని ధర్మజుడికి వెన్నతో పెట్టాడు. అక్షరం కూడా పొల్లుపోకుండా ధర్మరాజు ఆ సందేశాన్ని ఆకళించుకొన్నాడు. కనుకనే తిక్కనగారు ఈ సందర్భాలో భీష్మసందేశాన్ని తెలుగువారికి తగిన జాగరూకతతో పూర్తిగా అందించారు. దీన్ని దృష్టిలో పెట్టుకునే భీష్మపర్వంలో భగవద్గీతను సంక్షేపించారు. వ్యాసుని సందేశాన్ని మాత్రం బీరుపోకుండా తెలుగువారి హృదయాల్లో ప్రతిష్ఠించారు.

భారత పఠనారంభంనుంచి యుద్ధం పూర్తిఅయ్యేవరకూ చదువరి అర్జునుడితో ఏకత్వాన్ని అనుభవిస్తాడు. గీతోపదేశ సందేశం దగ్గర చదువరికికూడా అర్జునుణ్ణి నిలబెట్టడమే ముఖ్యం. యుద్ధం హడావుడిలోపడి మిగిలిన తత్త్వవిషయాల్ని చదువరికూడా మరచిపోయేటందుకు అవకాశం ఉంది. శాంతిపర్వ ప్రారంభంనుంచి పాఠకుడు ధర్మజుడితో ఏకత్వాన్ని అనుభవించడం మొదలు పెడతాడు. తానే ధర్మజుడై భీష్మాచార్యుని సందేశాన్ని అందు కుంటాడు. సంవాదం పూర్తిఅయ్యేసరికి చదువరికూడా ధర్మజుడి వలె విప్పారిన హృదయం కలవాడై ధర్మనిష్ఠు డవుతాడు. భారతాన్ని చదువుకొనేటప్పుడు చదువరిలో కలిగే ఈ పరిణామాన్ని తిక్కనగారు చక్కగా దర్శించారు. అనువాదప్రణాళిక తదనుగుణంగా

మలిచారు. వ్యాసుని సందేశం సమగ్రంగా అందిస్తూనే తెలుగు భారతానికి కావ్యరూపాన్ని సంతరించడంలో తిక్కనగారు చూపిన నేర్పు అనిర్వచనీయమైంది; అనితరసాధ్యమైంది.

# తిక్కన - హరిహరనాథ తత్త్వ ప్రతిపాదన

వైష్ణవం, శైవం అనేవి వేదంలో భగవంతుని విష్ణుత్వం, శివత్వం అనే రెండు వైభవాలను వర్ణించేవి. వేదాల్లో అంతర్యామి తత్త్వం పురుషుడు అనే పేరుతో వ్యవహరింపబడింది. 'పురుష సూక్తం' ఈ పురుషుణ్ణి ప్రతిపాదించే మహామంత్రం. ఈ సూక్తంలో పురుషుడు విష్ణువు అనిగానీ, శివుడు అనిగానీ చెప్పబడలేదు. కాబట్టే శైవం, వైష్ణవం వేరువేరు మతాలుగా సంకుచితత్వాన్ని చెందిన తరువాత కూడా శైవులూ, వైష్ణవులూ పురుషసూక్తం తోనే తమ సొంత దేవుణ్ణి పూజించుకొంటున్నారు. ఆ పురుషుడు పరమాత్మగా, వాని అంశ విరాట్పురుషుడుగా, వాని అంశ జీవుడుగా పురాణాల్లో ప్రతిపాదింపబడింది. ఈ ముగ్గురూ వరుసగా పురుషోత్తముడు, అక్షరపురుషుడు, క్షరపురుషుడు అని గీతాచార్యుడి చేత చెప్పబడ్డారు.

ఈ విధంగా వేదాల్లో ప్రతిపాదింపబడ్డ పురుషుడు సర్వ వ్యాపిగా వర్ణింపబడినపుడు విష్ణువుగా, శుభప్రతిపాదకత్వంలో శివుడిగా వర్ణింపబడ్డారు. 'విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచమ్'1 అనే విష్ణుత్వవైభవం, 'నమశ్శివాయచ శివతరాయచ'2 అనే శివత్వ

1. విష్ణుసూక్తం - ఋగ్వేదం - 1 - 154.
2. రుద్రనమకం

వైభవం వేదాల్లో ఒకే దేవుడి రెండు వైభవాలుగా ప్రదర్శించబడ్డాయి. దాని ఎరుకలేక అజ్ఞానంలో పడిన పండితులు కొందరు శైవాన్ని, కొందరు వైష్ణవాన్ని వేరువేరుగా స్థాపించుకొని పామరులనుకూడా భ్రమపెట్టారు. దానితో రాగద్వేషాత్మకమైన కల్లోలం శతాబ్దుల తరబడి వైషమ్యాగ్నుల్ని రగుల్కొల్పింది. అంతటితో ఆగక వీరశైవమే వేదమతమనీ, వేదమతం వైష్ణవమే అనీ ఆ యా వాదాలు ప్రబలినాయి. వేదాలతోనే సంబంధం అక్కర్లేదనే శైవవైష్ణవమతాలు ప్రజ్వరిల్లాయి. ఈ ప్రజ్వలన ప్రభావం రాజులమీద కూడా పడటంతో మతావేశాలు యుద్ధాలకు దారితీశాయని చరిత్రకారులు చెబుతున్నారు. మళ్ళీ మహాభారతం అంత సంహారకాండకు కారణం అయిన పల్నాటియుద్ధంలో శైవవైష్ణవాల ప్రభావం ఉన్నదనీ, సాత్వికవైష్ణవమూర్తి అయిన బ్రహ్మనాయుడిపై శివశక్తిస్వరూపిణియైన నాగమ్మ విరుచుకుపడడంలో శైవవైష్ణవాల ప్రభావం కొట్టవచ్చినట్లు కనబడుతోందనీ చరిత్రకారుల ఊహ. ఈవిధంగా మతావేశాలు యుద్ధాలకుకూడా దారితీశాయి.

పాల్కురికి సోమనాథుడి కృతుల్లో ఆనాటి మతావేశాలు ఏవిధంగా విజృంభించిందీ మనకు బోధపడుతుంది. ఒకవైపు వీరశైవం, మరొకవైపు వీరవైష్ణవం, ఇంకొకవైపునుంచి జైనం సామాజికరంగంలో ప్రవేశించడంతో సామాన్యుడిపని ఇబ్బందిలో పడిపోయింది. ఇందులో ఎవరిది సత్యమో, ఎవరిది కాదో, ఏమతాన్ని తాను అనుసరించాలో అతడికి బోధపడకపోవడం. బోధపరచుకొనేటంత అవకాశంకూడా లేకపోవడం జరిగింది. దానితో సామాన్యప్రజలు ఎవరికి తోచిన మతావేశాల్లో వారు పాలు పంచుకోవడం మొదలుపెట్టారు. ఆధ్యాత్మికత ఆచరణస్థితినుంచి ఆవేశస్థితికి దిగజారడంతో ముక్తిమాట ఎలాఉన్నా సాంఘిక వ్యవస్థమాత్రం అస్తవ్యస్తం అయిపోయింది.

అలాంటి కల్లోలస్థితిలో ఉద్భవించిన మహాద్రష్ట తిక్కన. ఆయన వేదం అనే సూర్యోదయాన్ని, ఉపనిషత్తులు అనే

సూర్యకిరణాలనీ, వ్యాసభారతం అనే అహస్సునీ ఒకే 'భూతద్దం' నుంచి చూసి ధర్మపథ తారాపరిగణనంచేసి దేశభవిష్యత్తును గమనించి రాబోయే విపత్సముద్రానికి సేతువుగా తన ఆంధ్రమహాభారతాన్ని ప్రయోగించాడు. కాబట్టే 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లు'గా తననేర్చినభంగి జాతీయతను ఏకముఖాన ప్రవహింపజేశాడు. అప్పటి విపత్తుయొక్క తీవ్రస్వరూపాన్ని దర్శించగలిగినవాడికితప్ప తిక్కన భారతావతారికలోని పదప్రయోగంలోగల గాంభీర్యం బోధపడదు. సాహిత్యంగా మాత్రమే చదువుకోగలిగినవారికి పదప్రయోగం, శిల్పం, నాటకీయత, పాత్రచిత్రణ మొదలైన అంశాలే తిక్కనగారి కవితలో గోచరిస్తాయి. లోతు ఎరిగినవారికీ, నాటి భారతాత్మబాధ హృదయశల్యమైనవారికీ తిక్కన ఒక శకకర్తా, ఒక ఆచార్యుడూ, ఒక ధర్మసంస్థాపకుడూ అయిన అవతారమూర్తి. ఆయన తాను విపత్పరిహారకాలుగా చిరకాలంనుంచీ ఆచరిస్తున్న అంశాలను అక్షరరూపంలో కరగించి పోసినవాడేగానీ ఉద్గ్రంథం వ్రాసిన గొప్పకోసం తాపత్రయపడినవాడు కాడు. ఆ ఆచరణే నేపథ్యంలో లేకపోతే కేవలం గ్రంథరచనాకౌశలం ఒక్కటే మిగిలిఉండేది. ఆ గ్రంథానికి పఠనయోగ్యత అబ్బేదేమోగానీ ఇంత పవిత్రతమాత్రం అబ్బేదికాదు.

ఇంతటి మహానుభావుడు అర్చించుకొనవలసిందిగా హరిహరనాథుడి సువర్ణమూర్తిని జాతికి అనుగ్రహించాడు. వేదం ఒకే పరమపురుషుణ్ణి స్థితిభేదాన్నిబట్టి హరిహరులుగా కీర్తించిందని చెప్పుకొన్నాం. ఆ హరిహరతత్త్వాలకు ఉన్న అన్యోన్యతనూ, వాటి ఏకత్వదర్శనాన్నీ వ్యాసభగవానుడు తనపురాణేతిహాసాల్లో కథలుగా, గాథలుగా విస్తరించి చూపాడు. హరిహరుల అభేదాన్ని లోకానికి గుర్తుచేసి వారిని సరైనమార్గంలోకి తీసుకురావాలని సంకల్పించిన తిక్కనగారికి హరిహరుల తత్త్వసమన్వయాన్ని అందించగల కల్పవృక్షంలా వ్యాసవాఙ్మయం దర్శనం ఇచ్చింది.

వేదమార్గమే సామాన్యుడి తెలుసుకోలేటందుకు వ్యాస మార్గమై విస్తరించిందని దర్శించిన తిక్కనగారు తాను ప్రతిపాదింప దలచిన హరిహరనాథతత్త్వానికి వ్యాసుణ్ణి మూలంగా స్వీకరించారు. వ్యాసభారతాన్ని అనువదిస్తూ ఆశ్వాసాలకు ఆద్యంతాల్లో ఆయన చేసిన హరిహరనాథస్తుతులను పరిశీలించినపుడు హరిహరనాథతత్త్వం వేద వ్యాసుడినుంచి తనకు ప్రసన్నమైనదేనని తిక్కనగారు సూచించినట్టు స్పష్టమవుతుంది. ఆయన హరిహరనాథుణ్ణి కీర్తిస్తూ పలుచోట్ల పారా శర్యుడి ప్రసక్తి తెస్తారు. ఆయన ఆ ప్రసక్తి తెచ్చిన సందర్భాలను ఒక్కచోట చేర్చిచూస్తే వ్యాసుడిపై తిక్కనగారికి గల గురుభావం ఎంతటిదో మనకు బోధపడుతుంది.

ఆశ్వాసాద్యంత పద్యాల్లో హరిహరనాథుణ్ణి కీర్తిస్తున్నప్పుడు తిక్కనగారు వ్యాసుణ్ణి స్మరించిన సన్నివేశాలు ఇవి:

1. వ్యాసాది మునిప్రోక్త మహాసందర్భాప్రమేయతా ఽఽరూఢ గుణోల్లాసా3

2. సాత్యవతేయ భారతీప్రోక్త 4

3. వేదవ్యాసవ్యంజితవిహారా5

4. పారశర్యాప్రముఖో
దార మునీంద్రాన్తరంగ ధామాస్తరివ
స్ఫార ప్రభాపటల వి
స్తారోజ్జ్వల దీపరూపతాస్తవనీయా6

5. సాత్యవతేయ వాఙ్మయ విశాల గృహస్ఫురిత ప్రదీపతా 7

3. ఉద్యోగ - 2-333
4. ఉద్యోగ - 3-413
5. భీష్మ - 1-1
6. భీష్మ - 2-409
7. ద్రోణ - 1-995

6. "జనవినుత బాదరాయణ
మునీంద్ర వాగమృతనిధి సముద్భూతాహ్లా
దనకీర్తి సుధాకిరణా
... ... ... ... ... ..."8

7. ప్రకట మహార్థ సౌరభ పరాశరనందన వాక్యమంజరీప్రకర సమర్చితా9

8. వ్యాసాది మనోనివాస.10

9. సాత్యవతేయాది మహామత్యవగమ్య ప్రకార11

10. వేదవ్యాసవచోవిభవలక్ష్య12

11. పారాశర్య స్తవనీయ గుణనిధాన13

12. వ్యాసచేతోనివాసీ14

13. బహునుత వేదవ్యాస15

14 సాత్యవతేయ వచోవిభూషణా16

15. వేదవ్యాస వాక్ప్రకాశిత17

16. వేదవ్యాసవచోవిభవవేద్య18

17. వ్యాసాది మునీంద్ర భావ్య19

---

8. ద్రోణ - 5-432
9. కర్ణ - 3-399
10. స్త్రీ - 1-1
11. స్త్రీ - 1-188
12. శాంతి - 1-1
13. శాంతి - 1-399
14. శాంతి - 4-4
15. శాంతి - 6-624
16. అను - 5-482
17. అశ్వ - 1-292
18. ఆశ్రమ - 1-1
19. ఆశ్రమ - 2-1

18. బోధ ఘనవ్యాస పరసమాధి సమాలీఢ తేజ[20]
19. పారాశర్య మనస్సదనా[21]
20. పారాశర్యవచః పయోనిధి సుధాభంగీ[22]
21. వేదవ్యాసానేక వచోఽనుషంగ[23]
22. వేదవ్యాస వర్ణనారూఢదయా[24]
23. శుకజనక మనీషా శుద్ధబుద్ధానుభావా[25]

ఈ విశేషణాలను ఒకచోట చేర్చిచూసినపుడు తిక్కనగారి భావాన్ని ఈక్రిందివిధంగా మనం క్రోడీకరించుకోవచ్చు.

వేదవ్యాసుడి మనస్సే హరిహరనాథుని సదనం. అతడు వ్యాసుని హృదయంలో ఉజ్జ్వలమైన కాంతితో వెలుగుతూ అతడిచే నిరంతరం అనుభవింపబడుతూ ఉంటాడు. వ్యాసునిచే నిరంతరం భావింపబడుతున్న హరిహరనాథుడే అతని వాఙ్మయం అంతకూ లక్ష్యమై ఒప్పుతున్నాడు. అతని కృతులందు అంతటా ప్రకాశిస్తూ అతనిచే వర్ణింపబడిన విహారాలు కలవాడై జనులందరికీ దర్శనం ఇస్తున్నాడు.

హరిహరనాథుడు వేదవ్యాసుడంతటివాడిచే పొగడబడే గుణోత్తముడు. అతనిచేత కృతులనే కుసుమగుచ్ఛాలతో అర్చించబడినవాడు. అతడికికూడా అంతుపట్టని ఉత్తమగుణాలు కలవాడు. అతనికృతులు అన్నింటికీ అన్వయం ఇతడే.

హరిహరనాథుడు వ్యాసవాఙ్మయం అనే సుధాసాగరంలో జన్మించిన అమృతమయూఖుడు. వ్యాసవాఙ్మయాంబుధినుంచి

20. మౌసల - 2-1
21. మౌసల - 1-225
22. మహాప్రస్థాన - 1-1
23. మహాప్రస్థాన -77
24. స్వర్గ - 96
25. స్వర్గ - 97

వ్యక్తమైన అమృతం అతడు. అతనిచే ప్రవచింపబడిన శుద్ధబుద్ధ స్వరూపుడు.

ఈవిధంగా సాగిన తిక్కనగారి వ్యాసస్మరణను పరిశీలించి చూసినపుడు వ్యాసుడు తనవాఙ్మయంలో లోకానికి అందించిన సమన్వయాత్మకమైన వేదదర్శనం తిక్కనగారిపై ఎంతటి ప్రభావాన్ని చూపిందో బోధపడుతుంది.

తిక్కన తాను సంకల్పించిన కార్యసాధనకు భారతాను వాదాన్ని పూర్తిచేయడమే గమ్యంగా భావించడంలో భారతంలో హరిహరనాథతత్త్వం విశిష్టమైనతీరులో ప్రతిపాదించబడటంకూడా ఒక ప్రధానకారణంగా తోస్తుంది. గీతలో తనవైభవాన్ని చెబుతూ 'నేను రుద్రుల్లో శంకరుణ్ణి' అంటాడు కృష్ణుడు.26 విశ్వరూపాన్ని చూసి 'ఇంత భయంకరమైనరూపం ఎందుకు? ఈ నీ ప్రవర్తనకు అర్థం ఏమిటి? నీ ప్రళయోన్ముఖం అయిన వృత్తాంతానికి ఆది కారణం ఏమిటో తెలుపవలసింది'27 అని అర్జునుడు వేడుకొన్నప్పుడు కృష్ణుడు 'ఇది నా కాలస్వరూపం. ప్రస్తుతం లోకాలను క్షీణింప చేయటానికై ఈరూపంలో వర్ధిల్లుతున్నాను' అంటాడు.28 ఈ సందర్భంలో పురాణపురుషుడు అర్జునుడికి చూపింది తనలోని హరుని తత్త్వాన్నే.

పాశుపతాన్ని అనుగ్రహింపచేసేందుకు శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి కలలో కైలాసానికి కొనిపోతాడు. ఆసందర్భంలో అర్జునుడు ఆనాటి రాత్రి తాను శ్రీకృష్ణుడికి సమర్పించుకొన్న నిశాసమయ పూజా ద్రవ్యాలైన మాల్యానులేపనాదులు శంకరుడి దివ్యదేహాన చూసి

26. 'రుద్రాణాం శంకరశ్చాస్మి' (భగవద్గీత - 10 - 23

27. భగవద్గీత - 11 - 31.

28. కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః। (భగవద్గీత - 11 - 32)

ఆశ్చర్యపోయి ఆ మురహర పురహరుల ఏకత్వానికి మనస్సులో మురిసిపోతాడు.29

అర్జునుడు తాను యుద్ధంచేస్తున్నప్పుడు తనముందు ఒక దివ్యాకృతి త్రిశూలాన్నిధరించి నడుస్తూఉండటం, ఆత్రిశూలం నుంచి వ్యక్తంఅయిన శూలపరంపరలు శత్రువుల్నితాకి తెగ టారుస్తూ ఉండగా వాటివెనుక శత్రువులనుతాకిన తనబాణాలు వారిని చంపిన కీర్తిని తనకు లభింపచేస్తూ ఉండటం దర్శించి, ఆ దివ్యాకృతి ఎవ్వరని వ్యాసుణ్ణి అడుగుతాడు. ఆ దివ్యాకృతి శివుడే అని చెప్పి, అతడి మహిమను వివరించి వేదవ్యాసుడు అర్జునుణ్ణి ఆ శివుడికి నమస్కరించమంటాడు.30

ఉపపాండవవధకు ఉద్యుక్తుడైన అశ్వత్థామకు పాండవ శిబిరాలను భూతరూపంలో రక్షిస్తున్న శంకరుడు ప్రసన్నుడై కృష్ణుడు తనకు అనురక్తుడనీ, అతడికి సహకరించడంకోసమే భూతరూపంలో అక్కడ కావలి ఉంటున్నాననీ చెబుతాడు. ఉపపాండవులకు కాలం తీరిందనిచెప్పి అశ్వత్థామచేతికి ఖడ్గం అందిస్తాడు. ఈసత్యాన్నెరిగిన కృష్ణుడు పాండవులను మరొకచోట నిలిపి జరగవలసినదాన్ని జరగనిస్తాడు.31

ఈవిధంగా ఒకేతత్త్వం శ్రీకృష్ణశంకరులుగా వ్యక్తమై కర్తవ్యాన్ని నిర్వహించినట్లు మహాభారతంలో మనకు బోధపడుతుంది. కృష్ణుడు విష్ణుతత్త్వంయొక్క పరిపూర్ణ ఆవిష్కారమేగదా!

విష్ణువైన తనకూ, రుద్రునకూ దక్షయజ్ఞంతర్వాత యుద్ధం వంటిది ఏర్పడిందని చెబుతూ అర్జునుడికి ఆ సన్నివేశాన్ని వర్ణించి

29. ద్రోణ - 2 - 368
30. ద్రోణ - 5 - 420 - 429.
31. సౌప్తిక - ప్రథమాశ్వాసం.

చెబుతాడు కృష్ణుడు. ఘర్షణపడుతున్న హరిహరులవద్దకు పరుగు పరుగున వచ్చిన బ్రహ్మాదిదేవతలూ, మునీంద్రులూ రుద్రునితో ఇలా అన్నారట :

"శివుడవు నీవు జగములకు
శివమొనరింపంగ వలదె చేయుము క్రోధ
ప్రవిహతి విష్ణుండనఁగా
శివుఁడన నొకఁడొట దివ్యచిత్తమె యెఱుఁగున్.
నిగమవేద్య మద్వంద్వంబు నిర్గుణం బ
మూర్తమనియెడు తత్త్వంబు మూర్తిభేద
కలనమున లోకమున ద్విధాకారియయ్యె
గాక హరియన నీవనఁ గలదె వేఱు."32

ఆపైన వాతావరణం ప్రశాంతం కాగా విష్ణువు శివుణ్ణి చేరి ఇలా అంటాడు :

"నిను నెవ్వఁ డెఱిఁగె నాతఁడు
నను నెఱిఁగినవాఁడ నిన్ను నమ్మిగ సేవిం
చిన నదియు నన్నుఁ గొల్చుట
యనువాదిత లేదు భేద మరయఁగ మనకున్
శ్రీవత్సము శూలాంకిత
మై వెలయుంగాక యిప్పుడాదిగ నాకున్
నీవును మత్పాణ్యంకో
ద్భాసన శ్రీకంఠుఁడనఁగఁ బరఁగుము శర్వా !"33

విష్ణువైన తనకూ హరునికీగల అభేదాన్ని వివరిస్తూ కృష్ణుడు అర్జునుడితో ఇలా అంటున్నాడు -

---

32. శాంతి - 8 - 446, 447.

33. శాంతి - 8-451, 452.

"నానా రూపంబుల ని
ట్లేను బ్రవర్తింతు జగములన్నింటను నీ
శానుఁడు నభవుఁడు నమృతుఁడు
నైన శివుని నీవు గొలువు మర్జున యెపుడున్.
ఏను రక్షింప జయము నీకెసక మెసఁగ
సమరమున శూలపాణియై శత్రుకోటి
నీదు మునుమున వధించియు నిరుపమాన
తేజు రుద్రుఁడుగా నెఱుఁగుము ధీరచిత్త!"34

ఒకే పరమపురుషుడు హరిహరులు అనే రెండు తత్త్వాలుగా వ్యక్తం అవుతున్నాడు తప్ప హరిహరులు ఇరువురూ వేరుకాదన్న వేదదర్శనాన్ని అనుభవానికి తెస్తుంది మహాభారతం అని దర్శించారు తిక్కనగారు. వేదవాఙ్మయ వేదవ్యాస వాఙ్మయాలనుంచి తాను పొందిన హరిహరనాథ దర్శనాన్ని భారతానువాదంలోని ఆశ్వాసాల ఆద్యంతాల్లో నిక్షేపిస్తూ వచ్చారాయన. భారతంలో అంతర్భాగంగా ఉన్న హరిహరనాథతత్త్వాన్ని ఒంటబట్టించుకొని భారతీయ దర్శనం వైపు దృష్టిసారించిన చదువరికి సాక్షాత్కరించే హరిహర నాథుడే ఈ ఆశ్వాసాద్యంతపద్యాల్లో అనితరసాధ్యమైనరీతిలో ఆ కవిచేత వర్ణించబడ్డాడు.

ఆశ్వాసాద్యంతపద్యాలను ఆసాంతం మనస్సుపెట్టి చదివిన వానికి

"శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప, భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముదాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వము..........."35

సాక్షాత్కరిస్తుంది.

34. శాంతి - 6 - 456, 457.
35. విరాట - 1-1

సాక్షాత్కరించిన ఆ

"ఓంకారవాచ్యునకు నన
హాంకార నియోగ భావనారాధ్యునకున్
హ్రీంకారమయు మనోజ్ఞా
లంకారోల్లాస నిత్య లాలిత్యునకు" 36

నమ్రుడై నమస్కరిస్తాడు చదువరి. నమస్కరిస్తున్న క్షణాల్లో అతడికి లభించే దర్శనం ఈ క్రిందివిధంగా ఉంటుంది :

మానవుడుచేసే ఉచ్ఛ్వాస నిశ్వాసల్లో 'సోऽహమ్' అనే స్వయంసిద్ధమైన మంత్రబీజాలున్నాయి. మానవుడు జపించడంతో నిమిత్తంలేకుండా మానవుడిచేత నిరంతరం జపించబడే అజపా మంత్రం ఇది. 'సో'లోని సకారం, 'హమ్'లోని హాకారం కరిగి పోయినప్పుడు మిగిలేది 'ఓం'కారం. కనుకనే పరమాత్మ ఓంకార వాచ్యుడయ్యాడు ఈ ఓంకారంనుంచే జీవిశ్వాస వ్యక్తం అవు తోంది. ఈ ఓంకారం తనచుట్టూతాను నిర్మించుకున్న మందిరమే దేహం అనబడుతోంది. జీవి ఓంకారంయొక్క వ్యక్తరూపం అయి నట్టే ఈసృష్టికూడా ఓంకారంనుంచి వ్యక్తంఅయినదే. జీవిహృదయ మండలి ఓంకారం జీవిదేహాన్ని నిర్మిస్తున్నట్టు సృష్టి హృదయమండలి ఓంకారం సృష్టిని నిర్మాణం చేస్తోంది. కాబట్టే కృష్ణుడు "ఓం ఇత్యే కాక్షరం బ్రహ్మ" 37 అన్నాడు. చిత్రం ఏమంటే సృష్టికి సిద్ధపడిన ఓంకారం హ్రీంకారంగా రూపొందుతుంది. సృష్టినిర్మాణానికి ఉద్యుక్తుడైన ఓంకారవాచ్యుడు అందుకొరకై తననుంచి వ్యక్తం అయిన తన ప్రకృతితోకలిసి హ్రీంకారమయుడు అవుతున్నాడు.

ఉచ్ఛ్వాసనిశ్వాసల్లో నిశ్వాస భగవంతుడి సృష్టిస్వరూపం. దానిమంత్రం 'హమ్'. దాన్ని నాదాత్మకంగా చేసేటందుకు స్వర

36. విరాట - 1-37
37. భగవద్గీత - 8-13

పీఠికలో రేఫం అగ్నిబీజమై వ్యక్తం అవుతుంది. అదే ఋగ్వేదం. ఈ రెండూ నాదప్రస్తారంలో 'హ్రాం' అనే మంత్రంగా రూపొందుతాయి. "తాం పద్మినీం ఈం శరణమహం ప్రపద్యే" అనే శ్రీసూక్తమంత్రంలోని 'ఈం' అనేది అమ్మవారి తత్త్వమైన శక్తికి బీజమంత్రం. దానితో కలిసి హ్రాం + ఈం = హ్రీం అనబడే శక్తి ఉద్భవిస్తోంది. ఈమే ఆసేతుశీతాచలం అంతర్లీనమై పనిచేస్తున్న శైలపుత్రికగా మంత్రశాస్త్రంలో ఋషులచేత దర్శింపబడింది. ఈమె యందున్న ఈ అక్షరధ్వనులు చరణ పాంసువులై ఆరాధింపబడగా 'తనీయాంస'మైన ఒక పాంసువునుంచి సృష్టికర్త ఈసృష్టిని హరిహరాత్మకంగా వ్యక్తంచేస్తున్నాడని శంకరభగవత్పాదులు దర్శించారు.38 దీన్నే హరిహరనాథుడిగా దర్శించిన ఆచార్యుడు తిక్కన. ఇదే అతడు ప్రశంసించిన వేదసంప్రదాయధ్యానం లేక వైదికధ్యాయిత. ఈసందర్భంలో హరిరూపం, హరరూపం 'హ్రీం' అనే మాతృకాశక్తినుంచి ఉచ్చారణారూపాలై ప్రసవించబడటం గమనించవలసిన అంశం.

ఈ విధమైన దర్శనాన్ని చదువరికి అందించి అతణ్ణి భేదదృష్టి నుంచి వేదదృష్టికి మళ్ళించి సృష్టికి అతీతమై, సృష్టిగా వ్యక్తం అవుతున్న ఒకేఒక దివ్యపురుషుని ముందు నిలుపుతాడు తిక్కన.

తిక్కన వ్యక్తిత్వప్రభావమో లేక సాహిత్యప్రభావమో లేక ఆ రెండిటి ప్రభావమో లేక ఆ రెండిటిద్వారా వ్యక్తం అయిన ధర్మాద్వైతప్రభావమో చెప్పలేంగాని తిక్కన తరువాత తెలుగు గడ్డపైన మతావేశాలు క్రమంగా తగ్గిపోయాయి. ఆవేశాలు తగ్గి శైవ వైష్ణవ సంప్రదాయాలు మిగిలాయి. సమన్వయదృష్టితో వేదమార్గంలో హరిహరుల్లో అభేదాన్ని దర్శించేవారిసంఖ్య నానాటికీ

38. సౌందర్యలహరి - 2.

పెరుగుతూ వచ్చింది. ఈ పరిణామానికి తిక్కన అడుగుజాడల్లో నడచి తమ కావ్యాలను హరిహరనాథుడికి అంకితంచేసిన నాచన సోమన, కొఱవిగోపరాజు, బైచిరాజు వేంకటనాథుడు తగుమాత్రం సహకరించారు. హరిహరులయెడల సమదర్శనం కలిగి హరుని చేత పాండురంగని మాహాత్మ్యాన్ని నోరారా చెప్పించిన తెనాలి రామ కృష్ణుణ్ణి ఈ సందర్భంలో స్మరించవలసిఉంది. ఆచరణీయత గల కవుల ప్రభావం సమాజంపై తప్పక ఉంటుందనీ, కవి తనను తాను ఉద్ధరించుకొని సమాజాన్ని ఉద్ధరించగల స్థితిలో తననితాను నిలుపు కొని ధర్మాద్వైతమూర్తిగా వర్తించగలిగినపుడు సమాజమూ, సత్కవులూ అతణ్ణి తప్పక అనుసరిస్తారనీ నిరూపించాడు తిక్కన. అతడి నడవడీ, పెట్టిన ఒరవడీ లోకానికి ఆదర్శప్రాయమైనదీ, కవిలోకానికి అనుష్ఠింపదగినదీను.

## భారతాన్నే ఎందుకు ఎంచుకున్నాడు ?

హరిహరనాథతత్త్వాన్ని బోధపరచి ప్రజలను మతావేశాల నుంచి సమన్వయస్థితికి మళ్ళించదలచిన తిక్కన భారతానువాదానికి పూనుకోవడంలోని ఆంతర్యం ఏమై ఉంటుంది ? తాను ప్రాచుర్యం లోకి తేదలచిన హరిహరనాథతత్త్వాన్ని భారతానువాదంలో ఆశ్వాసాద్యంతాల్లో నిక్షేపించడంలో తిక్కనగారు ప్రత్యేకంగా ఆశించిన పరమార్థం ఏమై ఉంటుంది అని ఆలోచించినపుడు ఈక్రింది సత్యాలు మనకు గమనికకు వస్తాయి.

మతావేశాల్లో మునిగిపోతున్నవారికి ముందుగానే హరిహర నాథ తత్త్వాన్ని ప్రత్యేకంగా ప్రబోధించి దారికి తీసుకురావడం అంత తేలికైన పనికాదు. ముందు ఆ ఆవేశపరులకు తాము పడుతున్న ఆవేశం కూడనిది అని తెలియాలి. ఆధ్యాత్మికత అంటే ఆవేశపడటం కాదనీ, ఆచరణలో కౌశలాన్ని చూపగలగడం అనీ వారికి బోధ

పడాలి. దైవారాధన అంటే తమకు నచ్చని రూపాన్ని నిందించడం కాదనీ, అన్నిరూపాల్లోనూ నిండి ఉన్నది వారు ఆరాధించాలని అనుకొంటున్న ఆ దైవమేననీ బోధపడగల సమదర్శనం వారికి అబ్బాలి. భక్తి చూపడం అంటే ఉన్మాదిలా రెచ్చిపోవడం కాదనీ, నిత్యజీవితనిర్వహణలో దివ్యమైన సంయమనాన్ని చూపగలగడమే నని వారికి అర్థంకావాలి. పారవశ్యం అంటే పరిసరాలను మర్చిపోయి ఊగిపోవడం కాదనీ, పురుషార్థాల స్వరూపస్వభావాలను ఎరిగి వాటి సక్రమ నిర్వహణలో ధర్మాద్వైతస్థితిని అనుభవించడం అనీ వారికి తెలియాలి. పరతత్త్వానికి వశమై, అంకితమై ఉండటమే పారవశ్యం అనిపించుకొంటుందని వారు గ్రహించాలి. మతావేశాల్లో పెల్లుబుకుతున్నవి హద్దులు మీరిన రాగద్వేషాలే తప్ప అవి భక్తి ప్రపత్తులు మాత్రం కావని వారికి అవగతం కావాలి.

పరమతాన్ని నిందించడంవల్లగానీ, తనమతాన్ని కీర్తించుకోవడంవల్లగానీ, తనమతం కానివారిని దండించడంవల్లగానీ, తనమతంలోకి మరింతమందిని బలవదాకర్షణం చేయడంవల్లగానీ దేవుడిమెప్పును పొందడం సాధ్యం కాదనీ, స్వధర్మాన్ని లోకహితంగా ఆచరించినపుడు మాత్రమే దేవుడు సంతోషించి తనతో అద్వైతస్థితిని అనుగ్రహిస్తాడనీ వారికి దర్శనం లభించాలి.

శాశ్వతమైన ఈ సత్యాన్ని సమగ్రంగా బోధపరచగలిగింది మహాభారతం ఒక్కటే. ఇది విద్వత్సంస్తవనీయమైన వ్యాసభగవానుని భవ్యకవితావేశంనుంచి దిగవచ్చిన దివ్యేతిహాసం. దీని అనువాదాన్ని పూర్తి చేసిననాడు తననాటివారికే కాక తరతరాలవారికీ తరించేమార్గాన్ని అందించినట్టు అవుతుందని దర్శించిన తిక్కనగారు 'మహాకవిత్వ దీక్షావిధినొంది' వ్యాసుని వెలుగును తెలుగులోనికి అవతరింపజేశారు. లోకహితనిష్ఠతో వ్యాసుడు అనుగ్రహించిన

సార్వకాలీనమూ, సార్వజనీనమూ అయిన ధర్మాద్వైత సందేశాన్ని తనలో ఇముడ్చుకొన్న మహాభారతం ద్రష్టలైన కవిత్రయం చేతుల మీదుగా మనతెలుగువారికి లభించడం మన పురాకృత పుణ్య విశేషం. తేటతెనుగులో భారతంనుంచి తేటతెల్లం అవుతున్న ధర్మాద్వైతస్థితిని దర్శించి, అనుష్ఠించి తరించడం మనకర్తవ్యం. మన గమ్యం.

---

## అనుబంధం - 1

# కేతవరపు రామకోటిశాస్త్రిగారి 'ప్రతిపాదన'

### (పూర్తిపాఠం)

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయను డర్థిలోకహితనిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్

ఈ పద్యమంతయు కృష్ణద్వైపాయనునకు సంబంధించినది. మరియు నాయనభారతమునకు సంబంధించినది. మొదటిమూడును కృష్ణద్వైపాయను డెట్టివాడో చెప్పునవి. చివరిమూడును ఎందుకు - ఎట్లు - ఏమి ఆయన చేసినాడో చెప్పునవి. కృష్ణద్వైపాయనుడు కవితావేశముగలవాడు. అది భవ్యము. మరియు నది యెట్టిదనగా విద్వత్సంస్తవనీయము. పండితులచేత స్తవనార్హమైనది. వేత్తి సర్వం విద్వాన్ - సర్వము నెరుగుటవలన విద్వాంసుడగుచున్నాడు. పరాపరములకు సంబంధించినదై యొకక ద్విధాభూతముగా నున్నది. అద్వితీయపరబ్రహ్మము పరము. అది నిర్గుణము. సగుణబ్రహ్మము అపరము. అది కేవలము జ్ఞానమయము. ఇది యుపాసనారూపమున

కర్మమయము. ఈ రెండింటియొక్క ఎరుకయే విద్వాంసుని లక్షణము. అట్టిజ్ఞానము కలిమిని కర్మలు చేయుటయే కావలసినది. అదియే విద్య.[1] వ్యస్తములుగా పేర్కొనబడు కావ్యవిద్య, దండనీతివిద్య మొదలైన వన్నియు నా పరాపరరూపమైన విద్యలో నంతర్లీనమగునవియే. వివిధ విద్యానిధిః[2], మహనీయ విద్యానిధి[3] ఈమొదలుగా వ్యాసుని గూర్చి తిక్కనగారు చెప్పుట గమనింపదగినది. సమస్తవిద్యాస్వరూపమైన పరమవిద్యకు నిధియగుటవలననే వ్యాసుడు విద్వత్సంస్తవనీయుడైనాడు. అనగా పరాపరవిద్యావివేకముతోడి భవ్యమైన కవితావేశముగలవాడు వ్యాసుడు. అందువలననే విద్వాంసులా కవితావేశమును సంస్తవము చేయుచున్నారు. మరియు వ్యాసుడు సర్వవిజ్ఞాన భవ్యాత్ముడు.[4] కనుక నాయన కవితావేశము భవ్యమైనది. విజ్ఞాన సంపద్విఖ్యాతుడు - విజ్ఞానమే సంపదగా గలిగి అందువలన విశేషమైన ఖ్యాతిని పొందినవాడు. విజ్ఞానమనగా విశిష్టమైన జ్ఞానము. శాస్త్రతాత్పర్యభూతముగా నేర్పడిన తెలివి జ్ఞానము. ఏతత్ జ్ఞాన మనుభవమున కగుట విజ్ఞానము. జ్ఞానముయొక్క పర్యవసాన మనుభవమే. అనుభవసిద్ధమగు జ్ఞానమునే జ్ఞానమనవలెను. శాస్త్ర తాత్పర్య జ్ఞానము ముందుమెట్టుగా నున్నందున అది కేవలము జ్ఞానమనియు, అనుభవమునకు వచ్చుట అను విశేషముగల జ్ఞానము విజ్ఞానమనియు అనబడుచున్నవి. జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా - అను గీతాశ్లోక మీ విధముగనే భాష్యము చేయబడినది.[5] శ్రీకృష్ణద్వైపాయనుడు సర్వశాస్త్రోక్త పదార్థ పరిజ్ఞానమును ననుభవమునకు తెచ్చుకొనినవాడగుటవలన తిక్కనగారిచేత విజ్ఞానసంపద్విఖ్యాతుడుగా

---

1. భగవద్గీత 4-19-శంకరభాష్యము మరియు - భారతము ఉద్యోగ - 2-320
2. భారతము - అశ్వ - 3-155
3. భారతము - మౌసల - ప. 207
4. భారతము - స్వర్గ - ప. 80
5. భగవద్గీత - 6-8 - శంకరభాష్యము

చెప్పబడినాడు. సంయము లనగా సంసారోపరతులు. సర్వేంద్రియములను విషయములందు ప్రవర్తింపనీయక నుపశమింప జేసుకొనినవారు. అనుభావమునకు ప్రభావము, బుద్ధినిశ్చయము అని యర్థములుగలవు. మరియు అనుపశ్చార్థం భావయతి ప్రకాశయతీత్యనుభావః6 - అనుభావుడనగా అర్థము నెరిగించగలవాడు. సంసారోపరతులైన సంయములు సంభావింపదగిన అర్థము నెరిగించగల నిశ్చయమైన బుద్ధిలక్షణములు కలవాడు వ్యాసుడు. సంయములు సంభావింపదగిన యర్థము కేవలము బ్రహ్మము. విద్వాంసులకును, సంయములకును గల భేదమిదియే. వారికి లోకమున నిర్మలముగా నైనను ప్రవృత్తి యున్నది. వీరి కదియు లేదు. వ్యాసు డటు వారిచేతను స్తవముచేయబడుచున్నాడు; వీరిచేతను సంభావింపబడుచున్నాడు. వారు కర్మపరులైన జ్ఞానులు. వీరు కేవలము జ్ఞానులు. ఈ ఇరువురకును కృష్ణద్వైపాయనుడనిన గౌరవమే. అందువలన నాయన కర్మజ్ఞానముల పరమార్థము మూర్తికట్టుకొనగా నైనవాడు వలెనున్నాడు. అట్టి కవితావేశము, ఇట్టి పరమార్థము రెండింటి యొక్క ఏకాకారము వ్యాసుడు. ఆయన భారతము వ్రాసెను. అర్థిలోకహితనిష్ఠనుబూని వ్రాసెను.

అర్థిలోకమనగా కోరుచున్న లోకము. లోకమనగా లోకులు. లోకము సుఖమును గోరుచుండును. సుఖము ఇహాపరభేదముచేత రెండువిధములుగా కనిపించుచున్నది. అప్పుడు ఇహాపరములకు సంబంధించిన సుఖమును గోరు లోకమునకు హితమును బోధించుట యందు నిష్ఠకలవాడై వ్యాసుడు భారతమును చేసినాడని యర్థము చెప్పవలెను. అర్థిలోకమనక లోకహితనిష్ఠనుబూని యనిన నదియే యర్థము వచ్చును. ఆ ఇహాపర సుఖములయందే ఒకదానియందు గాని, ద్వేషముగాని, రాగముగాని బోధించక, పరమున కిహా

6. గురుబాలప్రబోధిక - పుట - 157

ముపస్కారమగునట్లుగా ధర్మమును బహుముఖముల వ్యాఖ్యానించుటయే లోకమునకు హితముచేయుట. ఆ హితమునందు ఇహలోకయాత్ర సాగుటకు కర్మము, దానిని పాలించు జ్ఞానము - రెండిటికిని తుల్య ప్రాధాన్య మొసగి శ్రేయము ప్రబోధించుటయే హితముచేయుట. అట్టి లోకహితమునందు దృష్టికలవాడు గనుకనే వ్యాసుడు వ్రాసిన భారతము ధర్మాద్వైతస్థితి కలది యైనది. ధర్మాద్వైతములనగా కర్మజ్ఞానములు. ఇహపర సుఖసాధనములు. 'ధర్మ' శబ్దమున కర్థము 'కర్మ'యని. 'శ్రేయాన్ స్వధర్మో విగుణః'7 అను గీతాశ్లోకమునందలి ధర్మశబ్దమున కనివార్యముగా కర్మయనియే అర్థము చెప్పుకొనవలెను. తత్ప్రకరణమున మరియొక అర్థము పుట్టదు. మరియు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనినప్పుడు 'సన్న్యస్య సర్వకర్మాణీ త్యేతత్' అనియే శ్రీమచ్ఛంకరులు వ్రాసిరి. అందువలన ధర్మాద్వైతస్థితి అనుదాని యందలి ధర్మశబ్దమునకు కర్మయని యర్థము చెప్పవచ్చును. ఇక అద్వైతము-ఏది అద్వితీయమో అదియే అద్వైతము. అద్వితీయము బ్రహ్మము.8 బ్రహ్మము జ్ఞానము9. కనుక నద్వైత శబ్దమునకు జ్ఞాన మర్థమగుచున్నది. ధర్మాద్వైతస్థితి యనగా కర్మజ్ఞానములయొక్క కలిమి. ఇట్లు కర్మ జ్ఞానములు రెండును భారతమున చెప్పబడినపుడే వ్యాసుడు లోకహితనిష్ఠను బూని గావించినట్లు. లోకమున కా రెంటి యందే నిష్ఠయున్నది.

“లోకేఽస్మిన్ ద్వివిధానిష్ఠా ... జ్ఞానయోగేన ... కర్మయోగేన”10

అని శ్రీ భగవానుడు చెప్పెను. ఈ శ్లోకమునందు యోగ శబ్దము కర్మ జ్ఞానముల ననుసరించి పురుషార్థప్రాప్తిసాధనమైన యుపాయము చెప్పుచున్నది. ఆత్మానాత్మ వివేకానుభవమే జ్ఞానము.

7. భగవద్గీత - 18-47

8. ఏకమేవ అద్వితీయం బ్రహ్మ

9. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ - తైత్తిరీయం

10. భగవద్గీత - 3-3

స్వర్గాద్యపవర్గమునకు కారణభూతమైన శ్రౌతస్మార్తములు, క్రియలు కర్మ. వేదము పూర్వోత్తరకాండములయందు క్రమముగా కర్మ జ్ఞానములతో కూడుకొని యున్నది. భారతము పంచమవేదము. లేఖ్యంబైన ఆమ్నాయమని తిక్కనగారు చెప్పిరి. కర్మ జ్ఞానములను ప్రతిపాదించినది కానిచో భారతమునకు వేదగౌరవములేదు. అందు వలన ధర్మాదిప్రతిస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయమును అర్థిలోకహితనిష్ఠనుబూని వ్యాసుడు కావించినాడనినపుడు, కర్మ జ్ఞానములకు స్థితికలిగిన భారతమను పేరు కలిగిన లేఖ్యమగుట విశేషమైన వేదమును వ్యాసుడు లోకహితైకాపాదకదృష్టితో కావించిన వాడనియే అర్థము చెప్పుకొననలయును. భారతమంతయు కర్మ జ్ఞానముల సముచ్చయరూపమేకదా! ముఖ్యముగా శాంతిత్రయమందుకొరకే ఉన్నది.

ద్వితీయోన్మేషము

తిక్కన-కావ్యశిల్పము-తిక్కనగారి భారతావతారిక

పుటలు 181 - 185

# ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారి 'ప్రతిపాదన'

## (పూర్తిపాఠం)

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమిప్రకర సంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయను డర్థిలోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్.

మహానుభావుడగు వేదవ్యాసమహర్షి లోకకల్యాణప్రదమగు కవితనే చెప్పవలయునను పట్టుదల గలవాడు. ఆ కవిత్వము విద్వాంసుల స్తుతికిఁ బాత్రము కావలయునని యాతనిదృష్టి. ఆతఁడు వేదవిజ్ఞానసంపదనంతను అనుభూతము గావించుకొనినాడు. కావుననే యాతని ప్రభావమును జ్ఞానప్రధానులగు పరమహంస సముదాయములు మాత్రము దెలియగలవు. అట్టి మహానుభావుడు లోకహితమునే గోరి తదనుకూలమగు నిష్ఠతోఁ, గర్మ జ్ఞానములతో నొప్పు నీ భారతసంహితను రచించెను. ఇది అపౌరుషేయముగాన లేఖ్యము.

వివరణము : 'విద్వత్సంస్తవనీయ' యనుచో విద్వాంసులనఁగా, శాస్త్రజ్ఞానముగల సామాన్య విద్వాంసులు అను నర్థము చెప్పినచో వ్యాసవాక్కులకు సంకుచితార్థమును తెల్పినట్లగును కావున -

"ఏతద్ధస్మవై తత్పూర్వే విద్వాంసః ప్రజాం న కామయన్తే
కిం ప్రజయా కరిష్యామః యేషాం నోఽయమాత్మాఽయం లోకః"
(బృహ. 4 - 4 - 22)

అను శ్రుతివాక్యమునందలి ఔపనిషద జ్ఞానపరులగు విద్వాంసులనే గ్రహింపవలయును. అట్టివారలు స్తుతించు భవ్యకవితయే బ్రహ్మజ్ఞానమును గలుగఁజేయు కవిత. ఈ యాశయమునే 'విజ్ఞానసంపద్విఖ్యాతుడు' అను పదముచేఁ దిక్కయజ్వ సూచించెను. ఇంకను దీనియందలి విజ్ఞానసంపచ్ఛబ్దముచే సామాన్య సాహిత్యాది విజ్ఞానమును గ్రహింతురేమో యను నూహతోఁ దనకు నుద్దిష్టమగు నట్టి విజ్ఞానసంపదను 'సంయమిప్రకర సంభావ్యానుభావుండు' అను మాటచే సూచించెను. ఆతెడు ఆత్మజ్ఞానసంపన్నులచే నూహింపదగిన యతిశయము కలవాడేగాని సామాన్యజనుల కందరానివాఁడని భావము. గంభీరములగు వేదపాథోధులను మథించి బ్రహ్మసూత్రరూప సుధాకలశము నుద్ధరించిన మహానుభావుడగు కృష్ణద్వైపాయన మహామునిని సామాన్యకవితావేశునిఁగా దలంతురేమోయని తిక్కయజ్వ యిట్లు గట్టిగాఁ జెప్పెను.

ఈ భారతగ్రంథరచనాప్రయోజనము 'అర్థిలోకహితము'. ఈ యర్థిలోకము ద్వివిధముగా నున్నది. అందు కొందరు కర్మల నాచరించి తమ యైహికాముష్మిక ప్రయోజనములను జిత్తశుద్ధిని గాంచువారు. మరికొందరు జ్ఞానమునార్జించి మోక్షమును పొందగోరువారు. అట్టి యీయిద్దరికిని హితమును కలుఁగజేయవలయునని నిష్ఠనుబూని పారాశర్యుఁడు రచనము గావించెను. ఈ విషయమునే శ్రీకృష్ణభగవానుఁ డిట్లు చెప్పెను -

---

1. 'ప్రాచీనులగు జ్ఞానులు సంతానముతో మాకు బనియేమి ? మాకు అన్నియును ఈయాత్మయే అని సంతానమును గోరరు.'

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥"2
(భగవద్గీత - 3 - 3)

ఈ ద్వివిధమగు నిష్ఠయే యిందలి లోకహితనిష్ఠగా మనము గ్రహింపవచ్చును. ఈ విషయమునే సమనంతరమగు 'ధర్మాద్వైత స్థితి' అన్నపదముచే నిరూపించుచున్నాడు. ఈ ధర్మాద్వైతస్థితి అను సమస్తపదమునందు ధర్మ + అద్వైత + స్థితి అను మూడు పదములు గలవు. ధర్మమనగా వేదవాక్యముచే విధింపబడిన కర్మము. వేదార్థనిర్ణాయకుఁడగు జైమినిమహర్షి తన పూర్వ మీమాంసాశాస్త్రమునందు 'చోదనా లక్షణార్థో ధర్మః' (జైమిని సూ 1 - 2) అని యిట్లే నిర్ణయించెను. చోదనయనగా విధిబోధక ప్రత్యయాంతములు. యజేత, ఉపాసీత - మున్నగు పదములు. వీనిచే విధింపబడిన కర్మమే ధర్మమని తదర్థము.

ఇఁక 'అద్వైత' పదమునకు, 'ద్వే + ఇతే = ద్వీతం- ద్వీతమేవ ద్వైతమ్' అను విగ్రహముచే ద్వైతమనగా రెండు జ్ఞానములు. 'న + ద్వైతం' అను వ్యుత్పత్తిచే భేదరహితజ్ఞాన మని యర్థము. కాఁగా ధర్మాద్వైత శబ్దముల ద్వంద్వమునఁ దుదిని గల స్థితిశబ్దమును ధర్మశబ్దముతోడను, అద్వైతశబ్దముతోడను వేఱువేఱుగా సంబంధింపఁజేయుటచే, ('ద్వంద్వాన్తే శ్రూయమాణం పదం ప్రత్యేకమనుసంబధ్యతే' అను వ్యాకరణపరిభాషచే) 'ధర్మస్థితి' 'అద్వైతస్థితి' అను రూపము కలుగును. అనగా వేదము నందలి కర్మకాండముచేఁ దెల్పఁబడిన కర్మస్థితితోడను, జ్ఞాన కాండముచేఁ (ఉపనిషత్తులచే) ప్రతిపాదింపఁబడిన జ్ఞానస్థితితోడను వ్యాసభగవానుఁడీ భారతామ్నాయమును రచించెనను నర్థము పర్యవసితము.

---

2. సాంఖ్యులకు జ్ఞానయోగముతోను యోగులకు కర్మయోగముతోను ద్వివిధమగు నిష్ఠను బూర్వము నేను బోధించితిని.

వేదము కాండద్వయోపపన్నమని ప్రత్యహము తన యగ్నిహోత్ర సమయమునఁ దాను గావించు 'కాండద్వయోపపాద్యాయ కర్మబ్రహ్మ స్వరూపిణే, స్వర్గాపవర్గరూపాయ యజ్ఞేశాయ నమో నమః' అను యజ్ఞేశనమస్కారముచే సర్వదా తిక్కయజ్వకు సువిదితము కదా !

ఇట్లు కాండద్వయ రూపములగు ఋగ్వేదాదులకువలెనే భారతగ్రంథమునకుఁ గూడ ఆమ్నాయత్వమును నిరూపించి ప్రసిద్ధ ఋగాదులకును దీనికినిఁ గల భేదమును 'లేఖ్యము' అను పదముతోఁ దెల్పెను. భారతము లేఖ్యమగు నామ్నాయము. త్రయీవిద్య అలేఖ్యమగు నామ్నాయము. ఋగ్వేదాదులందు ఉదాత్తాది స్వరములు ప్రాధాన్యమును వహించుటచే నయ్యది గురుముఖముననే అభ్యసింపఁ దగినదనియు, ఈ భారతామ్నాయమున నట్టి స్వరప్రక్రియ లేకపోవుటచే నియ్యది వ్రాసికొని చదువఁదగినదనియు భావము. కావున శ్రుతిభారతముల రెండింటిని విషయసామ్యమున్నను అలేఖ్యత్వలేఖ్యత్వములచే భేదము గల్గుచున్నదని భావము. శ్రుతి అపౌరుషేయము, భారతము పౌరుషేయము అను భేదముగూడ ఉక్తప్రాయము.

# నండూరి రామకృష్ణమాచార్యగారి 'ప్రతిపాదన'

## (పూర్తి పాఠం)

# తిక్కన ధర్మాద్వైతము

తిక్కనభారతారంభమునందు ప్రార్థనశ్లోకము వెనువెంట చెప్పిన పద్యము అతని అంతరాత్మను ప్రతిఫలించుచున్నది.

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయను డర్థిలోకహితనిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్.

'అనన్యసామాన్యకరణంబను పరమధర్మప్రకారంబు' తిక్కన గుర్తించెను. ప్రాచీన గ్రీకు సప్తర్షులలో నొకడగు క్లియోబ్యులసు గూడ పరస్పర వైరుధ్యముగల ధర్మములను సమన్వయించి జగత్తుకు ధర్మాద్వైతప్రాయమైన (Golden mean) సువర్ణ సూత్రము ప్రతిపాదించెను. సర్వధర్మముల మాధ్యస్తమే సువర్ణ సూత్రము అని క్లియోబ్యులసు సుభాషితము. తిక్కన వ్యక్తిత్వములో నేర్పడిన బహుముఖ పరిణామ వికాసమునకు అంతర్వాహినిగ ఐక్యము చేకూర్చి సమన్వయము సల్పుచున్న దీ ధర్మాద్వైతమే.

మహాభారతమునందుగూడ తన జీవితవేదాంతమే ప్రతిఫలించు చున్నదని తిక్కన గుర్తించెను.

వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణ వర్గంబులకున్
వాదైనచోటులం దా
మూదల ధర్మార్థకామ మోక్షస్థితికిన్.

## తిక్కన వేదాంతము :

తిక్కన సమన్వయ వేదాంతి. తిక్కన వేదాంతము నొక్కమాటలో సంక్షేపింపవలెననిన ధర్మాద్వైతము అని చెప్ప వచ్చును. భారతమునందలి వేదాంతము ఈ ధర్మాద్వైత మని తిక్కన కంఠోక్తిగ చెప్పెను. కృష్ణద్వైపాయనుడు ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయమును రచించెను.

దీనినే విస్తరించి 'వేదములకు అఖిలస్మృతి వాదములకు' బహుపురాణవర్గములకు వాదైనచోటుల మూదలగా భారతమును గ్రహింపవలె'నని తిక్కన చెప్పెను. ధర్మము ద్వైతమగునా ? పైకట్లు భాసింపవచ్చును.

వేదము లొకటి చెప్పవచ్చును. పురాణము లింకొకటి చెప్ప వచ్చును. ఇట్లు విప్రతిపన్నములుగా భ్రమను గొల్పుచున్న వేద పురాణ వాక్యములలోని వైరుధ్యము పరమధర్మమును గుర్తించిన సమసిపోవును. 'సత్యంవద' 'అహింసా పరమోధర్మః' ఇత్యాది ధర్మములు వేదోపనిషద్ ప్రోక్తములు. అహింసావ్రతము పాటించు నపుడు సత్యవ్రతమునకు భంగమేర్పడవచ్చును. 'ధర్మము బహుమార్గ దృష్టంబు'. ధర్మసూక్ష్మ మరయుట కష్టము. అట్టియెడల మహా

భారతమే పరమధర్మమును బోధించు ధర్మాద్వైతబోధకమగు పంచమవేదము.

ఒక అరణ్యము. ఒక ఋషివాటిక. అరణ్యమార్గమునబోవు గృహస్థును సంహరించి ధనము హరింప దొంగలు అతని వెంటాడుదురు. గృహస్థు ఆశ్రమమునందలి ఋషిమరుగు చేరును. వెంబడించిన దొంగలా గృహస్థుని ఉనికిపట్టును గూర్చి ఋషిని ప్రశ్నించెదరు. 'సత్యంవద'అను వేదవాక్యమును పాటించిన 'అహింసా పరమోధర్మః' అను ఉపనిషత్ వాక్యమునకు భంగముకలుగును. ఇచ్చట ఋషికర్తవ్యమేమి ? ఇచ్చట ధర్మము ద్వైతముగా భ్రమకొలుపుచున్నది. కాని పంచమవేదము ధర్మాద్వైత పరిష్కారము సూచించుచున్నది. 'భూతహితంబుగా పలుకు బొంకును సత్యఫలంబునిచ్చు. తత్ భూతభయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్లు ప్రాణాతురుడైనచో పరిణయంబునయందున పల్కుబొంకు సత్యాతిశయంబయండ్రు మహితాత్మక యిట్టివి ధర్మ సూక్ష్మముల్.'

రెండు ధర్మములు విప్రతిపన్నములై యున్నపుడు దేని ననుసరింపవలెను? అందేది పరమధర్మమో దాని ననుసరింపవలెను. అప్పుడు రెండవ ధర్మమునకు ఉపహతి కల్గినను నిజమునకు ఆచరించినది ధర్మమే. ఇట్లు స్వార్థమును కుటుంబముకొరకై, కుటుంబమును దేశముకొరకై, దేశమును విశ్వమానవశ్రేయస్సుకై త్యజింపవలెను. దేశశ్రేయస్సుకొరకై పాటుపడునపుడు కుటుంబమునకు ఉపహతి కల్గినను అది అధర్మము కాజాలదు. ధర్మమునకు, అధర్మమునకు వైరుధ్యమేర్పడినపుడు ధర్మమునే స్వీకరింపవలెను. అది సులభ పరిష్కారమే. ఇక రెండును అధర్మములే అయిన ఉభయములును త్యాజ్యములే. ఇక రెండును ధర్మములైన ఆ రెంటికి సంఘర్షణ ఏర్పడిన కర్తవ్య మేమనునదే ప్రశ్న. విప్రతిపన్నధర్మములకు

ఏర్పడిన సంఘర్షణలను ఇతివృత్తముగా స్వీకరించుటచే మహోజ్జ్వల ప్రాచీన గ్రీకు నాటక వాఙ్మయ మేర్పడినది. విప్రతిపన్నధర్మములకు సంఘర్షణలేకుండ శాంతి సౌఖ్య పూరిత జీవితమును ప్రదర్శించుట మూలముననే విశ్వసాహితీజగత్తులో మంగళాంతకావ్యము లేర్పడినవి. సంఘర్షణ సుఖశాంతికి సమన్వయము గల్పించి, విప్రతిపన్నధర్మములకు, ధర్మవికల్పములకు సమన్వయముగల్పించి పరమధర్మమును నిర్వచించు ధర్మాద్వైతతత్త్వమును నిరూపించు పంచమవేదమే మహాభారతము.

# అనుబంధం - 2

# సర్ప (నహుష) యుధిష్ఠిర సంవాదము

**సర్ప ఉవాచ :**

బ్రాహ్మణ కో భవేద్రాజన్ వేద్యం కించ యుధిష్ఠిర
బ్రవీహ్యతిమతి త్వాంహి వాక్యై రనుమిమీమహే.

**యుధిష్ఠిర ఉవాచ :**

సత్యం దానం క్షమాశీల మానృశంస్యం తపోఘృణా
దృశ్యంతే యత్ర నాగేంద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః.
వేద్యం సర్ప పరం బ్రహ్మ నిర్దుఃఖ మసుఖం చ యత్
యత్ర గత్వా నశోచంతి భవతః కిం వివక్షితమ్.

**సర్ప ఉవాచ :**

చాతుర్వర్ణ్యం ప్రమాణంచ సత్యంచ బ్రహ్మచైవహి
శూద్రేష్వపి చ సత్యం చ దాన మక్రోధ ఏవచ
ఆనృశంస్య మహింసాచ ఘృణాచైవ యుధిష్ఠిర
తాభ్యాం హీనం పదం చాన్యన్నత దస్తీతి లక్షయే.

**యుధిష్ఠిర ఉవాచ :**

1. శూద్రేతు యద్భవేల్లక్ష్మ ద్విజేతచ్చ నవిద్యతే
నవై శూద్రో ౽భవత్ శూద్రో బ్రాహ్మణో నచ బ్రాహ్మణః
2. యత్రైతల్లక్ష్యతే సర్ప వృత్తం స బ్రాహ్మణః స్మృతః
యత్రైత న్నభవేత్సర్ప తంశూద్ర మితి నిర్దిశేత్.

3. యత్ పున ర్భవతా ప్రోక్తం నవేద్యం విద్యతీతిచ
తాభ్యాం హీనమతోఽన్యత్ర పదమస్తీతి చైదపి.

4. ఏవమేత న్మతం సర్ప తాభ్యాం హీనం నవిద్యతే
యథా శీతోష్ణయోర్మధ్యే భవే నోష్ణం నశీతలా

5. ఏవం వై సుఖదుఃఖాభ్యాం హీనమస్తి పదం క్వచిత్
ఏషా మమ మతిః సర్ప యథావా మన్యతే భవాన్.

సర్ప ఉవాచ :

యదితే వృత్తతోరాజన్ బ్రాహ్మణః ప్రసమీక్షితః
వృథాజాతి స్తదా యుష్మాన్ కృతిర్యావన్నవిద్యతే.

యుధిష్ఠిర ఉవాచ :

1. జాతిరత్ర మహాసర్ప మనుష్యత్వే మహామతే
సంకరాత్ సర్వవర్ణానాం దుష్పరిక్ష్యేతి మేమతిః

2. సర్వేసర్వా స్వపత్యాని జనయంతి సదా నరాః
వాఙ్మైధున మథో జన్మ మరణంచ సమం నృణామ్

3. ఇద మార్షం ప్రమాణంచ ఏయజామహ ఇత్యపి
తస్మాత్ శీలం ప్రధానేష్టం విదుర్యే తత్త్వదర్శనః

4. ప్రాఙ్నాభి వర్ధనాత్ పుంసో జాతకర్మ విధీయతే
తత్రాస్యమాతా సావిత్రీ పితాత్వాచార్య ఉచ్యతే

5. తావత్ శూద్రసమోహ్యేష యావత్ వేదే నజాయతే
తస్మిన్నేవం మతి ర్ద్వైధే మనుః స్వాయంభువోఽబ్రవీత్

6. కృతకృత్యాః పునర్వర్ణా యదివృత్తం నవిద్యతే
సంకర స్తత్ర నాగేంద్ర బలవాన్ ప్రసమీక్షితః

7. యత్రేదానం మహాసర్ప సంస్కృతం వృత్తమిష్యతే
తం బ్రాహ్మణ మహం పూర్వముక్తవాన్ భుజగోత్తమ.

అ ను బ ం ధ ం - 3

# సామవేదీయ వజ్రసూచికోపనిషత్ *

యజ్ జ్ఞానాద్యాన్తి మునయో బ్రాహ్మణ్యం పరమాద్భుతమ్
తత్త్రైపద బ్రహ్మతత్త్వ మహామస్మీతి చిన్తయే.

ఓం ఆప్యాయన్త్వితి శాన్తిః

చిత్సదానంద రూపాయ సర్వధీ వృత్తిసాక్షిణే
నమో వేదాన్తవేద్యాయ బ్రహ్మణేఽనంత రూపిణే.

ఓం వజ్రసూచీంప్రవక్ష్యామి శాస్త్రమజ్ఞానభేదనమ్, దూషణం జ్ఞానహీనానాం భూషణం జ్ఞానచక్షుషమ్ ౧. బ్రహ్మక్షత్త్రియ వైశ్య శూద్రా ఇతి చత్వారో వర్ణా స్తేషాం వర్ణానాం బ్రాహ్మణ ఏవ ప్రధాన ఇతి వేదవచనానురూపం స్మృతిభిరప్యుక్తమ్, తత్ర చోద్యమస్తి, కోవా బ్రాహ్మణోనామ, కింజీవః, కిం దేహః, కిం జాతిః, కింజ్ఞానం, కింకర్మ, కింధార్మిక ఇతి, తత్ర ప్రథమో జీవో బ్రాహ్మణ ఇతి చేత్తన్న, అతీతానాగతానేక దేహానాం జీవస్యైక రూపత్వాత్, ఏకస్యాపి కర్మవశా దనేక దేహసంభవా త్సర్వశరీ రాణాం జీవస్యైకరూపత్వాచ్చ, తస్మాన్నజీవో బ్రాహ్మణ ఇతి, తర్హి దేహో బ్రాహ్మణ ఇతి చేత్తన్న, ఆచండాలాది పర్యంతానాం

* 'అష్టోత్తర శతోపనిషదః' వావిళ్ళరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ ప్రచురణ-1951

మనుష్యాణాం పాంచభౌతికత్వేన దేహస్యైకరూపత్వా
జ్జరామరణ ధర్మాధర్మాది సామ్యదర్శనాత్, బ్రాహ్మణ శ్శ్వేతవర్ణః
క్షత్రియో రక్తవర్ణః వైశ్య పీతవర్ణః శూద్రః కృష్ణవర్ణ ఇతి నియ
మాభావాత్, పిత్రాది శరీరదహనే పుత్రాదీనాం బ్రహ్మహత్యాది
దోషసంభవాచ్చ, తస్మా న్న దేహో బ్రాహ్మణ ఇతి, తర్హి జాతి
ర్బ్రాహ్మణ ఇతి చేత్తన్న, తత్ర జాత్యంతరజంతు ష్వనేకజాతి
సంభవాత్, మహర్షయో బహవస్సంతి, ఋష్యశృంగో మృగ్యాః
కౌశికః కుశాత్, జాంబూకో జంబుకాత్, వాల్మీకో వల్మీకాత్,
వ్యాసః కైవర్తకన్యాయామ్, శశపృష్ఠాద్గౌతమః, వసిష్ఠ ఊర్వశ్యామ్,
అగస్త్యః కలశే జాత ఇతి శ్రుతత్వాత్, ఏతేషాం జాత్యా వినాప్యగ్రే
జ్ఞాన ప్రతిపాదితా ఋషయో బహవస్సంతి, తస్మాన్న జాతి
ర్బ్రాహ్మణ ఇతి, తర్హి జ్ఞానం బ్రాహ్మణ ఇతి చేత్తన్న, క్షత్రియా
దయో౽పి పరమార్థదర్శినో౽భిజ్ఞా బహవస్సంతి తస్మా న్న జ్ఞానం
బ్రాహ్మణ ఇతి, తర్హి కర్మ బ్రాహ్మణ ఇతి చేత్తన్న సర్వేషాం
ప్రాణినాం ప్రారబ్ధ సంచితాగామి కర్మసాధర్మ్యదర్శనాత్, కర్మాభి
ప్రేరితాస్సంతో జనాః క్రియాః కుర్వంతీతి, తస్మా న్న కర్మ
బ్రాహ్మణ ఇతి, తర్హి ధార్మికో బ్రాహ్మణ ఇతి చేత్తన్న క్షత్రి
యాదయో హిరణ్యదాతారో బహవస్సంతి, తస్మా న్న ధార్మికో
బ్రాహ్మణ ఇతి, తర్హి కో వా బ్రాహ్మణో నామ, యః కశ్చిదాత్మాన
మద్వితీయం జాతిగుణక్రియాహీనం షడూర్మి షడ్భావేత్యాది సర్వ
దోషరహితం సత్యజ్ఞానానందానంత స్వరూపం స్వయం నిర్వికల్ప
మశేషకల్పాధార మశేషభూతాంతర్యామిత్వేన వర్తమాన
మంతర్బహిశ్చాకాశవ దనుస్యూత మఖండానంద స్వభావ
మప్రమేయ మనుభవైక వేద్య మపరోక్షతయా భాసమానం కరతలా
మలకవత్సాక్షాదపరోక్షీకృత్య కృతార్థతయా కామరాగాది దోష
రహిత శ్శమదమాదిసంపన్నో భావమాత్సర్య తృష్ణాశా మోహాది

రహితో దంభాహంకారాదిభి రసంస్పృష్టచేతావర్తతే, ఏవముక్త లక్షణో యస్స ఏవ బ్రాహ్మణ ఇతి శ్రుతి స్మృతి పురాణేతిహాసానామభిప్రాయః, అన్యథా బ్రాహ్మణత్వసిద్ధి ర్నాస్త్యేవ, సచ్చిదానంద మాత్మాన మద్వితీయం బ్రహ్మభావయే దాత్మానం సచ్చిదానందం బ్రహ్మభావయేదిత్యుపనిషత్.

ఓం ఆప్యాయంత్వితి శాంతిః

ఇతి వజ్రసూచికోపనిషత్సమాప్తా

ఓం తత్సత్

అ ను బం ధం -4

# యజ్ఞస్వరూపం (శతపథబ్రాహ్మణం)

## భా షా ను వా దం

1 'సృష్టిలోక హితార్థమై తన్ను తాను యజ్ఞపశువుగా సంవత్సర పురుషుడు సమర్పణ చేసుకొంటున్నాడు. అతడు ప్రజాపతి స్వరూపుడు. అంటే ప్రజాసర్గానికి (Reproduction) అధిదేవత. అతడు నూటొక్క రూపాలు తన అవతారాలుగా ధరిస్తాడు. అహోరాత్రాలు, అర్ధమాసాలు (పక్షాలు), మాసాలు, ఋతువులు వాని అవతారమూర్తులు. ఒకమాసానికి (చాంద్రమానమైన మాసానికి) అరవై అహోరాత్రాలు (30 అహస్సులు, 30 రాత్రులు). ఇరవై నాలుగు అర్ధమాసాలు. పదమూడు మాసాలు (అధిమాసంతో కలిసి) మూడు ఋతువులు (ఈఋతువులు నాలుగేసి మాసాల విభాగాలు. వీటినే ఎండకాలం, వానకాలం, చలికాలం అంటారు.)

---

1. మూలం : 9వ కాండ, 5వ అధ్యాయం, 6వ బ్రాహ్మణం
మంత్రాలు 1, 2

సంవత్సరోవై ప్రజాపతిరేకశతవిధః । షష్టిర్మాసశ్చ అహోరాత్రాణి ।
చతుర్వింశతి రర్ధమాసాః । త్రయోదశమాసాః । త్రయంఋతవః ।
తాహ శతం విధాః । సంవత్సరఏవ ఏక శతతమే। సః ఋతుభిరేవ సప్తవిధః

ఈ మొత్తం ప్రజాపతి యొక్క నూరు రూపాలు. (60 + 24 + 13 + 3 = 100). వీటిలో అంతర్యామి అయిన సంవత్సరపురుషుడు నూటఒకటోవాడు. అతడు తన ఆరుఋతువుల విభాగంతో కలిసి ఏడవవాడు అవుతున్నాడు. (వసంతం, గ్రీష్మం, వర్షం, శరత్తు, శిశిరం, హేమంతం అనేవి ఆరుఋతువులు. వీటితో అవతరించిన సంవత్సర పురుషుడు సప్తమ స్వరూపుడు). ఈ ఏడువిధాలైన తేజస్సుతో ప్రజాపతి ఈదిగువ వేడిమినీ, వెలుగునూ ఇస్తూ వెలుగుతున్నాడు. అతడి రశ్మిలు ఏడు. (సూర్యుడి కిరణంలో ఏడేసి కిరణాలు ఉంటాయి.)'

* * *

2. 'సంవత్సరపురుషుడైన ప్రజాపతి ఏడుగురు పురుష రూపాల్ని ఒకపురుషుడిగా నిర్మాణంచేసి ప్రజాపతి అయ్యాడు (ఏడు కిరణాలయుందలి తన రూపాన్ని వేడిమిగా, వెలుగుగా భూమిపై ప్రసరింపజేసి సృష్టికి కారకుడు అయ్యాడు). సృష్టించి ఊర్ధ్వంగా ఉత్క్రమించాడు. ఈ మనం ఎరిగినలోకంగా దిగివచ్చి వెలుగుతున్నాడు (ఏడుకిరణాలరూపాన సూర్యుడిగా దిగివచ్చి సృష్టికి

---

షడ్రుతవః । సంవత్సర ఏవ సప్తమీవిధా । తస్య ఏతస్య సంవత్సరస్య ఏత త్తేజః యఏష తపతిత సరశ్మయః ।

* * *

2. 10వ కాండ, 2వ అధ్యాయం, 2వ బ్రాహ్మణం

మంత్రాలు 1-5

సప్త పురుషాన్ ఏకం పురుషం అకుర్వన్। స ప్రజాపతి రభవత్।
సః ప్రజా అసృజత ।
స ప్రజాన్ సృష్ట్వా ఊర్ధ్వ ఉదక్రామత్ । స ఏతాన్ లోకం అగచ్ఛత్ ।
యత్రైష ఏత త్తపతి ।

కారణభూతుడు అవుతున్నాడు.) దానివల్ల అతడు సృష్టి అనబడే యజ్ఞమందలి పురుషుడు అయ్యాడు. వానిని యజ్ఞంచేత యజ్ఞంగా చేయడానికి దేవతలు ఆదరించూపారు. కాబట్టే ఋషులు 'యజ్ఞంచేత యజ్ఞాన్ని దేవతలు యజించారు' అని కీర్తించారు. (ప్రజాపతిరూపుడైన భగవంతుడు యజ్ఞార్థంగా సృష్టి అనే యజ్ఞంలో జీవుడిగానూ, పశువు అనబడే దేహేంద్రియాదుల రూపుడుగానూ కూడా దిగివచ్చాడని అర్థం.) యజ్ఞధర్మాలను సృష్టిధర్మాలుగా దేవతలు ప్రప్రథమంగా ఏర్పరిచారు. (ఇంద్రియాలనూ, మనస్సునూ, దేహాన్నీ జీవుడిగా అనుభవించేటటువంటి లోకమైన) స్వర్గాన్ని దుఃఖాన్ని లేనిదాన్నిగా చేసి మహానుభావులైన దేవతలు వృద్ధిపరిచారు. ప్రాణాలు సృష్టిసర్వాన్నీ సాధించే మూర్తులు. వారే సాధ్యులు అనబడే దేవతలు. వారు మొదటివారై ఈసృష్టిని సాధించారు, అలంకరించారు, పొందారు. వారిలో మొదటపుట్టినవాడు సవిత అనే అండానికి పుత్రుడై ఉద్భవించాడు. అతడే సుపర్ణుడు అనబడే గరుత్మంతుడు. ప్రజాపతే గరుత్మంతుడై, సవిత అయి సృష్టిధర్మాలకు మూర్తిగా అవతరించాడు. అతడే ఏడుగురు పురుషులుగా అవుతున్నాడు. అందులో నలుగురు తనలోనిభాగం, ముగ్గురు రెక్కలూ, తోకా'.

---

ఏతస్మాత్ యజ్ఞ్య ఆస। తాన్ దేవాయజ్ఞేనైవ యష్టుం అద్రియంత ।
తస్మాదేతత్ ఋషిణా అభ్యనోక్తం 'యజ్ఞేన యజ్ఞ మయజ న్తదేవాః' ఇతి।
తేహి ధర్మాన్ ప్రథమే అక్రియంత । స్వర్గోవైలోకో నాకో దేవా మహిమానః।
తే స్వర్గలోకం సచంతే । ప్రాణావై సాధ్యాః దేవాః । తేఏతం అగ్రఏవం
అసాధయన్ । ఏతదేవ ఋభూష న్త. తఉ ఏవ ఆప్యే। సుపర్ణో అంగ
సవితృ గరుత్మాన్ పూర్వోజాతః । ఏషసవితా ఏతస్య ప్రజాపతి రనుధర్మ
మిత్యేతత్। సవై సప్త పురుషో భవతి । యత్ చత్వార ఆత్మా ।
త్రయః పక్ష పుచ్ఛాని ।

* * *

3ప్రజాపతినుంచి పుట్టిన దేవతలు సృష్టిని యజ్ఞంగా యజ్ఞార్థం ఆరాధిస్తున్నారు. సూర్యుడిదేహమైన యజ్ఞశాలను సూర్యకేంద్రకంగా నిర్మిస్తున్నారు. ఈ కనిపిస్తున్న సూర్యబింబంచుట్టూ ఏర్పడే సౌరకుటుంబసృష్టే యజ్ఞవేదిక. అలాగే ప్రజాపతి అయిన పురుషుడు ఒక్కొక్క జీవిగా దేహంలో సూర్యుడై ఏర్పడి వానిచుట్టూ యజ్ఞవేదిక దేహంగా నిర్మింపబడుతోంది. దేవతలు సాధ్యులు అనబడే ప్రాణాలై ఇటుకలపేర్పుగా వేదికయొక్క ఆవరణలను పేరుస్తున్నారు. ఈ ఆవరణలు ఏడు. (సూర్యుడి సప్తకిరణాలు, అగ్నిలోని సప్తజిహ్వలు, జీవుడి సప్తప్రాణాలు, దేహంలోని సప్తధాతువులు మొదలైనవి. ఇలా సప్తఆవరణలతో లోకాలు ఏర్పడుతున్నాయి.) ఈ పేర్పుల్ని చయనాలు లేక చితులు అంటారు. వారు మొదట చితినిపేర్చి, ఈలోకాన్ని ఆరోహించారు. (పంచభూతాలు, అహంకారం, మహస్సు అనే ఏడు ఆవరణలుగా ఇదే పురాణాల్లో వర్ణింపబడింది) వారు ఇలా అనుకొన్నారు - 'దీనికి చేతన కలిగిద్దాం'. కాబట్టే చితినుంచి కలిగి రెండవ ఆవరణం చేతనంగా నిర్మింపబడింది. చితినుంచి పుట్టిందికనుక చేతనం. పృధివినుంచి ఊర్ధ్వంగా దీన్ని దర్శించారు. (సచేతనాలు పృధివినుంచిలేచి అంతరిక్షంలో చరిస్తాయి. అంటే మట్టినుంచి దేహాలు పుట్టి భూమిపై ఉన్నచోటులో తిరుగాడుతూ ఉంటాయి). సాధ్యులు అనబడే ఈదేవతలు ప్రాణాలుగా దేహభాగాలను యజ్ఞంలో చయనంచేసి అశ్వినులను పిలిచి ఇలా అన్నారు - 'మీరు బ్రహ్మలు. బ్రహ్మచేత భిషక్కులుగా ఏర్పరచ

---

3. 8 వ కాండ - 1 వ అధ్యాయం - 1 వ బ్రాహ్మణం మంత్రాలు 1-6

దేవాః ప్రథమం చితిం చిత్వా సమారోహయన్ అయంవై లోకం ।
తే అబ్రువన్ చేతయధ్వమితి, చితిమిచ్ఛత ఇతి ... ... . చేతయమానా
ఏతాం ద్వితీయాం చితిమపశ్యన్ ।

బడినవారు. మీరు ఈ రెండవచితికి ఆధిపత్యం వహించండి. అగ్ని స్వరూపం అయిన ఈ ప్రాణాల చయనానికి మీరు అధ్వర్యులు కండి'. ఇలా అశ్వినులు రెండవచితిని యజ్ఞవేదికచుట్టూ నిర్మాణంచేశారు. కాబట్టి అశ్వినులే దేవతల అధ్వర్యులు. దానితో వారు అధ్రువం అయిన ఆకాశాన్ని సృష్టియజ్ఞానికి ధ్రువమైన యోనిగా స్థిరత్వం ఏర్పరిచారు. పొయ్యిలో నిప్పును రగిల్చినట్టు ప్రాణాగ్నిని వారు కేతువుగా- మొదటిచితిగా- ఏర్పరిచారు. దానితో అగ్ని గూడుకట్టుకొన్న పక్షిగా, పురాన్ని నిర్మించుకొని ధరించేదిగా వ్యక్తం అయ్యింది. ఈ కట్టుకున్న గూడువంటి-పురంవంటి- ఆవరణమే రెండవ చితి'.

'సాధ్యులు అనబడే ఈదేవతలు ప్రాణభృతాలు అనబడే ఇటుకల్ని ప్రాణాలముక్కలుగా పేర్చారు. వీటిని పది ఇటుకలకు ఒక గుంపుచొప్పున పేర్చారు. జీవులకు పదిప్రాణాలు దేహాన్ని బంధించి ఉంటాయి. అందులో జీవుడిప్రాణం భావాయనుడు అనే ఋషిగా పేర్చబడింది. వసంతుడు అనబడే ఋతువు (దేహంలో వసించేవాడని అర్థం) ప్రాణాయనుడు అనే ఋషిగా ఏర్పడ్డాడు. ఇతడు ఉచ్ఛ్వాస నిశ్వాసల అయనం. దేహం అనబడే రథానికి

---

ఏతాం ద్వితీయాం చితిం అపశ్యన్ । యదూర్ధ్వం పృథివ్యా । అర్వాచీనం అంతరిక్షాత్ తేషాం । ఏషలోకః ధృవః । తే అశ్వినా అబ్రువన్ యువంవై బ్రహ్మాణౌ, బ్రహ్మాణా భిషజౌస్థః । యువన్న ఇమాం ద్వితీయా చితిం ఉపధత్తం । యువమేవ నః అస్యాః అగ్ని చిత్యాయాః । అధ్వర్యూ భవిష్యథః । అశ్వినా ఏవ దేవానాం అధ్వర్యూ । ఏతత్ వ్యోమస్థిరం ధ్రువం కృత్వా ప్రత్యధత్తాం ధ్రువం వ్యోని మాసీత్ । కులాయినీ ఘృతవతీ పురంధరీ ఇతి ద్వితీయా చితిః ।

వెనుకభాగం అయిన వెన్నెముకను సృష్టించే ప్రాణం వసిష్ఠుడు. కుడి పార్శ్వం వెన్నెముకనుంచి సృష్టించేది విశ్వకర్మ. అతడే మనస్సు రూపంలో వ్యక్తం అవుతాడు. ఆహారాన్ని భుజించి, భరించి, మనస్సును నిర్మించేవాడు భరద్వాజుడు. వెలుపలకు వెలుగుతూ కన్నుగా పనిచేసే అగ్ని జమదగ్ని అనే ఋషి. విశ్వంతో మిత్రత్వాన్ని కూర్చే శ్రవణేంద్రియమే విశ్వామిత్రుడు.'

---

ప్రాణభృత ఉపదధాతి । ప్రాణా వై ప్రాణభృతః ప్రాణానేవ ఏత దుపదధాతి । .. తాదశదశోపదధాతి । దశ వై ప్రాణా ప్రాణౌ భౌవాయనః। వసంతః ప్రాణాయనః । రథం తరం .. వృష్ఠం నిరమిమీతి । వసిష్ఠ ఋషిరితి ప్రాణో వై వసిష్ఠ । మనోః వాయుర్భూత్వా దక్షిణతస్తస్థా । తస్మాత్ మనోవై శ్య కర్మాణమితి వదంతి । మనో వై భరద్వాజ ఋషిః । అన్నం వాజః యో వై మనో భిభర్తి । సో అన్నం వాజంభరతి తస్మాన్ మనో భరద్వాజః ఋషిః । చక్షుర్వై జమదగ్ని ఋషిః । యదేనేన జగత్పశ్యతి అధో మనుతే తస్మాత్ చక్షుర్జమదగ్నిర్ ఋషిః । శ్రోత్రంవై విశ్వామిత్ర ఋషిః యదనేన సర్వతః శృణోతి అధో యదస్మై సర్వతోమిత్రం భవతి ।

# ఉపయుక్త గ్రంథావళి

## సంస్కృత గ్రంథాలు :


అమరకోశం

అష్టోత్తరశతోపనిషత్

ఆపస్తంభ సూత్రాలు — ఆపస్తంభుడు

ఆర్షధర్మసూత్రాలు (సంకలనం) — చర్ల గణపతిశాస్త్రి

ఋగ్వేదం

నాగార్జున రసతంత్ర వ్యాఖ్య — కుణపనాగుడు

నారాయణీయ అగదతంత్రం

పంచతంత్రం

పురుషసూక్తం

పులస్త్యస్మృతి

బృహజ్జాతకం — వరాహమిహిరుడు

బృహత్పారాశరహోర — వరాహమిహిరుడు

మనుస్మృతి — మనువు

మహానిర్వాణతంత్రం

రుద్రనమకం

విష్ణుపురాణం

విష్ణుసహస్రనామం

విష్ణుసూక్తం

భారతం — వ్యాసుడు

| | |
|---|---|
| సూక్తిముక్తావళి (సంకలనం) | మహీధర జగన్మోహనరావు |
| సౌందర్యలహరి | శ్రీ శంకరాచార్య |
| శతపథబ్రాహ్మణం | |

**ఆంధ్ర గ్రంథాలు :**

| | |
|---|---|
| ఆంధ్రమహాభారతం | కవిత్రయం |
| ఆంధ్రమహాభాగవతం | పోతన |
| ఆంధ్రసాహిత్య చరిత్ర | పింగళి లక్ష్మీకాంతం |
| ఆంధ్రసాహిత్య పరిషత్ ప్రతిక సంపుటి : 49 | ఆంధ్రసాహిత్య పరిషత్ - కాకినాడ |
| ఆత్మపూజ | |
| కాశీఖండం | శ్రీనాథుడు |
| గీతామకరందం | శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి |
| తిక్కన కావ్యశిల్ప సమీక్ష | డా॥ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి |
| తిక్కన భారతదర్శనము | డా॥ సండూరి రామకృష్ణమాచార్యులు |
| తిక్కయజ్వ హరిహరనాథతత్త్వము | ఓరుగంటి నీలకంఠశాస్త్రి |
| పాండురంగమాహాత్మ్యం | తెనాలి రామకృష్ణుడు |
| భీష్మపర్వ అవతారిక (అకాడమీ ప్రతి) | డా॥ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి |
| మంత్రగీత | 'కులపతి' ఎక్కిరాల కృష్ణమాచార్య |

**ఆంగ్ల గ్రంథాలు :**

| | |
|---|---|
| Sanskrit to English Dictionary | Monier Williams |
| The history of Dharma Sastras | P. V. Kane |

# డా॥ మోపిదేవి కృష్ణస్వామి

## ఇతర రచనలు

| | | |
|---|---|---|
| 1. స్వామిగేయాలు | ... | 2-00 |
| 2. దర్శనాలు - విదర్శనాలు | ... | 3-00 |
| 3. సందేశాలు - సమాధానాలు | ... | 8-00 |
| 4. సంభాషణలు - సమన్వయాలు | ... | 8-00 |
| 5. ఆత్మకథ - అనుభూతి | ... | 3-00 |
| 6. అమెరికాలో అనుభూతులు | ... | 3-50 |
| 7. మానవసేవలో మాస్టర్ ఇ. కె. | ... | 5-00 |
| 8. మాటలు - మంత్రాలు | ... | 5-00 |


ప్రతులకు :

ది వర్ల్డ్ టీచర్ ట్రస్ట్

అమలాపురంశాఖ,

మాస్టర్ మందిర్

కొంకాపల్లి.

అమలాపురం

# డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామిగారి ఇతర రచనల పరిచయం

## 1. స్వామి గేయాలు :

మానవజీవిత గమనాన్ని అర్థవంతంగా తీర్చిదిద్దగల గేయాల సంపుటి. ఇందులోని గేయాలు ఆచరణపరులకు అరచేతిదీపాలు. మతాతీతస్థితిని మనకు అందిస్తూ, భావాతీతస్థితిని అనుగ్రహించగల వేదగీతిక లనదగిన గేయాలు ఇందులో చాలాఉన్నాయి. మానవ జీవితంలో కావలసిన సమన్వయం, సాధించవలసిన పరమార్థం ఈ గేయాలు మధురంగా, మందంగా అందిస్తాయి.

## 2. దర్శనాలు - నిదర్శనాలు :

కృష్ణస్వామిగారి మొదటి వచనరచన. ఈగ్రంథంలో మాస్టర్ ఇ. కె. వాణి వినిపిస్తుంది. కృష్ణస్వామి బాణి కనిపిస్తుంది. మాస్టర్ ఇ. కె ప్రసంగాలలోని అమృతోపమానాలకు కృష్ణస్వామిపట్టిన అంజలియే ఈగ్రంథం అందరికీ తెలిసిన అంశాలను ఉదాహరణలుగా తీసుకొని, అందరికీ తెలియవలసిన అంశాలను మాస్టర్ ఇ. కె. ఎలా తెలియచెబుతారో ఇందులో తెలుస్తుంది. ఇ. కె. గారినుండి దిగి వచ్చిన ఆ 'దర్శనాలు- నిదర్శనాలను' కృష్ణస్వామి నేర్పుతో కూరుపు చేసి చెబుతారు ఈగ్రంథంలో. యోగసాధనకూ నిత్యజీవిత నిర్వహ

జానికీ, సృష్టితత్త్వ దర్శనానికీ కావలసిన అంశాలెన్నో ఈ గ్రంథం వెన్నతో పెడుతుంది. ఈ గ్రంథం చదువుకొనేవారికి జీవితం అర్థమవుతుంది. భగవద్గీత, పతంజలియోగసూత్రాలు మొదలైన దివ్య గ్రంథాలను జీవితానికి ఎలా సమన్వయించుకోవాలో బోధపడుతుంది. ఈ గ్రంథపఠనం అర్థవంతమైన జీవితానికి ఆరంభం.

## 3. సందేహాలు – సమాధానాలు :

గుమ్మంవద్దర నిలబడి మాస్టర్ ఇ. కె. ను చూస్తున్నవారికి కలిగిన సందేహాలకు కృష్ణస్వామి చెప్పిన సమాధానాలు ఈ గ్రంథంగా కూర్పు చేయబడినాయి. నిలబడినవారి పరిణామాన్నిబట్టి సందేహాలు రకరకాలుగా ఉంటాయి. కృష్ణస్వామి సమాధానాలుకూడా సందేహాలకు తగ్గట్టుగా ఉంటాయి. ఒకచోట సరసంగా, మరోచోట గంభీరంగా, ఇంకొకచోట విజ్ఞానదాయకంగా - ఇలా ఔచిత్యవంతంగా ఉంటాయి. మహానుభావుల జీవితాలకు చెప్పబడిన భాష్యమా ఈ గ్రంథం అనిపిస్తుంది. ఏ మహానుభావుణ్ణి అయినా ఎలా అర్థంచేసుకోవాలో ఒక ఆప్తునిలా వివరిస్తుం దీ గ్రంథం. ఆ అర్థంచేసుకోవడం అలా జీవించడానికే సుమా అని హెచ్చరిస్తుంది. చేయి పట్టుకొని నడిపిస్తుంది. మహానుభావుల జీవితాలలోతులను వెలికి తీసి చూపించినట్టే సనాతనధర్మం యొక్క లోతుపాతులను కూడా పరిచయం చేసే ప్రయోజనాత్మకమైన గ్రంథం ఇది.

## 4. సంభాషణలు – సమన్వయాలు :

సర్వసాధారణంగా ప్రతిమనిషికీ కొన్ని సందేహాలు ఎంత వద్దన్నా కలుగుతూ ఉంటాయి. మృత్యువు అంటే ఏమిటి ? మృత్యువు తరువాత జీవి ఏమవుతాడు ? ఎక్కడుంటాడు ? స్వర్గ నరకాలున్నాయా ? పునర్జన్మ ఉంటుందా ? పునర్జన్మలు గుర్తు

రావడమనేది నిజమేనా ? పితృకర్మలు చేస్తారుగదా, వాటివల్ల పోయినవారికి కలిగేమేలేమిటి ? ఆర్థిక అసమానతలకు, కష్టసుఖాలకు పూర్వజన్మలు కారణమా ? - మొదలైన సంశయాలు మనిషి మనస్సును అవకాశం వచ్చినప్పుడల్లా పీకుతూఉంటాయి ఈపీకడానికి మతాలతో, పార్టీలతో, సిద్ధాంతాలతో ప్రమేయంలేదు - మనిషయితేచాలు. సహజంగా కలిగే ఈసంశయాలను తీర్చకుండా ఆధ్యాత్మికతపేరిట బ్రహ్మజ్ఞానాన్ని ఎంత నూరిపోసినా మనిషి మళ్ళీ మొదటికి వస్తూఉంటాడు. ఈసంశయాలకు తగినవివరణను అందించి, ఆపైన అమూల్యమైన విషయాలను ఎన్ని చెప్పినా ఫర్వా లేదు అన్న భావన కలిగి కృష్ణస్వామి మాస్టరుగారినుండి ఇటువంటి సంశయాలన్నింటికీ తగిన సమన్వయాలను రాబట్టారు ఈగ్రంథంలో. ఇంకా, పూనకాలు, ఆవేశాలు, చేతబడులు, చిల్లంగులు, మందులు, వశీకరణాలు మొదలైనవాటి స్వరూపస్వభావాలనుగూడా మాస్టరుగారినుండి రాబట్టారు. నిత్యపూజలో కలిగే సంశయాలను తీర్చారు. సామాజికసమస్యలకు పరిదారులు చూపించారు. సమాజంలో స్త్రీ పాత్రను పరామర్శించారు. ఈగ్రంథం కల్పవృక్షం లాంటిది. కోరినకోరికనల్లా ఆ కల్పవృక్షం తీరిస్తే, కలిగిన సంశయాన్నల్లా ఈ కల్పవృక్షం తీరుస్తుంది.

## 5. అన్వేషణ – అనుభూతి :

కృష్ణస్వామి సంక్షిప్త జీవితగాథ ఇది. పేరుతీసి ప్రక్కన పెడితే ఈగ్రంథంలో ఉన్నది ఒక భారతీయ యువకుడు ఎవరు చదువుకొంటే వారికి వారిగాథలాగానే అనిపించి నడిపిస్తుంది. నేటి యువకుడు చేస్తున్న ఆవేదనాత్మకమైన అన్వేషణ, దానికిగాను అతడు పొందవలసిన ఆచరణశీలమైన అనుభూతీ ఈ చిన్నగ్రంథంలో చక్కగా అందించబడినాయి. యువతరానికి ఎలాంటి అవగాహన

అవసరమో, ఆ అవగాహన ఏవిధంగా ఆచరణీయమైన రూపాన్ని ధరించాలో ఈ చిన్నిపుస్తకం చిన్నదీపమై చూపిస్తుంది. జాతి పునర్నిర్మాణానికి చేయూతనిచ్చే గ్రంథాల్లో ఇది ఒకటి.

## 6. అక్షరాల్లో అనుభూతులు :

పెద్దవాళ్ళను చూసి మెచ్చుకోవడం సహృదయతకు చిహ్నం; వారిలా నడుచుకోవడం ఆ మెచ్చుకోవడానికి గమ్యం అంటారు కృష్ణస్వామి. నడుచుకోవాలి అంటే ఆ పెద్దవారినడతను తెలియజెప్పేవారు కావాలి. ఆ తెలియజెప్పే ప్రయత్నంలోనే వాల్మీకినుండి రామాయణం, వ్యాసుడినుండి భారతభాగవతాలు దిగివచ్చాయి. అలాగే మాస్టరుగారి జీవితంతో మనజీవితాలను స్పృశించడానికి కొన్ని సన్నివేశాలను ఎంచి, వర్ణించి, కూర్పు చేశారు కృష్ణస్వామి. అనుభూతి అక్షరాల్లో ఒదిగినందుకు తృప్తిచెందుతూ 'అక్షరాల్లో అనుభూతులు' అని పేరు పెట్టారు. నిత్యజీవిత నిర్వహణను తీర్చిదిద్దగల శక్తి ఈ గ్రంథానికి ఉన్నది. ఇందులోని సన్నివేశాలు మాస్టరుగారి జీవితంనుండి స్వీకరించిన మేలుబంతులలాంటివి. 'ఆ మేలుబంతులను చూస్తూ మన జీవితసన్నివేశాలను తదనుగుణంగా మలచుకోగలగడంకోసమే ఈ గ్రంథం వచ్చింది' అంటారు కృష్ణస్వామి.

## 7. మానవసేవలో – మాస్టర్ ఇ. కె :

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య తెలుగులో ఎం. ఏ, పిహెచ్.డి గదా, మరి ఆయన హోమియోవైద్యులు ఎలా అయ్యారు? హోమియోవైద్యులు అవ్వడమే కాకుండా వందలకొలది హోమియో ఉచితవైద్యాలయాలను నిర్వహింపజేసే ఒకమహోద్యమంగా ఎలా విజృంభించారు? ఈ విజృంభణకు వెనుకఉన్న గాథ, ఆ గాథలోని పరిణామం, ఈ విజృంభణయొక్క వైఖరి, దానిగమ్యం ఈ గ్రంథం

గంభీరంగా వివరిస్తుంది. నేటి దేశపరిస్థితులను సమీక్షిస్తూ ఇ. కె. ఉద్యమం దేశపునర్నిర్మాణానికి ఎలా బాట వేస్తున్నదీ దర్శింపజేస్తుంది ఈ గ్రంథం. చదువరిని మరో ప్రపంచానికి వారసుణ్ణి చేస్తుంది.

## 3. మాటలు – మంత్రాలు :

మాస్టర్ ఇ.కె. సన్నిధిలో వికసిస్తున్న కృష్ణస్వామి ప్రజ్ఞా కమలం వెదజల్లుతూవస్తున్న సౌరభాలకు శ్రీ వి. చక్రపాణిరావు వాసిక బగ్గా రూపుకట్టినవే 'మాటలు - మంత్రాలు'. కృష్ణస్వామి మాటలు మంత్రాలుగా దర్శించిన చక్రపాణిరావు ఆ మంత్రాలను సందర్భసహితంగా ఈ గ్రంథంలో వివరించారు. ఈ గ్రంథంలో ఆరు అధ్యాయాలున్నాయి. మాస్టర్ ఇ. కె - మనం, తీరని బాధ - తీరైనబోధ, మాత్రలవైద్యం - మాటలవైద్యం, సమాజము - సంస్కరణ, సహచరులు - సరిదారి, ఆత్మవిద్య - అసలురూపం అనే ఆ అధ్యాయాల పేర్లు ఆయా అధ్యాయాల్లో ఏమేమి వివరించబడినవో సూచిస్తున్నాయి. మాస్టర్ ఇ. కె. వెలుగుకు కృష్ణస్వామి అంజలించిన 'దర్శనాలు-నిదర్శనాలు' ఎటువంటివో కృష్ణస్వామినుండి దిగివస్తున్న సరసమైన సందేశానికి చక్రపాణి చేసిన ఈ కూర్పు అలాంటిది. దేశపునర్నిర్మాణానికి ఈ గ్రంథంలోని పలుకులు ప్రణాళికలను సూచించగలవు. ఈ గ్రంథం మనతో ఉంటే కృష్ణస్వామి మనతో ఉన్నట్టేఉంటుంది.